# మానుషశాస్త్రం - 2840
# ఆదిమనివాసులు



శ్రీ డాక్టరు ఎ. అయ్యప్పన్
M. A. Phd; F. R. A. I. (Lond)
(President Indian Science Congress -
Section of Anthropology)
గారి తొలిపలుకుతో;

శ్రీ డాక్టరు గిడుగు వెంకట సీతాపతి పంతులు
B. A. L. T., D. Litt. (Washington)
గారి పరిచయ వాక్యములతో



గ్రంధకర్త
ఎ. ఎం. సోమసుందరం, M. A.



ప్రజాశక్తి కార్యాలయం, బెజవాడ



రచయిత

## శ్రీ సోమసుందరంగారు

"అంబాడీలు" అనే థీసిస్ రాసినందుకు లక్నో విశ్వవిద్యాలయాధికారులు 1944 లో ఎం. ఏ. డిగ్రీ యిచ్చారు. అర్థశాస్త్రం, మానుషశాస్త్రం వీరి సబ్జక్టులు ప్రస్తుతం పి. హెచ్. డి. డిగ్రీ కోసం జైపూర్‌లో నివశించే "గదబా" జాతి ప్రజల్ని గురించి పరిశోధనలు చల్పుతున్నారు.

# విషయసూచిక

## తృతీయభాగం-తిరుగుబోతు, ద్రిమ్మరుజాతులు



## చతుర్ధభాగం-ఆంధ్రదేశ ఆదిమనివాసులు

This work is most respectfully dedicated to **Dr. D. N. MAJUMDAR**, M. A.. Ph D (Cantb) P. R. S. F. N I., Professor of Anthropology, Lucknow University, the author's friend and teacher, as a humble token of high appreciation of his valuable scientific investigations among the Aboriginals of India and as a mark of gratitude for the training in technique of field investigations, which he so kindly has given to the author.



నన్ను వాత్సల్యముతో జేరదీసి, మానుష శాస్త్రము నాకు బోధజేసి, ఆశాస్త్ర పరిశోధనలయందు నాకు క్రమశిక్ష నొసగి, తన జీవితమును శాస్త్రీయ పద్ధతులపైని ఆదిమనివాసుల విముక్తికి అర్పణము జేసిన, నా గురువులును, మిత్రులును, లక్నో విశ్వ విద్యాలయమున మానుష శాస్త్రాచార్యులును అగు,

డాక్టరు ధీరేంద్రనాధ్ మజుందార్

M A., Ph. D. P. R. S., F. N. I. (Cantab)

గారికి ఈ గ్రంథము భక్తిపూర్వకముగా అంకితము సల్పుచున్నాను.

బద్ధమగు చట్టనిర్మాణమునకై కృషి సల్పుచున్నాడో, - అట్లాంటి పరిస్థితి లోని కేవిధముగా వచ్చినాడో, తెలిసికొనుటకు సహాయపడును. ప్రస్తుతము మానవసంఘంలో వ్యాప్తమయిన విద్వేషములు, నీచపూర్వకమగు తామసిక స్వభావ ఫలితములు. ఈ సందర్భములో ప్రస్తుతము చెలరేగుచున్న జాతి విద్వేషములు, ఒక్క పాశ్చాత్య దేశీయులకే చెందవను విషయము గుర్తుంచుకొనవలెను. మన దేశమందలి కులములు, వర్ణములు, కొంతవర కైనను జాతివిద్వేష ఫలితములే. మానవుడు జ్ఞానమువలన ఉపదేశికుడు కాకపోవుటచేత, విద్వేషములను, స్వరక్షణకు యంత్రగతివలె నుపయో గించి దానిని తన సంతతికిగూడ నొసగును. అవుసరమున్నను, లేకపోయి నను, అతనిసంతతివారు వాటినే పట్టుకొనిప్రాకులాడెదరు. స్థలావృత్తులలో మానవుని, భౌతికా, ధ్యాత్మిక, వైజ్ఞానిక, ఐహికాభివృద్ధుల స్వరూపములకు సంబంధించిన జ్ఞానమును మానుషశాస్త్రమువలన మనము వృద్ధిపరచుకొన గలము. అంతేగాక మనలోగల మంచి, చెడుగులను. సరియగుపంధాలో మరో ప్రపంచములోనివారు చూడగలిగినట్లే, మనము తెలిసికొనుటలో ఈ శాస్త్రము సహాయకారి అగును. మానవునకు సంబంధించిన ముఖ్య సమస్యలను అర్ధము చేసికొనుటకు, ప్రజాస్వామ్యమందలి ప్రతి సంఘ సేవకునకు, పరిపాలకునకు, పరిజ్ఞానముగల అభిప్రాయ సమ్మతిదారునకు వాదయుక్తమగు విషయజ్ఞానము అత్యవుసరము.

సోమసుందరంగారు నేర్పుతో వాదన, వాడుక, ఈ రెండూ తన గ్రంధములో సమన్వయించినారు. ఆ కారణంచేతనే ఈ పుస్తకము పాఠ కుల అభిమానమునకు పాత్రమగుటయేగాక, ఆంధ్రదేశ ఆదిమ నివాసుల విషయములను పరిష్కరించుటలో చాల సహాయపడును. విద్యా జ్ఞానము నిజంగా శక్తివంతము. కాని ఇంతవరకు మానవసమస్యల పరిష్కారము నకు అత్యవసరమగు పరిపూర్ణశాస్త్ర పరిజ్ఞానము మనలో లేదని చెప్పక తప్పదు. ఈ దృష్యాచూస్తే సోమసుందరంగారిప్రయత్నము ప్రత్యేకంగా శ్లాఘనీయమైనది.

మ్యూజియంహౌస్<br>ఎగ్మూర్, మద్రాస్<br>1—6—45.

(సం.) ఎ. అయప్పన్<br>(గవర్నమెంటు మ్యూజియం సూపరెండెంట్)

# గ్రంథపరిచయము

మానుషశాస్త్రమునుగూర్చి తెలుగులో ఈ గ్రంథమును రచించిన శ్రీ అమరవాది ముకుంద సోమసుందరరంగారు ఆంధ్రసంస్కృతికి గొప్ప సేవచేసినవారయినారని వారిని చాలా అభినందిస్తున్నాను. ఆధునిక సంస్కృతికి మూలమైన ఆధునిక శాస్త్రజ్ఞానము వికసించిన పాశ్చాత్య దేశములలో ఈ మానుషశాస్త్రము పుట్టి సుమారు నూట యిరువది సంవత్సరము లయినది. ప్రారంభములో ఇది తప్పుత్రోవను నడచినది. ప్రకృతి సిద్ధముగానే మానవులు వివిధజాతుల వారనిన్నీ, శ్వేతవర్ణులజాతివారి సంస్కృతి ఒక్కటే సంస్కృతిఅనిన్నీ, తక్కినజాతులవారి సంస్కృతి వేర్వేరు అంతరములలోఉండి ఆ శ్వేతవర్ణజాతివారి సంస్కృతిగా పరిణమించుటకే ప్రయత్నిస్తున్నదనిన్నీ, మొదట మానుషశాస్త్రజ్ఞులు సిద్ధాంతము చేసినారు. వారి సిద్ధాంతములను అనుసరించి వారి శిష్యులును మానుష శాస్త్ర పరిశోధనలు చేసినారు. ఆరంభములో ఈ శాస్త్రపరిశోధకులందు క్రైస్తవమత ప్రచారకులే ఎక్కువగా ఉండేవారు. వీరు సామాన్య సంస్కృతి గలవారే కాని, ఈ శాస్త్ర మూలసూత్రములను పఠించినవారు కారు; ఈ శాస్త్ర పరిశోధనలను చేయుటకు కావలసిన శిక్షణను పొందిన వారున్నుకారు. అంతేకాక, వీరు తమకు ప్రధానమయిన మత ప్రచారమునకు కావలసిన కృషిలో నిమగ్నులయి ఈ శాస్త్రపరిశోధన విలాసార్థముగానో, సత్కాలక్షేప వినోదముగానో, సాగిస్తూ వచ్చినారు. అందుచేత, వారి పరిశోధనలున్ను, వారి వ్యాసములు మొదలయిన రచనలున్ను, చదువుటకు మనోజ్ఞమయినవే అయినా, నిర్దుష్టములని చెప్పుటకు వీలులేదు. అంతేగాక వారు తమ మతప్రచారమునకు ఉపచరించేటట్లుగాకూడ ఆ రచనలు సాగించుటచేత కొన్ని విషయములు తారుమారుగా సయితము ప్రకటితములయినవి.

ఇటీవల ఈ శాస్త్రకృషి సరియైన మార్గమున నడుచుటకు ప్రారంభమైనది. ప్రభుత్వము వారున్నూ, విశ్వవిద్యాలయం వారున్నూ ఈ శాస్త్రము కూడా తక్కిన శాస్త్రములతోపాటు కృషిచేయదగిన శాస్త్రమని పరిగణించి, కృషి సాగించుటకు కావలసిన సౌకర్యములను ఏర్పరచినారు. మన దేశములో అన్నిమండలములందున్ను ప్రభుత్వమువారు ఈ పరిశోధనలు తగిన

వారిచే చేయించి ఆయామండలములలోని వివిధజాతులను గురించి గ్రంథములు వ్రాయించి ప్రకటించినారు. మన చెన్నపురి మండలములోగల వివిధ జాతులను గురించి థర్ స్టన్‌గారు రచించిన గ్రంథము ప్రభుత్వమువారు ప్రకటించినదే. అయినా తక్కిన మండలములలో ఈ శాస్త్ర పరిశోధన ఎక్కువగా జరిగినది. కలకత్తా విశ్వవిద్యాలయమునకు వైస్ ఛాన్సలరుగా ప్రఖ్యాతిగడించిన సర్ అశుతోష్ ముఖర్జీగారు వివిధశాస్త్రపరిశోధన కృషికై ఏర్పాట్లుచేస్తూ ఈ మానుషశాస్త్ర పరిశోధనకు ప్రత్యేకించి ఒకశాఖనిర్మించి ఈ కృషిసాగించిన విశ్వవిద్యాలయములలో కలకత్తా విశ్వవిద్యాలయమే మొదటిదన్న పేరుతెచ్చిన మహనీయులైయునువారు. అయితే అందులో మన చెన్నపురి మండలంవారు గర్వింపదగిన విషయమున్నది. మన మండలములో ఈ శాస్త్రపరిశ్రమకు విశ్వవిద్యాలయమువారు ప్రోత్సాహము కలిగించకపోయినా, కొందరు విద్యార్థికులు ఈ శాస్త్ర పరిశోధనలు అభిమాన విషయముగా సాగిస్తూవచ్చినారు. అట్టివారిలో కీ. శే. ఎల్, కె. అనంత కృష్ణ అయ్యర్‌గారు ప్రధానులు. వారు కొచ్చిన్, మైసూరు సీమలలోగల వివిధ జాతులనుగురించి వ్రాసినవారు. వీరిని కలకత్తా విశ్వవిద్యాలయంలో మనుష్యశాస్త్ర శాఖకు ప్రధానాచార్య పీఠమునవిల్పి ఈ శాస్త్రపరిశోధనకు కావలసిన సౌకర్యములను ముఖర్జీగారు ఏర్పరచినారు. ఈపనివలన అనేక విద్యార్థులు ఈ శాస్త్రమును పఠించి ఇప్పటికీ కృషిసాగిస్తూ క్రమముగా అధ్యాపకులయి శిష్యులను తయారు చేస్తున్నారు. ఆ కృషిఫలితమే ఈ సోమసుందరంగారి ఉద్యమము. వీరు లక్నో యూనివర్సిటీలో ఎం. ఏ. పరీక్షనిచ్చి, అందులో మనుష్యశాస్త్ర మభిమాన విషయంగా ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడగు డాక్టరు డి. యన్. మజుందార్‌గారి పర్యవేక్షణక్రింద పఠించి తాము అలవర్చుకొన్న శాస్త్రజ్ఞానముతో మన ఆంధ్రదేశ మందలి ఆదిమ నివాసుల జీవితములను పరిశోధించుటకై పనిచేయుటకు తమ జీవితమును వినియోగించ దలచినారు.

ఈ శాస్త్రపరిశోధనలకు మన మండలమందున్న విశ్వవిద్యాలయముల మూడింట నేదిన్నీ నేటివరకు తగినంత శ్రద్ధ వహించకుండుట శోచనీయము. ఇప్పుడిప్పుడు అందుకు తగిన ప్రయత్నములు జరుగుచున్నవి. ఈ మండలములో ఈ శాస్త్రపరిశోధనకు కావలసినంత అవకాశమున్నది. అంతేకాక, ఆధునిక సంస్కృతిగల వారి ప్రాబల్యమువలన

దిమనివాసుల సంస్కృతి వేగముగా ఇప్పుడు మారిపోతున్నది. అట్లు మారిపోవడము సహజము; కావలసినదే. అయినా వారి జీవితము-మార్పు చెందక మునుపుగల ఆచారవ్యవహారములు మొదలయినవి తెలుసుకోవలసి యున్నది. అందువలన ఇప్పటికైనా ఈ పరిశోధనలు ప్రభుత్వమువారున్ను, విశ్వవిద్యాలయములవారున్ను కావించుట అవశ్యమయినది. ఆపనిచేయగల యువకులు - శ్రీ సోమసుందరంగారి వంటివారు కొలదిగా ఉన్నారు. వారికి తగిన ప్రోత్సాహము కలిగించవలసి ఉన్నది.

శ్రీ సోమసుందరంగారి గ్రంథము ఆంధ్రులందరును చదువదగినది. అందరికివి సులభముగా బోధపడునట్లు గ్రంథరచనసాగించి, వీరు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులయినారని నా యభిప్రాయము. ఇందులో ఆదిమనివాసుల ఆర్థికమాంద్యము, దురాచారములవలన గలిగిన దుస్థితి, మొదలయిన విషయములను చర్చించి వీరి నుద్ధరించగల మార్గములను తెలియజేస్తూ సోమసుందరంగారు ఈ గ్రంథము రచించినందుకు ప్రభుత్వమువారును, దేశసేవ, మానవసేవ చేయదలచిన ఉదారులున్ను, గ్రంథకర్తను అభినందింతురని నా విశ్వాసము.

వీరు ఈ శాస్త్రకృషి నింకను ఎక్కువగా సాగించి చాలా గ్రంథములు రచించి కీర్తి పొందుదురుగాక!

50, పైక్రాఫ్ట్సు 1 స్ట్రీటు,
రాయపేట, మద్రాస్
23—4—45.

గి॥ వెం॥ సీతాపతి

# పీఠిక

మిత్రుడు శ్రీ రావూరి సత్యనారాయణగారి ప్రోత్సాహం, కమ్యూనిస్టుపార్టీవారి తోడ్పాటు ఈ గ్రంధరచనకు నన్ను ప్రేరేపించినవి.

ఇందలి ప్రకరణములలో కొన్ని వ్యాసముల రూపములో పత్రికల యందు అప్పుడప్పుడు బయల్వెడలినవి; వాటికితోడు కొత్త ప్రకరణములు కలిపి ప్రస్తుత గ్రంధము తయారు నల్పితిని.

బారన్ హైమండార్ఫ్ తెలుపుతున్నట్లు, ప్రపంచంలో ఏ శాస్త్రాన్నైనా విరసించడం మూలంగా మానవాభ్యుదయానికి తీరనిలోటు కలుగుతుందీ అంటే అట్లాంటి శాస్త్రం, మానుషశాస్త్రం. మానుషశాస్త్రం మానవ సంఘ అభివృద్ధికి తోడ్పడుతుంది. ఈ విషయమే సందర్భానుసారంగా పుస్తకములో పేర్కొన్నాను.

రెండు మూడుచోట్ల పాఠకులు ప్రత్యేకంగా గమనింపవలసిన విషయం ఉన్నది. నేను వాడిన 'జాతి' అనే పదాన్నిగూర్చి క్లుప్తంగా ముచ్చటిస్తాను. ఇంగ్లీషుభాషలో జాతికి పర్యాయపదం 'Race'. ఈవిషయమునుగూర్చి విపులంగా ప్రధమభాగంలో తెల్పినాను. పోతే 'జాతి' అన్నమాట ఆదిమనివాసుల సందర్భంలోగూడ వాడాను. ఐతే 'జాతి' అనే పదం వీళ్ళకు వాడవచ్చా? అనేదే ప్రస్తుత ప్రశ్న. ఆదిమనివాసులందరు 'Aboriginals' అని పిలువబడతారు. వీళ్ళందరూ చిన్నిచిన్ని ముఠాలుగా నివసిస్తారు. అనాగరికపద్ధతులు, సాంప్రదాయములుగలవారు. ఇల్లాంటి ముఠాలకి ఇంగ్లీషులో 'Tribes' అంటారు. ఆదేశాల్లో మానుష శాస్త్రం బాగా అభివృద్ధి చెందింది గాబట్టిన్నీ, వాళ్ళకు ప్రత్యేకంగా, జాతికీ, ఆదిమముఠాలకు పేర్లు ఉన్నవిగాబట్టిన్నీ, వాళ్ళకీ ప్రశ్నరాదు. మనదేశంలో మానుషశాస్త్రం ఇప్పుడే ప్రవేశపెట్టబడుటచేత, దీనికి పర్యాయపదంలేదు. అందుచేత 'జాతి' అనే పదాన్ని ఆదిమనివాసుల ముఠాకిగూడ ఉపయోగించాము. పోతే Tribe అనే పదానికి సరియైన అర్థం చెప్పాలంటే 'Any primitive or barbarous people under a chief with a common language and a sense of solidarity and who trace their descent from a comman ancester' అనే శాస్త్రకారుని వర్ణనే తీసికోవాలి.

ఇంతేగాకుండా ఈ ఆదిమజాతులను గూడ కొన్నింటిని కులముల క్రింద పరిగణింపవచ్చు. కులములంటే ఇంగ్లీషులో 'Caste'. డాక్టరు అయ్యప్పన్ తెల్పుతున్నట్లుగా హిందూమతం అవలంబించేవాళ్ల ని Caste అనే పేరుతో పిలువవచ్చు. తదితరులను 'Tribe' అని భాగింపవచ్చు. కాబట్టి నేను వాడిన 'జాతి' అనే పదం సందర్భానుసారంగా అర్థంచేసు కోవాలని నా మనవి.

పోతే "మానుషశాస్త్రం" అనే పదాన్ని గూర్చి కొద్దిగా చెప్తాను. చాలామంది మిత్రులు మానుషశాస్త్రం అన్న పదం ఇంగ్లీషు భాషయందలి 'Anthropology' అనేపదానికి సరియైన అనువాదమేనా అని అడిగి తమ సందేహం వెలిబుచ్చారు. ఈ విషయంలో వాదనసల్పడమంటే 'షాడబం' అనే పదముయొక్క అర్థాన్నిగూర్చి భారతిలో జరిగిన వాదనకంటే ఎక్కువే అవుతుందన్న భయంతో, శ్రీ గిడుగు వెంకటశీతాపతి పంతులు గారి సలహామీద, శ్రీయుత దిగవల్లి వెంకటశివరావుగారి వ్యవహారకోశంలో నుంచి ఈ పదం లాక్కొన్నాను. ఇంతేగాక, నేను వ్రాసిన వ్యాసాల్లో సహితం ఈ పదమే ఉపయోగించాను. అదేవిధంగా తరుణాపరాధులనే పదంగూడ అందులోనుంచే సంగ్రహించాను.

ఈ పుస్తకం నా ప్రథమ ప్రయత్నం. అందుచేత దీనిలో అనేక లోపములుండవచ్చును. ఆ లోపములున్నట్లయితే, ఆ అపవాదమంతా భరించడానికి నేను సంసిద్ధుణ్ణి. గాని పాఠకులు ఆలోపము శాస్త్రంలో ఉన్న దని అభిప్రాయ పడవద్దని నామనవి.

ఆదిమ నివాసులపైని తెలుగులో ఒక్క గిడుగు సీతాపతిగారు మాత్రం "ఆంధ్ర సర్వస్వము"లో ఒక ప్రకరణం వ్రాసినారు. అదిమినహా మన ఆంధ్రభాషలో మరోగ్రంధములేదు.

ఆంధ్రులలో ఆదిమనివాసుల సేవకు తమజీవితమును అంకిత మొన ర్చిన శ్రీ పుసులూరు కోదండరామయ్య, వెన్నెలకంటి రాఘవయ్యగార్ల వంటి మహనీయులుగలరు. వారుసల్పేసేవ ముఖ్యంగా శాస్త్రీయ పరిజ్ఞా నంతో విరాజిల్లితే ఆదిమనివాస సమస్యలు తెల్లమగుతవి. తేలికగా పరి ష్కరింప బడతవి. ఈ సేవసల్పుతున్న పెద్దలకు నా హృదయ పూర్వక మైన వందనములు.

([illegible])

విషయము ముగించేముందు మరోముఖ్య విషయం బహిర్గతం చేయకపోతే నావిధులకు దూరుడనవుతాను. అసలు నా ఉద్యమమునకు చేయూతనిచ్చి, నన్ను అభివృద్ధికి తీసికొనివచ్చినవారిలో పూజ్యులు, సాహితీపరులు, కృష్ణాపత్రికాధిపతులు కీ. శే. శ్రీ ముట్నూరి కృష్ణారావు పంతులుగారును, మిత్రులు, ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వర రావుగారును ముఖ్యులు. నావ్యాసములను తమ పత్రికాముఖమున ప్రజల కందించి, ఆంధ్ర ఆదిమనివాసుల సమస్యలకు ప్రాధాన్యత నొసంగినారు. వీరికి నేనెంతయు కృతజ్ఞుడను. వీరివలెనే ప్రధమంలో ఆంధ్రపత్రిక 'భారతి' సంపాదకులుగూడ నావ్యాసములు కొన్ని ప్రకటించి 'ఆదిమనివాసు'ల యెడ తమశ్రద్ధ చూపినారు. వారికి నా నమస్కారములు.

నా గురువర్యులు, ఆంధ్రదేశమున మానుషశాస్త్ర పితామహులు, ఉదారులు, పండితులుఅగు శ్రీ గిడుగు వెంకట సీతాపతి పంతులుగారు నే నడుగగనే, తమకుగల అవుసరపు పనులన్నీఆపి, నా గంధ్రమునకు పరిచయ వాక్యములువ్రాసి, నాయెడల తమకుగల వాత్సల్యమును ప్రకటించిరి. అసలు పంతులుగారి ఆశీర్వచన ఫలితమే ఈపుస్తకప్రకటన. వారికి నానమస్కృతులు. వీరికితోడు గ్రంధ విషయమును సాకల్యముగాజదివి, ప్రకటించిన 'ప్రజాశక్తి' సంపాదకా సంఘసభ్యులకు నాకృతజ్ఞత తెలుపుచున్నాను.

ఇంతేగాక, ఈ శాస్త్రమునందునాకు తమవద్ద శిక్షణయిచ్చి, యీ పుస్తక రచన విషయంలో అమూల్య సలహా లొసగుటయేగాక, తొలి పలుకును సహితం నాకు ప్రత్యేకంగా కానుకనొసగిన మద్రాసు మ్యూజియం సూపరెండెంటు శ్రీ డాక్టరు ఏ. అయప్పన్ M A. Ph.D. F. R. A I గారికి నా కృతజ్ఞతా వందనములర్పించుచున్నాను.

ఇతర మిత్రులు అనేకులు ముఖ్యముగా శ్రీ వట్టికొండ రంగయ్య గారు మొదలగువారు నాకు సహాయం సల్పినారు. వారందరు సుహృద్భావముతో నాకు ఈ గ్రంధ విషయంలో అమూల్యమగు సహాయ మొనర్చిరి. వారికి నా నమస్కారములు.

మచిలీపట్టణము,
15—8—45.

ఎ. ఎం. సోమసుందరం

# మానుషశాస్త్రం - ఆదిమనివాసులు

## ప్రథమభాగము

## (అ) శాస్త్రపరిచయం

"The importance of anthropological investigations has been widely recognised in countries like Africa, Australia and New Guinea on account of their being capable of practical application. The valuble contributions made by the anthropologists in those countries even have led to the appointment of permanent Government Anthropologists."

Dr. Von Furer Christoph Haimendorf Ph D.
From "Fortunes of a primitive Tribe"

"ప్రభుత్వ వ్యవహార చిక్కులను పరిష్కరించగల్గుటవలన, మానుషశాస్త్ర పరిశోధనల ప్రాముఖ్యము ఆఫ్రికా, ఆస్ట్రేలియా, న్యూగినీల వంటి దేశములలో విశేషముగా గుర్తింపబడినది. ఆ దేశాలలో మానుష శాస్త్రజ్ఞులు కనుపెట్టిన విలువైన సిద్ధాంతముల మూలమున, ప్రభుత్వ మానుష శాస్త్రజ్ఞుల శాశ్విత నియామకములకు దారితీసినవి."

డాక్టర్ క్రిష్టోఫ్ వాన్ ఫెరూయర్ హోమండార్ఫ్.

### 1. మానుషశాస్త్రము

మానవునకు సంబంధించినది మానుషశాస్త్రము. దీనినే ఆంగ్లభాష యందు **Anthropology**' అంటురు. '**Anthropos**' అనగా మానవుడు. '**logos**' అంటే శాస్త్రము.

ప్రస్తుతకాలమందు ఈ శాస్త్రముయొక్క ప్రాముఖ్యము ఆఫ్రికా, అమెరికా, యూరప్, ఆస్ట్రేలియా, న్యూగినీ, మొదలగు విదేశములయందు మిక్కిలి గుర్తింపబడినది. ఇట్లు ప్రాముఖ్యములోనికి వచ్చుటకు చాల

కారణములు - ముఖ్యముగా ప్రభుత్వచర్యలు, సమాజమునందలి ఆచార సాంప్రదాయములు—ఉన్నవి.

మానుషశాస్త్రము మానవాభ్యుదయమునకు పాటుబడుచుండును. అది, రాజకీయ వ్యవస్థలు, ఆర్థిక విధానములు, సాంఘిక నడవడులు, మొదలగువాని ప్రాచీన స్వరూపములను కనిపెట్టుటయేగాక, మానవుని నాగరికతను, దాని యభివృద్ధిని, పరిశోధించి, అమూల్యములగు సిద్ధాంతములను వెలికిదీయును. అంతేగాదు. ప్రపంచమునందలి వివిధజాతులను గూర్చి సమగ్రమగు పరిశోధనలుసల్పి ప్రస్తుతము యూరప్, అమెరికాల వంటి దేశములలో వ్యాపించిన జాతులసమస్యలను పరిష్కరించుచున్నది ఈ శాస్త్రము.

మానుషశాస్త్రము ఒకేలక్ష్యమును గల్గియుండును. మానవుని చరిత్రఅంతయు తొలుత నొకే స్వరూపముగల్గి యుండెననియు, కాని శతాబ్దముల తరబడిగా ప్రపంచమునందలి స్వాభావికమార్పుల, వాతావరణ వైపరీత్యముల మూలమున, ఒక్కొక్క మానవజట్టు, భిన్నభిన్న ఆకార స్వభాదులను, రాజకీయ, ఆర్థిక విధానములను అలవరచుకొనినదని ఈ శాస్త్రము బోధించును. అంతేగాని, జాతుల రంగుభేదములనుబట్టి (Variations in skin-colour) గొప్పదనము గల్గుననిగాని, ఒకజాతి కన్న మరియొకజాతి గొప్పదనిగాని, అంగీకరించదు.

నిజముగా ఇది సామ్రాజ్యవాదనలకును, ఫాసిస్టు సిద్ధాంతములకును వ్యతిరేకమన్నమాట।

కాని అమలునందుపెట్టునపుడు, మానుషశాస్త్రము ఒకవిధముగా ఆదిమనివాసులకు సన్నిహితమని చెప్పవచ్చును. 'ఒకవిధముగా'నని ఏల చెప్పితినన, శాస్త్రజ్ఞుడు R. W Firth చెప్పినట్లు, ఈ శాస్త్రము 'ఒక్క పురాతన విజ్ఞానమునకును, ఆదిమనివాసుల సంస్కృతులకు, వ్యవస్థలకు, జీవితములకు మాత్రమే సంబంధించదు. పైగా, మన నాగరికతా సంఘములందలి వ్యవస్థలనుగూడ పరిశీలించి, నవీన సాంఘిక సమస్యలనుగూడ పరిష్కరించును. అయినను ఈ విషయమునందు జరిగిన పరిశోధనలు క్రమపద్ధతులయందు జరుపబడక పోవుటవలన, ఈ లక్ష్యమంతగా ప్రాముఖ్యము గణించలేదు. కాని ఆదిమనివాసుల విజ్ఞాన వ్యవస్థలనుమాత్రం సమగ్రముగా పరిశోధించి, అనుభవముతోకూడిన విలువైన సిద్ధాంతము

లను ఏర్పరచి, తద్వారా లోకమునకు విజ్ఞానప్రబోధం చెయ్యటమేగాక, ప్రభుత్వములకుకూడ పరిపాలనా పద్ధతులలో చక్కనిదారి చూపించినది ఈ శాస్త్రం.

## విజ్ఞానం - ప్రజలు

ప్రస్తుతకాలమునందు, ప్రపంచమున వారివారి విజ్ఞానమును బట్టి చూచినచో, ప్రజలను రెండుతరగతులక్రింద భాగించవచ్చును. ఇందు ఒకరకంవారు ప్రపంచపరిస్థితులు, నాగరికత అవగాహనచేసుకొని, జీర్ణించు కొన్న సభ్యసంఘీయులు. రెండవరకంవారుమాత్రం సభ్యసంఘమునకు దూరముగా నివశించుచూ, అడవులలోగాని, కొండ గుహలయందుగాని, కాలము వెళ్ళబుచ్చుకొనుచూ, ప్రత్యేకముగా తమ సాంఘిక చట్టములు. నడవడులు, మతము, విజ్ఞానము, నిర్మించుకొన్నవారు. మొదటిరకం వారి విజ్ఞానము, నడవడులు, అన్నియునుగూడ భౌతికాభివృద్ధికి దోహద మొనగును. రెండవరకపు ప్రజలయందు ఈ భౌతికాభివృద్ధి కన్పడదు. వారిదంతయు మరియొకతరహా. వీరినే 'అసభ్యులని' సభ్యసంఘీయులు పిలిచెదరు. మనదేశమునందలి దస్యులు, తదితర ఆదిమ నివాసులుగూడ ఈ అసభ్యులక్రిందికే వచ్చెదరు.

## నాగరికతా వ్యాపకము - సభ్యతా సంబంధం

మానవసంఘము వ్యాపకమగునట్టిది. అందువలననే ప్రకృతిః మాన వునకు అధికారము, ఆశ, మొదలగువానిపైన ప్రీతిఎక్కువ. అందును, భౌతి కముగా అభివృద్ధి పొందుతున్న సభ్యసంఘీయులకు - ప్రస్తుతం యూరప్, అమెరికా దేశీయులలో ఈ భౌతికాభివృద్ధి ఎక్కువగా కన్పించుచున్నది - క్రొత్తదేశములు చూడవలయుననియు, ప్రకృతిప్రసాదించు సంపదను వశం చేసుకొనవలెననియు, కోర్కెకలిగినది. తత్ఫలితముగా, దేశాక్రమణలు, వలసలు, ప్రారంభించినవి. ఖనిజసంపదను వెలికితీసి, తద్వారా ఆర్థిక లాభము పొందవలయుననెడి కాంక్షగూడ బయలుదేరినది. దీనికితోడు కొంతమందికి తమమతము వ్యాప్తపరుపవలెనను ఆవేశమువచ్చినది. వీటి కొరకు కొన్ని సంస్థలు, ప్రభుత్వములు విశేషముగ కృషిసల్పి, చివరికి నెగ్గినవి. ఇంతేగాక ఈ యంత్రయుగమునందు అపారమగు పారిశ్రామికా వృద్ధి కలుగుట మూలమున తయారుచేయు వస్తువులకు వలయు ముడి

సరుకులు సంపాదించుటకును, తయారుచేసిన వస్తువులను దిగుమతి చేయుటకును, మార్కెట్లు కావలసి వచ్చినవి. దీనికితోడు ఎక్కువ జనసంఖ్య గల ప్రదేశములనుండి ప్రజలు కొత్తదేశములకు నివాసముకొరకు వలసవెళ్ళినారు.

నాగరికతా వ్యాపకముమూలమున, క్రొత్తగావచ్చినప్రజలకు ఆయా దేశములందలి స్వదేశీయులకు రాజకీయ, ఆర్థిక బాంధవ్యములు, తద్వారా సభ్యతా - సంబంధం కలుగుట సహజము. మరియును చాలా జాతులు, ఆర్థిక సహకారము, వివాహము మొదలగు పద్ధతులద్వారా, ఒకదానితో నొకటి కలిసిపోయి, జాతిసాంకర్యమును బొందినవి. తత్ఫలితముగ కొత్త జాతులు ఏర్పడి, నూతనవిజ్ఞాన వ్యవస్థలు ఆవిర్భవించినవి.

సభ్యతా-బాంధవ్యం, చాలవరకు అన్నిదేశాలలోను అనాదిజాతుల నడవడులయందు మార్పులుతెచ్చి, నూతన సమస్యలను లేవదీసినది. ఇట్టి సమస్యలు కల్గుటకు చాల కారణములుగలవు. విజ్ఞానాధిక్యతగల జాతులు తమకన్న తక్కువ సభ్యత, నాగరికతగల జాతులను ఆర్థికముగను, రాజకీయముగను, దోపిడీచేయుట మొదలుపెట్టినవి. దానితో జాతి కలహములు, నలుపు, తెలుపు రంగుల భేదములు మొదలగునవిపుట్టి, అంతః కలహములకు, కుట్రలకు, పితూరీలకు దారితీసినవి. ఇవన్నియును ఆయా దేశ ప్రభుత్వములకు పరిపాలనా నిర్వహణమునందు చాల చిక్కులు తెచ్చిపెట్టినవి. కాని పలుచోట్ల ప్రభుత్వములు మానుష శాస్త్రజ్ఞులను నియమించి, వారి సలహాలు నిరంతరము గైకొనుచు, తమ చిక్కులన్నియునుగూడ పరిష్కరించుకొనినారు.

ఐతే, ఈ విజ్ఞాన బాంధవ్యము ఎప్పుడూ చిక్కులను తెచ్చునని అనుకొనుట పొరపాటు. కొన్నిచోట్ల ఈ బాంధవ్యం అనాదిజాతుల అభ్యున్నతికి దోహదమొసగినది.

నిజమునకు, సభ్యసంఘమునకు దూరమున నివసించుచూ, పశుతుల్యులై, అధఃపతితులైన ఈ ఆదిమనివాసుల జీవితములను గ్రాహ్యం చేసికొని, వారిని చెడుఅలవాటులనుండియు, అనాగరిక పద్ధతులనుండియు తప్పించి, ఈ విశాల నాగరికతా ప్రపంచమున వారికిగూడా స్థానము కల్పించి, ఉపయోగకరమగు పౌరులనుగా తయారుచేయుట ఒక మానవ

సేవేగదా! గాంధీ మహాత్ముని నిర్మాణ కార్యక్రమంలోగూడ 'ఆదిమ నివాసుల' సేవకు ప్రాముఖ్యం ఇవ్వబడినదిగదా!! మానుషశాస్త్రం ఆదిమ నివాసుల అభ్యున్నతికి చాలా అవుసరం.

## 2. మానుషశాస్త్ర పూర్వచరిత్ర

విదేశములయందు ఇట్టి ప్రాముఖ్యత బొందిన మానుషశాస్త్రము పూర్వకాలమునందుమాత్ర మిట్టి గణ్యతనొందలేదు. ఇటీవల అనగా, షుమారొక శతాబ్దమునుండి మాత్రమే ఈ శాస్త్రపు విలువను గుర్తించినవి ఆయాదేశ ప్రభుత్వములు.

ఒకప్పుడు మత వ్యవస్థలు, ప్రభుత్వములు — ఈ రెండుగూడ మానుషశాస్త్రము నెడలను, శాస్త్రజ్ఞులనినను, ఉదాసీనము వహించెడివి. చూడుడు! ప్రప్రథమంలో, అనగా 1846 వ సంవత్సరములో ప్యారిస్ నగరమందు ఒక మానుషశాస్త్ర సంఘమును స్థాపించుటకు యత్నము చేయబడినది. గాని, పరాసుప్రభుత్వ మందుల కనుమతింపలేదు. తదుపరి 1859 లో ఇంగ్లాండులో మాత్రమొక సంఘము స్థాపింపబడినది. దీనికి 4 సంవత్సరములు ముందుగనే ఎట్లాగైతేనేమి, ప్యారిస్‌లోగూడ అల్లాంటి సంఘమొకటి బయదేరినది. దాని స్థాపకుడు బ్రోకా. కాని ప్రభుత్వం మాత్రం ఈ సంఘములో మతపీఠానికిగాని, తనకుగాని, వ్యతిరేకమగు ఉపన్యాసములు ఇవ్వరాదని శాసించినది. ఈ కారణముచేతనే, రెండు సంవత్సరాలపాటు ఈ సంఘమందు చర్చించెడి విషయములు "న్యాయ పూర్వకముగను, చట్టబద్ధముగను" ఉన్నవో లేవో పరిశీలించుటకై ప్రత్యేక పోలీసు ప్రతినిధులు సభలకు హాజరగుచుండెడివారు.

స్పెయిన్ ప్రభుత్వముగూడ మానుష శాస్త్రజ్ఞులనిన అనుమానము తోడను, భయముతోడను, చూచెడిది. అంతేగాక, మానుషశాస్త్రమునకు సంబంధించిన వ్రాతలుసైతం ఆ ప్రభుత్వం అవినీతికరములని భావించెనని ఎ. సి. హాడెన్ వ్రాసినాడు. ఆ కారణముచేతనే మాడ్రిడ్‌లో మానుషశాస్త్ర సంఘము నొకదానిని స్థాపించాలనే ప్రయత్నాన్ని ఆ ప్రభుత్వం అతి క్రూరంగా అణచివేసింది.

పీఠాధిపతులుసైతము ఈ శాస్త్రమును నిరసించటమేగాక, సాధ్య మగునంతవరకు నిరోధించారు. దీనికి మతసంబంధమగు కారణముగలదు.

మానుషశాస్త్రజ్ఞులు, పీఠాధిపతుల "ఆదామ్-ఈవ్"ల మానవజన్మ సిద్ధాంతమునకు వ్యతిరేకంగా మానవుడు "వానరసంతతి"వాడనే శాస్త్రీయ సిద్ధాంతమును ప్రచారము చేయదొడగుటయే ముఖ్యకారణము. ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడగు జె. సి. ప్రిఛర్డు పరిశోధనలను సల్పుతున్న సమయమందు అతని తండ్రి "నాయనా! బైబిలులో వ్రాయబడిన మానవోత్పత్తి సిద్ధాంతమునకేమాత్రమును వ్యతిరేకముగా వ్రాయకు సుమీ!" అని హెచ్చరించినాడు. 19 వ శతాబ్ది మధ్యభాగంలో, సుప్రసిద్ధ జంతుశాస్త్రజ్ఞుడగు బఫన్ ఈశాస్త్ర విషయమై ఉపన్యసింప, ఆ పీఠాధిపతులు నొక పెద్ద అలజడి లేవదీసినారు. అదేవిధంగా 1816—18 ల మధ్య సర్. విలియమ్ లారెన్సు శాస్త్ర ప్రచారము సల్పుచున్నప్పుడు అతని బోధనలు, సంఘనీతికి, అభివృద్ధికి హానికరములని ఈ స్వాములు అల్లరిసల్పినారు.

అసలు మానుషశాస్త్రబోధనలు ప్రపంచపునాదులనే కదలించి వేయుచున్నవని వీరిఘోష. కాని ప్రొఫెసర్ హక్సులే మాత్రం, ఈ శాస్త్రము ఎప్పటికైనా విద్యాసంస్థలలో ప్రవేశపెట్టబడునని జోస్యం చెప్పినాడు.

కాలం కలసివచ్చి అతని జోస్యం పలించినది. ఎందువలననగా, 1913 లో విశ్వవిద్యాలయ ప్రణాళికను గూర్చి పరిశీలించుటకు నియమింపబడిన, రాయల్ కమీషన్ ఆఫ్ లండన్ వారు, తమనివేదికలో "మన వలసదేశముల యందును. తదితర తూర్పుదేశములయందును, ఉద్యోగరీత్యాగాని, మరి ఇతర వృత్తుల కొరకైగాని, నివసించ దలచుకొన్న వారికి ఆయా ప్రదేశాలలోని, ఆసియా, నీగ్రోజాతుల స్వభావములు, ఆచార సాంప్రదాయములు, వ్యవస్థలు గ్రాహ్యము చేసుకొనుట మహా అవసరమని అభిప్రాయపడి, మానుషశాస్త్రము కళాశాలలయందును, తదితరపాఠశాలల యందును, బోధచేయవలసినదిగా సలహాయిచ్చిరి.

## మన దేశమునందలి స్థితి

"కర్జను ప్రభువు కృషివలన, హిందూదేశమున పురాతన వస్తుతత్వశాస్త్రము బాగుగా వృద్ధిపొందినది. పురాతన వస్తుతత్వశాస్త్రము - మానుషశాస్త్రములకుగల సంబంధము బహు సన్నిహితము. ఈరెంటిలో దేనిని నిరాదరించినను, రెండవదానికి నష్టము. మనము, మానుషశాస్త్రాభివృద్ధికై మరియొక కర్జను ప్రభువుకొరకు నిరీక్షించుటతప్ప, మరియేమియు చేయ

కాలమా ?' అనే విషయము తమరే యోచించవలె"— డాక్టరు ఎ. అయప్పగా (ఇండియన్ సైన్సు కాంగ్రెసుయొక్క మానుషశాస్త్ర శాఖ యెదుట 1945 లో యిచ్చిన అధ్యక్షోపన్యాసం నుండి.)

## 3. భారతదేశం - మానుషశాస్త్రం

మనదేశమునందు చాలాకాలమువరకు ఈ శాస్త్రమనునది యొకటి గలదని చాలామదింకి తెలియదు. ఎవరయినను ఆదిమ నివాసుల జీవితములపై, కొంచమో, గొప్పోవ్రాస్తే, అదికేవలం వినోదము పుట్టించెడి 'కాశీమజిలీ' కథలుగా మాత్రమే భావించుతుండేవారు ప్రజలు.

కాని చాలాకాలంక్రితమే కొందరు - వీరు శాస్త్రజ్ఞులు కాకపోయి నను-మనదేశమునందలి ఆదిమనివాసుల జీవితములపై, తామువినినదియు, కవినదియు కలిపి వ్రాసిరి. ఇట్టివారిలో మత వ్యాపకులు, చారిత్రకులు ముఖ్యులు. ది ఆబి జె. ఎ. డుబోయిస్, కాప్టెన్ మూర్. ఎఫ్. ఎస్. ముల్లాలీ, కర్నల్ ఇర్విన్, కర్నల్ టాడ్, జెనరల్ గంగ్రోప్, ఎలిఫిన్‌స్టన్, ఇలియట్. వైజ్ మొదలగు మత ప్రచారకులు, సైనికోద్యోగులు, చారిత్రకులు, తాము సేకరించిన వృత్తాంతముతోపాటు ఈ వెనుకబడ్డ జాతులను గూర్చి కొద్దిగా వ్రాసినారు. వారి లక్ష్యం, మానుషశాస్త్ర పరిశోధనగాక పోయినను, వారువ్రాసిన వృత్తాంతములు శాస్త్ర పరిశోధకులకు చాల సహాయకారి అయినవి.

మనదేశంలో, మానుష శాస్త్రపరిశోధనలు నల్పుటకు ప్రయత్నము నల్పిన వారిలో డాక్టరు జాను స్టూఆర్టు ప్రథముడు. ఇతని పరిశోధనలు శాస్త్రరీత్యా ఎక్కువ ఫలితములను యివ్వకపోయినను ఇతని ప్రయత్నము వలననే, మన ప్రభుత్వమువారు మానవజాతి పరిశోధనలకు (Ethnological investi gations) ఆర్థికసహాయమునల్పి, ప్రోత్సాహము కలుగ జేసినారు. ఈ పరిశోధనలు, "ప్రజానీకములోగల వివిధ ఆచార సాంప్రదాయములు, పురాతన విజ్ఞానము, భిన్నభిన్నజాతుల సాంఘిక, మతవ్యవస్థలు, మొదలగు విషయములపై పాలకులకు చక్కనిఅనుభవం ప్రసాదించి పరిపాలనా సామరస్యమును చేకూర్చుటయేగాక, మానవజాత్యాభ్యున్నతికి పాటుబడు శాస్త్రపరిశోధకులకు విలువైన అవకాశములు" కల్పిస్తవని ఇటీవలనే మన ప్రభుత్వంగుర్తెరుగుట కొంతవరకు శుభసూచకము. శాస్త్ర

ప్రాముఖ్యాన్ని ఈ విధంగా గుర్తించిన ప్రభుత్వం సంయుక్త రాష్ట్రముల లోను బెంగాలులోను, వివిధజాతుల కులములనుగూర్చి పరిశోధించుటకు డబ్ల్యు. క్రూక్, కర్నల్ డాల్టన్ అను ఇద్దరిని నియమించి, కొంతవరకు పరిశోధన సాగించినది.

డాక్టరు అయప్పన్‌గారు తెల్పినటుల కర్జనుప్రభువు పురాతన వస్తు తత్వ శాస్త్రమునకు భిక్షనిడినాడు. ఆయన కాలమునందే మానుష శాస్త్రము "ప్రభుత్వము వద్దనుండి కనీసము సవతితల్లిప్రేమ" అయినను సంపాదించుటచేతనే, ఇండియా కార్యదర్శివద్దనుండి తక్కిన రాష్ట్రములలోని జాతులను, కులములను గూర్చి పరిశోధించుటకు ప్రత్యేకముగా సూపరెండెంట్లను నియమింపవలసినదని అనుజ్ఞవచ్చినది. తత్ఫలితంగా ఎడ్గార్ థర్‌స్టన్ మద్రాస్ రాజధానిలోను, ఎంథోవన్ బొంబాయిరాజధానియందును, మధ్యరాష్ట్రములవారి విషయమై రస్సెల్, రాయ్‌బహదూర్ హీరాలాల్, హిందూదేశమందలి ప్రజలనుగూర్చి వ్రాయుటకు సర్ రిస్లే మొదలగువారు ఏర్పాటు చేయబడిరి. వీరేగాక మైసూర్, కొచ్చిన్, తిరువాన్కూరుసంస్థానము లందలి. జాతులనుగూర్చి వ్రాసిన కీ. శే. రావుబహదూర్ ఎల్. అనంతకృష్ణఅయ్యర్, హైదరాబాద్ రాష్ట్రములలో కొంతవరకు పరిశోధించి వ్రాసిన కీ. శే. షిరాజ్ - ఉల్ - హుస్సేన్, ఆయారాష్ట్రముల లోని అధఃతతితులను గూర్చి లోకమునకు వెల్లడి పరచినారు.

1911 లో మనదేశపు విద్యావిధానమును గూర్చి చర్చించుటకు సిమ్లాలో సమావేశమయిన సంఘం, మనదేశ విజ్ఞాన వ్యాప్తికిని, దానిని బహిర్గత మొనర్చుటకును ఒక "మానవజాతి ప్రదర్శనశాల" (Ethno'oji-cal Museum) అత్యవసరమనియు, అట్టి ప్రదర్శనశాలకును, విద్యావిధానమునకును సన్నిహిత బాంధవ్య మేర్పడవలెననియు, సూచించినది. అట్టి శాలలు లేకపోయినచో, పరిశోధనసల్పు విద్యార్థులు బెర్లిన్, ప్యారిస్ మొదలగు నగరములకు వెడలవలసి వచ్చుననియు, తన్మూలమున ఆవిద్యార్థులకు అనవసరముగా ధన వ్యయ ప్రయాసలు కలుగుననియు స్పష్టీకరించెను.

1913 ప్రాంతములయందు మన ప్రభుత్వమునకు ప్రాగ్దేశ పరిశోధనా సంస్థ (Oriental Research Institute) తెరువవలెననెడి సంకల్పము గలిగినప్పుడు, రాయల్ ఆంథ్రోపోలోజికల్ సంస్థ వారుగూడా

ఇండియా కార్యదర్శికి ఆ పరిశోధనాలయంలో మానుష శాస్త్రమునకు ప్రాముఖ్యత ఇవ్వవలసినదిగా కోరుచూ జాబు వ్రాసినారు.

ఈ సలహాల ఫలితముగా, మొట్టమొదట ఢిల్లీలో నొకమ్యూజియం స్థాపించినారు. తరువాత కలకత్తా, బొంబాయి, మద్రాసు, లక్నో, కొలంబో మొదలగు ప్రదేశములయందు రాష్ట్రీయమ్యూజియములు స్థాపించి, వాటిలో ప్రత్యేకముగా మానుష శాస్త్రశాఖను నెలకొల్పినారు. మన మద్రాసుమ్యూజియమునకు మానుషశాస్త్రజ్ఞులగు డాక్టర్ ఎ. అయప్పన్ గారు సూపరెంటెంటు. వీరికృష మూలమున "మానుషశాస్త్రశాఖ" వృద్ధి పరుపబడినది. ఇదెంతయు శుభసూచకము.

## 4. మనదేశమందలి మానుషశాస్త్రజ్ఞులు

మానుషశాస్త్రము మానవసంఘమును గూర్చియు, విజ్ఞానమును గూర్చియు. పరిశీలనసల్పి నవీన సిద్ధాంతములను కనిపెట్టి ప్రభుత్వములకు విలువైన సలహాలొసగి పరిపాలనా సామరస్యమును కల్పించి ఆదిమనివాసుల అభ్యున్నతికి పాటుబడుచు మానవసేవ చేయగలుగునని ఎప్పుడు గుర్తింపబడేనో అప్పుడే మన భారతదేశ విశ్వవిద్యాలయములలో దీని విషయమై అభిప్రాయములు, ఆలోచనలు, బయలుదేరినవి. పూర్వం, అనగా షుమారు 1916 సంవత్సరము వరకును, మన మద్రాసు విశ్వవిద్యాలయములో యీ శాస్త్రమునకుగూడ చోటు యొసంగినారు. అదేవిధముగ మైసూరు, పాట్నా యూనివర్సిటీలలో ఈ శాస్త్రము అభ్యసింపబడినది. లక్నో, కలకత్తా, బొంబాయి విశ్వవిద్యాలయములలో మాత్రమే దీనిని ప్రస్తుతమువిద్యాప్రణాళికలో చేర్చినారు.

అసలు మనదేశమునందలి మానుష శాస్త్రజ్ఞుల సంఖ్య చాల తక్కువ. దీని నభ్యసించినవారిలో చాలమంది బెంగాలీలు. దీనికి కారణము లేకపోలేదు. ఇదివరలో కలకత్తా విశ్వవిద్యాలయమునందు ఉపాధ్యక్షుడుగా పనిచేసిన విద్యావేత్త కీ. శే. సర్ అషుతోష్ ముఖర్జీ, యీ శాస్త్రము యొక్క విలువను గుర్తించి, దానికి ప్రాధాన్యత నొసంగెను. ఆయన కార్యదీక్ష, ఉత్సాహమువలననే, చాలమంది బెంగాలీలు ఈ శాస్త్ర మభ్యసించిరి. పైన పేర్కొనబడిన విద్యాలయములయందేగాక, ఈ శాస్త్రం ఐ. సి. యస్. పరీక్షకు నొక పత్రముగా నిర్ణేశింపబడినది.

మనదేశమందలి మానుషశాస్త్రజ్ఞులలోకెల్ల డాక్టరు బి. ఎస్. గుహాగారు ముఖ్యులు. వీరిపరిశోధనలు చాలవ్యాప్తమైనవి. ఇటీవలనే వీరు "భారతదేశములోని ప్రజల జాతిలక్షణములు" అనువిలువైన పుస్తకమొకదానిని రచించి ఈ శాస్త్రమున కమూల్యమగు సేవసల్పినారు. వీరివలెనే సర్వతోముఖమగు పరిశోధనలు సల్పినవారు, అధఃపతితుల అభివృద్ధికై పాటుబడుచున్నవారు, కొలదిమందివున్నారు. స్వర్గీయ శరశ్చంద్రరాయిగారు, ముండా, ఒరోయిన్ జాతులపైన అత్యంత కృషిసల్పి, వారిశ్రేయస్సుకై పాటుబడి, వారి సేవ యందే తన జీవితమునుకోల్పోయి, భారత మానుష శాస్త్రజ్ఞులకు ఆదర్శకుడయి నాడు. ప్రస్తుతము కలకత్తా యూనివర్సిటీయందలి మానుషశాస్త్ర శాఖాధిపతి ప్రొఫెసర్ కె. పి. చటోపాధ్యాయ, కొర్కులు మొదలగుజాతుల పైన విలువైన పరిశోధనలు సల్పినారు. ఆ విద్యాలయమునందే అధ్యాపకులయిన డాక్టర్ ఎన్. డి. మజుందార్ ఆదిమనివాసుల ఆర్థికపరిస్థితులపై ప్రత్యేకపరిశోధన గావించుచున్నాడు. రా. బ. కె. ఎన్. దీక్షిత్ (Retired Director - General, Archaeological survey of India గారు ఈ శాస్త్రమందు పత్యేకకృషి సల్పుచున్నారు. లక్నో విశ్వవిద్యాలయమందలి అధ్యాపకులు, శ్రీ, డాక్టర్ డి. ఎన్. మజుందార్ హోజాతిపైననూ, భిల్లుల పైనను, ఉత్తర హిందూస్థానమందలి 'తిరుగుబోతు జాతుల' పైనను, కొన్ని సంవత్సరములపాటు పరిశోధనలుసల్పి, అమూల్యమైన ఫలితములను కనుగొన గల్గినారు. క్రిందటి సంవత్సరమే 'రా జ పి ప్లా' సంస్థాన మందలి జాతులను గూర్చి పరిశోధించుటకుగాను, సంస్థానాధి పతులచే ఆహ్వానింపబడి, అచ్చట సైతము విశేషమైన అనుభవము గడించినారు. వీరి శిష్యుడగు ఇంద్రజిత్‌సింగ్, మధ్యరాష్ట్రములందలి, గోండ్ల ఆర్థిక వ్యవస్థలపై నొకగొప్ప గ్రంధము రచించినాడు. మజుందార్‌గారి కృషి శ్లాఘనీయము. వారు రచించిన "A Tribe in Transition" ఉత్కృష్ట గ్రంధమని కొనియాడబడినది.

పైనితెల్పిన వారలేగాక, తారకచంద్రదాస్, గులాం అహమద్‌ఖాన్, డాక్టర్ పి. సి. బిస్వాస్, ప్రొఫెసర్ సేను, ప్రొఫెసర్ జి. యస్. ఘురియే (బొంబాయి), జ్యోతిష కాంతిబోసు, మొదలగు కొలది మందియును ఈ శాస్త్రమున కపారమయిన సేవజేయుచున్నారు.

ఉద్యోగస్థులలో మానుషశాస్త్రమునందు అభిమానముగలిగి, ఆదిమ నివాసుల జీవితమును గ్రాహ్యంచేసికొనినవారిలో, పూర్వము మధ్యరాష్ట్రముల ప్రభుత్వ కార్యదర్శియు, ప్రస్తుతము నైజాము ప్రభుత్వమునకు ఆర్థికశాఖ సభ్యుడును అగు గ్రిగ్సన్, ఐ. సి. ఎస్. ముఖ్యుడు. ఈయన కొంతకాలము బస్తరు సంస్థానమునకు దివానుగనుండి, అచ్చటి గోండ్లను గూర్చి "The Maria Gonds of Bastar" అను నొక చక్కని గ్రంధము రచించెను. మధ్యరాష్ట్రములలో కాంగ్రెసు మంత్రుల కాలంలో ఆదిమనివాసుల జీవితముపై పరిశోధనలుసల్పి, నివేదికను తయారుసల్ప వలసినదిగా నియమింపబడిన ఇతడు, 2 సంవత్సరములు కృషిసల్పి, నొక గొప్ప రిపోర్టు తయారుచేసెను. బారన్ క్రిష్టఫ్ హైమండార్ఫ్, నొక గొప్ప శాస్త్రజ్ఞుడు. ఇతడు ప్రత్యేకముగా నైజాము ప్రభుత్వమువలన ఆహ్వానింపబడి, చెంచుజాతినిగూర్చి నొక ఉత్తమ గ్రంధము రచించెను. అంతేగాక, మణిపూరు ప్రాంతమందలి 'నాగ' జాతినిగూర్చి మరియొక గ్రంధము వ్రాసెను.

ఫాదర్ వెరియర్ ఎల్విన్ పేరు తెలియనివారరుదు. మధ్యరాష్ట్రములలో ప్రతిఇంటను ఇతనిపేరు ఉచ్చరింపబడును. విద్యార్థిగను, మత ప్రచారకుడుగను వచ్చిన ఎల్విన్ పది సంవత్సరములపాటు, అరణ్యములలో తిరుగుతూ ఆటవికజాతులగు గోండు, మురియ, బైగ, అగేరియాలలో కలసి, వారిలో తానుగూడా ఒకడై, కరంజియా అను గ్రామమందు ఆజాతుల సేవకై నొక ఆశ్రమము స్థాపించి, వారి హితుడై, మిత్రుడై, చివరకు నొక గోండుస్త్రీని సహితము వివాహమాడి, ఆజాతులపై సమగ్రమగునట్టియు, విలువగునట్టియు నుత్కృష్టగ్రంధములు రచియించినాడు.

డాక్టర్ అయప్పన్‌గారు 'నాయాదీ' లపై నొక చక్కని గ్రంధము తయారుచేసినాడు. అంతేగాక, భారతదేశమునందలి ఆదిమనివాసులసమస్య **(Problem of the Primitive Tribes in India)** అను ఆదిమజాతుల సమస్యలకు సంబంధించిన అమూల్యవ్యాసమును రచించినాడు. ప్రస్తుతం మద్రాసు మ్యూజియం క్యూరేటర్ డా. ఎ. రామకృష్ణారెడ్డిగారు, ఏనాదులనుగూర్చియు, గడబలను గూర్చియు, కొంత పరిశ్రమసల్పినారు.

ఒరిస్సాలో పార్షియల్లీ ఎక్స్‌క్లూడెడ్ ఏరియాస్ సంఘమునకు అధ్యక్షులును, హరిజనసేవక సంఘాధ్యక్షుడును శ్రీ ఎ. వి. ఠక్కర్‌బాబా

గారు, ఆదిమనివాసుల శ్రేయోభిలాషి. గుజరాత్‌నందలి భిల్లులకుప్రత్యేకంగా సేవామండలి నొకదానిని స్థాపించి వారి అభివృద్ధికై విశేష కృషి సల్పు చున్నారు. మత ప్రచారకులగు ఫాదర్‌వాన్‌డోరుస్టు, ఫాదర్‌ఫూచస్, మధ్య ఇండియాయందలి జాతుల విద్యావిషయమై పాటుపడుచున్నారు.

మన ఆంధ్రులలో ఎన్నికకు రాదగినవారు కీ. శే. రావుసాహెబ్ గిడుగు వెంకరామమూర్తిగారు, వారి కుమారులు డాక్టర్ వెంకటసీతాపతి పంతులుగారు. వీరిరువురు 'సవరజాతి' విజ్ఞానమును గూర్చియు, అభి వృద్ధిని గూర్చియు, విశేషముగా పాటుపడినారు. రామమూర్తిగారు సవర భాష విషయమై ప్రత్యేకకృషిసల్పి, ఆభాషకు లిపియును, వ్యాకరణమును, కనిపెట్టినారు. సీతాపతిగారు ఆజాతినిగూర్చి పరిశోధించి, వారి జీవితముపై శాస్త్రయుతమగు ఫలితములు కనుగొనినారు.

నెల్లూరు జిల్లాలో ఏనాదులవిషయమై శ్రీ వెన్నెలకంటి రాఘ వయ్యగారు విశేషముగా పాటుబడుచున్నారు. వీరేగాక ఈ జాతినిగూర్చి శాస్త్రీయ పరిశోధనలుసల్పి "మదరాసు రాజధానిలో ఏనాదులు" 'The yenadis of Madras Presidency' అను నొక అమూల్య గ్రంథం రచించినవారు నెల్లూరువాస్తవ్యులు డి. ఎన్. మజుందార్‌గారిశిష్యులు శ్రీ పి. చంద్రశేఖరరెడ్డిగారు. వీరేగాక, శ్రీ పుసులూరు కోదండరామయ్యగారు, మల్లిపెద్ది కృష్ణమూర్తిగారు, జయపూర్ ప్రాంతమందలి రామదాసుగారు, మొదలగువారు ఆదిమనివాసుల అభ్యున్నతకై పాటుబడుచున్నారు. కాని,

"చేసినది బహుస్వల్పము, చేయవలసినది అధికము"

"So little done; so much to do" Cecil Rhodes

## 5. విజ్ఞప్తి

భారతదేశం బహు ప్రాచీనదేశం. ఇది ప్రొఫెసర్ సి. ఎస్. శ్రీని వాసాచారిగారు*అని నటుల "నానాజాతి ప్రదర్శనశాల" యని చెప్పవచ్చును. ఈ దేశమందలి ప్రతిసంఘమునందు, ప్రతి జాతియందు ప్రత్యేక విజ్ఞానము కట్టుబాట్లు, భాషా సాంప్రదాయములు, వ్యవస్థలు నాటుకొనినవి. కాని, కాలము మార్పుచెందుచున్నప్పుడు జాతీయ సాంకర్యములతోపాటు ఈవిశిష్టతలు, వ్యవస్థలు, సాంఘికపద్ధతులు క్షణక్షణము మార్పుచెందుతూ,

* Hisory of India Part 1. Prof C. S. Srinivasachari.

కొంతకాలమయిన తదుపరి వాటి ప్రాచీనస్వరూపం పరిశోధించుటకు అనువుగానంత మిశ్రమ మగుచున్నవి. అందుచేతనే మానుషశాస్త్ర పరిశోధనలు ఎంత సత్వరము మొదలిడిన అంత క్షేమము. మనదేశమునందు ఈ శాస్త్రపరిశోధనలకు అమూల్యమైన అవకాశములున్నవి. "ఏప్రదేశము ప్రస్తుత నాగరికతకు, విజ్ఞానమునకు దూరమై, చీకటిభాగములని ఎన్నబడుచున్నవో, ఆ ప్రదేశములనుండియే శతాబ్దముల తరబడిగ మరుగుబడిన చారిత్రక వృత్తాంతమును వెలికిదీయవచ్చు" నని కలకత్తా యూనివర్సిటీ ప్రొఫెసర్. కీ. శే. అనంతకృష్ణ అయ్యర్ అన్నాడు.

ఇది వాస్తవము. ఈ సందర్భములో ఆంధ్ర, అన్నామలై, విశ్వవిద్యాలయములకు ఒకమనవి. హిందూదేశములోకెల్ల దక్షిణభారతమునందే అనాదులని తలువబడేజాతులు — తోడాలు, కడుంబరులు, చెంచులు, కావికర్లు — మొదలగువారు నివసించుచున్నారు. ఈజాతుల పరిశోధనలవలననే మానవసంఘమందలి వ్యవస్థయొక్క ప్రాచీన స్వరూపములను బహిర్గతము సల్పి, వివిధ మానవజాతుల ఏకత్వము, సమత్వము, నిరూపించవచ్చును. ఈ జాతులను అనాదరించుటనిన మన చరిత్రనే అనాదరించుట అన్నమాట.

మానుషశాస్త్ర విషయములో మదరాసు విశ్వవిద్యాలయమువారు ఇటీవల కొంత దృష్టిని మరల్చుట న్యాయమైనపని. విశ్వవిద్యాలయమునందు మానుషశాస్త్రమును ప్రవేశపెట్టుటకు అవుసరమగు శాసనములుసల్పి, అధికారులు ధన్యులయినారు. అంతేగాక, సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడగు 'లోవీ' వ్రాసిన Cultural Anthropology అను గ్రంథమును ఆంధ్రము, తమిళము, కన్నడము, మళయాళ భాషలలోనికి అనువదించుటకు ఏర్పాట్లు చేసినందులకు మదరాసు విశ్వవిద్యాలయాధికారు లెంతయు స్తుతిపాత్రులు.

సభ్యసంఘముచే అడవులలోనికి తరుమబడి అథోగతిలో పడిపోయిన ఈ జాతులే, ఒకప్పుడు భారతదేశములో సర్వస్వతంత్ర మనుభవించిన దొరలు. వెరియర్ ఎల్విన్ ఉద్దేశ్యము ప్రకారం వీళ్ళే "సిసలైన స్వదేశీ సముదాయము." వీళ్లలోకొన్ని జాతులలో సాంకర్యము తక్కువగుటచేతను, సభ్యసంఘమునకు దూరులగుటవలనను, పురాతన విజ్ఞానం, విశిష్ఠమగు సాంఘిక వ్యవస్థలు, చెక్కుచెదరలేదు.

కాని చాల జాతులయందు సభ్యతా సంబంధం మూలమున రాజకీయ, మత, సాంఘిక, యిక్కట్లు చాల గలుగుచున్నవి. సభ్యప్రపంచంలో

వీళ్లంటే - అశ్రద్ధ, ఏవగింపు. నిజమునకు 2½ కోట్ల జనసంఖ్యగల ఆదిమనివాసుల జీవితములను పరిశోధించి, వారిని చక్కని పౌరులుగా తయారుచేసినచో, మన భావ్యాభివృద్ధికి దోహదమొసగుసుగదా!

ఆంధ్ర, మద్రాసు, అన్నామలై, విశ్వవిద్యాలయములు ఈ కార్యమునకు పూనుకొనవలెను. ప్రభుత్వం ఈ జాతుల పరిపాలనకై ప్రత్యేకముగా సిబ్బందిని ఏర్పాటుచేయవలెను. ఈ సిబ్బందికి శాస్త్రీయశిక్షణ ఇవ్వగలిగినవి విద్యాసంస్థలు. అందువలననే విశ్వవిద్యాలయములు ప్రభుత్వంతో సహకారంచూపి, మానుష శాస్త్రము తమ విద్యాలయములలో ప్రవేశపెట్టి, పరిశోధనలకు వీళ్లుకల్పించి, తద్వారా ఈఅధఃపతితులయిన ఆదిమనివాసుల అభ్యున్నతకి పాటుపడవలసినదిగా నా విజ్ఞప్తి.

ఇది మహత్తరమగు మానవసేవ!

---

## ప్ర థ మ భా గ ము

# (అ) మానవుని ఉత్పత్తి - ప్రపంచజాతులు

"మానవజాతియొక్క ఐక్యత సృష్టిలోనే ఇమిడివున్నది, పృధ్వియందు మానవులందరూ ఒక్కసృష్టిలోనివారే. ఐనను, స్వభావ భేదములు వారియందుగల్గును. కాని, అవి పాతుకొని పోజాలవు. పృధ్వియంతయు మానవునిసొత్తు. అందమైనవాడు, అనాకారి, పొడుగుతలవాడు, వెడల్పాటి తలగలవాడు, తెలివిగలవాడు, ఆదిమనివాసి, - వీళ్ళందరూ ఒకే సృష్టికి, తెగకు చెందుతారు."

కీ. శే. రా. బ. ఎల్. అనంతకృష్ణయ్యర్

## 6. నా గ రి క త

సభ్యత, నాగరికత, ఈ రెండుగూడ ప్రస్తుత మానవ సమాజమునందలి ప్రధాన లక్షణములు. వీటిని సృష్టించి వ్యాప్తపరచినది మానవుడే.

కాని, నాగరికతా వ్యాపకంవలన, మానవ సంఘములయందు సభ్యత అనునది చాలావరకు మరుగుపడి, దానిస్థానమున గర్వము, దురహంకారము, ఆవరించుకొన్నవి. ప్రతిజాతికూడ తక్కినజాతులు తనకంటె

తక్కువ అనియును, అందువలన అవిఅన్నియు తన చెప్పుచేతులందుండి సభ్యత పొందవలయుననియు, వాంఛించును. జర్మనీలో హిట్లరు లేవదీసిన 'జాత్యాభిమానం', మన బ్రిటిషుప్రభువులు ఆఫ్రికానందలి నీగ్రోలపైనను, మనదేశమునందును అవలంబించుచున్న పరిలపానాపద్ధతులు, అమెరికాలోని జాతి విద్వేషనాగరికత — సభ్యత గడించిన సంఘముల అహంకారమునకును, గర్వోన్మత్తతకును తార్కాణములు.

నిజమరయుదుమేని, శాస్త్రీయరీత్యా, మానవులందరును ఒక్కటే అనియును, జాతినిబట్టిగాని, రంగుభేదములను బట్టిగాని, గొప్ప-తక్కువ భేదములు గలుగవని మనకు తేలును.

ఈ విషయము నిర్ధారణ చెయ్యవలయుననినచో, అసలు మానవుడు ఎక్కడివాడు? ఎటుల సృష్టిఅయినాడు? అతడు ప్రకృతిని ఏ విధముగా వశపరుచుకొని నాగరికత సంపాదింపగలిగినాడు? జాతులంటేఏమిటి? మొదలగు విషయములను కొంచెము పరిశీలించవలెను.

## 7. మానవుడు

అసలు భూమియొక్క ఆయుర్దాయం 1000 మొదలు 5000 మిలియన్ల సంవత్సరములని వివిధ శాస్త్రజ్ఞులచే అంచనా వెయ్యబడి, ఆర్కియోజొక్ (Archaeozoic), ప్రొటెరోజొక్ (Proterozoic), పాలియెజొక్ (Palaeozoic), మెసజొక్ (Mesozoic), సెనొజొక్ (Cenozoic] అను 5 యుగములక్రింద విభాగింప బడినది. భూమి పుట్టినప్పుడే జీవముగూడ పుట్టినదని తెలుపబడినది. తొలిరోజులలో జీవము గల్గి యుండినవి రెండుమాత్రమే: వృక్షములు, జంతువులు. కాని కాలక్రమేపీ ఈ రెంటిసంతతి బాగుగా వృద్ధిపొంది, రకరకములగు ప్రాణులు పుట్టుకొని వచ్చినవి. మానవుని ప్రాణముసైతము ఇటువంటిదేనని శాస్త్రజ్ఞులు వాదించుచున్నారు.

పైని పేర్కొనిన 5 యుగములలోను, 3 యుగములలో మాత్రము కేవలము నీటిలో చరించు కొన్ని జీవులుమాత్రమే ఉండినవి. ఆఖరు యుగమగు సెనొజొక్ కాలమునందు మాత్రం చతుష్పాదములు, వృక్షములు పుట్టుకొనివచ్చి, ఈ యుగమునందలి రెండవభాగమగు ఓలిజొసెన్ (Oligocene) కాలములో వానరములు పుట్టినవని శాస్త్రజ్ఞులు తెలుపు

చున్నారు. మరోభాగమగు ప్లియొసిన్ (Pliocene) కాలమునందు మాన వుడు వుద్భవించి తర్వాత భాగమగు ప్లియొస్టోసిన్ (Pleistocene) కాలములో అతడు ప్రకృతిని జయించటం జరిగినది.

* ప్రప్రథమంలో భూభాగంపైని ఇప్పుడున్నట్లుగా వృక్షములు, పర్వతములు ఆయా స్థానాలలోలేవు. కాని కొన్ని యుగముల అనంతరం అకస్మాత్తుగా భూనైసర్గిక మార్పులు చాల జరిగినవి. పర్వతములు ఉన్న చోట్ల అడవులు, నదీ డెల్టాలయందు పర్వతములు, అడవులున్నచోట్ల సరస్సులు మొదలగునవి వెలసినవి. ఈ మార్పులకు తాళజాలక కొన్ని వనచరములు నశించినవిగాని, వాటికన్న బలవత్తరములగు కొన్ని జాతి వానరములు బ్రతికినవి. అవి కొంతకాలం భూమిమీద చరిస్తూ, చెట్లమీద నివశిస్తూ కాలం గడిపినవి. జీవితసమస్యను ఎదుర్కోవటంలో వాటి ఆకార స్వరూపములు మారిపోయి, క్రమేపీ తోకరూపు మాసినది. నిలు చుండుటకు వీలైన శరీరం, జాపుటకు చేతులు, నడచుటకు కాళ్లు, గలిగి వానరములనుండి ప్రస్తుత మానవునకు పూర్వీకుడనదగు నొక జంతువుద్భ వించినది. ఈ జంతువు పేరుగాని, ఆకారముగాని, ఏమిటో, ఎటువంటిదో, శాస్త్రజ్ఞులకు దురూహ్యమగుటచేత దానిని (Missing link) మిస్సింగ్ లింక్ అను పేరుతో తేల్చివైచినారు.

వానరములనుండి మానవుడుపుట్టినాడు. ఈసిద్ధాంతమును శాస్త్రజ్ఞులు సహేతుకంగా ఋజువుపరచినారు. మానవునకు వలెనే, కోతులకు సైతం 32 దంతములున్నవి. అతని నుదురువలెనే కోతుల నుదురుకూడ ముంద రకు వచ్చినది. అతనికి వలెనే అవికూడకూర్చొనుట, చేతితో ఆహారం తీసుకొనుట, చేయగలవు. మానవునకు వలెనే చిన్నపాదములు, చేతులు, తల, గలిగియున్నవి. ఈ మొదలగు కారణముల వలన మానవుడు వానర సంతతివాడని నిర్ధారణ చెయ్యబడినది.

ఐతే, ఈ వానరములలో "సిమెడియె" అనే జాతికిమాత్రమే మాన వుడు చెందుతాడు. ఈ జాతి వానరములు, మనుష్యునికి వలెనే దీర్ఘబాహు వులు, విశాలవక్షం, కలిగి తోకఏమియును లేకయుండును. ఈ జాతికిచెంది

* ప్రొఫెసర్ రాధాకమాల్ ముఖర్జీగారి ఉపన్యాసమ దలిది. (Class room lecture)

వాటిలో గిబ్బన్, గోరిల్లా, చింపుంజీ, ఓరాంగ్ - ఊటాన్ అను నాలుగు రకములు ముఖ్యము.

## 8. మానవుడు - ప్రకృతి

నైసర్గికమార్పులు జరిగినప్పుడు వాతావరణ వైపరీత్యములకు తాళకొనగల్గిన 'మానవపూర్వీకుడు' మృగతుల్యాడు. ఐతే, శారీరక సంబంధమగు కామవాంఛ సహజంగా ఉండుటచేత, అతనికి స్త్రీసంపర్కము, సంతానఫలము కలిగినవి. తత్ఫలితముగా వాళ్ళ రక్షణభారం అతడు వహించవలసివచ్చినది. అతని ఆహారము వేటవలననే సంపాదింపబడినది. దొరికిన ఆకు, అలము, పచ్చిమాంసము మాత్రం తింటూ, జీవితం గడిపే వాడు. ఎప్పుడయితే భార్య, సంతానము, బడసినాడో, అప్పుడే వారిని అరణ్య మృగభీతినుండి తప్పించుటకు, ఆహారము వేటాడుటకు ఆయుధము లను, పరికరములను సంపాదింపవలసిన అవసరము అతనికి గలిగినది. తొలిరోజుల్లో అతడు 'మొఱటురాళ్లనే' ఆయుధాలుగా అమర్చుకొనినాడు. మొట్టమొదట నుండియు తక్కిన అన్నిజంతువులకన్న - ఒక్క వానర ములు మినహా - మానవునకు సమిష్టి జీవనము సల్పేకోర్కె, ప్రకృతః అలవడినది. ఈ జీవితవాంఛ మూలముగానే మానవుడు ఎప్పుడూ ఏదో ఒక మానవగుంపులో నివసిస్తూ ఉండేవాడు. కొంతకాలమునకు అతనికిని, తానుజెందిన గుంపునకును పరస్పరమగు మైత్రి, కోరికలు గలిగి, క్రమేపి చిన్నిచిన్ని సంఘస్థాపనలకు దారితీసినవి.

భావాభివృద్ధిమూలముగను, దైహికసుఖముకొరకును, సూర్యరశ్మి నుండి, వర్షపాతమునుండి రక్షించుకొనుటకును, అతడు కొండగుహల్లోను, నదీలోయలవద్దను, తలదాచుకొనెడివాడు. రానురాను ఆకు అలములతో, చిన్న కుటీరములను నిర్మించుకొనుటయు, గృహోపయోగమగు సామా సులు తయారుచేయుటయు, నేర్చుకొనినాడు.

మొదటి రోజులలో మానవునకు భాష అనునదిలేదు. కాని రాను రాను సాంఘికావసరముగా, పరస్పరసాంకేతికములచేతను, గుర్తుధ్వనుల చేతను, ఒకరికొకరు తమకు కావలసినదానిని, అవుసరములను, తెల్పు కొనెడివారు. ఉదాహరణకు, స్త్రీకి సంజ్ఞాపదములు తనపిల్లలను సాకు తున్నపుడు అవుసరమయ్యెను. వాటినే, బాగుగా వృద్ధిపరచికొని, కొన్ని

శతాబ్దముల అనంతరము మానవుడు ప్రాచీనభాషా స్వరూపములు తయారుచేసుకొన గలిగినాడు.

తొలిరోజులలో పురుషుడు వేటకు వెళ్లుట, స్త్రీ ఇంటివద్దనుండి పిల్లలను సంరక్షించుట, అరణ్యములలో నుండి దుంపలు, ఫలములు ఏరుకొనివచ్చుట, మొదలగు పనులు చేయుచుండెడివారు. రానురాను, స్త్రీ పురుష భేదములను గుర్తించుట. వారి విధులను, సల్పు కార్యములను శాశ్వతముగా నిర్ణయించుట జరిగినవి. స్త్రీల నియమితకృత్యముల మూలమున, పిల్లలకు తల్లియెడలనే ఎక్కువ ప్రేమ గలిగినది. వృక్షములను పెంచుటలో స్త్రీలకు ఎక్కువగా జ్ఞానం అలవడి, చాలకాలంవరకు వాటి ఫలములను తాను అనుభవించుట, తనకుగల ఆస్తి కుమార్తెలకు ఇచ్చుట, మొదలగు అధికారములను స్త్రీ చెలాయించెడిది. భార్యాభర్తల విద్యుక్త ధర్మములు కొన్ని కట్టుడులద్వారా జరుపబడేవి.

మానవసమాజం ప్రతి విషయమందును, పైని తెల్పిన విధముగా ప్రకృతిని ధిక్కరించి, జయించి వృద్ధిలోనికి వచ్చినది.

## 9. పురాతన మానవులు

మానవుని చరిత్రను పరిశోధించవలెననినచో, పురాతన మానవుని చరిత్ర ఎంతయో సహాయకారి యగును. ఏయుగమునందు మానవుడెట్టి స్వరూపమును దాల్చెనో, ఆయుగపుటాయుర్దాయ మెంతయో, ఆకాలమందలి విజ్ఞాన విశేషములెవ్వియో, మొదలగు విషయములన్నియు వీటి మూలమున కొంతవరకు తెలియును.

పురాతన మానవుల అస్థిపంజరములు, పుఱ్ఱె, మొదలగునవన్నియును భూమి త్రవ్వుటమూలముగా కనిపెట్టబడినవి.

ప్రపంచములోకెల్లను, పురాతన మానవుడని తలపబడెడివ్యక్తి "జావా మనుష్యుడు". ఈ మానవునకు సంబంధించిన పుఱ్ఱె, తొడ, ఎముకలు, 3 దంతములు 1891-92 ల మధ్య జావా - ద్వీపమునందు హాలండ్ దేశీయుడగు యూజీన్ డుబోయిస్ వలన కనుగొనబడినవి. ఈ మనుష్యుడు ప్లియోసిన్ యుగపువాడని నిర్ధారణ చేయబడినది. డుబోయిస్ ఉద్దేశ్యప్రకారం "జావామనిషి" కాలమునందు పురాతనమై, సంజ్ఞాపూర్వకమగుభాష ఉపయోగింపబడెనని తెలియుచున్నది. "జావా మనుష్యుడు"

మానవుడు వానరములనుండి సృష్టికాబడిన కాలమధ్యములోనివాడని తలవ బడుచున్నాడు.

1903 వ సంవత్సరములో శ్లొ్కాలోసర్ అను పరిశోధకుడు చైనాలోని పెకిన్ ప్రాంతమునుండి "పెకిన్ మనుష్యునకు" సంబంధించిన ఎముకలను కనుగొనెను. కొందరు శాస్త్రజ్ఞులు 'పెకిన్ మనుష్యుడు'ను "జావామనిషి" యును షుమారు ఒకే కాలమునకు, అనగా ప్లియెస్టోసిన్ యుగమునకు జెందుదురని తెల్పినారు. గాని, ఇట్లు నమ్మటకు దగిన ప్రబల ఆధారములేమియును లేవు. ఇతనిదని భావింపబడిన పై దవుడలోని వెనుకదంతము, మానవునకుగాని, లేక ఏదో నిర్ధారణ చేయజాలని ఒక వానరమునకుగాని, సన్నిహితముగా నుండెను. అయినను శ్లొ్కాలోసర్, ఈ ఎముకలు బహు పురాకృత మానవునకుగాని, లేక వానరమునకుగాని పోల్పవచ్చుననియు, అందువలన ఆకాలమందలి మానవులు వానరములవలె యుండిరనియు, తెల్పుచున్నాడు.

1907 లో హిడెలుబర్గు విశ్వవిద్యాలయపు ప్రొఫెసరగు ఆటోస్కో-టెన్సాకు "హిడిల్‌బర్గు మనుష్యుని" కనిపెట్టినాడు. ఈ మానవుని అస్థిక లతోబాటు, ఖడ్గమృగము, ఏనుగు, శునకము, అడవిదున్న, మొదలగువాని అస్థికలు కనబడుటవలన ఈ మానవుని కాలమందు జంతుజాతులు గూడ వృద్ధిపొందెనని తేలుచున్నది. ఈ మానవుని దవుడ పెద్దదిగను, బలిష్టము గను యుండెను. గడ్డము లేనేలేదు. పలువరుస ప్రస్తుత మానవుని దానికి వలెనే యుండెను. ఇది నడివయస్సునందలి పురుషుని అస్థిపంజరమని నిర్ధారణ చేయబడెను. శాస్త్రజ్ఞులు ఈ "హిడెల్‌బర్గు మానవుడు" పురాతన రాతియుగపు మానవుల పూర్వీకుడని తలచుచున్నారు.

1911–13 ల మధ్య ఛార్లెస్ డౌసన్ ఇంగ్లాండు దేశమునందలి ససెక్సు జిల్లాలో "పిల్టుడౌను మనుష్యుని" యొక్క పుఱ్ఱె, క్రిందిదవుడ యందలి కుడిభాగము, కొన్నిపన్నులు, కనుగొనెను. రెండు సంవత్సర ముల తరువాత మరియొక మనుష్యునికి సంబంధించిన దంతములు మొద లగునవి కనుపెట్టబడినవి. శాస్త్రజ్ఞులు ఈ యిరువురును ఒకే జాతికిని, ఒకే కాలమునకును చెందినారనియును, ఆకాలమునందు పురాతన మొరటు పనిముట్లు ఉపయోగింపబడెననియుచెప్పి, ఆకాలము ప్లియోష్టోసిన్ యుగ

మని నిర్ణయించిరి. డౌసన్ ఉద్దేశ్యప్రకారం 'పిల్టు డౌనుమనిషి' ప్రస్తుత మానవ జాతులకు పూర్వీకుడు.

ఈ పరిశోధనలేగాక, 1848 లో జిబ్రాల్టరుయందును, 1857 లో నియాన్‌డెత్రల్ ప్రదేశమునందును కనిపెట్టబడిన అస్థిపంజరముల మూలమున అమూల్యమగు సిద్ధాంతములు బహిర్గతమయినవి. వీళ్లందరును 'పాలియోలితిక్' కాలమునకు చెందినవారని తలపబడిరి. ఈ మనుష్యులు వేర్వేరు తెగలకు చెందినను, వీరందరికిని "నియాన్‌డెత్రల్" మనుష్యులనెడి సామాన్య నామము చెలామణి అయ్యెను.

ఈ పరిశోధనల తరువాత 20 సంవత్సరములకు 'క్రోమాగ్‌నన్' జాతికి సంబంధించిన మనుష్యుల అస్థికలు కనుగొనబడినవి. ఫ్రాంసుదేశమందలి ఒక గుట్టనుబట్టి, ఈ జాతికి ఈ పేరు యివ్వబడినది. ఇందు కనిపెట్టబడిన ఒక వృద్ధుని పుర్రె 1590 క్యూబిక్ సెంటీమీటర్ల భారముగలదై పొడుగుగా నుండుటయేగాక, పొడుగాటి ముక్కు, చదునగు ముఖము, కొంచముగా క్రిందకువచ్చిన గడ్డముకలిగి యున్నది. దీనివలన ప్రస్తుత మానవ స్వరూపములకు క్రోమాగ్‌నన్ మనుష్యుడు అత్యంత సన్నిహితముగా నుండెననియు, ప్రాచీన కాలమునందుకూడ కొన్ని మానవ జాతులుండెననియు, కాని కాలక్రమేపీ అవి నశించినవనియు తెలియుచున్నది.

## 10. ప్రాచీనయుగ విజ్ఞానము

చారిత్రాత్మక నిదర్శనములు దొరకుట దుర్లభమగు ప్రాచీనయుగపు మానవుని విజ్ఞాన నాగరికతలు పురాతనతత్వ వస్తుపరిశోధనలవలనను, తదితర శాస్త్రజ్ఞాన సహాయమువలనను, కనుగొనవచ్చును. దీనిమూలమున ప్రాచీనకాలమందలి వివిధదేశములందలి మానవుని నాగరికత ఎట్లుండెనో కొంతవరకు తెలిసికొనగలము.

డెన్మార్కు దేశీయుడగు సి. జె. థాంసేన్, చరిత్రహీనుడగు మానవుని విజ్ఞానమును మూడుయుగములక్రింద అనగా, రాతి, కంచు, ఇనుప యుగములక్రింద భాగించినాడు.

ప్రాత రాతియుగమునందలి మనుష్యుడు కేవలము వేటవలననే జీవనము సల్పెడివాడు. స్థిరనివాసము అలవరచుకొనుటకు స్వాభావిక వాతావరణము అడ్డువచ్చెను. ఆకాలమందు మనుష్యుని ఎముకలు, పుఱ్ఱెలు

స్వంత ఆస్థిక్రింద పరిగణింపబడెడివి. ఈ యుగమునందలి చివరిభాగములో మాత్రము, కుక్క మొదలగు కొన్ని జంతువులను మానవుడు మచ్చికచేసినాడు. గృహకృత్యములకు సంబంధించు పనిముట్లు బహు మొరటుగా నుండెను. నివసించుటకు గుహలే ఉపయోగపడెడివి.

ప్రాతరాతి యుగమునకును క్రొత్తరాతి యుగమునకును మధ్యరాతి యుగము ఆవిర్భంచెనుగాని, శాస్త్రజ్ఞులు దీనికంతగా ప్రాముఖ్యమివ్వ లేదు. మానవుని జీవితమునందలి ప్రతి అంశముగూడ ఈ యుగమునందు మార్పుచెందసాగి, క్రింద చేయవబోవు క్రొత్తరాతి యుగములో అభివృద్ధి గాంచసాగెను.

క్రొత్తరాతి యుగమునందు మానవుడు భౌతికముగ అభివృద్ధి పొందెను. ప్రాతరాతి యుగమునందు కేవలము మానవునికృషి అంతయును ఆహార సంపాదనయందే కేంద్రీకరింపబడినదిగాని, ఈ యుగమునందు వేటాడుట, చేపలుపట్టుట, మొదలగువానికి తోడుగా ఆహారమును తయారుచేయుటసైతము అతడు నేర్చుకొనెను. కొన్ని జీవితపద్ధతులను సైతము మానవుడు మార్చుకొనెను. వ్యవసాయము, పాత్రలు తయారుచేయుట ప్రారంభింపబడెను. అంతేగాక, పనిముట్టులకు నగిషీపెట్టుట, పదునుపెట్టుటగూడ, మానవుడు తెలిసికొనినాడు.

అంతేగాక, ఈకాలమునందు మేకలు, గొఱ్ఱెలు, ఎద్దులు, గుఱ్ఱములు మచ్చికచెయ్యబడినవి. మట్టిపాత్రలు తయారుచేసి, అవి ఎక్కువకాలము ఉపయోగపడుటకుగాను, బంకమట్టిని ఇసుకతో కలిపి కాల్చెడివారు. మరికొన్ని సమయములయందు ఎముకలనుగాని, వృక్షములనుగాని కాల్చి తయారుచేసిన బొగ్గును సైతము కలిపెడివారట!

తొలుత చేతితోడనే పాత్రలు తయారుచేయబడెను. కాని, తరువాత కొంతకాలమునకు 'సారె చక్రము' కనిపెట్టబడినటుల శాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు. ఈ కాలమునందు తయారుచేసిన పరికరములలో గొడ్డలి, సుత్తి, బాణములు, అంబులు, మొదలగునవి — ఇవన్నియు రాతితో చేసినవి — ముఖ్యము.

క్రొత్త రాతియుగమునందు మానవుడు కొండ గుహలయందును, చిన్ని గుడిశెలయందును, నివసించుటయేగాక, నీటిమీద కర్రలతో నిర్మించిన కుటీరములందు నివసించుటకూడ నేర్చుకొనెను.

ఈకాలమునందే మానవుడు చనిపోయినవారి స్మృతిచిహ్నముగ స్థూపములను నిర్మించుట నేర్చుకొనెను. దీనివిషయమై వాదోపవాదము లున్నవి. కొందరు ఈ 'గోరీ'ల నిర్మాణము ఈజిప్టులో ప్రారంభమయిన దని తెల్పుతున్నారు. మరికొందరు ఈ స్థూపములు, ప్రాత రాతియుగము నందలి స్థూపముల స్వరూపములకు నగిషీపెట్టు పద్ధతిని సూచించెనని తెల్పుచున్నారు. ఏమైనను ఈస్థూపములు పోర్చుగలు, దక్షిణ స్పెయిన్. వాయువ్య ఆఫ్రికా, మధ్యఐరోపా, ఉత్తర పశ్చిమ ఫ్రాంసు, ఈజిప్టు. ఇండియాలలో ఎక్కువగా కన్పడుచున్నవి. ఈ స్థూపములు ఆనాటికాలపు ప్రజల విజ్ఞానమును, మృతినొందినవారి యెడలగల భక్తిని, శవములను క్రూరమృగములు భక్షింపకుండ తీసికొనబడిన జాగ్రత్తను — సూచించును.

రాతి యుగానంతరము, లోహయుగము లుద్భవించినవి. ఈయుగ ములందు మానవుని బుద్ధి, జ్ఞానము వికసించుటయేగాక, అతని పనిముట్లు లోహనిర్మితములై యుంటచేసి, క్రమముగా కంచు, ఇనుప యుగము లనెడిపేర్లు గలిగెను.

## 11. మానవుని జన్మస్థానము

మానవుడు వానరములనుండి పుట్టినాడనే సిద్ధాంతమును పురస్కరించుకొని, శాస్త్రజ్ఞులు అసలుమానవుడు ఎక్కడ పుట్టినాడు? అనేప్రశ్నకు అనేక విధములుగ జవాబిచ్చినారు. ఈవిషయములో ముఖ్యముగ మూడు వాదనలు గలవు. కొందరు అసలు మానవుని జన్మస్థానము ఆఫ్రికా అని తెలిపెదరు. మరికొందరు ఆఫ్రికా కాదు, ఆసియా ఖండమే అతని జన్మ స్థానమని వాదించెదరు. ఇంకను కొందరు, ప్రస్తుత కాలమునందు సముద్రములో మునిగిపోయిన లుమేనియా ఖండమని వాక్రుచ్చెదరు. ఆఫ్రికా ఖండమే మానవుని జన్మస్థానమని వాదించెడి శాస్త్రజ్ఞులు ఈక్రింది విషయ ములను తెలుపుచున్నారు. అవి (1) మానవునకు మూలపురుషులనదగు పెమిడియోజాతికి చెందిన గోరిల్లా, చింపుంజీ వానరములు, ఆఫ్రికాలో నివసించుచున్నవి. (2) ఆఫ్రికాలోని నీగ్రోలకును, పైని తెల్పిన వానరముల కును సన్నిహితమైన పోలికలున్నవి. వానరములకువలెనే, నీగ్రోలకుగూడ ఎక్కువ వెంట్రుకలు శరీరమునందు కన్పడును. (3) ప్రస్తుత కాలము నందు ప్రపంచంలో మచ్చిక చేయబడిన మృగములకును, ఇటీవల ఆఫ్రికాలో పరిశోధించిన కొన్ని జంతువుల అస్థిపంజరముల ఎముకలకును,

సన్నిహితమైన పోలికలున్నవి. (4) ఖగోళశాస్త్రజ్ఞులు కొందరు ఇప్పటి సహారాఎడారి ఒకానొక కాలమందు సస్యశ్యామలమగు భూప్రదేశమనియు, విశేష నాగరికత ననుభవించిన స్థలమనియు, తెల్పుచున్నారు.

ఈవాదనను పూర్తిగా వ్యతిరేకించుచు,ఆసియావాదులు తమవాదనయే నిజమని సహేతుకముగా తెల్పుచున్నారు. వారీక్రింది కారణములు పేర్కొనెదరు. (1) గోరిల్లాకును, చింపుంజీకిని గూడ పూర్వీకమగు ఓరాంగ్-ఊటాన్ కోతి ఆసియాలోనే నివసించినది. (2) సామాన్యముగా మానవుల ఒత్తిడి (Population Pressure) ఎక్కువగా ఆసియాఖండము లోనే ఉన్నది. (3) ప్రపంచములోనికెల్ల పురాతన పురుషుడనదగు "జావా మనుష్యుడు" ఆసియాఖండమునందే కన్పెట్టబడినాడు. (4) సెమిడియో జాతికి పూర్వీకములై, ప్రస్తుతము నశించిపోయిన రెండు రకముల వానరములు హిమాలయప్రాంతము నందలివి. (5) సెంపుడు జంతువులలో పురాతనమైనవియు, ఆఫ్రికాలో కనిపెట్టబడిన వాటికన్న పూర్వీకము లగు జంతువులును ఆసియాఖండమునందే పుట్టినవి. (6) సామాన్యముగ చారిత్రక దృష్టితో చూచినచో, చాల జాతులు ఆసియాఖండమునుండియే పలుతావులకు వలనపోయి, ఆక్రమణలు సల్పినవి. ఈ కారణములచేత ఆసియాఖండం, అందును ముఖ్యముగా మధ్యఆసియా భాగమే, మానవుని జన్మస్థానమని వీరు వాదించుచున్నారు. ప్రొఫెసర్ గిడ్డింగ్, ప్రొఫెసర్ ఆస్బరన్ మొదలగువారు గూడ ఈ అభిప్రాయమే నొసగియున్నారు.

మూడవ వాదనను, అనగా 'లుమేనియా' ఖండవాదనను లేవదీసిన వారి సిద్ధాంతం ప్రకారము పూర్వకాలం ఇండియా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలు మూడును కలిసియే యుండెనట. ఇప్పుడు వీనిని వేరుచేయుచున్న సముద్రభాగములు ఒకప్పుడు భూభాగములేనట. ఆ భూభాగములందే మానవుని ఉత్పత్తి జరిగెనట. దీనికి తార్కాణముగా బీహార్‌లో ఇటీవల పరిశోధనలువల్లగా కంగారూ జంతు చిత్రమొకటియు, ఆస్ట్రేలియాలోని ఆరుంటాలను ఆదిమనివాసులు ఉపయోగించు ఒకానొక పనిముట్టును, దొరకినవట. అందువలన ఈభాగమే చాలా పురాతనమనియు, ఆకారణముచేత మానవుడు అక్కడే పుట్టినాడనియు, ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడగు బీర్బల్‌సహానీ మొదలగువారు తెల్పుచున్నారు.

(5)

ఏది మానవుని జన్మస్థానమయినను, మానవుడు వానరజాతికి చెందుతాడనే విషయం నిర్వివాదాంశము. తొలుత ఒకేచోటునుండి మానవుడు ఉత్పత్తి అయియుండవచ్చు. తరువాత, శతాబ్దములతరబడి, మానవజాతి భూభాగమెల్లెడను వ్యాపించియుండవచ్చు.

ఇక, మానవజాతులనుగూర్చి ముందు ప్రకరణమున జదివెదము.

## 12. జాతి

"జాతి" అనే పదమును నిర్వచనంచేయుట చాల కష్టమగుపని. ఈ పదమును కనీసము మూడు సందర్భములయందు సామాన్యముగ వాడవచ్చును. చాలాకాలమునుంచి ఒక నిర్ణీత ప్రదేశములో నిశ్చయముగ నివసించిన పూర్వీకులుగల ప్రజాసముదాయమనిగాని లేక ఒకే ప్రదేశమునుండి వ్యాపించిన మానవగుంపు అనిగాని, లేక ఒకే మతభావముగల్గిన ప్రజాసంఘమనిగాని తెల్పవచ్చును. కాని శాస్త్రరీత్యా చూచినచో, పైని తెల్పిన నిర్వచనములన్నియు సరిగావు. జె. కె. బోసు మొదలగువారు జాతి అనిన కొన్ని ప్రత్యేకమైన శారీరకలక్షణములుగల్గి తక్కినవానికన్న భిన్నమగు ప్రజాసముదాయమని తెల్పినాడు. టోపినార్డు మొదలగు శాస్త్రజ్ఞులు 'జాతి' అనేది కేవలం ఊహాకల్పితమని వాదించుచున్నారు. ఆయన ఉద్దేశ్యము ప్రకారం కేవలము ఒక సంఘమందలి వ్యక్తులుమాత్రమే జీవించువారనియు, "జాతి" అనునది వారి కల్పన అనియు తేలుచున్నది. ఈ వాదనే సహేతుకమును, సత్యమును అయిఉన్నది. కాని సామాన్యముగా, ఒక వ్యక్తికిగలుగు శారీరకలక్షణములు తన ఆత్మీయులగు తండ్రి, తాతలనుండి కొంతవరకు అలవడును. అంతేగాని, ఒకజాతికి చెందిన కారణముచేతనే ప్రత్యేకమైన గుణములు గలుగవు.

మానుష శాస్త్రరీత్యా "జాతి" అనే పదము మానవజాతి యందలి సహజమగు భాగములకు అన్వయించును. ప్రస్తుత కాలమందు ఈ పదము మానవులందలి వివిధములగు స్వతఃసిద్ధ లక్షణములకుగూడ ఉపయోగింపబడుచున్నది.

జాతివిభేదము ఎట్టివిధమున ప్రపంచమందలి అన్నిభాగములకు వ్యాపించినవో ఒకింత తెలిసికొనెదము. మానవుని జన్మ బహుపురాతనమైనదను విషయ మందరివలనను అంగీకరింపబడినది. తొలుత మానవుని

ఆకార స్వభావాదులు ఎల్లెడలను ఒకేరీతి నుండెడివి. కాని ఈ విభేద ములు వాతావరణము, ఆహారము, క్రూరమృగములతోడను, తనుజెందిన ప్రజాశ్రేణితోడను పొందిన పోటీ మొదలగు వాటివలన కొంతవరకు కలిగినవి. దీనికితోడు, మానవుడు నివసించు భూగోళ పరిస్థితులుగూడ ఒక్కొక్క జట్టుకు ప్రత్యేక ఆకారాదులను ఏర్పరచి, శాశ్వతమొనర్చెను. ఈవిషయమును తెలుపుచున్నప్పుడు పాఠకులు ఆకారము, పోలికలు, మారినంతమాత్రముచేతనే స్వభావము, గుణముగూడ మారుననిగాని, తన్మూలమున విజ్ఞాన నాగరికతలు వృద్ధిపొందుటయో లేక తగ్గుటయో జరుగుననిగాని, అనుకొనుట పొరపాటు. తమతోటి మానవజట్లునుండి విడగొట్టబడిన ఒకజట్టు చాలకాలము ఒకానొక ప్రదేశమున నివసించుట వలన, అందలి నైసర్గిక పరిస్థితులమూలమున ప్రత్యేకమగు పుఱ్ఱె, రంగు, జుట్టు కలిగియుండుట కవకాశము గల్గును. చూడుడు! శీతలదేశము నుండి ఉష్ణప్రదేశమగు దక్షిణాఫ్రికాకు బయలువెడలి చాలకాలము నివ సించిన ఐరోపియనులు సైతము తమ దేహపురంగును కొంతవరకు గోల్పోవుదురు. అట్టిచో, శతాబ్దాలతరబడి ఒకేదేశమందు నివసించిన వారి సంతతుల ఆకారములందు మార్పువచ్చుట అస్వభావికముగాదు. ఇవ్విధమున విడగొట్టబడక, ఒకజాతి మరియొకజాతితో కలియుటకు వీలుండెనేని, జాతి సాంకర్యము గలుగుటయో, లేక బలహీనము, అల్ప సంఖ్యాకము అగు జాతి బలవత్తరమై, అధికసంఖ్యాకమగు జాతివలన యుద్ధముద్వారాగాని, లేక మరి యితర సాంఘిక కారణములవలనగాని, తన నిర్దుష్టతను, ప్రత్యేకతను గోలుపోయి, నాశనము బొందుటయో లేక బలవత్తరమగు జాతియొక్క లక్షణములు గ్రహించుటయో, జరుగవచ్చును. ఇట్టి కారణములవలననే, తొలుత, ఒకేలక్షణములు గలిగిన మానవశ్రేణి అంతయు, వివిధజాతులుగా, కొన్నికొన్ని ప్రత్యేకలక్షణములు గలిగి, భూభాగమంతయు ఆవరించెనని, శాస్త్రజ్ఞుల అభిప్రాయమై యున్నది.

## 13. జాతి సాంకర్యము

ఎప్పుడయితే తెల్లజాతులు, నల్లజాతులు పరస్పరముగ కలసికొని నవో, అప్పుడే జాతి సాంకర్యమేర్పడినది. ఇట్టిజాతులు ముఖ్యముగా సుడాన్, మధ్య, దక్షిణఆఫ్రికా భాగములు, మెడగాస్కరు, దక్షిణహిందూ

దేశమందలి తూర్పుతీరము, బర్మా, దక్షిణ ఐరోపా, పొలిసీషియా, మొద లగుచోట్ల కన్పడుచున్నవి.

ఇదే విధముగ విదేశీజాతుల ఒత్తిడిగూడ కొన్ని ప్రదేశములం దధికమయినది. తద్వారా స్వదేశీజాతులు తమ నిర్దుష్టతను కోల్పోయెను. చూడుడు! ఉత్తర, తూర్పు ఆఫ్రికాలనుండి అరబ్బులు, బెర్బరజాతులు, నీగ్రోజాతిపై ఒత్తిడి గలుగజేయుచున్నవి. హటెంతాత్ జాతిపై ధర్మ బద్ధముగాని (Illegitimate) యూరోపియన్ సంకరజాతుల ఒత్తిడి అమితముగ గల్గినది. హిందూదేశమందును ఇట్టి ఒత్తిడి గల్గెనని అనంత కృష్ణఅయ్యరు వ్రాయుచున్నాడు. కెనడా దేశములోని ఫ్రెంచి సెటిల్ మెంట్లలోగూడ 'రెడ్ ఇండియన్'జాతి లక్షణములు కన్పడుచున్నవి. మధ్య, దక్షిణ అమెరికాలలోని ఎఱ్ఱ ఇండియనులపై మెజిటిజోలు, ములటోలు, ఒత్తిడి సాగించినారు.

ఓషియానా ప్రదేశమందు, మలే, పొలిసీషియన్ జాతులు పసిఫిక్ ప్రాంతములందలి నీగ్రోలతో సాంకర్యమును బొందినారు. మధ్య ఆసియా ప్రదేశమంతటా మంగోలియన్, చైనా, యూరప్‌జాతుల రక్తసాంకర్యము హెచ్చుగా గల్గుటయేగాక, ఈ మిశ్రమము భూభాగమందలి నాల్గవభాగము వరకు యథేచ్ఛగా వ్యాపించెను.

ఇట్టి సాంకర్యముల మూలమున మానవుని నాగరికతా విజృంభణ మునకు అమూల్యావకాశములు లభించినవి.

కాని జాతిసాంకర్యము సంక్రమింపబడిన రెండు జాతులను ఘోర విపత్తునందు ముంచునని, గొబినెయు, మోర్టన్ మొదలగువారు తెలుపు చున్నారు. దీనికి వ్యతిరేకముగా మరికొందరు భిన్నమగు రెండుజాతుల కలయికవల్ల రెండుజాతులకును లాభం కలుగునని వాదించుచున్నారు. ఈసందర్భమున మనం తెలుసుకోవలసిన విషయమేమనగా : జాతిసాంక ర్యము క్రమపద్ధతులయందు, అనువైన పరిస్థితులలో జరుపబడెనేని, రెండుజాతులకు లేదా ఒకజాతికి, గుణాధిక్యమగు విజ్ఞాన తేజములబ్బుట నిశ్చయము. ఈ కలయికవలన పుట్టెడిసంతతి బలవంతమై విలసిల్లును. ఈవిషయము పసిఫిక్ దీవులలో జరిగిన జాతి మిశితములవల్ల రుజువగు చున్నది. అమెరికాలోని సంయుక్తరాష్ట్రములందు ప్రతిభ, కీర్తిగణించిన నీగ్రోవారు చాలవరకిట్టి సాంకర్య ఫలితముగ పుట్టినవారే.

కాని జాతి సాంకర్యము కొన్నిచోట్ల జాతుల అధోగతికి దారితీసినది. కొన్నిచోట్ల దీనిమూలమున విస్పారమగు ప్రజాశ్రేణి ఉద్భవించినది. దీని కనేక కారణములుండవచ్చును. ఏ సంఘమందైనను సాంఘిక, జాతీయవిధులు, అన్యజాతి సంపర్క వివాహములను బహిష్కరించెనేని, ఆ సంఘమునందలి తక్కువజాతులతో మాత్రమే జాతులు వివాహములు సల్పుకొనుట తటస్థించును. ఆకారణముచేత తక్కువజాతి ప్రజలలో వారివారి జాతులయందే వివాహములు జరుగును. వారికి పుట్టిన సంతానముగూడ తమ పెద్దలవలెనే యుందురు. కాని ఏమైనను జాతి సాంకర్యము - మిశితము - కొంతవరకు సమాజంయొక్క భౌతికాభివృద్ధికి దోహదమొసగును. జాతినిర్దుష్టత, పవిత్రత, ప్రత్యేకత, అనునవి సమాజమందలి సభ్యుల యూహాకల్పితము.

## 14. జాతి నిర్దుష్టత - జాతి దురహంకారము

జాతినిర్దుష్టత అనునది కేవలము మిథ్యావాదము, కారణము, లోగడ మనము చూచినటుల ప్రపంచములోని ప్రతి సంఘముగూడ ఒకదానితో నొకటి కలిసిపోయి సాంకర్యముబొందినవి. తన్మూలమున నవీన భావములను, నూతన విజ్ఞానమును అలవరచుకొనినవి.

శాస్త్రజ్ఞుల ఉద్దేశ్యప్రకారము "ప్రతిజాతిగూడ తక్కిన జాతులకంటె భిన్నమగు స్వాభావిక ప్రకృతులు గలిగి ఏవిధమగు మార్పులేనట్టి ఆకార లక్షణాదులు సంతతివారికి గల్గుచుండ ప్రత్యేకతను గణించుటయే గాక ఏకాలమందయినను సమకాలికజాతుల సాంగత్యమును బొందనిదైనచో అది జాతినిర్దుష్టత" అని తెల్పబడుచున్నది. ఈ దృష్ట్యా చూచినచో ప్రపంచమునందు జాతి నిర్దుష్టత లేనేలేదని తెల్పవచ్చును. ఏలనన ప్రతిజాతి, సంఘముగూడ సాంకర్యముబొంది, ప్రస్తుత నాగరికతాభివృద్ధికి దారితీసినవి.

కొందరు శాస్త్రజ్ఞుల ఉద్దేశ్యప్రకారము ఇప్పటివరకును జాతి నిర్దుష్టతను, ప్రత్యేకతను నిలుపుకొనుచున్నజాతులు అండమాన్‌దీవులందలి ఆదిమ నివాసులు, ఆఫ్రికాయందలి 'బుష్‌మన్' జాతి, సింహళమునందలి 'వెద్దా' జాతివారు,యూరప్‌దేశమందలి యూదులు. ఈయూదులవిషయమై యొకింత వ్రాసెదను. పాలెస్టయిన్ దేశమునుండి తరుమబడిన వీరు అతర్వాత తమ

జాతిలక్షణములను ప్రత్యేకంగా కాపాడుకొనినారని చాలమంది చెప్పెదరు. కాని శాస్త్రజ్ఞుడు ఓక్‌స్మిత్ ఈ వాదన సరియయినది కాదని తెల్పుచున్నాడు. ఆయన వాక్యములు చూడుడు :

"యూదులలోనిజాతి నిర్దుష్టత తక్కిన జాతులలో ఉన్నదానికన్న ఎక్కువకాదు. యూదులు ఇజ్రా, నెహేమియా సంతతివారమని తెలుపు కొనుచున్నను, తదితరులతో సాంగత్యము పొందుటకు ఎప్పుడును సంసిద్ధముగానే ఉన్నారు." — ఓక్‌స్మిత్తు.

డాక్టరు రిప్పన్ ఉద్దేశ్యప్రకారం వారియందు జాతి సాంకర్యము చాల వడిగా జరుగుచున్నది. అసలు యూదులజాతి లక్షణములలో ప్రధానమైన విషయం, తక్కిన జాతుల లక్షణములను తాము అవలంబించుటయేనట!

ఈ పైకారణములవలన, జాతి నిర్దుష్టత అనే విషయంపై చర్చలు సాగించటమన్నా, ఆసిద్ధాంతమును అంగీకరించటమన్నా, అశాస్త్రీయమగు కార్యమని వేరుగ తెలుపనక్కరలేదు.

ప్రపంచమునందు జాతి దురహంకారము ప్రబలినది. వివిధ దేశములలో ఒకదానిపైనొకదానికి విరోధము, అహంకారము హెచ్చయ్యెను. అదేవిధమున ప్రతికులమునందును, ప్రతిమతమునందును, చివరకు స్త్రీ పురుషులమధ్యను, జాతి జాతికినిగూడ విద్వేషం, అహంకారము ప్రబలి, ప్రపంచమందలి శాంతిని బాడుచేయుచున్నవి. నాగరికత గడించిన మానవుడు భౌతికాభివృద్ధిని తలంచి మురియుటయేగాక, 'అసభ్యయుని' — తనతోటి మానవుని — విరసనభావముతోడను, ఏవగింపుతోడను, చూచుచున్నాడు. పైగా, తను ఎక్కువవాడను భావమును వృద్ధిపరచుకొనుచున్నాడు. అంతేగాదు. తెల్లజాతికిచెందిన సభ్యమానవుడు, తనజాతిమాత్రమే తక్కినవాటికన్న గొప్పదనుకొని, వాటిని తన ఆధిపత్యముక్రింద తెచ్చుటకు ప్రయత్నించుచున్నాడు. అసభ్యులను కేవలము పశుతుల్యులుగాను, పశువులుగాను, చూచును. అంతేగాదు. నల్లజాతులు ఆర్యులకును - వానరములకును గలిగిన అశాస్త్రీయ సంపర్క ఫలితములని శ్వేతజాతులు విరసింతురు. అంతేగాదు. "నీగ్రో మానవుడుగాడు; అతడు గాడిదలయొక్క, ఎద్దులయొక్క, వేరు స్వరూపమని" పూర్వం దొరలు తలపోసెడివారు. కాని మానుషశాస్త్రం మానవుని ఉత్పత్త్యైక్యతను నిరూ

పించుటచేత ప్రస్తుతము నీగ్రోగూడ మానవుడనియే దొరలు తలచు చున్నారు.

ఇదేటి న్యాయము ! జాతీయాధిక్యత కేవలము నల్ల, తెలుపురంగు భేదములనుబట్టి గలుగునా ? అటులైనచో భారతదేశప్రజలు నల్లనివారు. కాని వారిని పశుతుల్యులని ఎవరైనను అనగలరా ? యూరప్‌దేశము నాగరికతలేక, అందలిప్రజలు క్రూరమృగములవలె అడవులలో పచ్చి మాంసముతింటూ తిరుగుచున్న సమయమందు భారతవర్షము ఆదర్శ యుతమగు ఉత్కృష్ట నాగరికతను, విజ్ఞానమును గల్గియుండెనే ! నైతి కాధ్యాత్మిక ఆదర్శమిశ్రితమగు మతము విజృంభించెనే ? దీనికి దొరలు యిచ్చు సమాధానమేమి ?

జాతులకు సౌందర్యమునుబట్టి గణ్యతగలుగునా ? ఎప్పటికిని గలుగదు. శతాబ్దములతరబడి తమ పూర్వీకులు శీతలప్రదేశములలో నివసించుటచేత, సూర్యరశ్మి తగులకపోవుటచేత, తెల్లని దేహపురంగు గల్గినవారు తెల్లజాతులు. నల్లజాతులయందు సూర్యరశ్మి ఎక్కువగా జొచ్చుకొని, దేహమును నలుపుచేయును. ఈభేదము జాతుల సభ్యతను, నాగరికతను, మార్పుచేయజాలదు.

పోనీ, వారివారి బుద్ధి కుశలతనుబట్టి చూచినచోనైనా, నల్లజాతులు తెల్లజాతులకే మాత్రమును తీసిపోరు *చూడుడు.

సంగీత పోటీయందు తెల్లవానికన్న నీగ్రోయే మేటి అని పించుకొనెను. బొమ్మలు గీయుటయందునూ అతడే గణ్యత సంపాదించెను. మానసిక గుణితమునందును అతడే విజయమొందెను. సహేతుక వాదనయందును అతడే గెలిచినాడు. సమస్యా పరిష్కారమునందును, పదముల అర్థము చెప్పుటయందును, వ్యావహారిక కుశలతయందును, లోక జ్ఞానమునందును, శ్వేతవర్ణుడు జయముగాంచినాడు. దీనివలన మనకు తేలునది ఏమి ? నీగ్రోజాతీయుడు - నల్లజాతికి చెందినవాడు - దొరల దృష్టియందు కేవలము పశుతుల్యుడు - అధిక్యత, సభ్యత, గణించిన శ్వేత జాతి ప్రభువుకన్న ఎన్ని విషయములలో ఆధిక్యతను చూపగల్గినాడు ? ఇంతేకాదు. ప్రఖ్యాత సాంఘిక శాస్త్రజ్ఞులగు డేవన్‌పోర్టు మొదలగువారు

"* Class room lecture By Dr. D. N. Majumdar on "race and culture"

ఏసంఘమునయినను, జాతినైనను తీసికొనినచో అందు "బహు మేధావంతులు" "శుద్ధమొద్దులు" బహు అల్పసంఖ్యాకులనియు, మధ్యస్థమగు తెలివితేటలు గలవారు ఎక్కువగా నుందురనియు, తెలిపినారు. విజ్ఞానాధిక్యతగల జాతియందైనను అట్టి ఆధిక్యతలేని సంఘమందైనను మధ్యస్థులే ఎక్కువగా కన్పడెదరు.

ఇంతేగాదు. ప్రపంచమందలి జాతులయందు కన్పడు ఆకార లక్షణములు ఇదమిత్థమని తేల్చి చెప్పుటకు వీలుగానంత సాంకర్యము జరిగినది. అంతేగాక విజ్ఞానము, సభ్యత, ఈరెంటిని జాతినిబట్టి నిర్దేశింపలేము ఉదాహరణకు, జపానుదేశీయులు, యూరపియన్లు, రెండు ప్రత్యేకజాతులకు చెందినవారు. కాని విజ్ఞానవిషయమునందు ఇరువురును సమానహోదా ననుభవించుచున్నారు. విజ్ఞానవిషయమై మాట్లాడునప్పుడు దేశమందు జరిగిన వలసలు, భిన్నభిన్న విజ్ఞానముల వ్యాపకము దృష్టియం దుంచుకొన వలెను.

ప్రస్తుత కాలమందలి జాతులసమస్యలను పరిష్కరింపవలెనన్నచో, యూరప్‌లో వ్యాపించిన రెండు సిద్ధాంతముల నొకింత పరిశీలింపవలెను. ఒకవైపున జాతీయ దురహంకారవాదులు, జాతియే విజ్ఞానమునకు పునాదియని తెల్పుదురు. దీనికి వ్యతిరేకముగా వైజ్ఞానిక వాదులు విజ్ఞానమునకును జాతికిని సంబంధములేదని సహేతుకముగ పోరాడుదురు. జాతీయ దురహంకారవాదన అంతయు 'నార్డిక్' జాతి ప్రాధాన్యతపై కేంద్రీకరింపబడినది. మానవుని బుద్ధికుశలత, విజ్ఞాన సంపత్తి, మొదలగునవి వ్యక్తిగతములని గ్రహింపక, కేవలము 'నార్డిక్' జాతికి కొన్నిప్రత్యేక శారీరక, మానసిక లక్షణములను, ప్రతిభనుగల్పించి, ప్రపంచమునందలి అన్ని విషయములపైనను ఆ జాతికే ఆధిపత్యము, నాయికత్వము రావలయునని వీరివుద్దేశ్యము. ఇంతటితో ఆగక, ప్రత్యేకంగా నార్డిక్ పవిత్రత, ప్రతిభ, అను మాటలతో ప్రపంచమును మ్రింగజూచుచున్నారు. నిజమరయుదుమేని నార్డిక్ జాతి విశిష్టత యెక్కడను లేదనియే తెల్పవచ్చును. కారణమేమన, ప్రపంచమందు ఉత్కృష్టత, కీర్తి, ప్రఖ్యాతులు గడించిన వ్యక్తులందరును నార్డిక్ జాతికి చెందినవారుకారు. ప్రపంచ ప్రముఖులగు గెటీ (Geothe), కాంత్ (Kant) వంటి తత్వశాస్త్రజ్ఞులకు నార్డిక్ లక్షణములు లేనేలేవు. నెపోలియన్, షేక్సుపియర్, ఈన్‌స్టీన్, మహాత్మాగాంధి, వీరం

దరు నార్డిక్ జాతికి చెందకపోయినను, ప్రపంచకళ్యాణమునకు, విజ్ఞానమునకు పాటుబడి కీర్తిగడించినారు. అందుకనే డాక్టర్ డి. యన్. మజుందారు " The Nordic Myth played a semi religious role as basis for a theory of passionate racialism and nothing else " అని వెలవిచ్చినారు.

గ్రాహంవాలెస్, విజ్ఞానము అనగా ఒకసంఘమందలి ప్రజలకు ప్రత్యేకముగా అలవడిన జీవిత పద్ధతులయొక్కయు, ఆదర్శముల యొక్కయు, నమ్మకములయొక్కయు, కలయిక అనినుడివినాడు. ఈపద్ధతులన్నియును తమ పూర్వీకులవలన అవలంబింపబడి, అప్పటికాలమునకును, పరిస్థితులకును అనుగుణ్యముగానున్న పద్ధతులను పరిశీలించుట ద్వారా ఏర్పడిన అనుభవముచేత, సాంప్రదాయములపై ఆధారపడి యుండును. ప్రస్తుతము వైజ్ఞానికవాదులు తెల్పెడి వాదన ఈవిధముగ విభాగింపబడినది. (1) తెల్ల జాతులనదగు నార్డిక్, ఆల్పాయినిక్, మెడిటరేనియన్ జాతులలో ఉన్న వైజ్ఞానిక విభేదాలు, తెల్లజాతికిని మంగోలియన్ మొదలగు జాతులకును ఉన్న విభేదములకన్న ఎక్కువగా కన్పించుచున్నవి. కేవలం జాతే విజ్ఞానమున కాధారమగుచో, ఇట్టి విభేదములెందుకు గలుగవలెను? (2) ఒకేజాతికిచెందిన సభ్యులు భిన్నదేశములందు విజ్ఞానమును సంపాదించుటలో ఒకే తీరునగాక, వెనుకబడియున్నారు. చూడుడు. జర్మనులు, ఆంగ్లేయులు, అమెరికనులు జాతీయంగా ఒక్కటేగాని, వారి విజ్ఞాన సముపార్జన విషయమందును, నిర్వహణ చాకచక్యమునందును, ఒకరికొకరు పరస్పర విభిన్నులై యున్నారు. (3) శారీరక లక్షణములు సామాన్యముగా మార్పుచెందవు. క్రోమాగనన్ జాతి మనుష్యుని లక్షణములకును, ప్రస్తుతమానవుని లక్షణములకును ఎక్కువ భేదములులేక. హెచ్చు పోలికలున్నవి. కాని విజ్ఞానముమాత్రము క్షణ క్షణము మారుచుండును. (4) విజ్ఞానవ్యాప్తియును, అభివృద్ధియు, కాలానుగుణ్యముగ పరిస్థితులనుబట్టి జరుగును.

కాబట్టి వైజ్ఞానిక వాదకుల సిద్ధాంతం ప్రకారము జాతీయలక్షణములు విజ్ఞానమును నిర్ణయింపజాలవు. ఏదైనను ఒకసంఘము అభివృద్ధిలోనికి వచ్చుచున్నచో, దాని విజ్ఞానముగూడ అధికమవి తెల్పవచ్చును. ఏసంఘమయితే అభివృద్ధి చెందుచున్నదో అది శారీరక లక్షణముల ప్రాబల్యమునకు స్వతంత్రముగా నుండును. దీనిని పురస్కరించుకొనియే

ఐరోపాలో 'జాతి-వైజ్ఞానిక' వాదమొకటి బయల్వెడలి అభివృద్ధి పొందు చున్న సంఘములందు భూగోళపరిస్థితులు, నైసర్గికము ఆసంఘ విజ్ఞానానికి ఏవిధముగను అడ్డురావనియును, కాని, శీతోష్ణస్థితి మొదలగునవి మానవుని సహజలక్షణములలో మార్పు తెచ్చుననియు, తెలుపుచున్నారు.

పై వృత్తాంతమునుబట్టి జాతులన్నియు ఒకటేయనియు, ఏజాతియు ప్రత్యేకనిర్దుష్టత చాటుకొనజాలదనియు, దేనికిని ఆధిపత్యము లేదనియు, మనకు తేటతెల్లమగుచున్నది.

జాతీయ దురహంకారమునుగూర్చి మరికొంత ముచ్చటించి, యీ ప్రకరణమును ముగించెదను. ఆదిమజాతులు అపరిశుభ్రముగ నుందురని ఎక్కువజాతుల ఉద్దేశ్యము. కాని ఇది సరికాదు. ఎందువల్లనంటే, చాల జాతులు ప్రతినిత్యము స్నానముచేతురు. మరియు భోజనమునకు పూర్వమును, తదుపరియు, కనీసమొక అరగంట అయినను దంతధావనము చేతురని నొక గ్రంధకర్త వ్రాస్తున్నాడు. ఆదిమజాతులకు లిపిలేదనే అభ్యంతరము మరియొకటి. కాని వారికిగల జ్ఞాపకశక్తి అద్భుతము. సభ్యసంఘములయందుకన్న ఈ జాతులయందే శీలము ఎక్కుడుగా గోచరించును. ఆదిమసభ్యులు తెలివితక్కువవారని అనియెదరుగాని, అమెరికా సంయుక్త రాష్ట్రములలో చూచినచో నీగ్రోలలో చాలామంది న్యాయవాదులుగను, విద్యాధికులుగను, వైద్యులుగను యున్నారు. నీగ్రో జాతి డాక్టర్ బ్రూకర్ వాషింగ్టన్, డాక్టర్ బోయిస్ వంటి ప్రఖ్యాతపండితులను కానుకగా నొసగినది.

జాతి విద్వేషములకు కారణములగూర్చి ఎల్. ఎ. కె. అయ్యర్ ఇట్లా వ్రాస్తున్నాడు :

"మనకు ప్రీతికరమగు ఆచార వ్యవహారములను సానుభూతితో పరిశీలించని వారివలన అపహాస్యముగ పరిగణింపబడుటచేతను, ఆర్థిక శత్రుత్వమువల్లను, కాఠిన్యమువలనను, సరిగా అర్థముచేసికొనక పోవుట వలనను, అజ్ఞానమువలనను, జాతిజాతికి విద్వేషములు గలుగుచుండును."

## 15. జాతి విభాగములు

ప్రస్తుతకాలమునందు ప్రపంచమున మూడుముఖ్యజాతులు నివసించు చున్నవి. అవి తెలుపు, పచ్చ, నలుపు,జాతులు.

జాతిని భాగించవలెనంటే మనకు తోడ్పడునవి, ముఖ్యమయినవి, మూడు- జాతివిజ్ఞానము, భాష, స్వాభావిక లక్షణములు. ఈమూటియందును స్వాభావిక లక్షణములే పరిశీలనా ప్రమాణముగ నెంచబడుచున్నవి. ఈలక్షణములలో గణనీయమైనవి - దేహపురంగు, వెంట్రుకల స్వభావం, ముఖపోలికలు, ముక్కుపరిమాణము, నేత్రములరంగు, పుఱ్ఱెపరిమాణము, నెత్తురు, మొదలగునవి.

జుట్టు ఒత్తుగనుండవచ్చును, లేక పల్చగనుండవచ్చును. వంకరలు తిరిగిగాని, నిడుపైగాని, ఉన్నివలెగాని నుండవచ్చును.

దేహపురంగు:- కొందరు శాస్త్రజ్ఞుల ఉద్దేశ్యప్రకారం, దేహపురంగే జాతినినిర్ణయించుటకు ముఖ్యముగా సహాయకారి అగునని తెల్పుచున్నారు. (1) ఈరంగు తెల్లగా ఉండవచ్చును. లేక మంచువలెను, స్వల్పముగా 'బ్రౌను' రంగుగను ఉండవచ్చును. 'బ్రౌను'లో గూడ తేలిక, ముదురుగ నుండవచ్చును. (2) (Xanthodermi) పచ్చరంగు. తేలికగను లేక పచ్చపచ్చగా, బ్రౌనురంగుకు సన్నిహితముగ, నుండవచ్చును. (3) (Melanodermi) నలుపురంగు, నల్లచాకలెట్, బ్రౌను, నలుపుగా నుండవచ్చును.

ఎత్తు 5 రకములు: పిగ్మీ (58¼"), పొట్టి (58¼"–62¼"), మధ్యమము (62¼"–66"), పొడుగు(66"–67¾"), అపరిమితపొడుగు (67¾" పైన).

తల: అనేకవిధములుగా నుండవచ్చు. పొడుగుపాటి తలలు, వెడల్పాటి తలలని రెండురకములు.

ముఖము: ముఖము క్రిందిభాగము పొడుచుకొనివస్తే ప్రొగ్నాథస్ అంటారు. అల్లాలేకపోతే ఆర్థోగ్నాథస్ అనెదరు.

ముక్కు: ఇది మూడుభాగములక్రింద పరిశీలింపబడును.

నేత్రములు: వీటి తీరునుబట్టి అంటే, సోగ, గుండ్రము, చింకిరి మొదలగువాటినిబట్టి జాతి నిర్ధారణలు జరుగును.

రక్తము: ఇది నాలుగురకములక్రింద భాగింపబడినది. సి. గ్రూపు, ఎ. గ్రూపు, బి. గ్రూపు, ఎ. బి. గ్రూపు.

ప్రస్తుత మానుషశాస్త్ర పరిశోధకులు పై పద్ధతులద్వారా జాతులను పరిశీలించుచున్నారు. కాని పూర్వకాలమునందుగూడ కొందరు జాతులను అనేకవిధములుగ భాగించినారు.

అసలు 1735 సం॥లో రిన్నేయస్ అనుఅతడు, మానవులనంద రిని, సేపియనులు, ఫెరసులు, మాన్‌స్టరులు, అని మూడుభాగములుగ చేసినాడు.

1775 లో బ్లూమెన్‌బక్, ప్రజలను కకేషియన్, మంగోలియన్, ఎథోపియన్, అమెరికన్ ఇండియన్, మలయన్ అని 5 రకములక్రింద భాగించినాడు.

1873 లో హెకెల్ మనుష్యులను మొదట 12 భాగములక్రిందను, తరువాత 34 భాగములక్రిందను జమ చేసినాడు.

ఇదేవిధమున డేనికర్, ఫ్రాంజ్‌బోయిస్, ఇలియట్, ఆర్థర్‌కీత్ మొదలగు శాస్త్రజ్ఞులు వారికి తోచినరీతిని మానవులను భాగించినారు.

## 16. ప్రపంచ జాతులు

ప్రస్తుతము ప్రపంచమునగల జాతులలో ముఖ్యమయినవి 5. అవి: (1) నార్డిక్ (2) అల్పాయినిక్ (3) మెడిటరేనియన్ (4) మంగోలియన్ (5) నీగ్రో. ఈ జాతులనుగూర్చి క్లుప్తముగా తెలిసికొనెదము.

1. నార్డిక్:—ఈ జాతికి జెందిన మనుష్యులు సామాన్యముగా 5 అడుగుల 8 అంగుళముల పొడుగు ఉండెదరు. గులాబీవర్ణముతో గూడిన తెల్లని దేహపురంగు, పొడుగాటిముక్కు, వంకరలులేని మెత్తటి జుట్టు, పీలివర్ణములగు నేత్రములు—గలిగి అందముగా ఉండెదరు. వీళ్ల యూరప్‌దేశంలోని ఉత్తరభాగముల యందును, స్కాట్లండు, స్వీడన్, స్కాండినేవియా ద్వీపకల్పమునందును కన్పించుచున్నారు.

2. అల్పాయినిక్ :—వీరు అంత పొట్టిగాదు, పొడుగూకాదు. వెడల్పగుముక్కు, నలుపు, బ్రౌనుకు మధ్యగాఉండు నేత్రపురంగు, స్థూల కాయం—గల్గిఉంటారు. వీళ్ళు యూరపులో అన్నిజాతులతోను సాంక ర్యము పొందినవారు. ఎక్కువగా వీళ్ళు మధ్యఐరోపా, రష్యా, ఫ్రాన్సు, ఆస్ట్రియా, హంగెరీ, ఇటలీలలో కన్పిస్తున్నారు. మన ప్రభువులగు బ్రిటిష్ వారుగూడ ఈతెగకు చెందినవారే।

౩. మెడిటరేనియన్:—మధ్యస్థంగా, నాజూగ్గా, తెల్లగా, వల్లవి వెంట్రుకలతో ఉంటారు. వీరి జుట్టు వంకరలుతిరిగి యుండును. వీరు ఎక్కువగా మధ్యధరా సముద్రతీరములోను, ఇంగ్లండులోని వేల్సు, కారన్‌వాల్, స్కాట్లండ్ పశ్చిమతీరం, పర్షియా, ఇండియా మొదలయిన ప్రదేశములందును కన్పిస్తున్నారు.

4. మంగోలియన్:—పొట్టిగాను, లేక మధ్యస్థంగాను ఉండెదరు. పసుపుపచ్చరంగు. జుట్టు మృదువుగా నుండదు. శరీరంమీద, ముఖంమీద అసలు బొచ్చు ఉండదు. వెడల్పగుతల. కళ్ళు చిన్నవిగ, ఇరగరచుకొని ఉంటవి. వీళ్లు మధ్యఆసియా, జపాను, చీనా, మంగోలియా, బర్మా మొదలగు ప్రదేశాలలో ఉన్నారు.

5. నీగ్రో:—చాల పొడగరులు. అమితనలుపు. అతిబలిష్ఠులు. సొట్టముక్కులు, లావుపాటి పెదిమలు, ఉన్నివంటి ఉంగరాలజుట్టు—వీళ్ల ప్రత్యేక లక్షణాలు. కొందరికి విపరీతమైన పొడుగుచేతులు, కొందరికి అంతే పొడుగేసికాళ్లు ఉంటవి. వీళ్ళ విజ్ఞానానికి, జీవితానికి ఆఫ్రికాయే కేంద్రభూమిఅయినా, మరికొన్నిచోట్లగూడ కన్పడుచున్నారు.

ఈజాతులేగాక అమెరికన్‌ఇండియన్ (అమెరికా), మలే (జావా, సుమిత్రా మొదలగు దీవులు), హమెటిక్ (ఈజిప్టు, అబిసీనియా), సెమిటిక్ (అరేబియా, మెసపొటేమియా), బుష్‌మన్ (కాలహారి) మొదలగుజాతులు ప్రపంచమందంతటను వ్యాపించియున్నారు.

## 17. హిందూదేశమందలి ముఖ్యజాతులు

భారతదేశం బహు ప్రాచీనదేశం. ఈ దేశమునకు విదేశీయులు పలుమారులు దండయాత్రకై వచ్చి అందుకొందరు స్థావర నివాసమేర్పరచు కొనుట మూలమునను, పూర్వకాలమునుండి చైనా మొదలగు దేశములలో మనహైందవవ్యాపారం విజృంభించుటవలనను, మనదేశములో జాతి సాంకర్యము గలిగినది. అనేక వ్యవస్థలు, విజ్ఞానములు ఆవిర్భవించి దేశమున నూతన వికాసము, క్రొత్తదనము కలుగచేసినవి. చూడుడు: ఆర్య-ద్రావిడ, ఆర్య-హూణ, ద్రావిడ-మంగోలియన్, ఆర్య-రాజపుత్ర, రాజపుత్ర-మొగలాయీ, ఆంగ్లో-ఇండియన్ సాంకర్యములు ఇందులకు నిదర్శనము. ఇవి శతాబ్దముల తరబడి జరిగినవి.

సర్. హెర్బర్టు రిస్లే అంచనా ప్రకారము మనదేశమునందు ప్రస్తుతము ప్రజలను 7 భాగములక్రింద తీసికొని రావచ్చును.

1. టర్కో-ఇరానియనులు :— టర్కీ పారశీకులు కలిసినజాతి విశాలమగు నుదురు, చక్కని కను, ముక్కుతీరు, మధ్యస్థమైన శరీర పరిమాణం గలిగి అందంగా ఉంటారు. నివాసం బెలూచీస్థానం.

2. ఇండో-ఆర్యనులు:—పొడగరులు. ఆకర్షవంతమగు శరీరవర్ణం. అందమైనవారు. నల్లని నేత్రాలు, పొడుగాటి తలలు. జాట్లు, రాజపుత్రులు ఖత్రీలు, కాశ్మీరీయులు, పంజాబీలు, ఈజాతి క్రిందికి వచ్చెదరు.

3. సిధియో-ద్రావిడులు :— సిధియనులకు, ద్రావిడులకు గలిగిన సంపర్క ఫలముగా ఏర్పడినజాతి. ఈ జాతిక్రిందకు మహారాష్ట్ర బ్రాహ్మణులు, కూర్గుదేశీయులు, కుంభీలు వచ్చెదరు.

4. ఆర్యో - ద్రావిడులు :— సంయుక్తరాష్ట్రమందలి చమార్లు రాజపుత్ర స్థానమందలి కొన్ని భాగములందును, బీహార్, సిలోనులందును కన్పిస్తున్నారు. హిందూస్థానీ బ్రాహ్మణులుగూడ ఈ తరగతిక్రిందికే వస్తారు.

5. మంగోలీ-ద్రావిడులు :— వెడల్పాటి తలలు, మధ్యస్థమయిన ఎత్తు, నల్లనిరంగు. కాయస్థులు, బెంగాలీ బ్రాహ్మణులు, తూర్పుబెంగాలునందలి మహమ్మదీయులు.

6. మంగోలియన్‌లు :— నేపాల్, డార్జిలింగ్, అస్సాం ప్రాంతముల వారు.

7. సిసలైన ద్రావిడులు :— నల్లనివారు; పొట్టివారు. ఎత్తు సామాన్యముగ 5'-3". వంకరలుతిరిగి ఒత్తుగల జుట్టు; వెడల్పయిన ముక్కు; పొడుగాటి తల. వీరు సిలోన్‌మొదలు గంగానదిలోయ వరకు వ్యాపించియున్నారు. అంతేగాక మద్రాసు, హైదరాబాద్, సి. పి; సెంట్రల్ ఇండియా; ఛోటా నాగపూరు ప్రదేశములయందు ఎక్కువగా వ్యాపించియున్నారు.

హెర్బర్టురిస్లే అంచనాకన్న డాక్టరు బి. ఎస్. గుహాగారు సూచించిన జాతి విభాగములే సరియని తోచుచున్నవి. గుహాగారు భారతదేశమందలి ప్రజలను 6 ముఖ్యభాగములక్రింద భాగించి, 9 ఉపభాగములను

సైతము కన్పెట్టియున్నాడు. ఆయన ఉద్దేశ్యంప్రకారం మనదేశంలో యీ క్రింది జాతులవారున్నారు :

1. నీగ్రిటో
2. ప్రొటో - ఆష్ట్రాలాయెడ్
3. మంగోలియడ్
   ఎ. పాలయి-మంగోలియడ్లు: 1. పొడుగుతలలు గలవారు
   2. అడ్డుతలలు గలవారు
   బి. టిబిటో-మంగోలియడ్లు
4. మెడిటరేనియన్లు
   ఎ. పాలయి-మెడిటరేనియన్
   బి. మెడిటరేనియన్
   సి. ప్రాక్ దేశ మెడిటరేనియన్
5. పశ్చిమ బ్రాకీసిఫాలులు : 1. అల్పెనోయిన్ 2. డినారిక్
   3. ఆర్మినోయెడ్
6. నార్డిక్

1. నీగ్రిటోలు:—పొట్టివారు 5 అడుగులకంటె తక్కువ ఎత్తు గలవారు. చిన్నతల, చిన్నగడ్డము గలవారు. కాళ్లు, చేతులు బహు నాజూకుగా ఉంటవి. కాళ్ళకన్న చేతులుపెద్దవి. ట్రావెన్కూర్, కొచ్చినులలో కడార్లు, పులియనులు కొంతవరకు ఈ భాగముక్రిందికి వస్తారు. తరువాత వైనాడు తాలూకాలోని ఇరులాలుగూడ ఈ తెగవారే.

2. ప్రొటో ఆష్ట్రోలియెడ్ :—ఈజాతికి ఎక్కువగా ఆదిమనివాసులు చెందుతారు. చెంచులు, కురుంబరులు, యరవర్లు, ముండాలు మొదలగువారు ఈ తెగక్రిందికే వస్తారు. ఉబికిన ముఖము, వెడల్పాటి చదును గల ముక్కు, పెద్ద పెదిమలు తరంగములవలెనుండు వెంట్రుకలు, ముఖ్యలక్షణాలు.

3. మంగోలియడ్:—చదును ముఖములు, ఇరగరించిన కళ్ళు, వెంట్రుకలు లేకపోవటం మొదలయినవి లక్షణాలు. చిట్టగాంగ్ జిల్లాలోని చక్మా, మాఘ మొదలయినజాతులు, అస్సాం అరణ్యజాతులు ఈ మంగోలియడ్ తెగకు చెందుతారు. భూటాన్‌లోగూడ వీళ్ళు కన్పిస్తున్నారు.

నవి. ప్రస్తుతము మనదేశములో కనబడే జాతులలో నూటికి తొంభై వంతులకుపైగా ఇట్టి జాతిసాంకర్యమును బొందినవే.

భారతదేశమందలి ఆదిమనివాసులు అనేక విభిన్న తరగతులుగా నున్నారు. డాక్టర్సు బి. ఎస్. గుహాగారి అంచనా ప్రకారం చూచినచో, మానుష శాస్త్రరీత్యా ఈ జాతులను ప్రోటో - ఆష్ట్రోలియెడ్, మంగోలియడ్, నీగ్రిటో అనుమూడు ముఖ్యభాగములక్రిందికి చేర్చవచ్చును. మొదటిరకం ప్రోటో ఆష్ట్రోలియెడ్ జాతికి సంబంధించిన వారికినీ సింహాళమునందలి "వెద్దా" జాతివారికిని, ఆష్ట్రేలియాలోని ఆదిమనివాసులకును, ఒకేరకమగు ముఖము, జుట్టు, రంగు ఉన్నవి. నీగ్రిటో జాతివారే మనదేశములోని వారిలోనికెల్ల అనాదులని తలవబడుచున్నారు. మంగోలియడ్ జాతివారి లక్షణములు మనము లోగడనే చదివితిమిగదా!

పైమూడు జాతీయ భాగములేగాక ముండా-ద్రావిడ భాషలు మాట్లాడెడి జాతులు చాలగలవు. ముండాజాతులు ఆష్ట్రో - ఏషియాటిక్ తెగకు చెందుతారు. దక్షిణదేశమునందు నీగ్రిటో జాతికిచెందిన జాతులు ఎన్నో ఉన్నవి. అంగమీనాగులు, బగ్గీలు, కడార్లు మొదలయినవారు ఈ భాగము క్రిందికే వచ్చెదరు. పశ్చిమ సముద్రతీరమునందు మంగోలియడ్ తెగకు చెందిన జాతులు కొన్ని గలవు. డాక్టరు గ్రియర్‌సన్ ఉద్దేశ్యప్రకారం ముండాలు, ద్రావిడులు ఒకే జాతివారనియు, ఆకారణముచేతనే "బ్రాహూ" అనే జాతివారు ద్రావిడభాష మాట్లాడుట సంభవించుచున్నదనియు, తెలియుచున్నది. ఇ. యె. గైటుగూడ ఇట్టి అభిప్రాయమే వెలిబుచ్చుచూ, ద్రావిడులు, ముండాలు ఒకే స్వభావలక్షణములుగలిగి చాలకాలమువరకును ఒకేచోట నివసించిరనియును, తత్ఫలితముగ శీతోష్ణ స్థితిగతుల, అంతర్వివాహముల, సహజ పరిస్థితుల మూలముగ జాతీయభేదములు నశించి, ఒకే తెగక్రింద తయారయినారనియు తెలిపినాడు. పై విషయములవలన భారతదేశమునందలి ఆదిమనివాసులలోగూడ జాతిసాంకర్యము హెచ్చని తెలియుచున్నది.

మనదేశములో ముఖ్యమగు జాతులేమిటి? రాష్ట్రవారీగా చూచినట్లయినచో అస్సాం పర్వతప్రాంతములయందును, తత్పరిసర ప్రాంతములలోను నాగజాతి, ఖాసీలు, గారోలు, కఛారీలు, లుషాయిన్లు, మికీరులు మొదలగువారు కన్పడుచున్నారు.

బీహారులో ముఖ్యమగు జాతులు, ముండాలు, శాంతాలులు, హోలు,టమేరియాలు, ఖేరియాలు,ఒరోయనులు అయిఉన్నారు. ఒరిస్సాలో బొయిపారీలు, బోండోలు, ఖోండ్లు, భుయ్యాలు, భూమిజీలు, గిడబలు, పొరోజాలు, జాంగులు ఎక్కువగా కన్పడుతున్నారు.

మధ్యరాష్ట్రములలో గోండ్లు, పార్ధనులు. బంజారాలు, బైగాలు. కొర్కులు; బొంబాయిరాజధానిలో భిల్లులు, థాడియాలు, ఠాకూర్లు, లమనులు, వర్లీలు, కట్కారీలు - వ్యాపించియున్నారు.

హైదరాబాదులో ఆదిమనివాసులసంఖ్య అధికముగానేయున్నది. ఇక్కడ నివసించుచున్న జాతులలో కొండరెడ్లు, చెంచులు, గోండ్లు, అంధులు, కోలములు, కోయలు, ఎరుకలు, గోవారీలు, పార్ధనులు, భిల్లులు, బంజారులు ముఖ్యులు.

ఇక పోతే, మన మద్రాసు రాజధానిలో ముఖ్యమైన అనాదిజాతులు తోడాజాతి, కొండికరులు, కానికరులు, కురుంబరులు, ఎరుకలు, ఏనాదులు, చెంచులు, లంబాడీలు, కోయలు, పవరలు మొదలగువారు.

వీరేగాక దేశదిమ్మరి జాతులు, తిరుగుబోతుజాతులు, చాల ఉన్నవి. వీళ్ళకు ఏవిధమైన స్థిరనివాసములేక, ఊరూరా ముష్టిఎత్తుకొని, లేక ఇతర వృత్తులవల్ల, జీవించుచున్నారు. వీళ్లు దేశమంతటను వ్యాపించియున్నారు. ఉత్తరదేశములో ముఖ్యమయిన తిరుగుబోతు జాతులు, నట్, నటియా, కంజార్, చమేరియా, ఖానోస్పుర్, డోమ్ మొదలయినవారు ముఖ్యులు.

శాస్త్రీయరీత్యాగాక వారివారి నివాసములనుబట్టి జూచినచో, మన దేశమందలి జాతులను కొండజాతి, అటవికజాతి, మైదానములలో నివసించుజాతి, దేశదిమ్మరిజాతి అని నాలుగుభాగములు చెయ్యవచ్చును.

ఈ జాతి విశేషములనుగూర్చి తక్కిన ప్రకరణములలో విపులముగా ముచ్చటించెదను.

## 2. జాతుల భాషలు

పైన పేర్కొనిన జాతులలో చాలవాటికి భాషలు గలవు. కాని కాలక్రమేపి ఏ ప్రదేశములో నివసించు జాతికి, ఆ పరిసరప్రాంతములో నుండు సభ్యప్రజలతో సంబంధము గలుగుటవలన భాషాస్వరూపముగూడ జాతివలెనే కొంతవరకు సాంకర్యము గలిగినది. శ్రీ గిడుగు సీతాపతిగారు

ఆర్య - ఆదిమ సంస్కృతియొక్కయు, భాషలయొక్కయు కలయి కనుగూర్చి ముచ్చటించుచు, సవర భాషయందును, తదితర ఆర్యేతరభాషల యందును వందలకొలది సంస్కృతపదములు కలిసెననియు, సవరభాష యందలి వారముల నామములు ఈ విషయమును బుజువుపరచుననియు, తెలిపినారు. * ఉదాహరణకు "అర్ధియార" అను సవరభాషయందలి నామమునకును "ఆదిత్యవాసర" అను సంస్కృతపదమునకును "ఆదివార" అను ద్రావిడవార నామమునకును అత్యంత సన్నిహిత పోలికగలదని వారు చూపుచున్నారు. అదేవిధమున, "దేశ" మునకు, "దేశ" మనియు, "పృధ్వి" కి "పృర్తి" అనియు, "సముద్రము" నకు "సమంద్రన్" అనియు సవరలు వాడెదరు. అదేవిధమున ఆదిమజాతుల భాషయందలి కొన్ని పదములు సంస్కృతమునందును జొరబడినవి. సంస్కృత భాషయందలి "కదళీ" "లింగ" "బాణ" మొదలగునవి ఆదిమనివాసుల భాషలనుండియే గ్రహింపబడినవని శ్రీ సీతాపతిగారు తెలుపుచున్నారు. ఇంతేగాక ప్రొఫెసర్ 'లెవి' ఉద్దేశ్య ప్రకారము "అంగ, వంగ, కళింగ, త్రిలింగ" మొదలగు దేశముల పేరులుసైతము ఆష్ట్రోఏషియాట్ భాషాసంపర్కమువల్ల గలిగినవే.

జాతుల భాషలనుగూర్చి వ్రాయుచో ఆదిమజాతుల భాషలనియే అర్థము చేసికొనవలెను. ఆదిమభాషలు ఆదిమజాతులనుండియే బయల్వెడలినవి. సునీతకుమార చటర్జీగారి అభిప్రాయము ఈ విషయమై గమనార్హము. వారు అనాదులలోకెల్ల "నీగ్రిటో" జాతివారే ప్రాచీనులనియు, వారు ఆఫ్రికానుండి వచ్చిరనియు, కాని క్రమేపీ వారు నశించి ప్రస్తుతము అండమాను దీవులలో వారిభాషతో నివసించుచున్నారనియు తెల్పుతున్నారు. ప్రొటో-ఆష్ట్రోలాయెడు జాతివారు మనదేశమునకు పాలస్థానమునుండివచ్చి, దేశమంతయు వ్యాపించి, తరువాత సింహళము, బర్మా, మలయాదేశములకు వెడలి అచ్చటినుండి ఆష్ట్రేలియాకు వెళ్ళినారు. కాని వీరిభాష నశించినది. వీరితరువాత ఆష్ట్రిక్ జాతి పైజాతితో సాంకర్యము బొందినది. వీళ్లు మెసపొటేమియానుండి మన దేశమును తొలుత ప్రవేశించి, అచ్చటినుండి కాలక్రమేపి మెలనేషియా, పొలినీషియా ద్వీపములలో చేరి, అక్కడ

---

* Vide - His paper at the Indian Science Congress 1945 on the inter penetration of Aryan and primitive cultures.

మరికొన్ని జాతులతో సాంకర్యము పొందుటయేగాక తమ భాషాస్వరూప ములను మార్చుకొని, మనదేశమందు క్రీ. పూ 1500 తర్వాత ప్రబల మయిన ఆర్యభాషలతో తమభాషను సాంకర్యపరచినారు. అంతేగాక, వీరి భాష కొంతవరకు ద్రావిడభాషలో సైతము మార్పుతెచ్చినది. ఈ జాతికి చెందినభాష ప్రస్తుతము మనదేశమందలి ఈశాన్య, మధ్యప్రదేశమందలి ఆటవిక, కొండజాతులు మాట్లాడుచున్నవి. ఆర్యాక్రమణ తరువాత వాయవ్య చైనానుండి మంగోలియను జాతివచ్చి తొలుత టిబెట్టు, హిమా లయ ప్రాంతములు ఆక్రమించుకొని, క్రమేపి అస్సాము, బంగాళముల వరకు వ్యాపించినారు. కావున అనార్య భాషలు ఈ జాతులన్నిటికిని సంబంధించినవి.

ఎస్. కె. ఛటర్జీగారు* ఆష్ట్రిక్ భాషను మూడుభాగములుగాచేసెను. (1) కొలేరియన్ లేక ముండా భాషలు. ఈ భాషలు మాట్లాడువారు: శాంతాలులు (25 లక్షలు), హోలు (4½ లక్షలు), కొర్కులు (1 లక్ష 60 వేలు), సవరలు (షుమారు 2 లక్షలు), గడబలు (44 వేలు), ఖాసీలు (2 లక్షల 34 వేలు), నికోబరులు (10,000).

ఆదిమనివాసులలో కొన్నిజాతులు ద్రావిడభాషను మాట్లాడెదరు. ఆజాతులలో కొడుగు లేక కూర్గు (45 వేలు), తోడా (6 లక్షలు), తులు (1 లక్ష 52 వేలు), గోండ్ (18 లక్షల 65 వేలు), కాంధ లేక కుయ్ (5 లక్షల 86 వేలు), కురుఖ లేక ఒరోయిన్ (10 లక్షల 38వేలు), మాల్టో (71 వేలు), బ్రాహి (2 లక్షల 7 వేలు), మంగోలియడ్ భాష మాట్లాడు ఆదిమజాతుల సంఖ్య 40 లక్షలు. ఈ జాతులలో ముఖ్యమైనవి మణిపురిజాతి (3 లక్షల 92 వేలు), లుషాయి (60 వేలు), గారో (2 లక్షలు 30 వేలు). మిగిలిన జాతులన్నిటిని "సెనో-టిబిటెన్" అను పేరుతో వ్యవహరించెదరు. భిల్లులకు ప్రత్యేకభాష గలదు. అది 20 రకాలు. ఈభాష 40 లక్షలు మాట్లాడెదరు.

సామాన్యముగా ఈజాతి భాషలన్నియు, పరిసర భాషలతో సాంక ర్యము బొందినవని తెలిపితిని. ఇది నిజమే. సభ్యసంఘముతో సంబంధం గలిగిన వీరికి ఆ భాషలయందలి మాటలు తమ భాషలోసహితము దొరలు

* See S. K Chatterjee's 'Languages and Linguistic Problems', O. U. P. P.

చుందును, ఉదాహరణకు : మన ఆంధ్రదేశమందలి కోయ, సవర, ఎరుకల, లంబాడీ జాతుల భాషలనుగూర్చి విచారింతము. ఈ జాతులన్నిటికిని ప్రత్యేకభాష గలదు. కాని తెలుగుదేశములోఉండే కోయవారి భాషయందు తెలుగు పదములు, ఒరిస్సా, జయపూర్ ప్రాంతములో ... సించే కోదు (కోయ)ల భాషలో ఓఢ్రపదములు, మధ్యర... బస్తరులో నివసించు గోండ్లభాషలో హిందూస్థానీ పదములు ఎ... కనుపించును. సవరలకు ప్రత్యేకభాష ఉన్నప్పటికినీ, కొంత మే... ఓఢ్ర భాషలతో సాంకర్యము బొందినది. ఇంతేగాక మరికొన్ని... లలో జరిగిన భాషాసాంకర్యము చాల హెచ్చయి, ఇప్పుడు వా... తేల్చిచెప్పుటకు సాధ్యముగానిపని అయినది. ఇట్టి భాషలలో... మాట్లాడే కైకడీ, ఎరుకలభాష ముఖ్యము. లంబాడీలభాష తెలు... ఏవిధమగు పోలిక లేకపోయినను, వారి భాషలోనైతము కొన్ని... పదములు దొర్లుచుండును. వారిభాష రాజస్థానీ భాష.

కావి చాలాజాతులు రెండు భాషలను మాట్లాడెదరు. దీ...మైన కారణము సభ్యతా - సంబంధము. వారిలోవారు తమభాష... కొనెదరు. నాగరికులతో నాగరికుల భాషలు మాట్లాడగలుగు... జాతులు-జాంగులవంటివి-తమభాషను కోల్పోయి., ఓఢ్రమ...దురు. ఇకపోతే. మరికొన్నిజాతులు-అంటే ఏనాదులు, చె...రాచులు - మొదలగువారు తెలుగేమాట్లాడుదురు. సామాన...బోతు జాతులకు 'హిందూస్థానీ' భాష, పరిసరభాష, వ...గ్రఫీ నుండి

"చిన్నిచిన్ని ముఠాల భాషలుగాని, వైజ్ఞానికంగ...చిన పెద్ద సంఘముల భాషలుగావి, నిర్ణీతమైన ప్రదేశ... బొందియుండును." — ప్రొఫెసర్

## 3. శాస్త్రీయ విభాగములు

"భారతదేశమందలి ఆదిమనివాసులు వారి వైజ్ఞానిక సంపత్తినిబట్టి చూచినచో నాలుగుభాగములోకి వస్తారు. ప్రతిభాగముకూడా ప్రత్యేకమైన ప్రభుత్వ చర్యలవలన అభివృద్ధికి తీసుకురావలసియున్నది. ఈ విషయము మన గుర్తించినంత వరకు ఆదిమనివాసుల సమస్య తృప్తికరముగా పరిష్కరింప బడజాలదు." — వెరియర్ ఎల్విన్.

ఉనికినిబట్టి ఏవిధముగ మనము జాతులను నాలుగుతరగతుల క్రింద భాగించితిమో, అదేవిధముగా వారివారి వైజ్ఞానిక సంపత్తు, సభ్య ప్రపంచ ముతో ఏర్పరుచుకొనిన సంబంధములను బట్టిగూడా, నాలుగు రకములుగా భాగించవచ్చును. ఎల్విన్ ఈతరగతులను క్రిందిరీతిగా వర్ణించుచున్నాడు.

ప్రథమ, ద్వితీయ శ్రేణులకు జెందిన ఆదిమనివాసుల సంఖ్య చాలా తక్కువ. ఈ తరగతుల ప్రజలు చాలభాగం అరణ్యములలోను, కొండల యందును తిరుగుచూ, సాధ్యమగునంతవరకు బాహ్య ప్రపంచముతో ఎట్టి సంబంధమును పెట్టుకొనక, స్వేచ్ఛగా ప్రవర్తించు సుఖజీవులు. వీరి సంఖ్య షుమారు ఏబదిలక్షలు. వీరే అసలయిన అనాదిజాతులని ఎల్విన్ అభిప్రాయం. వారిమతము ఏవిధమైన సాంకర్యమును పొందియుండలేదు. వారి సాంఘిక వ్యవస్థలు, నడవడులు ఎట్టి మార్పును జెందలేదు. వారు నివసించు భూభాగముయొక్క నైసర్గిక పరిస్థితులే వారిని సభ్యప్రపంచ ముతో సంబంధము లేకుండా జేసినవి. ఇట్లు దూరముగా నుండుటయే వారికి మహోపకారమయినది. పైన నేను వర్ణించిన కొన్ని అనాగరిక జాతులు బహుఅమాయకులు. కొందరికి అంబు, బాణము ధరించుటకూడా తెలియదు. క్రొత్తవారు ఎవరయినను తమవద్దకువచ్చుచో, పారిపోవునంత అమాయకులువీరు. 'అబీడ్యుబోయి' వీరినివర్ణించుచు, వీరు అమెరికా, ఆఫ్రికాలలోని అనాగరికులకన్న అమాయకులనియు, తమకు అపకారము సల్పినవారికి సయితము ఎగ్గు సల్పనట్టి సాధుస్వభావులనియు తెలిపినాడు. ఇంతేగాక, కొన్ని జాతులందు మోటారుధ్వని సహితము సామాన్యముగా రోడ్లవెంబడి బండి లాగుటకు అలవడని ఎద్దులవలె అపరిమితమగు భయ మును పుట్టించును. 'Leaves from the jungle' అను గ్రంధమునందు వెరియర్ ఎల్విన్ ఒకజాతినిగూర్చి వ్రాయుచు, ఒకానొక ఆదిమనివాసి రైలు పోవుచున్నప్పుడు దానిని చేరుటకై, కొన్ని మైళ్ళదూరముపరుగెత్తి, ఆయాసపడి, చివరకు ఒకస్టేషన్‌చేరి అందలి స్టేషను మాష్టరు భ్రతి మాలగా ఆగి, బండివచ్చిన తరువాత ఎక్కినాడని చెప్పెను. నిజముగా ఎట్టి ప్రపంచ జ్ఞానశూన్యులు ఈ ఆటవికులు?

కాని వాళ్ళ ముఠాపరిపాలనా పద్ధతులు, కళానైపుణ్యత, శ్రావ్య మగు సంగీతము ఇప్పటివరకు ఎట్టి ఇక్కట్లుపాలుగాక, నిలచియున్నవి.

ఇట్టి తరగతులకు చెందిన జాతులలో పర్వతమురియాలు, పర్వత బైగాలు, జాంగులు, గదబలు; బోండోలు, బైసన్‌హారన్‌మురియాలు; భూమియాలు, బిన్‌జావర్ బైగాలు, ఒరోయినులు; భుయ్యాలు, కురుంబరులు; సవరలు, ఖోండ్లు మొదలగువారు ముఖ్యముగా పేర్కొనదగినవారు.

ప్రథమ శ్రేణి:

ఈ తరగతియొక్క లక్షణములు కొంచెముగా ముచ్చటించెదను. వీరు చాల భయస్థులనియు, క్రొత్తవారిని చూచినచో పారిపోవునంత అమాయకులనియు, లోగడనే తెలిపితినిగదా। అయినను వారిలోవారు న్యాయపూర్వకముగ, సక్రమముగ మసలుకొనెదరు. వీరిలో నేరములు సల్పుట అరుదు. వీరిస్త్రీలు పతిభక్తితోడను, విశ్వాసముతోడను మెలగెదరు. పాతివ్రత్యమనినచో పట్టుదల మెండు. స్త్రీనిగనుక ఎవరైన మానభంగమొనర్చినచో, నేరస్థునిపట్టుకొని, దిగంబరునిచేసి, కొరడాలతో కొట్టుచూ, గూడెమంతయు త్రిప్పెదరు. అంతేగాక అట్టి తప్పిదములకు దైవిక శిక్షయుగూడ జరుగునని ఈజాతుల నమ్మకము. సామాన్యముగా ఈ తరగతుల మనుష్యులు, దుస్తులు చాలియుచాలనటుల వేసుకొనెదరు. స్త్రీలు కడుపు పైభాగమునుండి మెడవరకు ఏవిధమైన దుస్తులు ధరించరు. వీరి వ్యవసాయపద్ధతి బహుపురాతనమయినది. ఈ పద్ధతిని "పోడు" పద్ధతి అనియెదరు. వ్యవసాయమునకు ముఖ్యసాధనము గొడ్డలి. అంటే వీరు చెట్లను గొడ్డలితో నరికి తగులబెట్టెదరు. ఆ బూడిదపై విత్తులు చల్లెదరు. ఈవృత్తి వాళ్ళ జీవితములో ఒక వ్యవసాయిక మార్గమేగాక ప్రధాన ఘట్టమయినది. ఇంకను ఇతర పురాతన వ్యవసాయపద్ధతులు గలవు.

వీరందరు సమిష్టి జీవనము సల్పెదరు. ఇది వారి గృహనిర్మాణమునందే వ్యక్తమగును. ప్రతి గ్రామమునకు ఒక నిర్దేశస్థలముండు, దానిచుట్టు ఇండ్లును యుండును. ఈ స్థలములో కుల వ్యవహారములు మొదలగునవి జరపుకొనెదరు. కొన్నిజాతుల గ్రామములలో చుట్టును కంచెవైచి, దానిలో ఇంటికి ఇంటికి ఎదురుగా గృహనిర్మాణము చేసికొనెదరు. కోయగ్రామాదులు మొదలగువాటిలో బాలబాలికలకు ప్రత్యేకముగా ప్రేమికసదనములు (Dormatories) ఉంటవి. ఘో, శాలకాలు మొత

లగు జాతులందుగూడ ఇట్టివిగలవు. ప్రతిగృహము ఒక ముసలిదాని ఆధిపత్యముక్రింద ఉంచబడును. బాలబాలికలు ఒక వయస్సువచ్చువరకు అచ్చట పడుకొనెదరు. ఈ కాలములోనే వీరు ఈ ముసలిదానిద్వారా ప్రేమించుకొని వివాహములు సలుపుకొనెదరు.

ఆర్థికముగా ఈ జాతులయం దన్యోన్య సహకారముగలదు. అందు వలననే చాల గ్రామములయందు సమిష్టిగానే ధాన్యము నిలువచేసుకొను టకు గాదెలు కట్టుకొనెదరు. కొన్నికొన్ని గ్రామములయందు బీద-గొప్ప భేదములేక అందరును ఒకేరేటున పన్ను చెల్లించెదరు. మరికొన్ని గ్రామ ములలో పన్నులు వ్యక్తిగతముగా గాక, గ్రామవారీగా, వసూలుచేసెదరు. ఇంతేగాక బీదల సహాయార్థము సమిష్టిమీద తమతమ గ్రామములలో ప్రత్యేకముగ ధాన్యం నిలవచేసెదరు. వీరి వ్యవసాయము 'గొడ్డలి పద్ధతి' మూలమున జరుగుటచేత భూమిగూడ వ్యక్తిగతముగా గాక గ్రామమున కంతటికీ చెందును. అందువలననే ప్రతివానికి అన్యోన్య సమ్మతిపైన ఆ భూమిని దున్నుకొనుటకు భాగమిచ్చెదరు. ఒకవేళ ఒక సంవత్సరము తక్కువపంట పండినను, లేక పండకపోయినను అట్టివానికి వచ్చే సంవత్సరము బాగా సారవంతమగు భూమినిచ్చెదరు. నిజముగా యిది ఎంతటి చక్కని కట్టుబాటు! ఏమి స్వార్థత్యాగము!! సభ్యసంఘమా! నీవు గర్వించు నాగరికతలేకుండా ప్రకృతిలో లీనమగు అసభ్యసంఘ సోద రులనుండి ఈ సద్గుణములను నేర్చుకొనవలె సుమీ!

<u>ద్వితీయ శ్రేణి:</u>

ద్వితీయశ్రేణికి చెందిన జాతులుకూడ, ప్రథమ తరగతికి చెందిన వారివలనే సభ్య సంఘమునకు దూరమున నివసించుచూ, తమతమ ఆచార వ్యవహారములు. కట్టుబాట్లు కాపాడుకొంటున్నప్పటికినీ, ఇటీవల కొద్ది కొద్దిగా మార్పుచెందుచున్నారు. అందువలననే వారి గ్రామములు అంతగా సమిష్టి పద్ధతులపైన కన్పడవు. ప్రతి వ్యక్తి ప్రత్యేకముగా దొడ్డి నిర్మించు కొని, ఒక చక్కని తోటవేసుకొని, అందులో ఇల్లు కట్టుకొనుచున్నాడని ఎల్విన్ తెలుపుచున్నాడు. ఐనను వీరిలోగూడ ప్రేమికసదనములున్నవి. కాని వీరు గొప్ప-బీద, అనే వ్యత్యాసం కనపరుచుచున్నారు. వీరికి 'గొడ్డలి పద్ధతి' జీవితంలో ప్రధాన ఘట్టముగాదు. అది కేవలము అలవాటుగా

పరిగణించ బడుచున్నది. నాగలి, ఎడ్లు - వీటి సహాయముతో వీరిలో కొందరు వ్యవసాయము చేయుచున్నారు. ఇది కొంతవరకు అభివృద్ధి సూచకమే.

తృతీయ శ్రేణి :

జాతులలోకల్ల, ఈ శ్రేణికి చెందినవారి విషయమే శాస్త్రజ్ఞులకు ప్రధానసమస్య అయినది. మొదటి రెండుతరగతుల వారివలేగాక, వీరికి బాహ్యప్రపంచముతో అనగా సభ్యసంఘముతో బాంధవ్యము ఎక్కువగా యేర్పడి, తన్మూలమున తమ పురాతన విజ్ఞానమును, జాతి ప్రత్యేకతను కోలుపోయినారు. అంతేగాక, తమతమ మత, సాంఘిక, రాజకీయవ్యవస్థలను చాలవరకు రూపుమాపుకొనినారు. ఈ శ్రేణికి చెందినవారి సంఖ్య షుమారు 2 కోట్లు.

వీరి దురవస్థలను గూర్చి ఎంతయినను వ్రాయవచ్చును. అందులో సభ్య ప్రజలతోకలసి వారి సంబంధం కొంతవరకు కలుగుట వలన, ఈ జాతులకు కలిగిన నష్టము మరీయెక్కువ. పూర్వము మన ప్రభుత్వములో పనిచేసిన డాక్టరు హట్టన్ వీరిని గూర్చి వ్రాయుచూ, 'ప్రభుత్వము వారి యొక్క ఖనిజ సంపదను వెలికితీయు ప్రయత్నంగాని, అరణ్య సంరక్షణ పద్ధతిగాని, నవీనభూములను సస్యశ్యామలము చేయవలయునను సంకల్పం గాని-ఇవి అన్నియును అనాదిజాతులను వారివారి స్థావరములనుండి దూరముగా వెడలు గొట్టుటవలననే' జరుగునని తెలిపినాడు. అనగా సభ్య ప్రజలతో ఎవ్విధమగు సంబంధములేక, ఏ అడవులలోనో స్వేచ్ఛా జీవనము సలుపు ఆటవికజాతులకు సభ్యప్రజలతో సంబంధము కలుగక తప్పినదికాదు. ప్రభుత్వ పరిపాలనా పద్ధతి మూలమున ఒక విధమగు ఒత్తిడి, తత్ఫలితముగా స్థానచలనము, గలిగినది. ఇంతేగాదు, క్రొత్త క్రొత్త వర్తకపుబాటలు, రహదారీలు, రైళ్లు మొదలగు నవన్నియుగూడ వివిధ జాతుల దురవస్థలకు దారితీసినవి. ఈ సందర్భమున, మనమొక విషయమును మరువకూడదు. ప్రకృతః ఈ జాతులన్నియుగూడ, ప్రత్యేకముతా పద్ధతులు, సాంఘిక కట్టుబాట్లు, ఆర్థిక విధానములు, మతనడవళ్లు, తంతులు, గలిగియుంటవి. మానసికముగ వీరందరికిని పట్టుదలఅధికము. క్రొత్త విషయములన్నను, నూతనాదర్శనములనినను అర్థము చేసుకొనలేరుగావి, తమఆచారములను, మతమును, సంరక్షించుకొనుటకు ప్రాణము

నైనను అర్పించుటకు వెనుదీయరు. అంతేగాక స్వభావరీత్యా వీరు సోమరులు. పురాతన పద్ధతులపైననే వీరికి అభిమానమెక్కువ. ఈ సమయములో, రాకపోకల సౌకర్యముమూలముగా మతవ్యాపకులు మత ప్రచారమును విరివిగా ప్రారంభించి, ఆదిమ నివాసులలో తీరని అనుమానమును, భయమును కలుగజేసినారు. ఇంతేగాక బారన్‌హైమండార్ఫ వ్రాసినటుల ప్రతి అంగుళము భూమిగూడ వారివద్దనుండి క్రమేపి సాగుబడినిమిత్తము లాగుకొనబడినది.

ఎప్పుడు ప్రభుత్వము అడవులను తమవశము చేసికొనినదో, అప్పుడే వీరి మతా కట్టుబాట్లు, న్యాయచట్టములు, భూస్వామికమునకు సంబంధించిన వ్యవహార లక్షణములు, రూపుమాసిపోయినవి. వాటి స్థానమందు బ్రిటీష్ ప్రభుత్వపు శిక్షాస్మృతి, న్యాయచట్టము ప్రవేశపెట్టబడినవి. వీని మూలమున మతాచట్టములకు, న్యాయమునకు శతాబ్దముల తరబడిగా అలవాటుబడినవారికి ఈ కొత్తన్యాయచట్టము ఏమాత్రమును సరిపోకపోయెను. ఇంతేగాక, కొన్ని మతా సాంప్రదాయములు సభ్యసంఘములో నేరములుగా ఎంచబడినను, ఆదిమజాతులలో జీవితమందలి ప్రధానఘట్టములక్రింద ఎంచబడును. ఈ కారణమువలన బహు "జిగిబిగి" గానుండు మన న్యాయపరిపాలనా విధానముమూలముగా అసభ్య ప్రజలయందలి సత్యస్వభావమును, నిజాయితీయు క్రమముగా అంతరించుచున్నదని ఎల్విన్ వ్రాయుచున్నాడు. మరియొక రచయిత, ఈ సభ్యతా సంబంధము అస్సాం నందలి నాగజాతిని చాలవరకు నాశనము చేసినదనియు, మణిపూరుకు వేసిన బండ్లదారి మూలమున ఈ జాతియందు వ్యభిచారము వృద్ధిపొందినదనియు, దీనికితోడు క్షయ, కలరా మొదలగు జాడ్యములు విరివిగా వ్యాపించినవనియు వ్రాసినాడు.

సభ్యతా సంబంధము మూలమున కలిగిన మార్పులలో దుస్తుల మార్పు ఒకటి. మన ఆంధ్రదేశమందలి ఎరుకలు, చెంచులు, కొందరు లంబాడీస్త్రీలు మొదలగువారు సభ్యప్రజలకువలెనే పంచెలు, చొక్కాలు, చీరెలు ధరించుట మనము ప్రత్యక్షముగా చూచుచున్నాము. నిజమునకు ఇది అభివృద్ధి సూచకమగు మార్పే. అందుచేతనేగదా! ఇటీవల హిందూపురమునందు జరిగిన వడ్డెరవారి సభలో వడ్డిస్త్రీలందరు రవికలు తొడుగుకొనవలెనని తీర్మానించినారు. ఇట్టి మార్పులైనచో మంచివే

కాని, కొన్ని జాతులలో ముఖ్యముగా, మతబోధకుల మూలమున, హైందవ దుస్తులకు బదులుగ విదేశీయములగు సూట్లు తొడగటము నేర్పినారు. దీనిమూలమున వీరికి అనవసర వ్యయముతప్ప మరియొక లాభముఏమియు లేకపోయినది. ఆఫ్రికాయందలి నీగ్రోలదుస్తులు ఈ విషయమునే స్పష్టీకరించును.

విజ్ఞాన - బాంధవ్యమువల్ల ఆదిమనివాసులకు మరియొక తీరని నష్టము గలుగుచున్నది. తృతీయ శ్రేణికిచెందిన జాతులకును - ప్రథమ ద్వితీయ శ్రేణులవారికిని చాల భేదములున్నవి. మొదటి రెండురకముల వారిలో ముఠాజీవితము, వ్యవస్థలు చెక్కుచెదరక నిర్దుష్టమైయున్నవి. వారిలో స్వేచ్ఛ, స్వతంత్రము, హాయి కన్పట్టును. కాని ఈ మూడవరకము వారు బలహీనులై దాస్యమున కలవడి పిరికిపందలయినారు. స్వేచ్ఛతో వేటాడుటకు హక్కులు పోవుటమూలమున వేటాడు నైపుణ్యం సహితము నశించినది. ఇంతేగాదు. 'గొడ్డలివ్యవసాయ' మన్నను మరచినారు. తమ జాతీయ కథలన్ననూ వారి కులదేవతలన్ననూ వారికే అపహాస్యమైనవి. మరియును సాంప్రదాయ సిద్ధమగు నాట్యము సహితము మరపున బడినది.

ఇదీ మూడవతరగతి విషమపరిస్థితి.

---

• సభ్యతా సంబంధం : ఆదిమనివాసులు :

సభ్యతా సంబంధమను పదమును ఉపయోగించినప్పుడెల్లెడలను, సామాన్య దృష్టిలో అది ఆదిమనివాసులకు ప్రస్తుత సభ్యసంఘముతోగల సంబంధమనియే గోచరమగును. నా ఉద్దేశ్యముగూడ అంతియే. సభ్యసంబంధమే ఆదిమనివాసుల ఆర్థిక అధోగతికిగాని, వైజ్ఞానిక మార్పులకుగాని దారితీసిందని వేను తెల్పజాలను; ప్రభుత్వచర్యలు, ఆదిమవాసుల మనఃప్రవృత్తులు, భూస్వాముల, షాహుకార్ల దోపిడీ విధానపద్ధతులు, వారిని అధోగతికి దారితీసినవని. సభ్య సంఘంలోని చెడుఅలవాటులను ఈజాతులు నేర్చుకోటంవల్ల వారికి నష్టము కలుగుచున్నదని, నా అభిప్రాయము. ఇది కేవలము అనుకరణము (Imitation). అట్లుగాక ఆదిమనివాసులు నాగరికతయందలి మంచిని అవగాహనముచేసికొని, తమ జీవిత పద్ధతులందు జీర్ణించచేసినచో అది వారి అభివృద్ధికే తోడ్పడును (Assimilation). మానుషశాస్త్రజ్ఞుడు ఎప్పుడును ఈ విషయమునందే శ్రద్ధ వహించును. అట్లా జీర్ణించచేసికోటానికి ఆదిమనివాసులకుగల అవకాశములు చాల తక్కువగుటవలనగూడా తృతీయశ్రేణి ప్రజలు దురవస్థల ననుభవించుచున్నారనే మిత్రుల అభిప్రాయముతో నే నేకీభవించుచున్నాను.

## చతుర్థ శ్రేణి

నాలుగవ తరగతి సభ్యుల విషయము కొంచెము ప్రస్తావించెదను. వీరు ఎవరోగాదు. పైచెప్పిన మూడుతరగతులందుకన్నడు భూస్వాములు, ధనవంతులు, ముతానాయకులు, భిల్లు నాగజాతియందలి ప్రభువులు, గోండురాజులు, కోయదొరలు-వీరందరుకలసి ఈ శ్రేణిక్రిందికి వచ్చెదరు. వీరు మొదటి రెండు తరగతులవారివలె అమాయకులు, విద్యావిహీనులు గారు; లేక మూడవ తరగతివారివలెై దుస్థితియు బొందుటలేదు. నాగరికతా ప్రపంచమున తిరుగుచు, అందలి యలవాటులను, నడవడులను యలవరచుకొని, సభ్యసంఘాదర్శముల నాహ్వానించి, తమ జాతుల చిహ్నములు, ఆచారములు, సాంప్రదాయములు విడనాడక తమ జాతీయ మతములను, కర్మకాండలను కాపాడుకొనెదరు. ఉదాహరణకు సారంగర్ నందలి గోండురాజు విద్యావంతుడు. ఎల్లప్పుడును విదేశీయములగు పద్ధతులను అవలంబించును. ఐరోపియన్ పద్ధతిని తన గృహమును అలంకరించుకొనును. ప్రత్యేకముగ అతనికి పఠనాగారము గలదు. అందు ఉత్కృష్టగ్రంథములు విరివిగా నున్నవి. అయినను అతడు తను "గోండు" నని చెప్పుకొనుటలో నొకవిధమగు గౌరవమును పొందును. అతని గృహమునందు జాతీయ చిహ్నమగు తాబేలుయొక్క చిత్రము అలంకరింపబడియున్నది. అంతేగాక, అతని రాజభవనమునందు ప్రత్యేకముగ జాతీయసంబంధమగు పూరిగుడిశె ఏర్పరుపబడి అందు కులదేవతలు ప్రతిష్ఠింపబడియుండిరి. వీరేగాక తదితర ఆదిమనివాసులుగూడ తమతమ ఆర్థిక సాంఘిక స్థితిగతులను వృద్ధిపరచుకొని, ఈ తరగతిలోనికి చేరినారు.

ఈ తరగతివారియందే విద్యావంతులు, ఉద్యోగులు కనుపట్టుచున్నారు. ఈతరగతికి చెందిన 'ఖాసీ' స్త్రీ యొకర్తె అస్సాంరాష్ట్రపు మంత్రిఅయెను. ఒక గోండుసభ్యుడు జిల్లా ఎక్సైజ్ ఆఫీసర్ ఆయెను; ఇంకొకడు స్టేషనుమాష్టరు ఉద్యోగము చేయుచున్నాడు. ఇట్టి ఉదాహరణములు చాలగలవు. ఈసందర్భమున ఎల్విన్ తెల్పినమాటలు ఉదహరించుట సమంజసముగ నుండును. "భూస్వామిక సాంప్రదాయములు, ఆర్థిక బలము, ఆత్మవిశ్వాసము వీటితోబాటు బయటినుండి పొందుచుండెడి ప్రోత్సాహము, ఈ తరగతికి చెందినవారిలో కలవు. ప్రస్తుత నాగరికత

లోని మంచి లక్షణములను వీరు అవగాహనము చేసుకొని, జీర్ణించుకొనినారు." కాబట్టి ఈ తరగతికి చెందినవారే అనాదిజాతులలోనికెల్ల అదృష్టవంతులని తెల్పవచ్చును. వీరికి వైజ్ఞానిక సంబంధము మేలు సల్పెనేగాని, అపకృతి చేయజాలకపోయినది. కాని వీరి సంఖ్య బహు స్వల్పం.

తక్కినవారి దురవస్థలు బహుతెఱగులు. అందుకనే

"ప్రస్తుత భారతదేశ ఆదిమనివాస సమస్యఅంతయును, అనాగరికులగు ప్రథమ, ద్వితీయ శ్రేణులను తృతీయశ్రేణికి జెందినవారి దురవస్థలకు గురికాకుండా కాపాడి, చతుర్థశ్రేణికి గొనిపోయి వారిని వృద్ధిలోనికి తెచ్చుటయే" అని ఘోషిస్తున్నాడు ఆదిమనివాసుల శ్రేయోభిలాషి ఫాదరు వెరియర్ ఎల్విన్!

## 4. ఆదిమనివాసుల జీవితవిశేషములు

ఆదిమనివాసులలో చాలమంది సభ్యతా బాంధవ్యము మూలముగను, మరి యితర కారణములవలనను, ఆర్థిక, సాంఘికదుస్థితి అనుభవించుచున్నారు.కాని, వారి సాంఘిక, రాకీయార్థికవ్యవస్థలు ఇప్పటికిని చాలవరకు తమప్రత్యేక పురాతనపద్ధతులపైననే ఆచరింపబడుచున్నవి. ఈప్రకరణమున ఈ జాతులయందుగల కొన్ని ప్రత్యేక సాంఘిక నడవడులనుగూర్చియు, తదితర వ్యవస్థలను గూర్చియు, విపులముగా ముచ్చటించెదను.

సామాన్యముగ ప్రతి అనాది జాతియందును ముఠా, లేక జాతి పంచాయితీ ఉండును. అదియే వాటి ప్రధాన రాజకీయవ్యవస్థ. కాని ప్రతి పంచాయితీయు దానిజాతి కనుగుణ్యముగా విధులు, న్యాయచట్టము నిర్మించుకొనును. ఉదాహరణకు మనదేశమందలి లంబాడీలు, ఎరుకలు, చెంచులు ఏనాదులు, ముఠరాచులు, మొదలగు జాతులన్నిటియందును పంచాయితీ యున్నది. కులమునందు జరుగు పోరాటములు, భూమివిషయమై కలుగు చిక్కులు, కులనేరములు - ఇవన్నియునుగూడ పంచాయితీవలన పరిష్కరింప బడతవి.

లంబాడీల విషయము తీసుకొనినచో వారి జాతియందలి కులపంచాయతి చక్కని కట్టుబాటులతోడను, సంఘనిబంధనలతోడను, నిర్వహింప

బడును. ప్రతి పంచాయితీకి ఒక్కొక్క నాయకుడుండును. * ఒక్కొక్క తండాలో-తండా అంటే లంబాడీ గ్రామము-ఒక్కొక్క ముఠా ఉండును. ఈజాతి కొంతవరకు తిరుగుబోతుజాతి అగుటమూలమున, వీరి సాంఘిక వ్యవస్థలు ఆర్థికపరిస్థితుల కనుగుణ్యముగా నిర్మింపబడినవి. ముఠాధికారిని 'నాయక్' అనియెదరు. ఇతనిని కులమంతయు కలిసి ఎన్నుకొనును. కాని ఉద్యోగము మాత్రము వంశపారంపర్యము.

ఈ జాతి కొంతవరకు క్రిమినలుజాతి అగుటమూలమున ఒక్కొక్కప్పుడు నాయకుడుగూడ దొంగలజట్టులో గలసి నిర్బంధింప బడును. అతడు జైలులోనుంచి విడుదల అగువరకు తండాప్రజలు మరోనాయకుని ఎన్నుకొనెదరు. ఇంతేగాక, ప్రతి తండాయందును మతసంబంధమగు విషయములను నిర్వహించుటకు 'భగత్' మరియు 'నింబుకట్నక్' అను ఉద్యోగులు ఉండెదరు. వీరు తమ విధులను నిర్వర్తించునటుల చేయుట నాయకుని విధి. పూర్వకాలము ఈనాయకునకు చాల హక్కులుండెడివి. ముఠాలో తప్పిదము చేసినచో వెడలగొట్టుట మొదలు ఉరితీయు అధికారమువరకు అతనికి ఇచ్చువారు. ఈ నాయకునిక్రింద చిల్లరవ్యవహారములు పరిష్కరించుటకు "కార్యభారి" అని పేరుగల ఉపనాయకుడు ఉండును.

నాయకునకు ప్రతిఫలము ఇంతని సామాన్యముగా ఏజాతియందును నిర్ధారణ చేయబడదు. ఎరుకలు, లంబాడీలవంటిజాతులలో ఎక్కడైనను దొంగతనములు చేసినచో, అందు కొంతభాగము వివాహములప్పుడు బహుమానములుగా యిత్తురు. జరిమానాలువేయబడిన మొత్తములో కొంత భాగము నాయకుడు తీసుకొనును.

గోండు, ముండా మొదలగు జాతులలో ఒక్కొక్క ముఠాకు ఒక్కొక్క నాయకుడుంటాడు. అట్టి కొన్ని ముఠాలపైన పెద్దనాయకుడు అధికారము చెలాయించును. అతనిమాటే అన్ని వ్యవహారాలలోను చెల్లవలయును.

1911వ సం॥పు మధ్యరాష్ట్రములు, బీరార్ జనాభారిపోర్టులో గోండ్లు జరుపు కులవ్యవహారముల సంఘమును గూర్చి ఈ క్రిందివిధమున వ్రాయబడినది. "ప్రతి మురియా (గ్రాండు) గ్రామమునకు గ్రామాధికారి యుం

* The lambadis - A. M. somasundaram Thesis submitted for M. A. Degree

డును. అతనిని "గైటా" అనెదురు. అతడు పంచాయతీకి సంబంధించిన వ్యవహారములను చూచుటయేగాక, ఇదివరలో మతాధికారిగాగూడ పనులు జరిపేవాడు. ఇప్పుడు వీరికి "భూమియా" అను పేరుగల మతాధికారి ఉన్నాడు. ఈ ఉద్యోగములు వంశపారంపర్యముగా వచ్చును. కాని వీరిలో ప్రత్యేకించి 'పంచాయితీ' అంటూ ఉండదు. ఎప్పుడు అవసరము వచ్చిన అప్పుడే పంచాయతీ ఏర్పాటుచేయబడును. ఎవరయినను ముఠాలో తప్పులు చేసినచో, "గైటా" ఇద్దరు ముగ్గురు పెద్ద మనుష్యులను పిలచి, వారి సహాయముతో కులతప్పులు పరిష్కరిస్తాడు.

ఇటువంటి గోండు గ్రామాలు 50 మొదలు 100 వరకు ఒక 'పట్టీ' క్రింద చేర్చబడును. పట్టీకి అధికారి "సెంధ్యా". అతడే పట్టీకి న్యాయాధికారి, మతాధికారి. వివాహములప్పుడు, కులజరిమానాలు విధించునప్పుడు, తదితర సాంఘిక శుభకార్యములప్పుడు, "సెంధ్యా" రెండు మొదలు పది రూపాయల వరకు రుసుమును గ్రహించును. ఈవుద్యోగముకూడా వంశపారంపర్యమే. సామాన్యముగా ఒక ముఠా వారికి మరొక ముఠావారితో తగవులు వచ్చినప్పుడుగాని, కుల పంచాయితీ నిర్ణయముపై అర్జీపెట్టుకున్నప్పుడుగాని, "సెంధ్యా" తగవు తీర్చును. సామాన్యముగా ఒక "సెంధ్యా" వ్యవహారములు, మరో "సెంధ్యా" పట్టించుకొనడు.

ఇట్టి ముఠా వ్యవస్థ ముండా జాతులయందుగూడ కన్పడును. ప్రతి గ్రామమును "హతు" * అని పిలచెదరు. గ్రామాధికారిని "ముండా" అనెదరు. కొన్ని "హతు"లు గలసి ఒక "పర్హా" అవుతవి. పర్హా అధికారిని "మంకీ" అనెదరు. గ్రామమున జరుగు సమస్త సాంఘిక వ్యవహారముల పైనను, కర్మలపైనను "ముండా"కు పెత్తనం వుండును. దానినెవరును ప్రతిఘటింపజాలరు. ఇంతియేగాక, ఈ జాతులలో "ఖున్ కట్టిదారు" లనెడి వారున్నారు. వీరు అసలు ముండా గ్రామములను నిర్మించిన వారి సంతతివారని తలపబడెదరు. వీరికి తక్కిన గ్రామీణులకు లేని ప్రత్యేక హక్కులు, అధికారములు ఉండును. అసలు "మంకీ" "ముండా" ఉద్యోగములు ఈ తెగకు సంబంధించిన వారికే వంశ పారంపర్యముగా ఇవ్వబడతవి. వీరుసల్పు విధులకు ప్రతిఫలముగా ధాన్యమును కొలిచెదరు.

---

* Dr. D. N. Majumdar - A Tribe in Transition - see his Introduction.

చెంచుజాతి*లో ప్రత్యేకముగా గ్రామతా పంచాయితీ లేదుగాని, వారిలో పోట్లాటలు, వివాదములు పరిష్కరించుటకు పెద్దమనిచి 1 అనే వాడు ఉంటాడు. అతడు మధ్యవయస్కుడై యుండవలెను. బుద్ధికుశలత, సమర్ధత గలిగియుండవలెను. అతనికేవిధమగు ప్రతిఫలం ఇవ్వరుగాని, శుభకార్యములప్పుడును, మతకర్మల సమయములందును, మొట్టమొదటగా త్రాగుట, దేవతకు మొట్టమొదటిపాట అతనే పాడుట, ప్రార్థించుట, మొద లగు హక్కులుంటవి. ఇతనికి ఎవరినైనను శిక్షించుటకుగాని, జరిమానాలు వేయుటకుగాని, హక్కులేదు. రెండు కులాలవారికి గనుక పోరాటములు వచ్చినచో, ఇంకో ఊరిలోనుండు మరో "పెద్దమనిచి" సహాయముతో కుల వ్యవహారములు పరిష్కరింపబడుతవి. ఈ ఉద్యోగము సామాన్య ముగా పెద్దకుమారునకే సంక్రమించునప్పటికినీ, అది వంశపారంపర్యమని తెల్పుటకు వీలులేదు.

మలబారునందలి "నాయాదీల" విషయము తీసికొనినచో, ఆజాతి యందుగూడ నాయకుడుండును. అతనిని "ముత్తనాయాది" అనెదరు. ఈ ఉద్యోగం వంశపారంపర్యము. అతడే కులతప్పులు పరిష్కరిస్తాడు. తప్పులుచేసినచో, జరిమానాలువేసిగాని, వీపుపైని దెబ్బలుగొట్టికాని, అపరాధులను శిక్షిస్తాడు. పండుగరోజులలో అందరు అతనికి బహుమాన ములు చేసెదరు.

పర్లాకిమిడి ప్రాంతములయందు నివసించు కొండ-సవరల విష యమై 'The Soras and their Country' అనువ్యాసమున శ్రీ జి. వి. సీతాపతిగారు ఈవిధముగా వ్రాయుచున్నారు: సవర గ్రామాధికారిని "సడిగమాంగ్" అనెదరు. అతనికి విధులు నిర్వహించుటలో సహాయ పడు అధికారిని "సడిబుయ్యా" అనెదరు. "సడిబుయ్యా" చిన్నిచిన్ని విషయములను పరిష్కరించుటయేగాక, మతవ్యవహారములందు అధికారిగ ఎంచబడును. వీరిరువురును జాతివ్యవహారములను పరిష్కరింతురు. ఈరెండు ఉద్యోగములు, మన ప్రభుత్వమువారివలన గుర్తింపబడినవి. ప్రతిసంవత్సరము దర్బార్ జరిపి, జిల్లాకలెక్టరు వీరిరువురికిని రెండు

1 The chenchus - Von. Christoph F. - Haimendorf.

2 The Nayadis - Dr A. Aiyappan.

ధోవతులొసగి గౌరవించును. ఈ రెండుహోదాలు వంశపారంపర్యమే గాని, వారికి దేహదార్ఢ్యము, మనోనిశ్చలతయు గావలెను.

ఇటులనే ప్రతిజాతికిని కులపంచాయితీ ఉండునని వేరే చెప్పనవసరములేదు. ఏవి ధర్మములు, నైతికములు అని భావించెదరో, వానినవలంబించుటకు, నిలబెట్టుకొనుటకును ఆదిమనివాసులు ఉత్సాహం, శ్రద్ధ చూపించెదరు. సభ్యప్రపంచమునందు అనేక క్లిష్టసమస్యలతో కూడుకొనియున్న ప్రభుత్వవ్యవస్థలెవ్వియును అనాదిజాతులందు కన్పట్టవు. కేవలము తమ కులమునందలి వ్యక్తుల హక్కులను రక్షించుకొను నిమిత్తము, తమ పురాతన సంఘములతో ఏర్పరుపబడిన విధులను సక్రమముగ అమలుజరుపుకొనుటకును, ఈ కులపంచాయితీలు ఏర్పాటు చెయ్యబడియుండుటవలన, వాటి స్వరూపము, నిర్వహణాపద్ధతి, బహుతేలికగాను, చురుకుగాను జరుగును. ఏమయినప్పటికిని, ఈ వ్యవస్థ అనాది జాతులలో వ్యక్తమగు విజ్ఞానమునకు సాక్షీభూతమగుచున్నది. మన నాగరికతా ప్రభుత్వములు, న్యాయస్థానములు, పోలీసుశాఖలమూలమున, దేశమునందు శాంతి భద్రతలు కాపాడబడుచున్నట్లు చెబుతున్నారు. కాని. బాహ్యప్రపంచమునకు దూరులైన ఈ ఆటవికుల జీవితములలో ఈముతా రాజ్యాంగపద్ధతి చక్కని ప్రజాస్వామ్య పద్ధతులపై నడుపబడుచున్నదనుట కెట్టిసందేహమును లేదు. దానికి తార్కాణముగ, శిక్షలమూలమున చాలవరకు సభ్యప్రపంచములోని వ్యక్తులు ప్రభుత్వపు విధులను ఆదరించుచున్నట్లు, అసభ్యసంఘమందలి అనాగరికులు తమ కులపెద్దలపైగల గౌరవాతిశయములవలనను, కులబహిష్కరణ జరుగుననుజంకు మూలమునను, కులనియమములను క్రమముదప్పక ఆచరించెదరు. ఇట్టి ఆదిమనివాసుల వ్యవస్థలయందుగాని, జీవితపద్ధతుల యందుగాని ఏదైనను మార్పు వచ్చినదనినచో, అది విజ్ఞాన బాంధవ్యఫలితమని నేను వేరే వ్రాయనవుసరములేదు. నిజమునకిట్టి బాంధవ్యము జాతుల అభ్యున్నతికి దోహదమొసగినచో, అట్టిమార్పు అవశ్యావలంబనీయము. అటుల కాకపోతే, మనదేశములో ఈ సభ్యతా-బాంధవ్యము, జాతుల అనర్థకమునకు కారణమన్నమాట. చూడుడు ఎల్విన్ ఏమని తెలుపుతున్నాడో! "క్రమశిక్షణీయముగాని విజ్ఞానపరివర్తనము జాత్యోభ్యున్నతికి దారిచూపదు సరిగదా, వారి కనరకముగనే పరిణమించును." ఇది నిజమేగదా!

అనాది సంఘములందలి ఆర్థికవిధానము ఆర్. డబ్ల్యు. ఫర్తు* తెల్పినటుల కేవలము తమకుకావలసిన వస్తువులను సమకూర్చుకొనే సూత్రములపైననే ఆధారపడి యుండలేదు. తమ ఆహారసమస్యలో కేవలము క్షుద్బాధ తీర్చుకొనే కోర్కెగాక, వారి బంధుగులకు, ప్రభువులకు, పూర్వీకులకు మరియాదలు సల్పు విధులు, తమ స్నేహితులకు తదితర క్రొత్త వారికి సల్పు ఆతిధ్య నిబంధనలు, వివాహము, కీర్తి మొదలగు కోరికలు ఇమిడియున్నవి. అనగా, వాళ్ళ ఆర్థికవిధానములో రాజకీయ, మత, సాంఘిక సమస్యలు ఇమిడియున్నవన్నమాట. ఈ కారణముచేతనే ట్రోబ్రియన్ దీవులయందలి ఆదిమనివాసులు సామాన్యముగా ముత్యపు వర్తకులకు డబ్బుకు ప్రతిఫలముగా ముత్యపుచిప్పలు తెచ్చి ఇచ్చుటకు నిరాకరింతురు. గాని, తమ కులమంతయు కలసి వారికవుసరమగునప్పుడు మాత్రము ముత్యపు వేటకై అతి ఉత్సాహముతోడను, సంతృప్తితోడను, బయల్వెడలెదరు. అదేవిధమున తమ పశువులను మేపుకొనుటలో ఆఫ్రికాలోని కొందరు అనాదిజాతివారు బీళ్ళసారముపోయి చవుడుబట్టినను సరే గాని, తమ మందలను తగ్గించి తమ ఆర్థికవిధానమును బాగుపరచుకొనరు. ఇటువంటి విచిత్ర ఆర్థికవిధానములను అనాది జాతులు అవలంబించుటలో గల రహస్యమేమి? సామాన్యముగా ఈ జాతులకు కావలసిన భౌతిక వాంఛలు బహుతక్కువ. వారి వద్దనుండు వస్తు సామాగ్రియు బహుస్వల్పమే. అంతేగాక వారి ఆహారసమస్య వ్యక్తిగతముగ గాక, కులమునకంతటికిని చెందును. వారిలోవారు సల్పుకొనెడి సహాయము కేవలము గ్రామసమిష్టిపైనను, సహకార ఆదర్శములపైనను, జరుపబడును. కొంత ధనమిచ్చి, 'చాకిరి' చేయించుకొనెడి పద్ధతి వారిలో లేదు. ఇది కేవలము పారిశ్రామికాభివృద్ధి మూలమున నాగరికతా సంఘమందు ఘనీభవించిన 'నరమాంసభక్షణ' పద్ధతి. వారుసల్పు సేవలయందుగాని వృత్తులయందుగాని నీచ-ఘనములు లేవు. వారికి కాలముయొక్క విలువ ఏమాత్రము తెలియదు. తెలిసికొనవలసిన అవుసరమును లేదు. దీనినిబట్టి వారి కోరికలు చాలవరకు భౌతికమైనవి గావనియు, మానవాదర్శయుతములనియు, మనకు తెల్లమగును. సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడగు మాలినొవిస్కీ తెల్పినటుల ఈ అనాగరిక సంఘములందుగూడ ప్రతి ఫలవాంఛయుండును గాని అది కేవలము భౌతికముగాదు. ఒకడు ఇంకొకనికి భోజనమిడవచ్చును. అతిధి

* Human Types - R. W. Firth

అతనికి నాట్యమునందుగాని, మత కర్మలయందుగాని సహాయపడవచ్చును. ఇంతేగాదు. సామాన్యముగా వారు తయారుచేయు పరిశ్రమలుగూడ జీవితమునందలి ప్రధానఘట్టములుగావు. అవి ఒకవైపున వారి ఆర్థిక సమస్యను పరిష్కరించును; మరియొకవైపున వారి మతకర్మలకును ఉపకరించును. ఇంతేగాదు. వారు ఉత్పత్తిచేయు వస్తువులుసైతం సంఘమునందలి మరికొన్ని వస్తువులను సృష్టించుటకును, కొన్ని అవుసరములు తీర్చుటకును, అంతా సమిష్టిపద్ధతిపైననే వినియోగింపబడును. ఫర్తుగారు మరల ఈవిషయమై వ్రాస్తూ టికోపియా సంఘమందు ఒక పడవకట్టుటకుముందు, అందలిసభ్యుడు తన గృహావసరముకన్న ఎక్కుడుగానే ఆహారవస్తువులు సేకరించుననియు, ఆ నౌకా నిర్మాణ సమయమునందో, లేక తత్పూర్వమో, ఎవరైనను చనిపోవుచో, నిలువజేసిన పదార్థము అతని మతకర్మలకు ఉపయోగింపబడుననియు తెలుపుచున్నాడు! సభ్యసంఘీయుల కీవిషయము హాస్యాస్పదమగునుగాని, నిజమరయుదుమేని, ఆదిమనివాసుల విజ్ఞానము తమ సంఘావుసరముల నేవిధమున కనిపెట్టునో వ్యక్తపఱచును. ఇంతేగాక అనాదిజాతులయందు ప్రతివ్యక్తిగూడ తను తయారుచేయు వస్తువులను పంచిపెట్టు విధానము మూలమున, సాంఘిక ఔన్నత్యము పొందుటకు ఉత్సహించును. ఇదీ ఆదిమనివాసుల ఆర్థిక విధానము. ఈ కారణములవలననే, ప్రతి అసభ్యయుడుగూడ తన పొరుగువాని కష్టసుఖములు పంచుకొనుటయును, వ్యక్తిగత కష్టసుఖములన్నియు కులమంతటికి చెందుననే అతని జ్ఞానమును—ఇవన్నియు నిజముగా సభ్యసంఘమందలి వ్యక్తులలో లేకపోవుటయేగాక, వారికంటె 'ఈ పశువులే' నాగరికులేమో అనిపిస్తుంది. మన దేశమునందలి ఆదిమనివాసుల ఆస్తి * మూడుభాగములుగ భాగించవచ్చును. వ్యక్తిగతముగా కొన్ని వస్తువులు — అంటే నగలు, నాట్యము సల్పునపుడు ఉపయోగించు దుస్తులు — కేవలము వాని నుపయోగించు వ్యక్తికే చెందుతవి. కుటుంబ ఆస్తులు అనగా ఒక కుటుంబమునకు మాత్రమే చెందునవి. ఇళ్ళు, దొడ్డి, తోట, కొంతవరకు వ్యవసాయిక భూములు. కుల లేక గ్రామఆస్తులు అంటే, వేటాడే భూములు, పుల్లరి ఏరుకొను అరణ్యభాగములు, ప్రేమిక సదనములు, ధాన్యపు గాదెలు,

* Dr. N. D Majumdar of calcutta - his paper in Aboriginal property in India



ఒరాయిన్ల ఆయుధములు : సంగీత పనిముట్లు

**కి. శే. అనంతకృష్ణ అయ్యర్‌గారి 'లెక్చర్స్ ఆఫ్ ఎథ్నోగ్రఫీ' నుండి**

దేవాలయములు మొదలగునవి. వీటినిబట్టి చూచినచో, ఆదిమనివాసుల ఆర్థికవ్యవస్థనుండియే తన సభ్యసంఘమందలి వ్యవస్థలు పుట్టినవనియు, ప్రతిసంఘం, జాతిగూడ విశిష్టమగు ప్రత్యేక పద్ధతులపైన అన్యోన్య సహకారముతో విలసిల్లు ననియు మనకు తెల్లమగుచున్నది.

జాతుల జీవిత విశిష్టతలలో వారి సాంప్రదాయము మరొకటి. ఆదిమనివాసులు సామాన్యముగా క్రొత్తవిషయములను దరికి చేరనివ్వక పోయినను తమ పద్ధతులను చాల పట్టుదలతోడను, భక్తితోడను అవలంబించెదరు. ఈ విషయము వారు సలుపు పూజలు, మతకర్మలు మొదలగు వానియందు వ్యక్తమగును.

ఏసంఘమునందైనను, అందరి వ్యక్తుల ఆర్థికవిధానముపైననే చాలవరకు వారివారి రాజకీయ సాంఘిక వ్యవస్థలు ఆధారపడి యుండును. ఉదాహరణకు మనదేశమునందలి లంబాడీలు ఇప్పుడిప్పుడు వ్యవసాయం చేసుకొనుటయు, పశువులను మేపుకొనుటయు నేర్చుకొనినను, పూర్వకాలమునందీజాతి ఉప్పు, ధాన్యం, మొదలగు వస్తువులు రవాణాసల్పు తిరుగుబోతుజాతి అగుటచేత వారి ఆచార వ్యవహారములు వారి వృత్తికి అనుగుణ్యముగా నేర్పరుచుకొని యున్నారు. వీరి సాంఘికాచారము లొకింత పరికించినచో యీ విషయము స్పష్టమగును. సామాన్యముగా వీరు ఎప్పుడును గ్రామములకు దూరములో తమతండాలను కట్టుకొనెదరు. దీనికి కారణము తెలియునా ? వీరికి పూర్వకాలమునందు వేలకొలది పశువులుండెడివి. జనరల్ బ్రిగ్సు తెలిపినటుల ఒక్కొక్క తండాలో 30 మొదలు 40 వేల పశువులుగూడ యుండెడివట. అటువంటప్పుడు వారి పశువులకు నీరు, గ్రాసం, ఎచ్చట సమృద్ధిగా దొరకునో అక్కడ — అంటే గ్రామములకు కొంచము దూరముగా — బీళ్ళలో తమ తండాలను కట్టుకొనెడివారు. ఇదే ఇప్పటి ఆచారమై సాంప్రదాయమైనది. ఈ లంబాడీలలో విశిష్ఠులమనుకొనువారు సామాన్యముగా ఊటనీరే త్రాగెదరు. కారణమేమిటి ? బిడారివృత్తి సలుపునపుడు క్రొత్త గ్రామములయందలి చెరువులలోగాని, బావులయందుగాని నీరుత్రాగుట తమ కనారోగ్యమని వీరి అభిప్రాయము. అందువలననే ఇప్పటికిగూడ లంబాడీలలో ఊటనీరు త్రాగుట యొక సాంప్రదాయమయినది. అదేవిధమున బిడారీ వ్యాపారము సల్పునపుడు సంచులు కుట్టెటందుకుగాను ప్రత్యేకముగా సూదులు ప్రతి

వ్యక్తి తనవద్ద నుంచుకొనెడివాడు. ఈ సూదియే అతని ఆర్థికజీవితము నందు ఒక ప్రధాన ఘట్టమయినది. ఇప్పటికిగూడ ఈ వృత్తి లేకపోయి నను అట్టిసూది పారవైచినచో, లేక దొంగిలించినచో, గొప్ప అపరాధము క్రింద పరిగణించి ముఠానాయకుడు అపరాధికి రు 12-8-0 మొదలు రు 61-0-0 వరకు జరిమానా విధించును.

మరికొన్ని జాతులకు వ్యవసాయము, వేటాడుట, జీవనోపాధి అయినది. దాని మూలమున ఆ జాతులన్నియును స్థావరనివాస మేర్పరచు కొనినవి. దీని మూలమున వీనికి భూమిపైన గొప్ప భక్తి, శ్రద్ధలు జని యించినవి. దానిని పూజించుటకు మొదలిడినారు.

అనాది జాతీయుల జీవిత విశేషములలో మనము ముఖ్యముగా గమనింపవలసినది వారి సుగుణములు.* బాహ్య ప్రపంచముతో సంబం ధము గలిగినచోట మాత్రము ఇటీవల వారిలో కొందరి ప్రవర్తనయందు మార్పు కనిపించినను సభ్యతా బాంధవ్యము గలుగనిచోట్ల మాత్రము అసభ్య జాతీయుడు నిజాయితీగా ప్రవర్తించును. ఇంతేగాక వీరిలో నిష్క పటత్వము, అమాయకత్వముతోగూడిన హాస్యము వెల్లడియగుచుండును.

సామాన్యముగ ఆదిమనివాసులలో నీతి అనేది ఉన్నది. వ్యభిచా రము చాల తక్కువ. కాని ఇప్పుడిప్పుడు సభ్యతా సంబంధముతోబాటు, యీ దుర్గుణముగూడ కొన్నికొన్ని జాతులలో కన్పడుచున్నది. నాగరికతా సంపర్కము సోకనిచోట మాత్రము, వ్యభిచారము సల్పినచోట్ల, నేరస్థు లను కులపంచాయితీ అతి కఠినముగా శిక్షించును. అంతేగాక, అసభ్య సంఘములో స్త్రీలకు — ఏ కోయజాతివంటి దానిలోనోతప్ప — గౌరవస్థాన మిచ్చెదరు. స్త్రీ స్వేచ్ఛగా, పొలమునందు తన భర్తతోబాటు పనిపాటలు సల్పి హాయిగా కుటుంబములో స్వతంత్రముగా అనురాగ జీవితమును గడుపును. ఆదిమస్త్రీల నీతినిగూర్చి వ్రాయుచు, ఫాదర్ ఎల్విన్ బస్తర్ రాష్ట్రమునందలి మెరియాజాతియందు జరిగిన రెండువేల వివాహములలో, 43 గురు భర్తలుమాత్రమే రెండవ వివాహము సల్పుకొనినారని వ్రాసి

---

* ఈ విషయమై ఎల్విన్‌గారి అభిప్రాయము సమంజసముగనే కన్పిస్తు న్నది. అంతేగాక డి ఎన్. మజుందార్‌గారు గూడ తిరుగుబోతు జాతులలో ఈ సభ్యతా - బాంధవ్యమే, కొంతవరకు వారి జీవిత పద్ధతులలో మార్పు తెచ్చినదని వ్రాస్తున్నారు. అసలు విషయము అమకథనమా ? లేక అనుగాహనమా ?

నాడు. ఇష్టము లేకపోయినచో విడాకులిచ్చు ఆచారమున్నదిగాని, వ్యభిచారము, ఇతర దురభ్యాసములు వారిలో లేవు.

ఆదిమనివాసులు సామాన్యముగా సమిష్టిజీవనము చేయుదురని గలోడనే తెలిపితినిగదా! అందువలననేవారు పండుగలయందు అందరును గలసి పండుగ చేసుకొనెదరు. సమిష్టిగానే దేవుళ్ళకు మ్రొక్కెదరు. విందులు చేసికొనెదరు. సారాయి త్రాగెదరు. నాట్యమాడెదరు. పాటలు పాడెదరు. లంబాడీలలో దీపావళి, దసరా, హోళీపండుగలయందు యీ సమిష్టి జీవనము ప్రత్యేకముగా వ్యక్తమగును.

ఆదిమనివాసుల జాతీయ నాట్యములు, పాటలు, ముఖ్యముగా పేర్కొనదగినవి. ఈ పాటలు ఎంతయో హృద్యముగనుండి స్వేచ్ఛను వెలిబుచ్చుచుండును. ఆటవిక దొరలగు వీరికి తమ ఉనికియే యిట్టిపాటలు పాడుటకు దోహద మొసగినది. ఈ పాటలు వ్రాసినవిగాదు. తల్లిదగ్గర నుండి కుమార్తెకు నేర్పబడినట్టివి.

వేటాడుముందు, చేపలుపట్టునపుడు, వివాహ సమయమునందు, పండుగ సందర్భములయందు, బాలిబాలికలు పుష్పములతోడను, ఆభరణముల తోడను తమ జాతీయోచితమగు అలంకారములు ధరించి, నాట్యము సల్పెదరు. ఇట్టి నాట్యములు సల్పుటయందు గోండ్లు, గడబలు, చెంచులు, లంబాడీలు మొదలగు జాతులకు చాల ప్రజ్ఞయున్నది. ఒక్కొక్క పదమే పాడుచూ, 10, 15 మంది లంబాడీ స్త్రీలు వలయాకారముతీరి నగారామీద మేళము చేస్తూఉంటే గంటలకొద్ది నాట్యమాడుట, అందునను ఒక్కొక్కప్పుడు స్త్రీ పురుషులు కలసి పాల్గొనుట - చూచువారికి నేత్రోత్సవముగా నుండును. అదేవిధమున చెంచువారిలోని నెమలిఆట, కొండముచ్చులఆట, భోగంవాళ్ల ఆట. గోండ్లజాతులలోని "దున్నపోతు కొమ్ముల" నాట్యము ఆనందము కలుగజేయును. చిన్నపిల్లలు యౌవన వంతులు కలసి నాట్యం సల్పుచున్నప్పుడు కుల గ్రామపెద్దలందరు ఉత్సాహముగాచూచి ఆనందించెదరు. అదేవిధమున హోజాతిలోని స్త్రీ పురుషులు, పుష్పాలం కృతులై, "ఇల్లీ" అను సారాయమునుత్రాగి నాట్యము సల్పెదరు. కాబట్టి జాతులన్నిటియందును నాట్యము ముఖ్యమగు వ్యాయామక్రీడ.

అంతేగాక, లోగడ తెలిపినటుల చాల జాతులయందు ప్రేమిక సదనము లున్నవి. ఒరోయిన్‌లలో వీటిని 'ధుం కూ రి యా' అనెదరు.

గోండ్లలో వీటిని "ఘోటులు" అంటారు. నాగజాతియందు "మోరుంగు" అనెదరు. ఈ సదనములు బాలబాలికలకు సాంఘిక విధులలో క్రమశిక్షణ యిచ్చుటకు ఏర్పడినవి. ఇంతేగాక బాలబాలికలు ప్రేమించుకొని వివాహ మాడుటకుగూడ ఈ గృహములు ఉపయోగపడును.

అనార్యజాతులు చాలావాటిలో "బాల్యక్రీడలు" అధిక సంఖ్యాక ములుగా నున్నవి. ఒక్క మురియా జాతియందే 50 క్రీడలకుపైగావున్నవి. చెంచువాళ్లలో బాధనపదము, కుంథలఆట, దొంగలఆట, చాల ఆకర్ష ణీయంగా ఉండును.

ఆదిమ నివాసులలో విధవా వివాహములు, ఎదిగిన పిల్లలకు పెండ్లిండ్లు జరుగుతవి. ఈ సందర్భమున సామాన్యముగ ప్రతిజాతియం దును కన్యాశుల్కము అధికముగానుండును. మేనరికములు సర్వ సామా న్యము. సామాన్యంగా ఈ జాతులు గోమాంసం తినరు. మరియు వివాహ ములు పరస్పర ప్రేమమూలమునే జరుగును.

అసభ్యయుని రోజువారీ కార్యక్రమమొకింత చూచెదము. ఎల్విన్ తెలిపినటుల, అందరును పెందలకడనే మేల్కొనెదరు. కొద్దిగా మజ్జిగ కాని, గంజిగాని త్రాగి, తాబేటి కాయలు బుజమున తగిలించుకొని, దూర ప్రదేశములందలి అరణ్య భాగములకు దుంపలు త్రవ్వుటకుగాని, వేటాడు టకుగాని, పోయెదరు. స్త్రీలు ఆకులు తెచ్చుకొనుటకు, పుల్లలు ఏరుటకు వెళ్ళెదరు. ముసలివారు విప్పపువ్వు, కూరగాయలు ప్రోగుచేసెదరు. ధాన్యం బాగుచేసెదరు. చాపలు, బుట్టలు అల్లెదరు. బాలురు పశువులను మేపెదరు. ఎలుకలను పట్టెదరు. సాయంకాలమునందు ఇండ్లకు తిరిగి వచ్చి దొరికినదికాస్తతిని, తాటిచెట్లువున్నచోట్ల చెట్లుఎక్కి కల్లుత్రాగెదరు. ఈ విధమున బాధ్యతా రహితమగు స్వతంత్ర జీవితము గడిపెదరు.

అనాది జాతులందలి గృహ పరిశ్రమలనుగూడ మనమొకింత పరిశీలింతము. విప్పపువ్వు రసమునుండి, బియ్యపుఅన్నమునుండి, కొన్ని జాతులు సారాయి తయారుచేయుదురు. మలై కొండిగర్‌వంటి జాతులలో ఈతకల్లు, తాటికల్లు స్త్రీలే గీసెదరు. కాని సారాయి నిర్ణీతసమయముల యందుతప్ప యెప్పుడూ తయారుచెయ్యనీయటం సరియగు పద్ధతిగాదు. ఈ విషయము ముమ్ముందు విపులముగా చర్చింతును.



గోండుకన్య అలంకృతమగు తలుపుముందర ధాన్యమును చెరుగుట

**ఎల్విన్‌గారి 'మేరియా హత్యలు - ఆత్మహత్యలు' నుండి**



హింజ్ అను మేరియాకన్య

**ఎల్విన్‌గారి 'మేరియా హత్యలు - ఆత్మహత్యలు' నుండి**

లంబాడీలు త్రాగుబోతులేకాని వాళ్లు 'దామన' త్రాళ్లు అను ప్రత్యేక మగు తాళ్లు అల్లుటయందును, గోతములు నేయుటయందును బహు ప్రజ్ఞ గలవారు. చెంచులు, ఎరుకలు మొదలగు జాతులు బుట్టలు అల్లుట, వెదురు గడలను, చిన్నచిన్న సంగీతపనిముట్లుగా చేయుటయందు నేర్పుగలవారు. బోండోలు, గడబలు మొదలగు జాతులు అడవినుండి ధాన్యము, విప్ప పువ్వు ఏరి, వాటిని సంతలకుతెచ్చి అమ్మెదరు. నాయాదీలు కొబ్బరితాళ్లు అల్లుటలో మంచి నేర్పుగలవారు. ఈ పరిశ్రమ లన్నిటియందును నిర్దిష్ట మగు నిరాడంబర కళాకౌశలము, స్వతంత్రత, మానవప్రజ్ఞ బహిర్గత మగును. మరియును అనాదిజాతులలో అలంకరణకై ఎక్కువకాలము వెళ్ళబుచ్చెదరు.

వీరిలో అతిధులను గౌరవించుట అనునది ఒక ప్రత్యేకత. లంబాడీలలో క్రొత్తవారు ఎవరైనను తండాలకు వెళ్ళినచో పీటవేసి, పాలుగాని, మజ్జిగగాని దాహమిచ్చెదరు. తండాయందలి పెద్దలందరునువచ్చి, అతిధులతో మాట్లాడుటకుత్సహింతురు. అదేవిధమున క్రొత్తవారు చెంచుల వద్దకుగాని, కోయ ప్రాంతములకుగాని వెళ్ళినచో విప్పపువ్వు, పుట్టతేనె, వెదురుబియ్యము మొదలగునవి యిచ్చి సత్కరించెదరు. సవర జాతి యందు యీ ఆతిధ్యపద్ధతి వారి పాటలయందు సైతము వ్యక్తమగును. ఈ క్రింది * పాటను జూడుడు.

(1) దకు, సలదన్ అబోయినా, సున్‌గన్
అనిన్, అతే, అటాడ్ సలదన్;

(2) అగ్గోబుగోబుటాయ్ అనిన్ అటాడ్ సలదన్
గోబుటాయ్ జెనిన్ లాబొలెన్ గాన్;

(3) దకు ఉదన్‌జి, బగన్ మెయ్‌సున్‌గన్
అబోయ్‌నాగుర్రె, బరబోయ్‌కసీ;

(4) టిట్టాయ్ జెనిన్, అగురుల్ అనిన్
జిమ్‌టాయ్ జ్నెన్నా ఆకాసియుల్.

" నా ఇంటివద్ద చినిగిపోయిన ఒక చాపతప్ప మరేమియు లేదు; నా అతిధిని ఆ చాపపైప కూర్చొనబెట్టి, నేను క్రింద కూర్చుండెదను.

* Dr. G V. Sitapathi - "The sora songs and poetry"

నావద్ద రెండు మామిడిపండ్లు మాత్రమే గలవు. అందు ఒకటి పండినది; మరియొకటి పచ్చిది. పండినఫలము అతిథికిచ్చెదను; పచ్చిది నే తినెదను."

ఇక రెండు విషయములనుగూర్చి వ్రాసి ఈప్రకరణము ముగింతును — అవి 1. ఆదిమనివాసులకు పూర్వీకులయెడలగల భక్తి. 2. వారి జీవితములో ఎక్కువగా వ్యాప్తమగు తాంత్రిక ప్రయోగములు. ఈ రెండును వారి జీవితమునందలి ప్రధానఘట్టములు. చనిపోయినవారినిచో ఆదిమనివాసులకు భయభక్తులు మెండు. ఈ భయభక్తుల మూలముననే మానవసంఘమునందలి మతవ్యవస్థలు ఆవిర్భించినవని తెల్పవచ్చును. మానవాతీతమగు నొక శక్తిగలదని ఆదిమనివాసుల అభిప్రాయము. తొలిరోజులయందు పురాతన సంఘ మానవుడు అరణ్యములలో నొంటరిగా దిరుగునప్పుడుగాని, కొండగుహలయందు జపించునప్పుడుగాని, అతడు సల్పు ధ్వనులకు ప్రకృతి ప్రతిధ్వనించుచుండెడిది. తన్మూలమున ఆదిమ మానవుడు తనయందే రెండుప్రాణములున్నవను భావమును సృష్టించుకొనెను. అందునొకటి దృష్టికి గోచరించు శరీరము: రెండవది అంతరాత్మ. ఈవిధముగా ఒక మానవునియందే ఇరువురు జీవించియున్నారనెడి అభిప్రాయము గలవాడయ్యెను. ఆత్మ పోయినను, శరీరము శుష్కించక సజీవమై యుండుననియు, అందువలన దానిని పాతిపెట్టక పోయినచో శత్రువుల కపకారము సల్పుననియు వీరి నమ్మకము. ఈ కారణమువలననే వీరు కళేబరములను పాతిపెట్టెడివారు. ఇంతియగాక, పాతిపెట్టిన శవముయొక్క రెండవ ప్రాణముగూడ హాని సల్పునను భయమువలన దానిని సంతోషపెట్టుటకు పూజలు సల్పెడివారు. ఇంతేగాక చాల జాతులయందు ఏ వృక్షముపైననో, జంతువుపైననో భక్తిశ్రద్ధలుండును. తమజాతికి ఆజంతువు పేరుగాని, యా వృక్షము పేరుగాని పేరుపెట్టుకొనుటయేగాక, వాటికిసైతము పూజలుసల్పి, గౌరవింతురు. దీనిమూలమున, ఆ జంతువృక్షములు తమజాతిని అపాయములనుండి రక్షించుటయేగాక, వారికెట్టి ఎగ్గును సల్పవని ఆదిమ మనుష్యులు నమ్మియుండిరి. ఇట్టిజాతులకు మానుషశాస్త్రములో "టోటెమిద్" జాతులనియెదరు. ఈ టోటెమ్ అనుపదము (Totem) మన భారతీయ ఆదిమ జాతులయందెందును — నేనెరిగున్నంతలో — కానరాదు. స్వర్గీయ శరశ్చంద్రరాయిగారు ఈ విషయమై వ్రాయుచూ, మనదేశమందలి అనాగ

రిక జాతులలో చాలవరకు జంతువులనుగాని, వృక్షములనుగాని పూజ సల్పినను, అవి "టోటెమ్" పద్ధతిపై జరుపబడునని తెల్పుటకు వీలులేదని స్పష్టీకరించినారు. కాని ఆస్ట్రేలియా, అమెరికా, దేశములందలి జాతులు చాలవరకు (Totemestic group) టోటెముజాతులే. వాటి జాతిపేర్లు సహితము పెద్దపులి, ఏనుగు మొదలగుపేర్లను గలిగియుండును. ఈ పదము అసలు అమెరికన్ జాతులనుండే పుట్టినదనియు, "డోడమ్" అనునదియే దాని ప్రాచీన స్వరూపమన్నియు, ఆంధ్రూలాంగ్ అను శాస్త్రజ్ఞునివలన కనుగొనబడినది. ఈ జంతువృక్షపూజలే ప్రస్తుత ఆదిమనివాస సంఘముల మతమునకు ప్రాతిపదికలు.

మనదేశమందలి జాతులు "టోటెము" సంబంధమైనవో, గావో నిర్ణయించి చెప్పుట కష్టము. కాని ఎస్. సి. రాయిగారి ఉద్దేశ్యమే సమంజసమని తోచును. కారణమేమన, యీ పద్ధతిగల జాతులే మనదేశమునందుండెనేని ఈ మాటకు జాతుల భాషలందు పోల్చదగిన పర్యాయపదమేలలేదు ? ఐనను 1891 జనాభా కమీషనర్ అగు సర్ హెర్బర్టు రిస్లే గారి యుద్దేశ్య ప్రకారము మనదేశమందలి వివిధ జాతులకు వివిధ జంతు, వృక్షనామములుండినవని తేలుచున్నవి.*

పైన తెల్పినటుల ఆదిమనివాసులలో తమ పూర్వీకుల యెడలగల భక్తిచేతనే, పెద్దల పేరులు తమ పిల్లలకు పెట్టుదురు. అంతేగాక వారియందుగూడ "పునర్జన్మ సిద్ధాంతము" నందు నమ్మకముండినది. అంతేగాదు. వీరికి స్వప్నములనినను, వాని ఫలితములనినను అమిత నమ్మకము. ఏవియయితే వారు అనుభవింప బోవుదురో, అవియే స్వప్నములందు కనబడునని వీరు తలచెదరు. ఈ విషయము లంబాలలో యిప్పటికిగూడ వ్యక్తమగును. లంబాడీలలో బ్రతికున్న మనుష్యుడెవడైనను కల లోకనుపించినచో, ఆకనుపించిన వానికి తరువాత ఏమైనను హానిగాని, నష్టముగాని కలిగినచో కులపంచాయితీ ఆ కనుపించిన వానిని పట్టుకొని శిక్షించును. ఆదిమనివాసులకు చనిపోయిన వారిపై ఎట్టి భక్తియుండునో ఈక్రిందివిషయమువలన తెలియును. సామాన్యముగా హిందూసంఘమునందు సంవత్సరమున కొకపర్యాయము జ్ఞాపకార్థమై చనిపోయినవానికి అతని సన్నిహితులు 'శ్రాద్ధకర్మ' సల్పెదరు. కాని నీల

* గదబల గోత్రాలు యీ విషయము ఋజువుపరచును.

గిరి యందలి 'తోడా' జాతిలో ఈ క్రింది ఆచారముగలదు. వారిలో ఎవరైనను చనిపోయినచో అప్పుడు ఒకపర్యాయము, రెండవసారి రెండు మూడు సంవత్సరముల అనంతరమును, కర్మలు జరిపెదరు. ఈ రెండవ పర్యాయము సల్పు కర్మ కేవలము చనిపోయినవానికే సంబంధించదు, అతనితోబాటు చనిపోయిన అందరి పూర్వీకుల యెడలను భక్తితెలుపుటకై నొక ఉత్సవము చేయబడును. చనిపోయినవారి గృహములందలి వ్యక్తులందరు యీ ఉత్సవముసల్పి ఖర్చులు సమిష్టిగా భరించెదరు. అసలు ఆదిమనివాసులలో మృత్యువనినచో సంతోషముగా తలంచెదరు. కారణమేమన వారి ఊహయందు చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ, తన తాత, తండ్రులతో గలిసిపోయి ఔన్నత్యము బడయునట. సవరజాతి [1] యందు జరుపబడు, పితృకర్మ—దీనినే గువార్ అంటారు—సైతము సమిష్టి పద్ధతులపైనే జరుపబడును.

ఆదిమనివాసులయందు, మ్యాజిక్కు-అనినను, ప్రయోగములనినను చాల నమ్మకము. దేవతలను సంతోషపెట్టుటకును, తమకోర్కెలు నెరవేర్చుకొనుటకును, శత్రువులపై కక్ష సాధించుటకును ఈ ప్రయోగములు, మ్యాజిక్ చాలవరకు ఉపయోగింతురు. సర్. జేమ్సు జార్జిఫ్రేజర్ మ్యాజికును వర్ణించుచు "అది ప్రకృతి నియమములను తప్పుగాచెప్పే పద్ధతి. నిత్యజీవిత వ్యవహారాలలో అది తప్పుడుమార్గం చూపును. అదొక దొంగ శాస్త్రము, అబద్ధపుకళ" అని తెలిపినాడు. కాని ఈవిషయమై తర్కించుటకు ఇక్కడ స్థలముచాలదు. ఈ సందర్భమున ఒకవిషయముమాత్రము తెల్పెదను. ప్రతి జాతియందును మాంత్రికుడు, మ్యాజిక్ చేయువాడు ఉండెదరు. సామాన్యముగా మ్యాజిక్ పద్ధతులవలన రోగములు కుదుర్చుట, వర్షములు రప్పించుట మొదలగు సాంఘికావసర కార్యములు సాధ్యమని, ఆదిమనివాసులలో నమ్మకము. దీనినే Sympathetic magic అనియెదరు. పూర్వకాలమునందు ఈపద్ధతివలననే "కామెర్లి" రోగము నయముచేసెడివారు. వీని నవలంబించుటకై కొన్ని ప్రత్యేకవిధులను సైతము ఏర్పరతురు. చూడుడు. బిలాస్‌పూరు[2]లో కొన్నిజాతులయందు గర్భిణీస్త్రీ కనుటకు రెండునెలలకు పూర్వము నూలు వడుకుటయు, తాళ్ల

1 Dr. G V sitapati - his paper on the interpenetration of Aryan and primitive Cultures

2 Sir J G. Frazer - Magic and Religion P. 33.

పేనుటయు చేయరాదట. దీనికికారణమేమి? లోనుండు శిశువు నరములు సహితము ఆ త్రాడువలె నలుగునట. అదేవిధమున గ్రామపెద్దలు కచేరీ చేయుచున్నప్పుడు, నులకకండె త్రిప్పగూడదట. తన్మూలమున వారి వాదనలు 'రసాభాస' అయిపోవునట!

ముండాజాతివారు వర్షముకోసము కొండమీదినుండి పెద్దపెద్ద బండలను దొర్లించెదరు (Rain Magic). సవరలు ఈ మాజిక్ మూలమున చనిపోయినవారిని పిలిచి మాట్లాడగలరనియు, దుష్టదేవతలనుండి రక్షింపబడుదురనియు నమ్మకమున్నది.

ప్రయోగములు, చేతబడులు, మొదలగునవి సామాన్యముగా ఆసభ్యసంఘములందు సర్వసామాన్యముగాజరుపబడును. ఇంతేగాక, తమ కోరికలు నెరవేర్చుకొనే నిమిత్తం నరబలులు ఇచ్చే ఘోరాచారములు సహితము లంబాడీవంటి జాతులలో ప్రబలముగ నుండెడివి. ప్రయోగము మూలమున మనుష్యుడు రోగగ్రస్తుడగుననియు, చంపబడుననియు నమ్మకములు కోయ, లంబాడీ, యెరుకలు మొదలగు జాతులలో విశేషముగా వ్యాపించి యున్నవి. ఇంతేగాక, కోయ, కడుంబరు మొదలగు జాతి వారు, పెద్దపులి నోరు కట్టుతారని మంత్రములుపెట్టి ప్రయోగములు చేయుదురని, అపోహ, సభ్య ప్రజలలో చాలమందికి గలదు.

ఆదిమ నివాసుల జీవితమునందలి విశేషములు ఇట్టివి. వారు పేదవారేగాని, అనాగరికులేగాని, కొంతవరకు మూర్ఖులేగాని, వారిలో తృప్తిఅనేది కనపడుచున్నది. మోసముచేసి అన్యాయముగా దోపిడి చేయవలె ననెడి ఉద్దేశ్యము వారియందు కనపడదు. ప్రకృతిలో లీనమగుచు, ప్రకృతిచే ప్రసాదింపబడిన దుంపలు, పండ్లు, కాయలు, కొండధాన్యము, తింటూ, పొట్టపోసుకుని కాలము గడిపెదరు. వాతావరణ వైపరీత్యముల మూలమున గలుగు ప్రతిబంధకములను సరకుగొనక, అట్టివి కేవలము తమ దేవతల ఆగ్రహమువలన కలుగుచున్నవని యూరడిల్లుచు, వాటిని సంతోషపెట్టుటకు ప్రయత్నించెదరు. బాహ్య ప్రపంచముతో ఏమియు సంబంధము లేకపోయినా, వారి జీవితములోనికి తొంగిచూచినచో, నిజమైన మానవజీవిత మాధుర్యము, కళాకౌశలము, బాధ్యతా రహితమగు స్వతంత్ర ప్రవర్తన, అమాయకత్వము, నిరాడంబరత్వముతోగూడిన నిర్భయత్వము, నిజాయితీ, మొదలగు లక్షణములు వారియందు గోచరించును.

నైతిక ప్రవర్తనయందును, సామరస్య విషయమునందును, పరోపకారత యందును, మన సభ్య ప్రజలు ఆదిమ నివాసులనుండి నేర్చుకొనవలసినది చాలగలదు.

మనకన్న తక్కువవారిగా చూడబడు ఈ అరణ్య దొరలజీవితము లోని ఆర్థిక వ్యవస్థలు, సాంఘిక కట్టుబాట్లు చూచినచో, వారిపైన మనకు గల దురభిప్రాయము పోవుటయేగాక, వారి పురాతన విజ్ఞానమునుండియే మన నాగరికత యందలి ఉత్కృష్ట లక్షణములు ఆవిర్భించినవని మనకు తోచును. ఇది వాస్తవము. గనుకనే, ఫ్రేజర్ పుస్తకమునకు పీఠికవ్రాస్తూ జి. ఎం. ట్రెవిలిన్ యిలాఅన్నాడు. "ఆయనపుస్తకము మానుషశాస్త్రము నందలి క్లిష్ట సమస్యలను ఎక్కువ శ్రద్ధతో అర్థముచేసుకొనేటట్లు చేయుట కుపకరించును. అంతేగాక, అనేక విషయములలో వెనుకబడియున్న మనము మంచికిగాని, చెడుకుగాని, ఏ ఆదిమ సభ్యునినుండి వృద్ధి పొంది తిమో, ఆతని ప్రజ్ఞలను చక్కగా తెలుసుకొనవచ్చును."

## 5. జాతుల కడగండ్లు

"అప్పుల భారంనుండి, భూముల అన్యాక్రాంతమునుండి, నిరంకు శత్వమునుండి, బాండు సర్వీసునుండి మనము ఆదిమనివాసుని కాపాడ వలెను. మలేరియా, కోయరోగము Yaws) మొదలగు వ్యాధులనుండి అతనిని రక్షించవలెను. అతని భావములకును, అతని ఉనికికిని అనువగు వ్యవసాయమునుగూర్చి, ఆర్థిక సంస్థలనుగూర్చి బోధ సల్పవలెను. తన జాతి జీవితపు విలువలను, విజ్ఞానమును నిలుపుకొనుటయేగాక, నవీన భారతదేశమున ప్రతిబింబించు ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక జీవితములో అతనుగూడ తన పాత్రను నిర్వహించునటుల శిక్షణ యొసంగవలెను. అతని మానమర్యాదలను పునఃప్రతిష్ఠించి వాటిని వృద్ధి పొందించవలెను. ఇది మన ప్రధాన కర్తవ్యము." — డబ్ల్యు. వి. గ్రిగ్సన్.

ఆదిమనివాసుల సమస్యలన్నిటిని క్లుప్తముగా గ్రిగ్సనుగారు సూచిం చినారు. ఈ ప్రకరణమునందు ఆదిమనివాసుల ఆర్థిక, సాంఘిక, మత, దురవస్థలను వర్ణించెదను. *

---

* ఈ ప్రకరణము వ్రాయునప్పుడు డబ్ల్యు వి గ్రిగ్సనుగారు మధ్య రాష్ట్రములందలి ఆదిమనివాసులపై గావించిన పరిశోధనా నివేదికను ఆధారముగా తీసికొంటిని. అందులకు గ్రిగ్సనుగారికి కెంతయు కృతజ్ఞుడను.

ఆర్థిక దురవస్థ: లోకవ్యవహారములు తెలియని కారణముగా ఆదిమనివాసులను ఋణదాతల ఒత్తిడి యెక్కువగా బాధించుచున్నది. అసలు వీరి కష్టనిష్ఠూరములనుగూర్చి వ్రాయదలచుకొన్నచో, ఒక గ్రంథమును తయారుచేయవచ్చును. వీరి యిక్కట్లలో ఆర్థికదురవస్థ ప్రధానమైనది. వీరి భూములు, వీరిలో పాతుకొనిపోయిన అప్పులబాధ, అరణ్యసంరక్షక పద్ధతిమూలమున వీళ్ళకు జరిగెడి నష్టము, మొదలగు వానిని గూర్చి ప్రస్తుతము ముచ్చటింతును.

"అరణ్యపు పాటలు" 'Songs of the Forest' అనే పుస్తకములో ఎల్విన్ ఈవిధమున తెల్పినాడు. "ఆదిమ నివాసులు గట్టి భూములలో విత్తులు నాటుదురు. దానివలన నాగలి విరిగిపోవును. మరల క్రొత్తది తయారుచేసి, భూమినిదున్ని విత్తులు జల్లుతారు. కాని ఆ శ్రమకు తగిన ప్రతిఫలము లేదు."

నిజముగా యిదియే ప్రస్తుత ఆదిమనివాసుల దుస్థితికి కారణం.

(అ) వ్యవసాయము :

సహజముగా ఈ జాతులన్నియు అరణ్యప్రదేశములయందును, కొండలవద్దను నివసించుటవలన, ఆ భూములు వ్యవసాయమునకంత అనువయినవిగావు. కొండచరియలవద్దగల ప్రదేశము లంతకన్నను పనికిరావు. చూడుడు. గోండ్లవిషయములో నురోనుహా ఐ. సి. ఎస్. గారు తెలిపినటుల వీరికివ్వబడు భూములు నిస్సారమైనవి. వీటిని "భాటువా" భూషుంలనియెదరు. వీటిని 3 సంవత్సరములవరకు మాత్రమే సాగుచేయవచ్చును. తరువాత 3 మొదలు 6 సంవత్సరములవరకు సేద్యము చేయకుండా వదలివేయవలయును. హైదరాబాద్‌రాష్ట్రము, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని లంబాడీలు సేద్యముచేయుచున్న భూములుగూడ ఇట్టివే. సామాన్యముగా పైఉద్యోగివేసిన అంచనాప్రకారం, ప్రతి గోండు కర్షకునకు 12 ఎకరములభూమి ఉన్నప్పటికినీ, అందులో సగముభూమిని ఎప్పుడును బీడుపెట్టవలసినదే. ఈ సాగుకాని దినములయందు 12 ఎకరములమీద శిస్తు కట్టటమంటే, వీరికి కష్టతరమగుపని. అందుచేత వీరు ఎల్లప్పుడును భూస్వాములకు బాకీదార్లుగా నుండెదరు. ఇంతేగాక, వీరి భూములన్నియు వర్షాధారమగుటచేతను, వీరి వ్యవసాయ పద్ధతులు బహు

పురాతనములగుటవలనను, వర్షములు తక్కువయినచో, ఆకాస్త పంటయి నను పండక, ఆదిమనివాసులు సంవత్సరముపొడుగునను మాడవలసినదే. ఒకవేళ పంటపండినను, భూములు సారవంతములు కానివగుటచేతను, నాలుగునెలలకు సరిపడు ధాన్యముమాత్రమే అతడు పొందగలుగుచున్నాడు. అంతియేగాక, ఒకవేళ పంటపండినను ఈ భూములన్నియు అరణ్యము లకు చేరువగా నుండుటవలన దుప్పులు, అడవిపందులు మొదలగునవి పాడుచేయును. ఇట్టి కారణములవల్లననే, ఆదిమనివాసులకు భూసేద్యము మీద ప్రీతితగ్గినది. అంతేగాక, చాలజాతులు పరిసర ప్రాంతములలోని ఫ్యాక్టరీలలోగాని. తదితర సేవకావృత్తులకుగాని, పోవుచున్నారు. లాభసాటి గాని సేద్యమునకుతోడు ఆదిమనివాసులలో ఇటీవల జనసంఖ్య అధిక ముగా పెరుగుటవలనను, భూమి చాలినంత లేకపోవుటవలనను, వారు భూములను వదలిపెట్టి పరిసరగ్రామములకు బోవుచున్నారు. ఈకారణము చేతనే జబ్బల్‌పూర్ జిల్లాలోని ముర్‌వారా, పటాను, సింఖోరా తాలూకాల యందలి గోండు, కోలు, ఖేరియా, భూమియా, బైగా జాతులు, జబ్బల్ పూర్, కట్నీ మొదలగు ప్రదేశములలో ఫ్యాక్టరీలయందును, సున్నపు రాళ్ళగుట్టల యందును కూలినాలి సల్పి బ్రతుకుచున్నారు. అదేవిధమున బీహార్ * నందలి ముండా, శాంతాలు, హో, జాతులు జమ్‌షద్‌పూర్ కర్మాగారములల్లోను, బీహారు, బెంగాలు, ఒరిస్సాలయందలి జనపనార ఫ్యాక్టరీలయందును, తేయాకు తోటలలోను కూలిచేసికొని కాలము వెళ్ళ బుచ్చుకొనుచున్నారు.

(ఆ) అప్పు :

ప్రస్తుతము ఆదిమనివాసుల భూములన్నియును ఇతరులకు సంక్ర మించుచున్నవి. దీనికిగల కారణము లేమిటి? సురోన్‌హోగారు చెప్పి నట్లు షాహుకార్లే దీనికి ముఖ్యకారకులు. ఉదాహరణకు మధ్యరాష్ట్రముల యందలి గోండ్లనే తీసుకొందము. వీరు అప్పుతీసుకొనుట కనేకకారణము లుండును. భూమిశిస్తు కట్టుకొనుటకును, కుటుంబ సంరక్షణార్థమును, తమకుపండే పంట చాలక సామాన్యముగా వీరు అప్పుచేసెదరు. దీనికి తోడు అప్పుతీసుకొనిన మొత్తమునకు అధికమగు వడ్డీ - అంటే షుమారు రూపాయకు పావలా యివ్వవలెను. ఈ వడ్డీ ప్రతిసంవత్సరము చెల్లించు

* Dr. D. N. Majumdar - A Tribe in Transition.

చుండినచో, కోయవాళ్లు తినునది ఏమున్నది? నూరురూపాయలు అప్పు తీసికొనినచో సంవత్సరమునకు 125 రూపాయలు అగునుగదా! ఇటుల పెట్టుబడిపెట్టిన మొత్తమున కేవిధమైన పత్రమును ఉండదు. మరియొక ముఖ్యకారణము అనాదిజాతులు వివాహములకు, మతకర్మలకు, అధికముగా ఖర్చుపెట్టెదరు. దీనికి కావలసిన డబ్బు షాహుకార్లే ఇచ్చెదరు. వడ్డీ అధికమని వేరే చెప్పనక్కరలేదు గదా! మరియును, ఊరూరా తిరిగే గుడ్డల షాహుకార్లును, పచారీ వర్తకులును, అప్పుమీదనే వీళ్ళకు తమ వస్తువులిచ్చెదరు. దీనిమీదగూడ పాపముపండినట్లు వడ్డీ పెరుగును. నిజమునకు ఆదిమనివాసుడు సత్యసంధుడే! తీసుకొనిన ఋణమును తిరిగి తీర్చవలెననెడి నైతిక భావము, ఆత్మ గౌరవము అతనిలోగలవు. కాని భారమగు వడ్డీవలన అతడు ఋణము తీర్చలేకపోవుట సంభవించుచున్నది.

ఈ అప్పులే వీరిని చాలవరకు అధోగతిలోనికి యీడ్చినవి. షాహుకారులు వీరిని ఆర్థికముగా దోపిడి చేసెదరు. ఇంతేగాక, వీరు ఎప్పుడును కాతాలు మొదలగునవి సరిగా నుంచరు. అసలు వ్రాతమూలకముగా అనాది జాతివారికి వీలుగా నుండునటుల ఏపత్రమును జారరు. ఈ జాతులలో ముఖ్యముగా, గోండ్లలో 20 సంఖ్యలకన్నా అధికముగ లెక్కపెట్టలేని వారు చాలమంది గలరు. అందుచేతనే బేతూల్ జిల్లాలోని గోండ్లు సామాన్యముగ పదిరూపాయలు అప్పు తీసుకొనినచో రు. 20-0-0 లకు నిశానీ ముద్రవేసెదరు. పైగా వడ్డీ రు 100కి రు 20 లు. ఈకారణమువలన అప్పు తీర్చలేకపోవుటయు, దానివలన వీరి భూములు అన్యాక్రాంతమగుటయు, సంభవించుచున్నది.

ఖర్గాగర్ జాగీరుదారుడగు గోండురాజు, 39 గ్రామముల కధిపతి. అతనికి 1935 - 36 లో షుమారు 80 వేల రూపాయల అప్పు ఉన్నది. ఇంత అప్పు ఎందుకయినదో తెలియదు. బహుశః శుభకార్యములకు. కర్మలకు కొద్దికొద్దిగా తీసికొనిన మొత్తములకు విశేషమగు వడ్డీ తోడయి, అంత పెద్ద మొత్తమయియుండును. ఋణ పరిష్కార సంఘమువారు దానిని రు. 23,300 లకు తగ్గించినారు.

ఇట్టివి చాల ఉదాహరణములు గలవు. మధ్య రాష్ట్రములయందలి ఆదిమనివాసుల స్థితిగతులపై ప్రభుత్వమువారిచే ప్రత్యేకముగా నియమింప

బడిన గ్రిగ్సన్‌గారు, శ్రీవత్సవాగారికి యిచ్చిన రిపోర్టులో ఈ క్రింది విషయములు ఉన్నవి.

"అసలు అనాదిజాతివారిలో అప్పు అనునది వివాహమునకుగాని, ఇతర శుభకార్యములకుగాని పుట్టును.

"ఆదిమనివాసులకు మధ్యరాష్ట్రములలో అప్పులిచ్చువారు చాలవరకు దుకాణాదారులు. వీరు సామాన్యముగా జాగీర్లకు పరిసర ప్రాంతముల యందును, వ్యాపార సంబంధమగు గ్రామములయందును నివసించుచుండె దరు. అనాథుల అక్కరల నిమిత్తము డబ్బు అప్పుగాయిచ్చుట వీరికొక విధమయిన పెట్టుబడిపద్ధతి అయినది. వీరివుద్దేశ్యము, సాధ్యమైనంతవరకు అసలు తీసికొనకుండా వడ్డీక్రిందమాత్రమే పండిన పంట లాగుకొనుట, అందువల్ల అసలుమొత్తం యెప్పుడునూ చెల్లుబడి కానియ్యరు. ఏదో ఒక విధముగా ఋణపత్రమును మాత్రము అప్పుడప్పుడు తిరిగి వ్రాయించు కొనెదరు. వడ్డీ చెల్లింపనిచో దానినిసయితము తమను ఆశ్రయించుకొని యున్న పంచాయితీల సహాయముతో ప్రత్యేక ఋణపత్రములక్రింద వ్రాయించెదరు. ఈవిధముగ కొంతకాలము జరుగునప్పటికి ఒక్కొక ఖాతాకు 3 పత్రాలు - అంటే ధాన్యపత్రం, ఋణపత్రం, వడ్డీపత్రం అనునవి ఏర్పడుతవి. ఒక్క జాగీరుదారుగూడ యీ ఋణమును తీర్చలేడు. కాని షాహుకారుకు కష్టములేకుండా ధాన్యము ఇంటికివచ్చును."

## (ఇ) మల్‌గుజార్లు :

షాహుకార్లకు, మార్వాడీలకు తోడు "మల్‌గుజారు ల"నేవారు ఉన్నారు. వీరు భూస్వాములవలనగాని, షాహుకార్లవలనగాని తమ తమ భూ వ్యవహారములను చూచుటకును, శిస్తులు వసూలుచేయుటకును నియ మింపబడిన ఏజెంట్లు. ఈ భూస్వాములలో చాలమందికి తమ గ్రామము లలోనున్న భూవిస్తీర్ణముగూడ తెలియదు. ఈ మల్‌గుజారులు ఆదిమ నివాసులను అపరిమితముగ బాధించెదరు. ఒక్కొక్క గ్రామమునకు వీరే ప్రభువులవలె సంచరించెదరు. వీరుగూడ చిన్ని చిన్ని ఆదిమ కర్షకులకు కొద్దికొద్ది మొత్తములు అప్పులిచ్చెదరు. ఇట్లా మొత్తములు అప్పుగా యిచ్చునప్పుడొక షరతు ఉండును. ఋణగ్రస్తమైన కుటుంబములో ఎవరైనను ఒకరు బాకీయొక్క వడ్డీ చెల్లుబడిక్రింద మల్‌గుజార్ గృహ

ములో సాలుకి 30 లేక 40 రూపాయల జీతమునకు సేవకుడుగా పనిచెయ్య వలెను. దీనిలోగూడ చాలచిక్కులున్నవి. వర్షములు కురిసేటంతవరకును "బరసాలియా" అనగా ఆ ఋణగ్రస్తకూలి, అతని కుటుంబము, తమకు భూమిలో పండిన గింజను తినెదరు. వర్షములు ఆరంభముకాగానే మరల ఋణదాత గింజలు కొలుచును. ఇట్లా పెట్టుబడిపెట్టిన ధాన్యం వేరేపద్దు అగును. ఈవ్యవహారమూలముగా అసలు 100 రూపాయలు తీసుకొంటే, ఋణగ్రస్తుని బాకీ 3 లేక 4 వందల రూపాయలకు పెరుగును. (అతని కుమారుడు మల్‌గుజార్ గృహముల్లో పనిచేసిననుగూడ)

ఇట్లా అప్పులు పెరుగుటకు ముఖ్యమైన కారణములు రెండు. మొదటిది, ఈ జాతులు సివిల్ న్యాయస్థానములకు వెడలి వ్యవహారము చేయుటయనినచో అయిష్టము చూపుదురు. ఒకవేళ వెళ్ళినా, గెలుచుట కష్టము. ఎందుకనిన, షాహుకారులు తమకు చెల్లించిన డబ్బు ముట్టినట్లు రసీదులివ్వరు. రెండవది, ఆదిమనివాసులలో వ్యక్తమగు అమాయకత్వము, విద్యావిహీనత్వము. ఈ కారణములచేత ఋణదాతలగు షాహుకార్లకు వీళ్ళపై జరిపే సకల కోర్టువ్యవహారములయందు మంచివీళ్లు, లాభమును కలుగును.

## (ఈ) షాహుకార్ల దుండగములు :

షాహుకార్లుచేయు దుండగములగూర్చి జే. కే. అతుల్, ఐ.సి.యస్. గారు యీ విధముగా తెలిపినారు. "కుసుంకోటలో అనాదిజాతి సభ్యులు తమ తల్లిదండ్రులు చేసిన అప్పులను తీర్చుకొను నిమిత్తము 'బాండు సర్వీసు' లో చేరినారు." ('బాండు సర్వీస'నగా వివాహములకును, యిదివరకున్న అప్పులు తీర్చుటకున్నూ కావలసిన రొక్కమును అనాది జాతి సభ్యులకిచ్చి, షాహుకారు వారిచేత చేయించుకొనుచాకిరీ. సామాన్యముగా గోండ్లలోను, కొర్కులలోను యిట్టిపద్ధతి గలదు. ప్రొఫెసరు చటోపాధ్యాయగారి వ్రాతలప్రకారం కొర్కులలోని పద్ధతికి భాగ్యియా యనెదరు. గోండ్లలో వివాహమునకు అరువది రూపాయలు మొదలు నూటయాభై రూపాయలవరకు కావలెను. అందులకై కనీసము రెండు సంవత్సరములు అనాది సభ్యుడు ఊడిగము చేయును). వీరివిషయములో షాహుకార్లు యెంత వడ్డీ తీసుకొనుచున్నారో నిర్ణయించుట

కష్టము, కేవలము షాహుకార్ల యిష్టాయిష్టములపైని వడ్డీరేటు ఆధారపడి యుండును. కాని వీరు నూటికి యాభై మొదలు వందవరకు వడ్డీ తీసుకొనెదిరని తెలియుచున్నది. ఈ విధమున డబ్బు దోపిడి చేయుచున్నప్పటికిని ఆదిమనివాసులకు అసలు తమకు న్యాయస్థాన మున్నదనిగాని, మధ్యరాష్ట్రములలో ఋణదాతలు నూటికి పన్నెండుకంటె యెక్కువవడ్డీ తీసుకొనునపుడు శాసనరీత్యా తమకు రక్షణ వున్నదనిగాని - తెలియదు. ఒకవేళ తెలిసినను, షాహుకార్లకు వ్యతిరేకముగ న్యాయస్థానములకు పోవుటకు ఆదిమ నివాసులకు భయము ఎక్కువ. కారణ మేమన, ఎవరిమీద వ్యాజ్యము వేయునో తిరిగి అతనిదగ్గరకే ఆదిమనివాసులు తమ అక్కర నిమిత్తము డబ్బుకొరకై వెడలవలెను. అతనికి కోపము వచ్చినచో తమకు డబ్బు ముట్టదు.

భోకరబార్డీ యనుచోట నొక షాహుకారు నిర్దేశింపబడిన రేటుకు మించి నూటికి 50 వడ్డీ తీసికొనుచుండెను. అతుల్‌గారు, ఋణదాతను ఋణగ్రస్తుని తమయొద్దకు ముఖాముఖిని తీసికొనివచ్చిరి. కాని ఋణగ్రస్తుడు షాహుకారుకు వ్యతిరేకముగా సంజాయిషీ నిచ్చుటకు భయపడెను. నిజము కనుగొనుటకు సల్పిన ప్రయత్నములన్నియు వ్యర్థములైనవి. కారణము తనకుమారుని వివాహము దగ్గరకు వచ్చుచున్నదనియును, అందువలన అప్పుకొరకు తిరిగి ఆ షాహుకారుయొద్దకే వెడలవలెననియు, తత్కారణమున నతనికి వ్యతిరేకముగా నేమియు చెప్పలేననియు, ఆ ఋణగ్రస్తుడు జవాబునిచ్చెను. ఒకవేళ ధైర్యముచేసి వ్యతిరేకముగ సంజాయిషీ నిచ్చినచో, అతని పిల్లవానికి వివాహముకాదు సరిగదా, అతని జీవితమందు యెన్నడూ యికముందు మనశ్శాంతి యుండదు. ఈ షాహుకార్లు పఠాన్‌లను తమ సేవకులుగా నియమించుకొని వడ్డీలను వసూలు చేయుటకును, న్యాయవిరుద్ధముగ బలప్రయోగము చేయుటకును, ఋణగ్రస్తుని గొడ్డు గోదలను, యితరవస్తువుల నెత్తుకొనిపోవుటకును, నియమించెదరు. పోలీసువారికి యీ విషయము తెలిసినప్పటికిని ఫిర్యాది దారుడగు అనాది జాతీయుడు తన మాటపైని తుదివరకు నిలవజాలని కారణమువలన యీ సందర్భములో యెక్కువగా జోక్యము కల్పించుకొనరు. అసభ్య మానవునకు షాహుకార్లను చూచినచో మరొక భయమున్నది. షాహు

కార్లు కొందరు రౌడీలను పంపుచుందురు. వారప్పుడప్పుడు యెవరును చూడకుండ నతనికి దేహశుద్ధి గావించెదరు. ఇదీ వీరి ఆర్థికదుస్థితి.

## 6. జాతుల కడగండ్లు (అ)

"అరణ్య సంచిత విధానము (రిజర్వుడు) ఆదిమనివాసుని వేట హక్కును త్రోసివైచినది. సంచిత భూములలో అతడు అరణ్యసంపదను ప్రోగుచేయజాలడు; పళ్ళు కోయజాలడు; వేళ్ళు త్రవ్వలేడు; ఇంతేగాక గేమ్సు శాసనము, చేపలశాసనమువంటి ప్రభుత్వశాసనములు ప్రవేశపెట్టుట మూలముగాను, ప్రభుత్వపు అబ్కారీ పద్ధతిమూలముగాను, ఆదిమనివాసుల స్వతంత్ర, శాంతియుత ఆర్థిక, సాంఘిక జీవితపద్ధతులకు తీరని ప్రతిబంధకములు ఏర్పడినవి." — ఫ్రీప్రెస్ (19–12–44)

అరణ్య సంరక్షణకై స్థాపింపబడిన ఆటవికశాఖ ఆదిమనివాసులకు తీరని నష్టము కలుగజేసినది. పైనతెల్పిన జాతులన్నిటికీగూడ గొడ్డలి వ్యవసాయమేగదా ముఖ్యజీవనోపాధి! అటువంటప్పుడు అరణ్యములను ప్రత్యేకముగాకాపాడే పద్ధతిద్వారా ఈజాతులవారు చెట్లుకొట్టకుండా, వేటాడుటకు వీలులేకుండా, దుంపలు త్రవ్వుకోనీయకుండా, ప్రభుత్వముచేసినది. జయపూర్, పోలవరం, విశాఖపట్నం ఏజన్సీ మొదలగు ప్రాంతముల యందుండెడి జాతుల అగచాట్లు తిలకించితిమేని, ఆదిమనివాసుల స్థితి గతులు బాగుగా వ్యక్తమగును. అరణ్యశాఖోద్యోగులు వీరిచేత ఆటవిక సంపదను బలవంతముగా ప్రోగుచేయించి సరఫరా చేయింతురు. ఇంతేగాక, నిర్బంధ కూలీవిధాన షమలుజరిపెదరు. అశాస్త్రీయమగు జరిమానాలు, మామూళ్లు వసూలుచేసెదరు. ఈ సంగతులు బైటికిరావు. అక్కడ నివసించుచు, వారితో సంచరించినచో వారు ఇప్పటికీగూడ ఈ ఉద్యోగీయుల దురాగతములు కథలుగా చెప్పుకొనెదరు. మధ్యరాష్ట్రములలోని ఆదిమనివాసులనుగూర్చి వ్రాయుచూ ఎల్విన్‌గారుగూడ ఇలాగే అభిప్రాయపడుచున్నారు. ఈ మానుషశాస్త్రజ్ఞుడు నిర్భయముగ ఆదిమనివాసుల కడగండ్లు విపులముగా వర్ణించుటమూలముననుు, కాంగ్రెసువారు, తదితర రాజకీయవేత్తలు చేసిన అలజడిమూలముననుు, ఈ అడవులలో అనాది జాతివారికి కొద్దిగా హక్కులు వచ్చినవి,

"Loss of Nerve"అనే పుస్తకమందు ఎల్విన్ అరణ్యావిధానంవల్ల ఆదిమనివాసులకుగలుగు అవస్థ ఈక్రిందిరీతిని వర్ణించినాడు. "అన్నిటికన్న ముఖ్యముగా ఈజాతులన్నిటికిని ఎక్కువ నష్టము కలుగజేసినది యేమనగా తమకు గృహమువలెనున్న అరణ్యములలో సేచ్ఛగా తిరుగుచూ, కాలము గడుపుటకు వీలులేకపోవుటయే. ఇంతేగాక సాంప్రదాయముగా అనాది జాతులు అవలంబించుచున్న వ్యవసాయ పద్ధతులు బహిష్కరింపబడినవి. అడవులలో స్వేచ్ఛగా తిరగకుండ ఎక్కడనో ఒకచోట స్థిరముగా నివశింప వలయునని శాసింపబడినది. అతనికిగల గొడ్లు ప్రత్యేకింపబడిన అరణ్య భాగములలో ఎక్కడ మేయునో అనుభయము ఎక్కువయినది. అటుల మేసినచో, అధికముగా జరిమానాలు విధింపబడును. అసభ్య జాతివారు కర్మంజాలక అరణ్య గ్రామములో నివసించినచో, ఎప్పుడు పడితే అప్పుడు నిర్బంధకూలికి రావలసివచ్చును. వేరేచోట నివసించినచో, అర ణ్యమునందు దొరకు ప్రతి దానికీకూడ లైసెన్సు తీసుకొనవలయునని శాసించెదరు."

తరువాత ప్రతిజాతికిని పండుగ రోజులలోను ఇతర శుభకార్యముల యందును వేటాడుట అవసరకార్యము. ఇంతేగాక అరణ్యములో నుండు చెరువులలో చేపలు పట్టుకొనుట, సారాయి తయారు చేయుటకూడ నొక ఆచారము. ఇట్టికార్యములుకొన్ని పురాతనపద్ధతుల ప్రకారం ఆదిమజాతులు అవలంబించెదరు. వేటాడుట చాల పద్ధతుల ప్రకారం జరుగును. చాల జాతులవారు నీటిలో విషముకలిపి చేపలను చంపెదరు. లేదా ఏదైన ప్రవాహములోనుండి వచ్చునీటిని తిప్పివేసి, దానిలో వలలు మొదలగునవి వేసి చేపలను పట్టెదరు. ఇట్టి పద్ధతులన్నియును ఇండియన్ ఫిషరీల ఆక్టు 5, 26 శెక్షన్ల క్రింద నేరములుగా భావింపబడుచున్నవి. కాని అరణ్యజాతుల పురాతన సాంప్రదాయములతోకూడిన ఈ కార్యములను తప్పిదములుగా పరిగణించుట, ఆదిమ నివాసుల జీవితమునకు మహోపకారం గల్గినదని ఈ శెక్షన్లను వీరిపై ప్రయోగించగూడదని గ్రిగ్సన్, తన "బస్తర్ పరిశోధనలో" అభిప్రాయమును వెలిబుచ్చినాడు.

చేపలను బట్టుటయేగాక, వేటాడు విషయములోగూడ చాల ప్రతి బంధకములుగలవు. అరణ్యములను రిజర్వు చేయుటవల్ల ఆదిమనివాసులకు ఆ భాగములలో వేటాడుకొనుటకు వీలులేదు. అంతేగాక, అట్లు



నిసర్గైన భిల్లు యువకుడు

డా. డి. ఎన్ మజుందార్‌గారి 'గుజరాత్ భిల్లులు' నుండి



భిల్లు విలుకాండ్రు

డా. డి. ఎన్. మజుందార్‌గారి 'గుజరాత్ భిల్లులు' నుండి

ప్రత్యేకించబడిన అరణ్యభాగములలోని పులులు, చిరుతలు, దుప్పులు మొదలగు జంతువులు ఆదిమ నివాసుల పొలములలోబడి చాల నష్టము కలుగజేయుచుండును. ఒకవేళ అసభ్య జాతీయుడెవడైనను తన తిండి కోసముగాని, స్వరక్షణార్ధముగాని, వేటినైనను వేటాడినచో చిన్న చిన్న ఫారెస్టు, రివెన్యూ, పోలీసు ఉద్యోగస్థులు అది తప్పనిచెప్పి, మోసముచేసి, అతనిదగ్గర లంచములు, మామూళ్లు, జరిమానాలు వసూల్చేసెదరు. దీనికి తోడు లోగడ తెలిపినటుల ఆ జాతుల అజ్ఞానము, విద్యావిహీనత యీ ఉద్యోగుల అక్రమకార్యములకు దోహదమొసగినవి.

అరణ్యములలో పెరుగు కొన్ని విచిత్ర సృష్టిజాలముయొక్క రక్షణార్థమై ప్రభుత్వము "గేమ్సుఆక్టు" పెట్టినప్పటికినీ, అనాదిజాతుల వేటహక్కులకెట్టి ప్రతిబంధకము యిది కలుగజేయదు. తనపంటను పాడు చేయుచున్నప్పుడు, లేక ప్రత్యేకింపబడని అరణ్యభాగములలోని జంతువు లను ఆహారముకొరకు వేటాడునప్పుడు, ఈ "గేమ్సుఆక్టు" అడ్డురాదు. అంతేగాక, మన మద్రాసు రాజధానిలోని ఫారెస్టు అధికారులు కొన్నికొన్ని నిర్ణీత సమయములందు ఆదిమనివాసులు వేటాడుకొనుటకు హక్కొసంగు దురు. ఈ హక్కులు నిరక్షరాస్యులగు ఆదిమనివాసులకు తెలియకపోవు టయు, అటుల తెలియనీయకపోవుటయు - ఈ రెండు ప్రతిబంధకముల వల్ల చిన్న యుద్యోగుల అక్రమములు విరివిగా జరుగుటకు అవకాశము గల్గినది; గల్గుచున్నదిగూడ. పోనీ అటువంటి జంతువులు ప్రత్యేకింపబడిన ప్రదేశములనుంచి బయటకువచ్చి పంటలు పాడుచేయకుండ సంచితారణ్యా ములచుట్టును కంచెతీగ వేయమనికూడ మధ్యరాష్ట్రములలో సలహాలివ్వ బడినను, అట్టిపను లెవ్వియును జరుగలేదు.

ఇంతేగాక, ఉద్యోగులవలన జాతులకు సంభవించు కష్టములు చాల గలవు. వానిలోనికెల్ల ముఖ్యమయినది, పర్యటనసలుపు ఉద్యోగులకు కావలసినవన్నీ సరఫరా చెయ్యటం. ఈ సందర్భములో పూర్వము మధ్యరాష్ట్రముల గవర్నరుగా పనిచేసిన సర్ ఫ్రాంసిస్‌వైల్ ఉద్యోగస్థు లకు కావలసినవన్నీ సమకూర్చుటమనేదే అరణ్య గ్రామస్థులు సామాన్య ముగా సలిపే ముఖ్య నేరారోపణమన్నాడు!

ఎవరైనా ఉద్యోగస్థుడు వచ్చి ఫారెస్టు బంగళాలో దిగితే, ఫారెస్టు గార్డులు ఊరిలోనికివెళ్ళి ముఠానాయకుని - ఇతనిని ముకద్దం అనెదరు -

కోడిపెట్టలు, గ్రుడ్లు, నెయ్యి పంపమని ఆజ్ఞయొసగెదరు. ముకద్దం గ్రామమంతా తిరుగుతూ కనపడిన కోళ్ళనన్నిటినీ పట్టుకొనును. ప్రతి గృహమునందునుజొరబడి కావలసిన గ్రుడ్లు, నెయ్యి యధేచ్ఛగా గుంజుకువచ్చును. ఈవిధముగా సంపాదించిన సామగ్రియంతయు దొరగారిముందర సమర్పించి వెళ్లను. అధికారి అప్పుడు డబ్బు ఏమియు యివ్వడు. ఒక 20, లేక 30 రోజుల తరువాత నిర్ణీతరేటు ననుసరించి డబ్బు పంపించును. కాని అరణ్యశాఖవారు నిర్ణయించురేటు బహుతక్కువ. మధ్యరాష్ట్రములలో కోడిపెట్ట 1కి రు. 0-3-0; కోడిగ్రుడ్లు డజను రు. 1కి రు. 0-3-0.

అందరును ఇటులనే ఉందురని చెప్పుట నా ఉద్దేశ్యముగాదు. ఉద్యోగస్థుల విషయములోగాని, ఫారెస్టుగార్డుల విషయములోగాని. లేక ముఠా నాయకుల విషయములోగాని అనుమానాస్పదమగు విషయమేమియునులేదు. కాని వాళ్లు నిర్ణయించిన రేటు, ముకద్దం ఆ విధముగా గ్రామస్థులను ఏడిపించటం - ఈ రెండును న్యాయముగాదని నా ఉద్దేశ్యము.

ఇవీ అరణ్యశాఖమూలమున అరణ్యజాతులకు గలుగు కష్టములు.

## 7. ఆదిమనివాసులు - మద్యపానము

అనాదిజాతులయందు త్రాగుడు ఒక సాంప్రదాయమైన అలవాటు. పూర్వపురోజులలో, ఏజాతికి ఆజాతే సారాయి తయారుచేసుకొనెడిది. కాని ఇప్పుడు సారాయి స్వంతముగా తయారుచేసుకొనుట చట్టవిరుద్ధమని నిర్ణయించినది ప్రభుత్వం. ఇట్టి చర్యమూలమున ఆదిమనివాసులకు తీరని ఇక్కట్లు గలిగినవి. త్రాగుడును ప్రోత్సహించుట అన్యాయమును, అవినీతియు, అసభ్యమును, అయియున్నదిగాని, జాతుల సాంఘిక జీవితములయందు హృద్గతమైన యీ మద్యపానమును పూర్తిగా నిర్మూలించుటయన, ఆజాతుల వ్యక్తిత్వమును, ప్రత్యేకతను, కూకటివ్రేళ్ళతో పెళ్ళగించుటయే యగును. అందువలననే, కాంగ్రెసుమంత్రులు అమలునందుబెట్టిన మద్యపాననిషేధచట్టము అనాదిజాతులకు వర్తించదని స్పష్టపరచుట ఎంతయు శాస్త్రయుతమగు పరిపాలనా పద్ధతి ఈ సందర్భమున నొక విషయము మరల పాఠకులకు జ్ఞాపకముచేసెదను. విద్యావిహీనుడును, మన నాగరికతా ప్రపంచమునకు దూరస్థుడును, అగు ఆదిమనివాసునకు తన కులకట్టుబాట్టు

సాంఘిక ధర్మములనినచో బహుప్రీతి. వాటిని నిలుపుకొనుట కతడెట్టి కార్యమునకైనను వెనుదీయడు. ఆర్. డబ్ల్యు. ఫర్తు ఈవిషయమై వ్రాయుచు, మానుషశాస్త్రజ్ఞానము ఆదిమనివాసుల జీవితమునందలి అల వాటులను అవగాహనము చేసుకొని, వారి మనఃప్రవృత్తులను కనిపెట్టునని అభిప్రాయమిచ్చినాడు. అతడు ఈక్రింది ఉదాహరణను తెలుపుచున్నాడు. ఆఫ్రికాయందలి అషాంతి జాతివద్ద నొక బంగారు పీటయున్నది. వారు దానిని మహాపవిత్రముగా నెంచుదురు. దానిపైన అనాద్యి ప్రభువులైనను కూర్చొనుటకు వీలులేదు. దాని నెప్పుడును క్రిందపెట్టరు. ఒక ఏనుగ చర్మము భూమిపైనపరిచి, దానిపైన యుంచెదరు. అషాంతి ప్రజలు అది దైవదత్తమనియు, అందువలన మహాపవిత్రవంతమనియు పూర్తిగా నమ్మకము గలిగియుండిరి. 19 వ శతాబ్దము చివరిభాగములో చాలమంది బ్రిటిషు ఉద్యోగులు దానిని తమ స్వాధీనము చేసికొనుటకు ప్రయత్నించిరి. చివరకు ఒక గవర్నరు దానిమీద కూర్చుండుటకుచేసిన ప్రయత్నమే తరువాత జరిగిన యుద్ధమునకు ప్రధాన కారణమైనదట! కాబట్టి ఆదిమ నివాసుల జీవితములకు సంబంధించిన శాసనములు ఏవైన చేయవలయు నన్నచో వారి సాంప్రదాయములు, ఆచార వ్యవహారములు బాగుగా అవ గాహనము చేసికొనవలెను.

ప్రస్తుత సందర్భమున ఈత్రాగుడునుగూర్చి చర్చించెదను. ఉదాహ రణకు మధ్యరాష్ట్రములలోని అనాదిజాతుల విషయంచూతము. ఈ రాష్ట్ర మున ప్రతి జాతిగూడ మొట్టమొదట స్వేచ్ఛగా సారాయి తమంతట తామే తయారు చేసుకొనేవారు. కాని రానురాను ఈ విధముగా తయారుచెయ్య టము తప్పని శాసింపబడినది. “గోండు, బంజారా” వంటి జాతులలో వివాహసమయములయందు సారాయి అమితముగా వాడెదరు. చేతిలో డబ్బున్నచో, యీ జాతులన్నియు యదేచ్ఛగా సారాయి వాడుదురు. మధ్య పానము ఒక విధముగా ఈ అభాగ్యులను అధోగతిలోని కీడ్చినదని చెప్ప వచ్చును. ప్రభుత్వమువారు ఏర్పరచిన పద్ధతుల మూలముగా ఈ జాతు లలో కొంతవరకు త్రాగుడుమీదపెట్టు ఖర్చు తగ్గినదని చెప్పుటకెట్టి సందే హమును లేదు. కాని మొట్టమొదటి రోజులలో ప్రభుత్వమువారు త్రాగు డును తయారుచేయు నధికారము కొన్నికొన్ని ప్రదేశములలో కొంత మందికి ఇచ్చినారు. వీరు తిరిగి పెద్దసరి బేరముగా కొంతమందికి అమ్మ

వారు. సారాయిరేటుగూడ చాల స్వల్పముగా నుండెడిది. దీనిమూలమున గోండ్లలో త్రాగుడు అధికమై, ఇదిఒక త్రాగుడుజాతిగా పరిగణింప బడ్డది. దీనికితోడు అప్పటిలో ఏ ప్రదేశములోనైనను ఇన్ని షాపులుండవలెనను నిర్ణయములేదు. అందుచేత సారాయి ఎక్కడబడితే అక్కడ యథేచ్ఛగా అమ్ముడు పోయెడిది.

ఇట్టి పద్ధతులమూలమున మన అనాదిజాతులకు గల్గుచున్న అనర్థక మునుగమనించి ప్రభుత్వము మరియొకపద్ధతినిప్రవేశపెట్టెను. దీనినే "ఔటు స్టిల్" పద్ధతి అనెదరు. దీనిమూలమున కంట్రాక్టరు తన ప్రదేశములో కొన్ని షాపులకన్న అధికముగా తెరువకూడదు. అతనికివ్వబడిన ప్రదేశ విస్తీర్ణమునుగూడ తగ్గించినారు. దీని తరువాత "సాదర్ డిష్టలిరీ" పద్ధతిని అవలంబించినారు. దీనిమూలమున కొద్దికొద్దిగ సారాయి అమ్ముకొను లైసెన్సుదారులందరును తమ సారాయిని జిల్లా ప్రధానగరములలో తయారైనచోటనే కొనవలయునని శాసింపబడినది. దీని తరువాత "కంట్రాక్టు" లేక "మదరాసు" పద్ధతి ప్రవేశపెట్టబడినది. దీనిమూలమున సారాయిని తయారుచేయువారు కొద్దికొద్దిగా సారాయి అమ్మట నిషేధింపబడినది. అంతేగాక, కొద్దికొద్దిగా కొని అమ్ముకొనుటకుగాను ఇవ్వబడు లైసెన్సులు బహిరంగంగా వేలంపాటద్వారా యివ్వబడెడివి. వారికిమాత్రమే సారాయి తయారు చేయబడెడిది. కాని సరిగా రాకపోకలకు అనువుగాని ప్రదేశముల యందును ఏప్రదేశమునందు చౌకరకపుసారాయికి హెచ్చుగిరాకీయుండునో, అచ్చటమాత్రం "ఔటుస్టిల్" పద్ధతి జరుగనిచ్చినారు. "ఔట్‌స్టిల్" పద్ధతి మూలమునగూడ ఆదిమనివాసులలో త్రాగుడు ఎక్కువయినది. అంతేగాక హత్యలు, మానభంగము మొదలగు నేరములుగూడ అధికమయినవని బాలఘర్ డిప్యూటీ కమీషనర్ వ్రాసినాడు.

నిజమునకు ఇట్టి పద్ధతులను ప్రవేశపెట్టి, సారాయిధరను పెంచి, అనాది జాతులలో త్రాగుడు తగ్గించవలెననియే ప్రభుత్వముయొక్క యుద్దేశ్యము. దీనిమూలమున చిల్లరసారాయి దుకాణములు మూయబడినవి. కాని ఛాందా, ఛాటిస్‌ఘర్ మొదలగు ప్రదేశములలోని అదిమనివాసులలో అసంతృప్తి వ్యాపించినదని గ్రిగ్సన్ వ్రాయుచున్నాడు.

ఇట్టి పద్ధతులకు ఆదిమ నివాసులొప్పుకొనక తప్పినదికాదు. కాని దొంగతనముగ సారాయి తయారుచేయుట ఎక్కువైనది. 1936 లో ఇట్టి

నేరములు ఒక్క మధ్యరాష్ట్రములలోనే షుమారు 1750 పట్టుకొనబడినవి. అశాస్త్రీయముగా సారాయితయారు చేసినపుడెల్ల కఠినశిక్షలు, జరిమానాలు, విధింపబడినవిగాని, అనాది జాతులందు త్రాగుడు తగ్గించటముగాని, దొంగ తనముగా సారాయి తయారుచేయుటగాని, తగ్గింపబడలేదు. పైగా అధిక మైనది. దీనికంతకును కారణమేమిటి? ప్రభుత్యోద్యోగులు ఆదిమనివా సుల సాంప్రదాయములను, నమ్మకములను సరిగా అర్థము చేసుకొనక పోవుట ఒకటి. రెండవది, ప్రభుత్వం తన ఎక్సైజ్ పద్ధతులను చాల వరకు ఆర్థిక సూత్రములపై అమలు జీరుపుట.

అసలు ఆదిమనివాసుల ప్రదేశములలో సారాయి దొంగతనము చేసి నచో, పట్టుకొనుట గూడ దుస్సాధ్యము. మొరియా, కోయ. సవర, హో, భిల్లు, బంజారావంటి జాతులలో ప్రతి పండుగకు, వివాహమునకు. దేవతా కొలుపులకు, ఇంట్లోతయారుచేయు సారాయినే నుపయోగించ వలెననెడి కట్టుబాటుఉన్నది. ఈ కారణముచేతనే మధ్యరాష్ట్రములలోని మొరియాలకు ఉచితముగా కల్లుగీసుకొను లైసెన్సులు ఇవ్వాలనిగూడ ఇటీవల సూచింప బడినది. ఛాందాజిల్లా, సిర్‌హోన్‌కా తాలూకాలోని గోండ్లకు ఈప్రత్యేకపు హక్కు చాలాకాలమునుండి ఇవ్వబడినది.

అసలు దొంగతనముగ సారాయి కాచుకొనుటకు ఆదిమనివాసుల సాంఘికాచారములకు తోడు వారి యునికిగూడ దోహదమొసగినది. వీరు నివసించు ప్రదేశములన్నియు పర్వతమయములు, అరణ్య భాగములు, అచ్చట విప్పచెట్లు సమృద్ధిగా పెరుగును. రహదారి సౌకర్యములు అసలు లేవనియే తెలుపవచ్చును. మరియును ముఖ్యముగా పర్వతజాతులకు విప్పసారాయి కొన్ని సందర్భములయందు ఔషధముగా పనికివచ్చును.

ప్రభుత్వము ప్రవేశపెట్టు ఎక్సైజ్ విధానము వారి పద్ధతులకు, ఆచారములకు అనుగుణ్యముగా నుండవలెను. ఇంతేగాక, వారికి కావల సినరకము సారాయి ప్రభుత్వమువారివద్దనుండి దొరకకపోవుటవలనను, అసలు సారాయి ఆదిమనివాసులు భరింపజాలనంత అధికధరలతో అమ్మ బడుటచేతను, దొంగతనముగా సారాయిని తయారుచేయుట జరుగు చున్నది. అందువలననే యిట్టి అనవసరపు ఎక్సైజ్ నేరములు తగ్గుటకు గాను అరణ్యజాతులు భరించేటంత ధరలలో, వాళ్లకోరు సారాయిని తయారుచేయవలసినదిగా మధ్యరాష్ట్రములందలి ఎక్సైజ్ కమీషనరు

ఇ. ఎస్. హైడ్, ఐ. సి. ఎస్. గారు సలహా చేసియున్నాడు. అనవసరముగా క్షణక్షణము ఎక్సైజ్ పద్ధతులు మార్చుచో యీ జాతులకు అనేక కష్టములు కలుగుననికూడ ఆయనే స్పష్టపరచియున్నాడు.

ఆదిమనివాసులను సారాయి చెయ్యనియ్యకపోయినచో వారికిగల్గు నష్టములనుగురించి వారి శ్రేయోభిలాషి ఎల్విన్ * ఏవిధముగా వ్రాసినాడో తిలకింపుడు :

"కాంగ్రెసువారు మద్యపాన నిషేధచట్టమును అనాదిజాతుల ప్రాంతములలో ప్రవేశపెట్టమని స్పష్టపరచుట నిజముగా సరియగుపద్ధతి. ఆదిమనివాసులను మద్యము చేసికొనకూడదని శాసించుట లాభకరమగు గ్రామ పరిశ్రమను రూపుమాపుటయేగాక, కేవలము లాభముకొరకై లైసెన్సులు సంపాదించి అనాదిజాతులను ఆర్థికముగా దోపిడి సలుపువారికి ప్రోత్సాహకరమే యగును. ఈ దోపిడిమూలముననే ఆదిమనివాసులు భూమిని గోల్పోవుటయేగాక, యావజ్జీవము ఋణములో క్రుంగిపోవుటయు, చెడు ప్రవర్తనము కలవారితో సంబంధముకలుగుటయు, సంభవించుచున్నది (పాఠకులు మద్యపానముచే అనాదిజాతులందరును మరింత అధోగతిలో పడినారని గ్రహింతురుగాక).

"సారాయి ఆదిమనివాసుల పూజలు, తదితర శుభకార్యములయందు వాడబడు పదార్థము. పంటలు వృద్ధిపొందించుటకు సల్పు బిద్రే ఉత్సవమునందు, విత్తులపైని సారాయి జల్లెదరు. పెద్దపులి నోరుకట్టుటకును, పూజసల్పు మట్టివిగ్రహముమీద చల్లుటకును, తదితర భగవతారాధన సమయములందును, అనాదిజాతివారు సారాయి తప్పనిసరిగా నుపయోగింతురు. చనిపోయినవారి గౌరవార్థముగనేమి, వివాహసందర్భముననేమి, బహుమానార్థముగనేమి, కుల బహిష్కరణ విషయమున విధింపబడు జరిమానా రూపముననేమి, వేటాడుసమయమందేమి, నాట్యమాడుటకు ముందునేమి, సారాయమును తప్పనిసరిగా నుపయోగించి తీరెదరు.

"ఈ సందర్భములన్నిటియందును, సారాయము గృహములందే తయారుచెయ్యవలెను. వారి మాంత్రికుడు ముందుగా కొన్ని విప్ప పూలనుండి రసమునుపిండి, తక్కిన భాగమునందు కలిపి సారాయమును పవిత్రము చేయును.

* Verrier Elvin - Loss of Nerve Wagle press, Bombay.

"మధ్యరాష్ట్రములందలి ఆదిమనివాసులకు సారాయి రోగమును పుట్టించదు. అచ్చట నివశించు అసభ్యజాతీయుని జీవితము శుభరహితము. అతని భోజనముఎట్టిమార్పు లేనట్టిది. అతని బలము యావత్తు జ్వరము మూలమున కృశించినది. అట్టి సందర్భములలో సారాయి వారికి ఒకటానిక్‌గను, ఆకలిపుట్టించు నొక యౌషధముగను, ఉల్లాసము గలిగించునదిగను ఎంచబడును. ఎక్కడైతే సారాయి త్రాగనివ్వరో, అక్కడ ఆదిమనివాసులు హానికరములగు పదార్థములు, నల్లమందు. గంజాయి వాడుచున్నారు."

'ఫాదర్ ఎల్విన్' తనకు ఆదిమనివాసులపైగల సానుభూతివలననే పైవిధముగా వ్రాసినాడు. కాని ఆదిమజాతులను అసలు సారాయి త్రాగకూడదని శాసించుటెట్టి అక్రమమో, వారిని స్వేచ్ఛగా త్రాగనిచ్చుటగూడ అంత అక్రమమే. అందువలన గ్రిగ్సన్ తన బాలఘట్ రిపోర్టులో తెలిపినటుల, ఆదిమజాతులందలి కులపెద్దలతో అధికత్రాగుడు హానికరమని తెల్పి, వారిచేత యొప్పించవలెను. తరువాత వారి శుభకార్యములకు, తదితర పండుగలకు వారే స్వంతముగా సారాయి తయారుచేసుకొనుటకు అనుమతి నీయుటయు, తదితర సమయములందు వారు అధికముగా త్రాగుటకు వీలులేనట్లు తగు కట్టుదిట్టములు చేయుటయు, సమంజసము. దీనిమూలమున అనాదిజాతులందు త్రాగుడుతగ్గి, వారి ఆర్థిక దుస్థితి కొంతవరకు తొలగునని నా నిశ్చితాభిప్రాయము.

ఈ విషయములో ప్రభుత్వ చర్యలకుతోడు ప్రచారం అవసరం. ఇదిగూడ ముఖ్యమగు సాంఘికసేవ. ప్రచారము, ప్రజల సహకారము, లేని ప్రభుత్వచర్య విఫలము కాకమానదు. మనదేశమందలి 'హరిజన సేవక సంఘము' 'అఖిలభారత ఆదిమజాతుల సంఘము' మొదలగు సంస్థలు, మనసంఘమందలి పెద్దలు, దేశనాయకులు, ప్రభుత్యోద్యోగులు, తమదృక్పథము మార్చుకొని ఈ కార్యమునకు పూనినపుడే, ఆదిమనివాసుల అగచాట్లు తొలగును. అందుకనే:

"ఆదిమనివాసుని బాగుచేయదలచినచో, అతనిని సంస్కరింప ప్రయత్నింపకుము; అతనితో సంబంధముగల వైద్యుని, ఉపాధ్యాయుని, వర్తకుని, న్యాయవాదిని సంస్కరింపుము" అని వెరియర్ ఎల్విన్ వ్రాయుచున్నాడు.

## 8. అనాదిజాతులు - క్రైస్తవమత ప్రచారము

"క్రిందటి శతాబ్దపు మధ్యభాగములో, క్రొత్త మతమునకు చెందిన విదేశీయప్రచారకులు మనదేశమునకువచ్చి, ఆదిమజాతులు పురాతనభూతములను, దేవతలను కొలుచుటవలన సంభవించు నిరుపయోగతను గూర్చియు, తమ క్రొత్త మతముయొక్క ఉపయోగమును, అందమునుగూర్చియు, ఉత్సాహముతో బోధచేయసాగినారు" —— స్వర్గీయ శరశ్చంద్రరాయ్.

క్రైస్తవ మతమునుగూర్చి చర్చించుట అంత సులువైన పనికాదు. ఏలనన, ఈ మతప్రచారం ఒక వైపున ఆదిమనివాసుల జాతి విశిష్టతలను, ప్రత్యేకతలను, రూపుమాపినది. మరియొక వైపున కొంతవరకు వారిఆర్థిక దుస్థితిని చక్కబరచినది. ఒరోయిన్, ముండా జాతులనుగూర్చి వ్రాసిన శరశ్చంద్రరాయిగారు, క్రైస్తవ మతప్రచారము ఆజాతుల ఆర్థిక స్థితి గతులను బాగుపరుచుటయేగాక, విద్యాప్రచారముగూడసల్పి, ఆయాజాతులలో కొంతవరకు విద్యావిధానమును ప్రవేశపెట్టినదని వ్రాయుచున్నారు. కాని, వెరియర్ ఎల్విన్ మొదలగువారు ఈ మతప్రచారము మూలమున వివిధ జాతులకు తీరని ఇక్కట్లుగల్గినవని తెలుపుచున్నారు. శ్రీ. ఎ. వి. ధక్కరు బాబాగారు, మతప్రచారకులు కేవలము స్వార్థపరత్వముతో, జాతుల అవివేకతను, ఆర్థిక నిస్సాయతను ఆధారముగాగొని దుష్ప్రచారము సల్పుచున్నారని ఇటీవల "టైమ్సు ఆఫ్ ఇండియా" పత్రికలో నిర్మొగమాటముగ వాక్రుచ్చియున్నారు. అందుచేతనే, మతప్రచార విషయమై వ్రాయవలసి వచ్చినపుడు ఈ విషయములన్నియును మనస్సునందు పెట్టుకొనుట మంచిది.

అసలు, అనాదిజాతులలో క్రైస్తవమత ప్రచారము 19వ శతాబ్దము మధ్యభాగమునుండియే మొదలిడినది. ఈ మతప్రచారకులు వీలయినచోట్ల హిందూలేక పురాతన మతావలంబకులగు అనాదిజాతులకు క్రైస్తవమతమును అంటగట్టి, ధన్యులమయితిమని తమలోతాము పొగడుకొనెదరు. కాని, చాలవరకిట్టి మతస్వీకారము అసభ్యజాతులలో ప్రచారఫలితము మూలమునగాక, పాదరీల కుతంత్రములచేత, ఆయాజాతుల నిస్సహాయత, అవివేకములవల్ల, స్వప్రయోజనమునకే జరిగినదై యున్నది. చూడుడు : భద్రాచలప్రాంతమందు ఇది షుమారు 25 సంవత్సరములక్రితము జరిగినషయము - కోయజాతివా

డొకడు సంచితముగాని (Unreserved) అరణ్యభాగములలోనుండి ఒక నాడు పుల్లలు ఏరుకొని వచ్చుచుండెను. చేరువనే పొంచియున్న మిషనరీ యొకడు, పోలీసు జవానును బంపి అతని భయపెట్టవలసినదిగా కోరెను. పోలీసు కోయవానిని బట్టుకొని, ఆ కట్టెలను శాసనవిరుద్ధముగ సంచిత భూములనుండి దొంగిలింపబడినవనియు, తత్కారణము వలన అతనిని స్టేషనుకు రమ్మనమనియు. బాధించుచుండెను. ఈ నాటకమంతయు చూచు చున్న దొర ఏమియు ఎరుగనటుల బైటికివచ్చి, పోలీసువానిచేత అంతయు జెప్పించి, వినినట్లు నటించి, కోయవానితో "చూచితివా! క్రైస్తవమతమును స్వీకరించినచో నీకీయిబ్బందులు గలుగవుగదా!" అని వానిని ప్రోత్సాహ పరచెను. ఇది ఎంతనీచము! క్రీస్తుభగవానుని పేరుజెట్టి ఇట్టి అన్యాయ కార్యములకు పూనుకొనుట ఎట్టి ఆత్మవంచనమగు పని! ప్రచారముననే జాతులన్నియు, క్రైస్తవమత స్వీకారము చేసినచో, ఈ మతప్రచారకులకు 2½ కోట్లసంఖ్యగల ఆదిమనివాసులు నిశ్చయముగ కృతజ్ఞులై యుండెదరు.

ఇట్టి నాటకములు జరుగనిచోట మాత్రము ప్రచారకులు అనేక విధములుగ ఆదిమనివాసుల ప్రీతిని జూరగొనిరి. ఈ విషయమును తెలుపు చున్నప్పుడు మిషనరీ లందరు ఇట్టివారే అని తెల్పుట నా యుద్దేశ్యము గాదు; వారిలో కొందరు సహృదయులు లేకపోలేదు. వారి పరమావధి కేవలము ఈ అధఃపతితుల శ్రేయము. వారికి మాత్రమిట్టి అపనింద రాకుండుగాక!

ఇంతేగాదు; ఈ మిషనరీలు సల్పుచుండిన ప్రచారము చాలవరకు అనాదిజాతుల జీవితమును రూపుమాపినది; వారికి తమతమ ఆచారముల యందును, కట్టుబాటులయందును నిరాదరణ కలిగినది. ఎందుకు కలుగదు? అన్యమత నిరసనము, స్వమత పొగడ్తయు, ముఖ్యలక్షణముగా గల్గిన ఈ మతప్రచారకులు ఒకవైపున నిస్సహాయులగు జాతులకు ఆర్థిక సహా యముచేసి, ఆశలు చూపుచు, వేరొకవైపు క్రీస్తుభగవానుని గొప్పదన మును మార్మోగునట్లు చేయుటయేగాక, ఆజాతుల సాంఘికజీవన పద్ధతు లన్నియు అసభ్యములనియు, అపహాస్యయుతములనియు, తాళమువేయు చుందురు. సంస్కారహీనుడు ప్రస్తుత నాగరికతకు దూరుడు. మంచి, చెడ్డలను తెలిసికొనుటగూడ చేతగాని స్థితిలోనికి, మన సభ్యసంఘమున ద్రోసివేయబడిన ఆదిమనివాసికి ముఖ్యముగా రెండు విషయములు ప్రత్య

క్షములు: ఒకటి తన ఆర్థిక దురవస్థ; రెండు తన జాతీయజీవితము. సభ్యతా-బాంధవ్యము వలన—ఇదిగూడ చాలవరకు ఈ మత ప్రవ_క్తలవలననే జరిగినది—అతనికి తన జాతియొక్క ప్రత్యేకతలు, సాంఘిక నడవడులు, అర్థశూన్యములు, అనాగరికములుగా కన్పట్టినవి. తమ సమిష్టివిందులు, ఉత్సవములు, నాట్యములు మొదలగు పద్ధతులన్నియు అతనికి హాస్యాస్పదము లైనవి. దీనికితోడు, మిషనరీలు ఇచ్చుచుండిన ఆశాపూరితమును ప్రోత్సాహకరమును అగు బోధనలు, వీటినన్నిటికన్న భగవానుని పేరుతో ఇచ్చెడి బహుమతులు :

మహోశ_క్తి అతని జీవిత దృక్పథములో మార్పును దెచ్చుచున్నది: మతముకన్నను అతనికి ప్రత్యక్ష నరకమువలె కన్పడునదిఆర్థిక దురవస్థ, ఋణదాతలుపెట్టు ఒ_త్తిడి! జమీందారులు పెట్టెడిబాధ; మధ్యవర్తులు సల్పెడి ఘోరము ; కమీషన్ పద్ధతి; ఋణదాతలకు బానిసత్వము. వీటిని తెంచుకొనుట ఎట్లు ? మతమును మార్చుకొన్నమాత్రముచేత నష్టమేమి, తమ అవుసరములు తీరినతరువాత మరల "జాతీయ మతము" స్వీకరింపవచ్చును—ఈ ఆలోచనలతో కొందరు ఈ మతమును స్వీకరించిరి. మరికొందరు ఈ మతమును స్వీకరించుచో తమకు విద్యాప్రా_ప్తి గలుగునను ఆశతో క్రై_స్తవులయినారు. మరికొందరు తమ జాతినుండి బహిష్కరింపబడినవారు. వీరికి యీ మతమే దిక్కయినది. మరికొందరికి అప్పు-కావలసి వచ్చినది. కొందరికి ధనాశ. ఇన్నివిధములుగ క్రై_స్తవమతము అనాది జాతులలో వ్యా_ప్తిచెందినది.

ఏదైనను వీరి ఆర్థికదుస్థితిని కొంతవరకు తప్పించారు క్రై_స్తవస్వాములు. మన లంవాడీలలో ఈమతమును పుచ్చుకొన్నవారిలోనే విద్యావంతులు గలరు. వారిలో చాలమందికి స్కూలుమేష్టర్ల ఉద్యోగములివ్వబడినవి. ఎస్. సి. రాయి ఏమనివ్రాశాడో చూడుడు :

" తమ పురాతన దేవతలు, భూతములుతమ్ము తమ ఆర్థికదుస్థితి నుండి రక్షించలేదని కనుగొన్నారు ఒరోయిన్ జాతివారు. విదేశీయ ప్రచారకులచేత రక్షింపబడిన అన్యమత స్వీకారకులుమాత్రము కన్పించినారు. ఈప్రచారకులు ప్రస్తుత ఆర్థికదుస్థితినుండి వివిధజాతులను పూర్తిగ రక్షింపజాలకపోయినను, భవిష్యత్తులో కష్టములు వారికి రాకుండ కాపాడగలిగిరి." *

* Oraon Religion and customs Pg. 337.



ఛోటా నాగపూర్ సందలి ముండాయువకులు
**కే. శే. అనంతకృష్ణ అయ్యర్‌గారి 'లెక్చర్సు ఆఫ్ ఎత్నోగ్రఫీ' నుండి**

ఈ కారణమువలననే మతస్వీకరణచేసిన ఆదిమజాతులు తమ కోరికలు తీరగనే మరల తమ స్వమతమునందు చేరినారు।

ఈ విషయమునుగూర్చి చర్చించునప్పుడు ఎట్టి భ్రష్టత్వము గలిగిననూ, అది తృతీయశ్రేణికి చెందిన ఆదిమనివాసులకేనను విషయం మరచిపోకూడదు. ఎస్. సి. రాయిగారు చెప్పినటులు వ్యవసాయ జీవన మెరుగనటువంటిన్నీ, ఋణదాతల దోపిడీ అనుభవించనటువంటిన్నీ, బిరోహర్ మొదలగు జాతులలో మాత్రం యీ క్రైస్తవ మతప్రచారం వ్యాపించలేదు. చదువుచెప్పించి "జీసస్ భగవానుని సంతతివాడవు కమ్ము" అని మతము అంటకట్టినంత మాత్రముచేత, అనాది జాతీయుడు వృద్ధిలోనికి రాజాలడు. స్వార్ధపరత్వమువలనగాని, ఆశలు గొలుపుటవలనగాని, ఎక్కువ సంఖ్యాకులకు "బాప్టిజము" యిప్పించినచో తమకు ప్రమోషన్ వచ్చునను ఆశవలన గాని-సల్వే యీ పరిచారకుల ప్రచారము మూలముననే అనాది జాతులలో మిషనరీలంటే నమ్మకము తగ్గినది. ఇంతేగాక, ఆదిమనివాసుల ఆర్థిక నిస్సహాయతను యెవ్విధమున తమ స్వప్రయోజనముకొరకై యుపయోగించుకొనుచున్నారో, ఎ. వి. ఠక్కరుగారి * యీ క్రింది వాక్యములు స్పష్టపరచును:

"మాండ్లా మిషనరీలు సల్పుచున్న పెట్టుబడి వ్యాపారము కేవలము ఆదిమనివాసులను క్రైస్తవ మతమును స్వీకరింపచేయుటకే అయియున్నది. ఋణము తీర్చలేని చోటులందు అసభ్యుడు క్రీస్తుమత స్వీకరణకొప్పుకొనునేని, అప్పు యిచ్చినమొత్తమును వీరు వదలివేయుదురు. అట్లు స్వీకరించుట తిరస్కరించెనేని, దమ్మిడీలతో సహా న్యాయస్థానములో వసూలుచేయుదురు."

ఈ ప్రచారకులు ప్రథమ, ద్వితీయ, చతుర్థ శ్రేణులయందలి సభ్యులలో ఏవిధమగు పనియు చేయజాలకపోయినారు.

ఫాదర్ ఎల్విన్, తనుగూడ ఒక ప్రచారకుడైనప్పటికిని, ఈ మిషనరీల విషయమై ఉన్నదున్నట్లుగా చర్చించుట శ్లాఘనీయమగు విషయము. అతడేమనినాడు? క్రైస్తవ మతప్రచారకులు, జాతుల జీవితములోని సమస్యలను వారి సాంఘిక, విజ్ఞాన కట్టుబాట్లద్వారా పరిష్కరించుటకు మారు వారిని మరొక మతములోనికి మార్చి, వారిలో హానికరమైన కొత్తసమస్యను

* Thakkar's letter to the editor 'Times of India' 23-11-44

మరొకదానిని లేవదీయుచున్నారు. క్రైస్తవుడైన మరుక్షణమునుంచియే ఆదిమనివాసుడు తన జాతియందలి నైతిక, సాంఘిక హక్కులను గోల్పోవుచున్నాడు. అంతేగాక, అతడు పుట్టిపెరిగిన స్వజాతి ఆచారములను విసర్జించి, క్రొత్తపంథా త్రొక్కుటచేత ఆర్థికముగను, నైతికముగను చాల చిక్కులు పడుచున్నాడు.

పైగా, ఈజాతులలో చాలమంది హిందూదేవుళ్ళను కొలిచెదరు. సభ్యులు కొన్నిజాతులను తక్కువజాతి హిందువులుగా చూచెదరు; అనాదిజాతి సభ్యుడు సహితము, తనకేమయినను లాభము కలుగజేసినచో ఇంకా కొంతమంది క్రొత్త హిందూదేవతలను కొలుచుటకు వెనుదీయడు; హిందువులుసహితము అనాదిజాతి దేవుళ్ళను తమ 33 కోట్ల దేవతలతో బాటు కొలిచెదరు!

ఇటీవల వివిధజాతులయందలి క్రైస్తవమత ప్రచారవిషయమై నాకును, మరియొక మానుషశాస్త్రజ్ఞునకును సంభాషణ జరిగినది. ఆయన చేసిన సూచనలను ఈక్రింది విధముగ తెల్పవచ్చును: "మనదేశములో మిషనరీల ప్రచారం — దుష్ప్రచారంకావచ్చు — చేస్తూన్నమాట నిజం. దానిమూలముగా, జాతుల జీవితమునందు మార్పువచ్చినది. మీరు చెప్పినటులగా, వారి కధోగతిగనే పరిణమించినది; మిషనరీ ప్రచారము స్వార్థపరత్వముతోగూడినది. ఇంతేగాదు; చాలమంది క్రీస్తుమతము నవలంబించుచున్నారు; ఇది నిజమునకు మన భారతీయజాతికి తీరనికష్టము.... కాని నేనొక విషయమడిగెదను. మన దేశమందలి "హరిజన సేవా సంఘము" "Servants of India Society" *' "ఆర్యసమాజము" మొదలగునవన్నియు, ఈ జాతుల ఆర్థికాభివృద్ధికేల తమ కార్యక్రమమును మరల్పవు? వారిలోని విద్యావ్యాప్తికి అవి ఏమి ప్రయత్నములు సలుపుచున్నవి? మనవారు చేయనిపనిని మిషనరీలు చేసినారు; చేయుచున్నారు; చేయగలరు; వారిపై మనము నిందమోపుటేల? పైతెల్పిన సంఘములు కృషిసల్పి, జాత్యాభివృద్ధికి పాటుబడరాదా? వీరికొరకు కొంత ప్రజాధనమును వినియోగించరాదా?" ఈ మాటలన్నియును సమంజసముగనే యున్నవి. మన దేశీయసంఘములు ఈవిషయమై శ్రద్ధచూపకపోవుట

* ఇటీవల సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ; హరిజన సేవాసంఘము - ఆదిమనివాసుల అభ్యున్నతికి ప్రయత్నములు సలుపుచున్నవి.

శోచనీయమేగాని, క్రైస్తవమత ప్రచారము జాతుల అభివృద్ధికి దారితీసిన దనుమాట చెల్లుబడిగానిమాట; మన సంఘములుచూపిన అశ్రద్ధ ఎట్టి బాధాకరమో, స్వార్థపరత్వముతోగూడిన క్రైస్తవమత ప్రచారముకూడా అంతే బాధాయుతము.

నిజమునకు 2½ కోట్ల భారత ఆదిమనివాసుల సమస్యలపై శ్రద్ధ, బాధ్యత, ఉత్సాహము భారతీయులమగు మనకు పట్టలేదు. అందుకనే ఆంగ్లేయుడగు డబ్ల్యు. వి. గ్రిగ్సన్ ఏమన్నాడో చూడండి!

"మధ్యరాష్ట్రములందలి మొత్తము జనసంఖ్యలో ఆదిమనివాసులు 30 లక్షలని అంచనా వేయబడినను, ఇదివరలో వారు నిరాదరింపబడి, తమ హక్కులను సంరక్షించుకొనుటకుగాని, రాజకీయముగను, విద్యా విషయకముగను తమపాత్రను ఉచితరీతిని నిర్వహించుకొనుటకుగాని, వీలులేనంత అసమర్థులుగా, తయారయినారు. నిమ్నజాతీయులకుగాని, హరిజనులకుగాని అభివృద్ధిగల్గునటుల సల్పిన ప్రయత్నములలో పదవ వంతయినను ఆదిమనివాసుల విషయములో చేయబడలేదు."

## 9 ప్రభుత్వ ప్రచారము

తదితర విషయములన్నియు ముక్తసరిగా తెల్పవచ్చు. బ్రిటిష్ ప్రభుత్వం మనదేశంలో స్థాపింపబడిన తరువాత అనాది జాతులలోనుండు కొన్ని దురాచారములను రూపుమాపినారు. ఇది నిజమునకు న్యాయమగు పనియేగాని, ఏ జాతియందయినను నొక దురాచారము పోవలయునన్నచో ప్రభుత్వ శాసనములకన్న ప్రచారమువలననే బాగుగా జరుగును. ప్రచారముమూలమున ఆదిమనివాసులకు తమ జీవితమునందలి చెడు అలవాటులను జూపి, సహేతుకముగ వారిచేత ఒప్పించితిమేని అట్టి దురలవాటు నుండి వారిని తప్పింపగలము. అంతేగాని, బలాత్కారముగా ఏదైనను అమలులో పెట్టినచో ఆదిమనివాసులు తమ స్వేచ్ఛను గోల్పోయినటుల భావించెదరు.

మన దేశమునందలి గోండు, బంజారా వంటి జాతులలో నరబలి, మానవులను వేటాడుట, ప్రయోగం చేసినాడనే అనుమానంమీద చంపుట, మొదలగు ఘోరాచారములుండెడివి. ప్రభుత్వమీ క్రూరాచారము లన్నిటిని రూపుమాపినది, అదేవిధముగా ఒరిస్సాలోని ఖోండ్లలో వర్షాలకొరకు

ఒక యువకుని చెట్టుకు కట్టివైచి బుగ్గలమీద పిడికిలితో గ్రుద్దుచు చంపే ఘోరాచారము ఉండేది. అస్సాంలోని నాగజాతిలోగూడ మనుష్యుని వేటాడి చంపటం ఉండేది. ప్రభుత్వం వీటినన్నిటిని ఆపివేసినది. కాని తగు ప్రచారము సల్పకుండా బలాత్కారముగా, శాసన పూర్వకముగా వీటిని మాన్పించుటమూలమున ఈ జాతులకు ప్రభుత్వమంటే అసంతృప్తి, భయము గల్గినవి. అందుకనే డాక్టరు జె. హెచ్. హట్టన్, ఐ. సి. ఎస్. బ్రిటిష్‌పరిపాలన దేశములోని అనాదిజాతులకు లాభము కలుగచేయకపోగా, మంచికన్న, చెడుగే చేసినదని నిర్ణయముగా తెలిపినాడు.

కనుకనే ప్రభుత్వం ఆదిమనివాసులలో ప్రచారం చెయ్యవలసిన దని నా అభిప్రాయము.

## 10. ఆదిమనివాసులు - విద్య

"ఈ దేశప్రజలలో కలుగజేయు విద్యావ్యాప్తి పైననే దేశంయొక్క భవిష్యత్తు ఆధారపడి యుండును."

ఆర్థికముగ దురవస్థల ననుభవించుచున్న ఆదిమనివాసులలో విద్యా వ్యాప్తి ఏమైనను గలదా? అను ప్రశ్నహాస్యాస్పదముగ కన్పట్టును. ఏల యనిన, విద్యనేర్చుకొనుట కేవలము విజ్ఞాన సముపార్జనకొరకేగాక వ్యక్తి గతముగ మానవుని భావిజీవితమునందు ప్రయోజనకారిగ నుండవలెననెడి యుద్దేశ్యము ఈ రోజులలో వ్యాప్తమయినది. అట్టిచో పేదరికముచే బాధ పడుచు బాహ్యప్రపంచజ్ఞానమెరుగని ఆదిమనివాసులు విద్యయొక్క విలు వను, దాని ప్రయోజనమును ఈషణ్మాత్రముగూడ అవగాహనము చేసికొన జాలరు కదా!

భారతదేశ ఆదిమనివాసుల జీవితమునకు క్రైస్తవమత బోధకుల ప్రచారమెట్టి అపకృతి సల్పినప్పటికిని, వారి మూలముననే కొంతవరకైనను వీరిలో విద్యావిధానము ప్రవేశపెట్టబడినదని తెలుపవచ్చును. సామాన్య ముగ మతముపుచ్చుకొనిన హరిజనులయందే విద్యావ్యాప్తి ప్రత్యక్ష మగును. మన ఆంధ్రదేశమునందలి లంబాడీలలో చదువను, వ్రాయను నేర్చినవారిసంఖ్య బహు స్వల్పమే అయినను అది క్రైస్తవమత స్వీకార ఫలితమేనని చెప్పుటకు నేను వెనుదీయను. ఇంతేగాదు. సవర జాతి భాషకు లిపిని కనిపెట్టిన కీ. శే; గిడుగు రామమూర్తి గారికిని, వారి

కుమారులగు సీతాపతిగారికిని కొంతవరకు యీ మిషనరీలు సహాయపడి నారు. కనేడియన్ బాప్టిస్టు మిషనకుచెందిన మిస్‌మన్రోతోగలిసి శ్రీ సీతా పతిగారు సవరభాషలోనికి బైబిలులోని కొన్నిభాగములు అనువదించినారు. ఇంతేగాక, శ్రీ శరశ్చంద్రరాయ్*గారు గూడ ముండా, శాంతాలు, జాతు లకు క్రైస్తవ ప్రచారకుల మూలముననే కాస్తో, కూస్తో, విద్య అబ్బినదని తెల్పుచున్నారు. జె. సి. విష్లే అను జర్మన్ మిషనరీయొకడు 1869 లోనే ముండాభాష నేర్చుకొని, ముండా వ్యాకరణమును ఇంగ్లీషు భాష లోని కనువదించుటయేగాక, బైబిల్ నందలి కొన్నిభాగములు ముండా భాషలో తయారుచేసెను. ఇతడును, ఇతని సహోద్యోగులును యీ జాతుల విద్యావ్యాప్తికై పాటుబడిరి. దీనితరువాత వ్యాప్తమైన క్యాథలిక్ మిషన్‌వారు నేను లోగడ తెలిపినటుల ఆర్థికసహాయము మొదలగు పద్ధ తుల వలన అనేకమంది ముండా జాతీయులను క్రైస్తవులుగ నొనర్చిరి. అయినను వీరు సల్పిన విద్యాసేవ "ఆదిమనివాస చరిత్ర" యందు మరువ రానిది. ఛోటా నాగపూరులో పిల్లలకొరకు ఈ మిషనరీలు 140 కి పైగా స్కూళ్ళు తెరచిరి. ఆడపిల్లలకు ప్రత్యేకముగా బడులు నెలకొల్పినారు. ఇంతేగాక, 1908 వ సంవత్సరమున ఫాదర్ హాఫ్‌మన్ ముండా, ఒరో యిన్ జాతులకుచెందిన బాలురకొరకై నొక పారిశ్రామిక విద్యాలయమును తెరచిరి. అసలు ప్రజోపయోగముకొరకై కృషిసల్పిన మిషనరీలలో నొకనిని పేర్కొనకుండ ఉండజాలను. అతడేది. ఆబి. జెయె. డుబోయిస్. మన మదరాసు రాష్ట్రమునందు షుమారు 30 సంవత్సరములు నివసించి, సంస్కృత, తమిళభాషలందు చక్కని సాహిత్య జ్ఞానము సంపాదించి, మనదేశప్రజల ఆచార వ్యవహారాదులనుగూర్చి నొకగొప్ప గ్రంథము వ్రాసి నాడు. అంతేగాక, ప్రజలలో వ్యాపించిన మశూచిక జాడ్యమును పోగొట్టు టకై టీకాలపద్ధతిని వ్యాప్తిపరచినాడు. ప్రజల ఆర్థికదుస్థితిని రూపుమాపు టకై వ్యావసాయిక కేంద్రములు స్థాపించినాడు. ఇట్టివారు మనకెప్పుడును చిరస్మరణీయులు. అతడు మిషనరీయేగాని ప్రచారకులకున్నట్టి పరమత ద్వేషములేదు.

అసలు విషయమునకు వచ్చెదను. ఆదిమనివాసులలో విద్యావంతు లున్నప్పటికిని, వారు నేర్చుకున్న విద్యఎట్టిది ? జాతియొక్క విజ్ఞానము,

---

* S C. Roy. the Mundas and their country.

కళాకౌశలము, వ్యక్తపరుచుటకుకీవిద్య ఏమైనను సహాయ పడుచున్నదా? ఉదాహరణకు హో జాతిని గూర్చి ముచ్చటించెదను. వీరికి ప్రత్యేక భాష కలదు. వీరిలో కొందరు క్రైస్తవ మత ప్రచారము మూలమున కొంత మంది బాప్టిజం పుచ్చుకొని విద్యావంతులయినారు. ఈ జాతి పై పరిశోధనలు సల్పిన డి. ఎన్. మజుందార్ * వీరిలోనికి విద్యా వ్యాప్తిని గూర్చి వ్రాయుచూ, "ప్రేమికసదనములు" (Dormatories కాలక్రమేపి రూపు మాసి పోవుచున్నందున హో జాతిలోని బాలబాలికలకు వారిజాతికి సంబంచిన నడవడిలోను, వారిశిక్షణాపద్ధతిలోను, చాలమార్పు వచ్చినదని తెలియపర్చినారు. అంటే. కొంతవరకు విద్యాలయములు హో గ్రామములలో స్థాపింపబడుటమూలమున, జాతియందు ప్రబలియున్న నిరక్షరాస్యత కొంత వరకు నిర్మూలింప బడినదని తెలుపవచ్చును. కాని ఇట్లు విద్య నేర్చుకొనుటలోగల ప్రధానోద్దేశ్యము ఉద్యోగం సంపాదించుకొనుట. చాలమంది హో విద్యార్థులు ప్రాథమిక తరగతుల వరకు మాత్రమే జదివినారు. ఈజాతిలో షుమారు ఒక డజనుకన్న యెక్కువమంది మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణులయిన విద్యార్థులులేరు. ఈ జాతి సంఖ్య షుమారు $5\frac{1}{2}$ లక్షలు. ఈ విద్యార్థులకు పోలీసు డిపార్టుమెంటులోగాని, విద్యాశాఖలోగాని, ఉద్యోగములు సంపాదింపవలెనని యున్నది. పోనీ ఇలా హైస్కూలులోచదివిన వాళ్ళయినా ఆ జాతిలోని భాగ్యవంతులగు వారి కుమారులుమాత్రమే.

దీనినిబట్టి మనకు తేలెడి విషయములు మూడు: (1) అసలు జాతులలో విద్యఅనునది మృగ్యం, (2) విద్య నేర్చుకోడం ఉద్యోగము సంపాదించి తమ ఆర్థిక స్థితిగతులను బాగుచేసుకొనుటకే. (3) విద్యార్థులలో నయినా ప్రాథమిక తరగతులవరకు చదివిన వారే ఎక్కువ. కాబట్టి ఇట్టి విద్యమూలమున జాతులేవిధమున అభివృద్ధి పొందగలవు?

హోజాతిలో, స్కూలుఫైనల్‌వరకు చదువుకొనిన విద్యార్థియొక్క మానసిక పరివర్తననుగూర్చి మజుందార్ ఎటుల ఈక్రింది వాక్యములలో నిర్దుష్టముగా వ్యక్తపరచినాడో చూడండి. "పరీక్ష ప్యాసుఅయిన తరువాత 2 లేక 3 సంవత్సరములపాటు ఉద్యోగము సంపాదించుకొనుటకు విశ్వప్రయత్నములు సల్పెదరు. ఉద్యోగం లభ్యంకాకపోయినచో, తిరిగి తమ గ్రామాలుచేరి, తాము నేర్చుకొనిన విద్యను తూలనాడెదరు. గ్రామములకు

* A Tribe in Transition - Dr D. N Majundar

తిరిగి చేరినప్పుడు, తమ సంఘమును వృద్ధిలోనికి తీసుకొనివచ్చుట కెట్టి ప్రయత్నమును చేయరు. కారణమేమి? తమలో ఉత్సాహము, కోర్కెలు, రేకెత్తించిన విద్యావిధానము తమకేమియును ప్రయోజనకారి కాకపోవుటయే. ఇంతేగాదు. వీరు దేనియందయినను ప్రత్యేక అనుభవం గాని, ఏకళయందుగాని, పరిశ్రమయందుగాని ప్రత్యేకజ్ఞానము సంపాదించి, తమ భవిష్యత్ జీవితమునందు లాభము బొందలేరు. ఇంతేగాక, ఏ మనుష్యుల ఉనికిలో తాము నివసింతురో, వారితోబాటు తాము జీవితముగడుపలేరు. విద్య విద్యకొరకే అను ఆదర్శము, సమస్త సౌకర్యములుగలిగిన వారుమాత్రమే అవలంబించుటకు వీలగునుగాని, ప్రత్యేకముగా ఉద్యోగ వాంఛతో నేర్చుకొన్నవారి కదియొక గుదిబండయే అగును.... ఈకారణములచేతనే, ఈవిద్యావిషయము హో జాతిలో ఒక గొప్పసమస్య అయినది". ఏజాతియందు ఇట్టి ఇక్కట్లు గల్గుటలేదు? హో జాతియందలి విద్యమూలమున గలుగు ఆర్థిక నష్టములు 2½ కోట్ల సంఖ్యగల ఆదిమజాతుల కడగండ్లకు దృష్టాంతరమగుచున్నవి.

ఐనను, విద్యలేకపోవుట మూలమున ఈజాతులకు జరుగు నష్టము చాల ఎక్కువ. విద్య లేకపోవుటమూలముగానే షాహుకార్లు కాతాలపై కాతాలుపెంచి వీరిని ఆర్థికముగ దోపిడిచేయుచు సంఘమునందు ఎట్టి స్థానము లేకుండా చేయగలిగినారు. విద్యావిహీనతవలననే చిన్నఉద్యోగుల దుండగాలు యథేచ్ఛగా సాగుచున్నవి. విద్యలేకపోబట్టియే వీరిలో అజ్ఞానం ప్రబలి తమ జాతియొక్క అభ్యున్నతిని సైతము గమనింపజాలకున్నారు. విద్య లేకపోవుటమూలముననే ఆదిమనివాసులు తమ హక్కులను తెలిసికొనజాలకున్నారు. విద్యావిహీనత్వమువలననే అనాది జాతులు అన్నివిధముల అధోగతిపాలై పోవుచున్నారను విషయము నిస్సంశయముగ తెలుపవచ్చును.

ఆదిమనివాసులకెట్టి విద్యకావలయును? వారి ప్రాంతములందు ప్రవేశపెట్టబడు విద్యాలయము లెవ్విధమున నుండవలెను? ఈవిషయముపై ఎల్విన్ ఈక్రిందివిధముగా మూడుసూత్రములను ప్రకటించినాడు: (1) అనాదిమతమును, విజ్ఞానమును, ముఠావ్యవస్థలును, నిలుపునట్టిదియు, వానిని వృద్ధిలోనికి తెచ్చునట్టిదియు, (2) నాగరికతా సంఘమునందు ఏశక్తులు అనాదిజాతిని నాశనముచేయుచు, అధోగతిలోనికి ఈడ్చుకొని

పోవుచున్నవో, అట్టివానినుండి సంరక్షించుకొనుటయేగాక, క్షణక్షణము మార్పుచెందుచున్న ఈ ప్రపంచమునందు అనాదిజాతీయుడుగూడ తన పాత్ర నిర్వహణము సలుపుటకు వీలుకలిగించునట్టిది; (3) ఆదిమనివాసుల ఆర్థిక స్థితిగతులను వృద్ధిపరచునట్టిది. మొదటి రెండు సూత్రములు అవుసరములు. మూడవ సూత్రము అత్యవుసరము. అందుకనే డి. ఎన్. మజుందార్ "హోజాతిలోని విద్యార్థులు ఇప్పుడిప్పుడు తమ జాత్యవుసరములను గుర్తించుచున్నారు. అంతేగాక, వాటి నేవిధముగనైన నెరవేర్చుకొనవలయునను సంకల్పము గలిగియున్నారు. సింగభూమి జిల్లాలో, హోజాతి కేంద్రీకరింపబడియున్న "కొల్హాన్" ప్రదేశములోని విద్యాలయములు, కళలు, గృహపరిశ్రమలనుగూర్చి విద్యార్థులకు శిక్షణయొసగి ఆజాతి అభ్యున్నతికి దారిచూపరాదా ? విద్యార్థులకు వడ్రంగము, నేత, అద్దకము బుట్టలుఅల్లుట మొదలగునవి, శాస్త్రీయపద్ధతులపై వ్యవసాయముచేయుట, నేర్పరాదా ?" అని హెచ్చరించుచున్నాడు.

ఇది సక్రమమయిన పద్ధతే. ఏలనిన, ప్రస్తుత విద్యావిధానము మనదేశములో అన్ని సంఘములయందును అనవుసరమనియు, అప్రస్తుతమనియు, ప్రయోజనకారి కాదనియు నిరసింపబడినది. విద్యావిధానము కేవలము ఆర్థిక సూత్రములపైననే అమలునందు పెట్టబడుచున్నది. విద్యాలయములు, అందలి ఉపాధ్యాయ బృందము కేవలము డబ్బుకొరకు విద్యను విక్రయించుచున్నారు; విద్యార్థులు కేవలము డిగ్రీలకొరకు చదువుచున్నారు. కళాశాలయందు చదివినపిమ్మట విద్యార్థి కేవలము విదేశీయ ప్రభుత్వావుసరములకు పనికివచ్చు నొక వస్తువుగా తయారగుచున్నాడు; ఎప్పుడును ఉద్యోగపు గొడవే; తత్ప్రయత్నమే. దీని కంతములేదు. ప్రతిసంవత్సరము వేలకొలది విద్యార్థులు తయారగుచున్నారనే గోల. కాని లెక్కపెట్టినచో ఈ 1945 వ సంవత్సరములోగూడ నూటికి 12 మందికన్న విద్యార్థులు లేరనే విషయమునకు మనము సంతోషపడవలెనో విచారించవలెనో పాఠకులే తెల్పెదరుగాక ! ప్రస్తుతము మనదేశమందలి ముఖ్యసమస్య ఆర్థిక సమస్య. దేశమునందు జీవనదులు గలవు; సస్యశ్యామలము కాగల భూభాగములు గలవు. ఖనిజ సంపదయు అనల్పము; కాని వీటినన్నిటిని భారతదేశ భౌతికాభివృద్ధికి అనువగునటుల చేయ యత్నించు విద్యాధికులేరి ? బదులలో వారు జదివెడిదేమి ? విద్యార్థి భావి

జీవితమునం దీషన్మాత్రము కొరగాని విద్యా ప్రణాళికతో తయారగు విద్యాలయములలో నేర్చుకొనెడిదేమి? పరిశ్రమలా విదేశములు. శాస్త్రపాండిత్యమా అదియును విదేశీయులు పెట్టెడి భిక్షయే; మనకు తెలియనిదిలేదు; కాని మనము చేయునదియు లేదు; చేయజాలము. ఏదీ? ఒక్కసారి మన భారతీయులు విదేశీవ్యారమునందలి సలక్షణములను గ్రహించి, వాటిని మన అభివృద్ధికై అమలుపెట్టమనుడు? దేశములో ఒక బిర్లా గలడు; ఒక దాల్మియాగలడు; ఒక సింఘానియా గలడు; తాతా కంపెనీ ఉన్నది. విశాలమగు యీ దేశమునకు, 40 కోట్ల జనసంఖ్యతో నిండియున్న యీ గొప్ప ఉపఖండమునకు ఇట్టి సంస్థలెన్నికావలెను? ఒకవైపు విదేశీపోటీ, మరియొకవైపు పారతంత్ర్యము. అందుకనే డాక్టర్ శంకరన్ ఒకసారి మాట్లాడుతూ,

"భారతీయ శాస్త్రజ్ఞులు, విదేశీయ శాస్త్రజ్ఞుల వ్యావార పోటీ ప్రవాహమును అరికట్టజాలనిచో తమ పరిశోధనలు మూలబడవైచి, మంగలి దుకాణములు తెరచుట యుక్తము" అని తెలిపినాడు. (Indian science congress 1945 Speech delivered on the importance of social sicenoe.

ఈ కారణములచేత విద్యావిషయమై వ్రాయునప్పుడు ఈ సమస్య ఒక్క ఆదిమనివాసులకే చెందదు. సభ్య సంఘీయులకుగూడ అనువర్తించునని, తెలిసికొనవలెను. ఆదిమనివాసులకు ప్రత్యేకసమస్య లుండవచ్చును గాక! వారి ఆర్థికదుస్థితియు హృదయవిదారకమై యుండవచ్చుగాక! కాని దేశమునంతటిని ఒకే సమస్య క్రుంగదీయుచున్నది; ఇది ప్రత్యేకముగా ఒక జాతికి చెందదు. ఈ విషయములో ఇతడు ఆదిమ నివాసుడు, ఇతడు నాగరికతా సభ్యుడు అనే భేదములేదు. అందుచేతనే ఇట్టి సమస్య గలుగునప్పుడు మానుషశాస్త్రము, మానవుని జీవితమునంతయు అన్నిసంఘముల నుండియు పరిశోధించును. శాస్త్రజ్ఞుడు మానవుని విజ్ఞాన మంతటిని, మానవ సంఘములను పరిశీలించుటవలననే కనిపెట్టి గలుగును. తన పరిశోధనకు మనుష్యుని సాధనముగా గ్రహించును. అంతేగాని నేను మానుష శాస్త్రజ్ఞుడను; అందువలననేను ఆదిమనివాసులను మాత్రమే పరిశోధించెద" నని శాస్త్రజ్ఞుడు తెలుపజాలడు. మానవుని చరిత్రఅంతయు అతని సొత్తు.

కాని కొన్నికొన్ని సంఘములను శాస్త్రజ్ఞుడు తీసికొని పరిశోధించి మానవాభ్యుదయమునకు తోడ్పడుతాడు. ఇదేమానుషశాస్త్రమును చదువవలసినరీతి.

దేశమునకెట్టి విద్యాలయములు గావలెను? ఈ క్రింది వాక్యములే ఈ ప్రశ్నకు సమాధానము నొసగగలవు. "గ్రామావుసరములను తీర్చునట్టి అసంఖ్యాకములగు గ్రామపాఠశాలలే మనకు ప్రస్తుతం అవుసరము. ఈ పాఠశాలలు కేవలము ఉన్నతవిద్య గరిపేవాటికి ప్రాతిపదికలుగాగాక, స్వయం పోషకులై యుండవలెను. అవి వ్యాపారరీత్యా ఉండక నిజమగు విద్యా సంస్థలుగా నుండవలెను. సంఘమునకు వ్యతిరిక్తముగా నుండక, దాని జీవిత భాగముగా నుండవలెను." — డి. వెష్టర్‌మాన్

(The African too-day and tmarrow 19 9 Edition, page 219)

వార్ధా విద్యావిధానం మన పరిస్థితుల కనుగుణ్యంగాఉంటుంది.

ఇప్పుడు అసలు విషయానికి వద్దాము. ప్రస్తుతం ఆదిమనివాసులలో ప్రవేశపెట్టబడిన విద్య చాల అసంతృప్తి కరముగను, అగచాట్లు గల్గించునదిగను ఉన్నది.

అనాదిజాతుల ప్రదేశములందు ప్రవేశపెట్టబడిన విద్యఅంతయు జిల్లా విద్యా సంఘముల ఆధిపత్యము క్రిందనున్నది. ఈ సంఘములో నుండు సభ్యులు చాలవరకు అనాది జాతీయులను దోపిడిసల్పువారనే చెప్పవచ్చును. వారి ప్రయోజనము లెప్పుడును ఆదిమనివాసుల ప్రయోజనములకు వ్యతిరేకముగనుండును. పాఠశాలందలి ఉపాధ్యాయులు సమర్ధతలేనివారు. విద్యాలయములు జాతులు నివసించేగ్రామములకు చాలదూరములో కట్టబడి యుంటాయి.

ఇదివరకే అనేకసారులు ఎల్విన్ సూచనలను, వ్రాతలనుగైకొంటిని. ఇంక నొకటి రెండుసార్లు అతని నుదహరింపకుండ నుండజాలను. ఈ విద్యాలయములగూర్చి అందు నేర్పబడు విద్యనుగూర్చి అతడు "లాస్ ఆఫ్ నర్వ్ (Loss of Nerve)లో ఏమనివ్రాశాడో గమనింపుడు :

"ప్రస్తుత విద్యావిధానము అనాదిజీవితమును, ఆదిమ విజ్ఞానమును నాశనం చేయునట్టిది. వీరికొరకై తెరువబడు పాఠశాలలు పోలీసుస్టేషనులకు దగ్గరగానో, వాళ్ళగ్రామములకు దూరముననో కట్టబడుతవి. ఆదిమ విద్యార్థులు వెళ్ళు బడులలో వారిని అసహ్యించుకొను వారుండెదరు.

ఏర్పాటుచేయబడిన ఉపాధ్యాయులు పట్టణదృక్పథమును గల్గియుండెదరు. అందుచేత — ఈ "పశువుల" విజ్ఞానానికన్న తమ విజ్ఞానం ఉత్కృష్ట మైనదని అనుకొనెదరు. బడులలో ఇచ్చు సెలవులు, హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ పండుగుల కిచ్చెదరుగాని, ఆదిమనివాసుల పండుగుల కివ్వరు. పిల్లలకునేర్పు పాఠములు, పాటలు, వారిజాతి దేవుళ్లకుగాని, వారి జీవితానికిగాని సంబంధించినవిగావు. ఆంగ్లదేశపు వైస్రాయిల విషయమై తెలిపెదరుగాని, వారిజాతి నాయకులు, వీరులనుగూర్చి మాత్రమేమియు చెప్పరు. ఇంతేగాదు. వీరికినేర్పు విద్య వారి భాషలలో నేర్పరు. ఎప్పుడు తమ స్వభాషకు దూరులయినారో అప్పుడే తమజాతిలోని పాటలకు, కథలకు. కవిత్వమునకు దూరులైనారు. జాతీయోచితమగు అలంకారములను వదలివైచి, జుట్టు కత్తిరించుకొనుట, ఖాకీ చొక్కాలు మొదలగునవి తొడుగుకొనుట, నేర్చుకొనినారు. విద్య నేర్చుకొంటే సాధారణముగా ఆదిమవిద్యార్థి తనమురాలో క్రొత్తవానిగ భావించుకొని తక్కినవారికన్న అధికుడ ననుకొనును.

"అన్నిటికన్న అసభ్యజాతీయ జీవితమున ప్రస్తుత విద్యావిధానము కలుగజేసిన గొప్పమార్పు మరొకటి. వారి సంగీతము, నాట్యము రాను రాను క్షీణించుచున్నవి. కొంచమో, గొప్పో చదువుకొనినవారు తమ జాతీయ క్రీడలంటే ఏవగింపుతో చూచెదరు. దీనికితోడు ఈవిద్యాధికులు పట్టణాలలో కనపడు వినోదములను అవలంబించినారు. నాట్యమునకు బదులుగా జూదము తొంగిచూచుచున్నది. వాళ్ళజీవితములోనుండు చక్కని పాటలకుబదులు బూతుపదాలు మొదలగునవి వ్యాప్తమయినవి. స్కూళ్ళల్లో క్రొత్తక్రొత్త సాంఘికనడవళ్లు, అలవాట్లు ప్రవేశపెట్టినారు. అసలు యీ జాతులలో అస్పృశ్యతలేదు. స్త్రీలకు ఘోషాలేదు. విధవా వివాహములున్నవి. కాని స్కూళ్లున్నగ్రామాలు చూచినచో, మేష్టరు ఎట్లానడిచిన పిల్లలుగూడ అట్లాగే నడుస్తున్నారు. ఈ మేష్టర్లమూలమునసే అస్పృశ్యత, బాల్యవివాహములు ప్రవేశపెట్టబడినవి.

"పరీక్షలు పెట్టుట అనాదిజాతి బాలురకు అనవుసరము. దీనిమూలమున ప్రయోజనములేనిచేట భారతమంత విద్యాప్రణాళికలో కనీసభాగము చదువుట నేర్చుకొనుటవలన విద్యార్థులలో క్రమశిక్షణ, నడవడికాభివృద్ధి,

తగ్గినవి. ఇంతేగాక ఆదిమనివాసుల అలవాటులలో యేదియు క్రమముగా నుండదు. కాని అలవడుల వైపరీత్యములను ఉపాధ్యాయులు సైరింపరు."

వీటికితోడు ఉపాధ్యాయులు అప్పుడప్పుడు విద్యార్థులపై ప్రయోగించు శిక్షలు అతి దారుణముగా నుండును. పాఠశాలలో చదివిన ప్రతి పిల్లవాడు పిరికిపంధగా తయారగుచున్నాడు. ఒక ఉపాధ్యాయుడు కొట్టుట వలన పిల్లల దేహముపైని ఎర్రటి రక్తపుదెబ్బలు తేలినవి. ఒక ప్రభుద్ధుడు మరొక పిల్లవానిని తనగదిలోనికి లాక్కొనిపోయి బట్టలు ఊడదీసి బాదినంతవరకుబాది, ఒకచాకు తీసికొని మర్మాయములుకోసి నపుంసకునిగా చేస్తానని బెదరించాడు. భయంతో ఆ పసివాడు రెండురోజులవరకు రెండవ కంటికి కనుపించకుండా, మగ్గూర్. మరో దయామయుడు ఒక పిల్లవానిని కొడితే వాడు కక్కినాడు. వానిని మరీ బెదరగొట్టి ఆచార్యుడు వానితోడి పిల్లకాయలందరును గేలిసల్పుతుండగా, ఆ అసహ్య పదార్థాన్ని, ఆ నిర్భాగ్యునిచేత నాకించి, తరువాత వానిచేతనే శుభ్రం చేయించాడు.

ఇట్టి శిక్షలన్నియును సక్రమముగా పిల్లవాడు బడికి రానందుకే! ఎట్టి రాక్షసత్వము! ఈవిధమైన ప్రకృతిగల ఉపాధ్యాయులుచెప్పే చదువుఏమిటి? పిల్లలు నేర్చుకొనేదేమిటి? ఇట్టి విద్యావిధానముమూలముగా ప్రసాదింపబడే నాగరికత ఆదిమనివాసుల జీవితమాధుర్యమును చంపివేస్తున్నది. నిజముగా ఇది గొప్ప అపాయకరమగు విపత్తు. ఎస్. సి. రాయ్, డాక్టరు హట్టన్‌గారలు అందుకనే ఈ విద్యమూలముగా ఆదిమనివాసులకు తమ జీవితములపై వాంఛ తగ్గినదని సూచించినారు.

ఏమైనను, ఆదిమనివాసులకు ప్రస్తుతం యివ్వబడుచున్న విద్య ముఠాజీవితాన్ని, వ్యాయామక్రీడలను, సాంఘికాచారములను, ధర్మములను నాశనముచేస్తూ క్రొత్తక్రొత్త సమస్యలను లేవదీయుచున్నది. ఆదిమనివాసులను బాగుచేయవలయునన్నచో ఇట్టి విద్యావిధానాన్ని ఆపివైచి, వారి జీవితమునకు ఆర్థికముగను, మానసికముగను ఉపయోగపడు నూతన పంథాలతోగూడిన, విద్యావిధానమును ప్రవేశపెట్టవలెను. బీహారునందలి విద్యావిధానమునుగూర్చి ఏర్పరచిన షాకమిటీవారు ఏప్రదేశములలో నుండు ముఖ్యజాతుల భాషలు, ఆయా ప్రదేశములందలి పాఠశాలలో బోధింపవలయునని అభిప్రాయపడినారు.

గ్రిగ్సను తెలుపుచున్నట్లు, అసలు ఆదిమజాతుల విద్యాపాలనను జిల్లాకౌన్సిళ్ళనుండి తీసివేసి, ప్రభుత్వము తనపరము చేసికొనవలెను. ఇంతేగాక, సామాన్యముగ ఆదిమబాలుర పాఠశాలలలో ఆదిమ ఉపాధ్యాయులనే ఏర్పాటుచేయవలెను. ఎల్విన్ చెప్పినట్లు పాఠశాలా భవనములు సైతము, ఆజాతి కనుగుణ్యమగు ఫక్కీలో నిర్మింపవలెను. ప్రతి పాఠశాలయు ఒక విద్యార్థివసతిగృహముగా నుండవలెనని అతడు అభిప్రాయపడుచున్నాడు (Boarding house). జాతులపాటలు, మొదలగువాటిని పరిశోధకులు సంపాదించి, వాటిని సజీవముగా నొనర్పవలెను. మాతృభాషలద్వారా బోధన జరుపవలెను, లోగడ తెలిపినటుల విద్యార్థులకు భవిష్యత్ జీవితమున ఉపయోగపడులాగు కళలు, గృహపరిశ్రమలు, మొదలగువానియందు శిక్షణ నొసగవలెను. నిర్మాణ కార్యక్రమమునందలి నూలువడకుట ప్రవేశపెట్టవచ్చునుగాని, గోండులవంటి జాతులలోగల కుల నియమములవలన, అట్టిది నిర్బంధముగా నేర్పరుపరాదు. గోండ్లలో నూలు వడుకుట అనునది బహిష్కృతము.

ఇటీవల రాయల్ ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్‌వారు ప్రత్యేకముగా నొక National Museum జాతీయ ప్రదర్శనశాలము, చిత్రకళా సంస్థయు, జాతీయ వైజ్ఞానిక సంఘము (National cultural Trust) మొదలగునవి తెరచి, భారతజాతీయౌన్నత్యమునకును, చారిత్రకముగా మరుగుపడిన విజ్ఞాన సంపదకును దోహదమొసగ నిశ్చయించుటెంతయు శుభకరము. ఈవిషయమై ప్రసంగించుచూ Dr శ్యామప్రసాద్ ముఖర్జీగారీ విధమున నుడివినారు.

"ఈ అఖిలభారత సంస్థలు, స్వతంత్ర స్వపరిపాలనాయుతములై, ప్రభుత్వ సహకారముతో కార్యనిర్వహణము సల్పవలెను. కాని ఇవిఅన్నియును వివిధ విజ్ఞాన శాస్త్రములయందలి నిపుణులవలన ఏర్పరుపబడి, నిర్వహింపబడవలెను. వీరందరును భారత జాతీయ "జీవితమును,నాగరికతను, పునఃప్రతిష్ఠించి సజీవముగా నొనర్పవలెను."

— డాక్టరు శ్యామప్రసాదముఖర్జీ
(హిందూపత్రిక, మద్రాసు 7—2—45)

మానుష శాస్త్రమునకు ఆదిమనివాససమస్యలకు, చేయూత నిచ్చుచున్న ఈ రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారు, భారతదేశ ఆదిమనివాస విద్యావిధానమును గూర్చి ఆలోచింతురుగాక!

## 11. కర్తవ్యము

ఆదిమనివాసుల జీవితము, పైనదెల్పిన విధముగ దుఃఖభూయిష్టమై అధోగతిలో మునిగియుండవలసినదేనా? చాలాకాలమువరకు ప్రభుత్వము గాని, దేశనాయకులుగాని ఈ విషయమై శ్రద్ధ గైకొనలేదు. మన సభ్య ప్రపంచమునందు ప్రవేశపెట్టబడిన సివిల్ పరిపాలనా పద్ధతితో ఏవిధమగు సంబంధములేకుండా జాతులు నివశించు ప్రదేశములను రెండు భాగముల క్రింద చేసినారు. అవే ఎక్స్‌క్లూడెడ్ ఏరియాలు, పార్షియల్లీ ఎక్స్‌క్లూడెడ్ ఏరియాలు: వీటికి ఐ. సి. యస్. ఆఫీసరులను కమీషనర్‌లగా ఏర్పాటుచేసెదరు. మన మదరాసు రాజధానిలోని పోలవరం ఏజన్సీ, విశాఖపట్టణం ఏజెన్సీ, మొదలగునవి పార్షియల్లీ ఎక్స్‌కూడెడ్ ఏరియాల క్రిందికి తేబడ్డవి. వీటికి సామాన్యముగా సబ్‌కలెక్టరు కమీషనర్‌గా ఉండును.

ఈ జాతుల భావి అభివృద్ధినిగూర్చి ఇటీవల ప్రభుత్వమునందును దేశనాయకులయందును, కొంత సంచలనము కలిగినది. కాంగ్రెసువారి ప్రోత్సాహము మూలమున అఖిలభారత దొంగజాతుల సంఘంవంటి సంస్థలు బయల్వెడలినవి. మహాత్మాగాంధీ నిర్మాణ కార్యక్రమంలోగూడ ఆదిమ నివాసులసమస్య ఒక భాగమయినది. ఇటీవల శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు తేజ బహద్దూర్ సప్రూగారికి ఈ ఆదిమనివాసుల భౌతికాభివృద్ధిని గూర్చియు, విజ్ఞాన రక్షణ గూర్చియు, శాసనపూర్వకముగా కట్టుదిట్టము లనుచేయవలసినదిగా నొకలేఖను వ్రాసినారు. తత్ఫలితముగా సప్రూకమిటీ రిపోర్టులో ఆదిమనివాసులకు 3 స్థానము లొసగబడినవి.

అసలు అనాదిజాతుల ఉన్నతినిగూర్చి అనేకులు భిన్నభిన్న సలహా లిచ్చినారు. అందులో మొదటిది వీరందరికిను స్థాన భ్రష్టత్వం కలిగించి మైదానములకు తీసికొనివచ్చుచో, తన్మూలమున సభ్య ప్రపంచముతో వైజ్ఞానిక బాంధవ్యము కలిగి, అభ్యున్నత స్థితికి వత్తురనునది. కాని యీ సలహాను అమలునందు పెట్టినచో, ఆదిమనివాసులకు తీరనిఇక్కట్లుగల్గును.

ఈ విజ్ఞాన బాంధవ్యమూలముననేగదా తృతీయ శ్రేణియందలి రెండుకోట్ల మందియు పెక్కిడుములు పడుచున్నారు? ఎల్విన్ తెలిపినటుల, ఇట్లు ఈ జాతులను తమ యునికినినుండి తప్పించి మైదానములలో ప్రవేశపెట్టినచో ఆర్థిక అగచాట్లు, నైతిక హీనత్వము, దైహిక నిరుత్సాహము మొదలగునవి సంభవించును. అసలీ సలహాలు గొప్పగొప్ప పారిశ్రామిక వర్గములకు లాభకారియని ఎల్విన్ తెలుపుచున్నాడు. ఆదిమనివాసులు తమ స్థావరములను వదలివేసినచో, అరణ్యముల యందుండు ఖనిజములు, పర్వతములు మొదలగు వాటిపైన ఈ పారిశ్రామిక వర్గములకు ఏ విధమైన ఒత్తిడి, కష్టములేకుండా హక్కులు యేర్పడతవనే ఆశ వీరికి వున్నదని అతడు సూచించినాడు.

ఇంతేగాక, పర్వతములను, అరణ్యములను ఆదిమ నివాసులకు దూరముచేసినచో, వాళ్ళస్వేచ్ఛా నడవడి రూపుమాసిపోవును. ఈ ప్రదేశములన్నియు ఘోర మృగములకును, దోపిడి గాండ్రకును ఆశ్రయమిచ్చును. లక్షలకొలది ఎకరములు ఆదిమనివాసుల జీవనోపాధికై ప్రత్యేకించినచో, అసలే జీవనము జరగక నిరుద్యోగముతో బాధపడుతూ కాలము వెళ్ళబుచ్చుచున్న సభ్య ప్రజలలో క్రొత్తసమస్యలను లేవదీయుచూ, సంఘమందలి ప్రస్తుత ఆర్థిక విధానమును పాడుచేయును. దీని మూలముగ దేశములో దారిద్ర్యం ఎక్కువగును. ఇంతేగాక ప్రభుత్వ దృష్ట్యాచూస్తే ఆటవిక శాఖవారికి కావలసిన కూలీలసహితం దొరకరు. కాని ఈ విషయమంత ముఖ్యంగాదు.

అసలు ఆదిమనివాసుల విషయములో ఏ సలహా చేసినను అది ఆ జాతుల పరిస్థితులకు, ఉనికికి అనుగుణ్యముగా నుండవలెను. అందుకొరకై మానుషశాస్త్ర పరిశోధకులు దేశమునందలి జాతుల జీవితము లన్నిటిని సమగ్రముగా పరిశీలించి తమ నివేదికలను పంపవలెను. ఇట్టికార్యము గ్రిగ్సన్, ఎల్విన్ వంటివారు మాత్రమే పూనుకొనినచో, శుభప్రదమగును. ఏలనన, ఎవరు జాతుల పరిశోధనకు బూనుకొనెదరో, వారికి ఆ జాతుల పైనను, వారి విజ్ఞానమున్నను నిజమైన సానుభూతి యుండవలెను. వీరికది యున్నదని తెలుపవచ్చు. ఎస్. సి. రాయ్‌గారు చనిపోవుట ఆదిమ నివాసుల దురదృష్టము.

ఈవిషయములో ప్రభుత్వముగూడ సహకారము, శ్రద్ధ చూపించవలెను. లేకపోయినచో జాతులసమస్య తేలదు. దేశమునందు ఈజాతుల సేవకై తమ జీవితమును ధారబోయుచున్నవారు లేకపోలేదు. వారిని పేర్కొనుటకు చోటుచాలదు. మన ఒక్క ఆంధ్రదేశములోనే చాలమంది గలరు. ప్రభుత్వమువారు వీరికి కొంతవరకు సహాయము చేయవలెను. ఈ మానుషశాస్త్ర పరిశోధనలకు తగిన చేయూతనివ్వవలెను. అనాదుల సమస్య ఇటీవల హైద్రాబాద్‌వంటి సంస్థానములలో ప్రభుత్వదృష్టి నాకర్షించుట శుభసూచకము. కాని ప్రభుత్వము ఆదిమనివాసుల విషయములో ప్రతి ప్రయత్నమునకు మానుషశాస్త్రజ్ఞుని సలహా తీసుకొనుట శాస్త్రీయ రీత్యా వారి జీవితములను పునరుద్ధరించుట యగును.

దురదృష్టవశాత్తు, మనదేశములో మానుషశాస్త్రజ్ఞులపై కొన్ని అపవాదులు గలవు. ముఖ్యముగా ప్రభుత్వమేర్పరిచిన ఎక్స్‌క్లూడెడ్ ఏరియాలపద్ధతి ఈ మానుషశాస్త్రజ్ఞులమూలముగా పెట్టబడినదనిన్నీ, జనాభా లెక్కలు వేయునప్పుడు హైందవమతానుయాయులగు ఆదిమ నివాసులను హిందూమతమునుండి వేరుచేయుటలో వీరికిగూడ కొంత పాత్ర ఉన్నదనియును, తరువాత ఆదిమనివాసులను జంతుప్రదర్శనశాలలో తమ పరిశోధనలకు ఉపకరించులాగున, ఒకజాతిగా ఏర్పరుచుట మానుష శాస్త్రజ్ఞుని అభిలాషయనియు — ఇట్టి దురభిప్రాయములు మన సంఘము నందలి విద్యావంతులలోనే వ్యాపించియున్నది — కాని ఇట్లా అనుకొనుటకు కొన్ని కారణములున్నప్పటికిని అది పొరబాటు. మానుషశాస్త్రజ్ఞులకు ఆదిమనివాసుల అభ్యుదయముపైననే ఆసక్తిమెండు. ఒకవేళ కొన్ని కారణములుండినను. అవి శాస్త్రజ్ఞుల చర్యలకు సంబంధించినవిగావు. భారతీయులలో మానుషశాస్త్రమన్నను, శాస్త్రజ్ఞులన్నను ఏవగింపు గలుగుటకు మన ప్రభుత్వం కొంతవరకు కారణమని తెలుపవచ్చును. మొదటినుండియు మానుషశాస్త్ర పరిశోధనలు క్రమశిక్షణబొందిన శాస్త్రజ్ఞులచేగాక, ఉద్యోగుల, మతబోధకుల వలన జరిగినవి. అవి అయినను, అసంపూర్తిగను, పూర్ణపరిశీలనతోకూడినవిగాక క్రింది ఉద్యోగస్థులిచ్చిన విషయములపై ఆధారపడి కేవలము జాతులలోనుండు మూఢనమ్మకములు, అలవడులు మొదలగువాని వర్ణనలతో నిండియుండెడివి.

హిందూ మతానుయాయులగు ఆదిమనివాసులను ప్రత్యేక మతాను యాయులుగా జనాభా రిపోర్టులోచేర్చుట అనుదానినిగూర్చి ఎల్విన్ ఈ క్రిందివిధమున వ్రాయుచున్నాడు :

"భారతదేశమునందలి అనాదిజాతులన్నియు, ఒక్క అస్సాం ప్రాంతం మినహా, మతవిషయములో హిందూదేవతలను, అందును ముఖ్యముగా శివపూజావిధానమును కొలుచుచున్నారు. జనాభా లెక్కలలో వీరినందరిని హిందువులవలెనే పేర్కొనవలెను."

• ఇంతేగాక "మతకారణములపైని ఆదిమజాతులను హిందూమతం నుండి వేరుపర్చవలెననెడి ప్రయత్నములు హెచ్చుగా నిరసింపబడినవి. ఉద్యోగీయులయొక్కయు, మతప్రచారకులయొక్కయు, కొంతవరకు శాస్త్రజ్ఞులయొక్కయు ప్రయత్నములు ఇవి. ఇదివరలో జనాభాలెక్కలు ఆదిమ నివాసుల మతమును "ఆనిమిజమ్" (పురాతన జంతువృక్షపూజలు, బలుల పైన ఆధారపడిన మతము) అనీ పేర్కొనినవి. తరువాత 'ఆదిమ మతానుయాయులు' అని అనార్యజాతులు పిలవబడుచున్నవి. ఇల్లా భేదం చూపుట అర్థశూన్యము. ఎందుకంటే, తనకేమైన భౌతికలాభం కన్పిస్తే ఆదిమనివాసి హిందూదేవుళ్ళను కొలుచుటకు సంకోచించడు. అంతేగాక, హిందువులుసైతం తమ 33 కోట్ల దేవతలతోపాటు కొన్ని ఆదిమదేవుళ్లను గూడ కొలుస్తారు. జనాభా లెక్కలవారు శాస్త్రీయంగా నిరుపయోగమై కేవలము రాజకీయ కారణములుగలవైన మత లెక్కలను ఎందుకు ఇంకా వదలుటలేదో తెలియకుండా వున్నది."

ఇంతేగాదు. ప్రతిజనాభా లెక్కల సమయమునందును, ఈ జాతులను హిందూమతస్థుల క్రింద జమ చేద్దామని, హిందూ మత ప్రచారకులు, మహమ్మదీయులుగాను, క్రైస్తవులుగాను, నొనర్చెదమని ముస్లిమ్ క్రైస్తవ ప్రచారకులు. చాల ఉత్సాహం చూపిస్తున్నారట ! కాని ప్రభుత్వ దృష్టిలో వీరి ప్రయత్నములు న్యాయవిరుద్ధములు. అందుచేతనే గాబోలు 1941 లో బేతూలు జిల్లాకలెక్టరు హిందూమత ప్రచారముచేయుచున్న ఒక కాంగ్రెసు సేవకుని గోండ్లను హిందువులుగా మార్చుటకు ప్రయత్నము చేసినచో శిక్షింతునని భయపెట్టినాడట !

(ఎల్విన్ - Loss of Nerve)

పాఠకులారా! ప్రభుత్వమా, మానుష శాస్త్రజ్ఞుడా - దీనికి ఎవరు కారణము?

ఐతే ఆదిమనివాసుల హక్కులను సంరంక్షించుటయే శాస్త్రజ్ఞుల ప్రధాన సమస్యయని ఇప్పుడందరివలనను అంగీకరింప బడినది. అందువలన ప్రభుత్వము శాస్త్రజ్ఞులు కనిపెట్టిన సిద్ధాంతములను అమలుజరిపి, ఫలితములకై నిరీక్షింపవలెను. ఇంతేగాక ఇతరదేశములయందు ఆదిమజాతి సమస్యలు ఏ విధముగ పరిష్కరింపబడ్డవో గూడ గమనింపవలెను, ఆఫ్రికాలోని 'International Institute of African Languages' వంటి పరిశోధనా సంస్థలను దేశమునందంతటా నెలకొల్పి మానుషశాస్త్ర పరిశోధనలకు ప్రోత్సాహమివ్వవలెను. చూడండి సర్. రోజర్ లుమ్లీని* ఇంగ్లండులోని విద్యాలయములలో ప్రాగ్దేశ విజ్ఞాన, చారిత్రకశాఖ సంఘమునకు అధ్యక్షునిగా ఎన్నుకొనినారు. మనదేశములో అటువంటి సంస్థయేది?

ఇంతేగాక ఈ జాతుల పరిపాలనా నిర్వహణమును కేంద్ర ప్రభుత్వమునందు ప్రత్యేకశాఖా పరము చేయవలెను. ఈ పరిపాలనకు ఎవరు ఆదిమనివాసుల యెడల సానుభూతిని కలిగియుండి, వారి జీవిత విశేషములను గ్రాహ్యం చేసుకొనెదరో, వారినే నియమింపవలెను. విశ్వవిద్యాలయములు, విదేశములోవలె నొక సిబ్బందిని తయారు చేయుటకు బోధన చెయ్యవలెను. ప్రభుత్వం వీరికి ప్రోత్సాహమివ్వవలెను. అంతేగాక, ప్రతి రాజధానియందును ఆ ప్రాంతములందలి జాతుల ఆచార వ్యవహారములు, విజ్ఞానములయందు శాస్త్రీయముగ పరిశోధనలుసల్పి, అవగాహనము చేసుకొనిన శాస్త్రజ్ఞుల సహాయముతో ఎబొరిజినల్ అండ్ బాక్ వర్డు క్లాసు డిపార్టుమెంటు నొకటి నెలకొల్పి (Aboriginal and Back-ward class Department) ఆశాఖపైన బాగుగా అనుభవజ్ఞానముకలిగిన ఒక ఉన్నతోద్యోగిని నియమించవలెను.

"ఈ పద్ధతివలన విద్యాశూన్యుడై, సాంఘికముగా వెనుకబడినటువంటి ఆదిమనివాసుని నాగరికతా సంఘములో ఉపయోగకరమైన పౌరునిగా తయారుచేయుట కొకమార్గము ఏర్పడును."

— ఫ్రీ ప్రెస్, మద్రాసు (19–12–44)

---

* Ex - Governor of Bombay Province.

## 12. వివిధరాష్ట్ర ప్రభుత్వాల వైఖరులు

1935 ఇండియా ఆక్టు సెక్షన్లు 52, 92 ల ప్రకారము ఆదిమనివాసుల ప్రదేశములు ప్రత్యేకింపబడి 8 గవర్నరుల ప్రత్యేకాధికారములక్రింద నుంచబడినవి. ఐతే పార్షియల్లీ ఎక్స్క్లూడెడ్ ఏరియాలపై అధికారము మాత్రము ఆయా రాజధానులలోని మంత్రులపరము చేయబడినది. కాని ఈ జాతులకు సంబంధించిన శాసనములు రాష్ట్రీయ శాసనసభలు చేసినప్పటికిని వాటిని అమలునందుపెట్టు విషయములోగాని, మార్పుచేయుటకుగాని గవర్నరుదే బాధ్యత.

ఆయితే ఇటీవల ప్రజాభిప్రాయము ఆదిమనివాసుల సమస్యలపై కొంతవరకు మరలుటవలనగాని, లేక ప్రభుత్వపరిపాలనా వైఖరిలో కొంత మార్పువచ్చుట వలనగాని రాష్ట్రప్రభుత్వములు ఈ జాతులను వీలయినంతవరకు ప్రత్యేక పరిపాలననుండి తప్పించి మామూలు పరిపాలన క్రిందికే తీసికొని రావలయునను సంకల్పము గలిగినది.

రాష్ట్రీయ గవర్నరునకు ప్రత్యేకం జాతులసమస్యను పరిష్కరించుటకు తగిన తీరుబడిగాని, అవకాశముగాని, అనుభవముగాని యుండదు. అందుచేత ఆదిమనివాసులు ఎక్కువగా వ్యాప్తిపొందిన రాష్ట్రములలో ఒక ప్రత్యేక ఉద్యోగిని నియమించి, వీరి స్థితిగతులను సర్వవిధములా విచారించి గవర్నరునకు తెలియబరిస్తే అతడు జాతుల అభివృద్ధికి అనువైన పద్ధతులు ప్రవేశపెట్టుటకు వీలుకలుగును.

కాని ఈ సలహా లెంతవరకు ఆచరణీయములైనవి ? రాష్ట్రవారీగా యీ సమస్యపైన భిన్నాభిప్రాయములు బయలుదేరినవి. కొన్ని రాష్ట్రములలో ఈ సలహాకు ఒక విధముగా అనుగుణ్యమగునట్టి సంస్కరణలు ప్రవేశపెట్టినారు.

ఒరిస్సాలో 1940 * లో యీ జాతుల విషయమై విచారించుటకు ఏర్పరుపబడిన సంఘము ఒక ఇండియన్ సివిల్ సర్వీసునుండిగాని, లేక ప్రొవిన్షిల్‌య సర్వీస్‌నుండిగాని, ఒక ప్రత్యేకోద్యోగిని నియమింపవలెనని అభిప్రాయమిచ్చినది. అతడు ముగ్గురు సహాయోద్యోగులు, మరియు ప్రధానమంత్రి లేక గవర్నర్ సలహాదారుడు అధ్యక్షుడుగానున్న సలహా

---

* ఎ. వి. ఠక్కరు బాబాగారి అధ్యక్షతక్రింద ఒకకమిటీ ఏర్పరుపబడినది.

సంఘము-వీటి సహాయముతో ఈ జాతుల సర్వతోముఖమగు అభివృద్ధిని గూర్చి నిమ్నజాతీయుల అభివృద్ధిశాఖ నొకదానిని ఏర్పాటు చేయవలెనని అభిప్రాయ మిచ్చెను.

మధ్యరాష్ట్రములందలి కాంగ్రెసుమంత్రులు ఆదిమ జాత్యుద్ధరణకై ప్రత్యేక ప్రభుత్వశాఖ నొకదానిని ఏర్పరుపవలెనని సంకల్పించిరి. ఈ శాఖకు "ప్రొటెక్టరు ఆఫ్ ఆబొరిజినల్సు" అను ఉద్యోగిని నియమించి, ఈ ఉద్యోగము ఎక్సైజ్ కమీషనర్‌ హోదాతో కలుప నిశ్చయించిరి. ఈ సందర్భముననే గ్రిగ్సన్ తన అమూల్యమగు నివేదికను తయారుచేషి వాడు. ఈ సూచనల నమలునందు పెట్టకపూర్వమే, రాజకీయ కారణముల వలన మంత్రులు రాజీనామా యిచ్చినారు.

బీహారులో రాజకీయముల యొత్తిడిమూలముగా ఆదిమనివాసుల యొక్కయు, నిమ్నజాతుల యొక్కయు శ్రేయస్సుకై, రాంచీని ప్రధాన కార్యస్థానముగా ఏర్పరచి,, ఒక ప్రత్యేకోద్యోగిని నియమించి, అతనిని చోటానాగపూరు, శాంతాలు పరగణాలలోని అనాదిజాతుల విషయం చూచునట్లు చేసినది ఆరాష్ట్ర ప్రభుత్వము.

బెంగాలు రాజధానిలో రెవెన్యూబోర్డు సభ్యుడు ఈ జాతుల అభి వృద్ధినిగూర్చి పనిచేయుటకు ప్రత్యేకముగా గవర్నరుచే నియమింపబడెను.

అస్సాము ప్రభుత్వము ఉద్యోగిని నియమింపలేదుగాని, నాగజాతు లను గూర్చి గొప్ప పరిశోధనలు సల్పిన జె. పి. మిల్సు. గారిని గౌరవ ఎత్నోగ్రాఫర్‌గా నియమించినది.

బొంబాయి రాజధానిలో ప్రత్యేకముగా బాక్‌వర్డు క్లాసు డిపార్టు మెంటు గలదు. దీనికి కొంతకాలము డి. సైమింగ్‌టన్ అను ఆయన అధికారిగానుండి, బొంబాయి రాష్ట్రమునందలి కొండజాతులపై నొక నివేదిక తయారుచేసినారు.

మన మద్రాసు రాజధానిలో ప్రత్యేకముగా ఆదిమనివాసులనుగూర్చి ఉద్యోగిని నియమించుటకు ప్రభుత్వము ఒప్పుకొనలేదుగాని, లేబర్ కమీష నర్ తమ విధులకుతోడు ఈ జాతులనుగూర్చి కొంత బాధ్యత వహించి నారు. మరియును, రెవిన్యూబోర్డువారు తమ నివేదికయందు జిల్లా కలె క్టరులు పంపిన జాతుల స్థితిగతుల రిపోర్టులను చర్చించెదరు.

పంజాబ్ సంయుక్త రాష్ట్రము ఈ జాతుల ప్రసక్తియే పట్టించు కొవలేదు.

స్వదేశీ సంస్థానములుగూడ కొన్ని ఇటీవల జాతుల సమస్యను గూర్చి యోచించుట శ్లాఘనీయము. సంస్కరణలు ప్రవేశపెట్టవలెననే కుతూహలముతో తిరువాన్కూర్ ప్రభుత్వము Protector of Back-ward classes అను ఉద్యోగిని నియమించి అరణ్యశాఖ పోషణక్రింద ఆదిమనివాసులను ఏర్పరచినారు. హైదరాబాద్‌లోగూడ ఇటీవల బారెన్ హైమండార్ఫుగారి సలహా ననుసరించి అమూరాబాద్ పీఠభూమియందలి అరణ్యభూమి యంతయు చెంచువాళ్ళకి రిజర్వుగా ప్రకటించి, కీర్తిగణించింది, ఆ సంస్థాన ప్రభుత్వము.

ఇదీ, భారతదేశ ఆదిమనివాసుల క్లుప్తచరిత్ర.



## తృతీయభాగము

# కొన్ని తిరుగుబోతు, ద్రిమ్మరి, దొంగ జాతులు

## (Nomads, Vagrants and Criminals)

"Most criminal tribes are Vagrant, but all Vagrant tribes are not criminal and I think many of the latter become criminal in absence of opportunities for honest livelihood ······· criminality and Vagrancy are not inherited like insanity or feeblemindedness."

— Dr. D. N. Majumdar M. A., Ph. D
from his essay on 'Some Vagrant Tribes of Northern India'

"చాలా దొంగజాతులు ద్రిమ్మరిజాతులే. కాని ద్రిమ్మరిజాతులన్నీ దొంగజాతులుగావు; వాటిలో చాలజాతులు నిజాయితీగా జీవించుటకు అవకాశములు లేకపోబట్టే, దొంగజాతులగుచున్నవని నా అభిప్రాయము. నేరము, ద్రిమ్మరితనము ఈ రెండును పిచ్చి, చపలత్వములవలె వంశ పారంపర్యములుగావు".

— డి. ఎన్. మజుందార్.

## ఉపోద్ఘాతము

మనదేశమందలి తక్కువజాతి వాళ్ళలో కొన్ని సంసారములకు ఇళ్లు, వాకిళ్లులేవు. అసలుకొన్ని సంసారములకు ఇళ్ళు అనేవే అవుసరము లేదు. ఇలాంటి కులాలవాళ్ళు గుంపులుగుంపులుగా, ఊరూర తిరుగుచు, ముష్టి ఎత్తిగాని, లేక ఇతర వృత్తుల వలనగాని, జీవించుచున్నారు. ఎక్కడైతే ప్రశాంత యుతమగు జీవనోపాధి దొరకదో, అక్కడ మాత్రము చిన్నచిన్న దొంగతనములు, ఎప్పుడైనా పెద్దపెద్ద నేరములు సల్పి జీవితము వెళ్ళబుచ్చుకొంటున్నారు.

ఇలాంటి ఇళ్లువాకిళ్లులేని తిరుగుబోతుల సమస్యను ప్రభుత్వము ఎంత త్వరపడి పరిష్కరిస్తే, సంఘమునకంతమంచిది. లేనిచో, వీళ్ళలో చాలామంది నేరములుచేయుటయే ప్రధానవృత్తిగా అవలంబించి, సంఘము నందలి శాంతి, భద్రతలను పాడుచేయుచున్నారు. ఇటీవల జరిపిన పరిశోధనలవల్ల ఇట్లా నేరములు చేసేవాళ్ళలో చాలామంది తమకు శాంతియుత జీవనము గడుపుట కవకాశములున్నచో, నేరములు అసలు చేయరనియే తేటతెల్లమగుచున్నది.

వీళ్ళేగాక చాలామంది దిమ్మరజాతులు స్థావరమగు జీవన పద్ధతులు గాని, నివాసముగానిలేక, దేశమంతటా వ్యాపించియున్నవి. వీరి సంఖ్య షుమారు 10 లక్షలని అంచనా వేయబడినది. శాస్త్రరీత్యా చూచినచో జాతి సాంకర్యము హెచ్చు. అందువలననే దేశమునందలిముఖ్యజాతుల లక్షణములన్నియు వీరిస్వరూపములలో కన్పట్టును. ఈ కారణముచేతనే వీరందరును ఏజాతికి చెందుతారో నిర్ధారణచేసి చెప్పటం బహుకష్టము. వీళ్ళందరు మన సంఘములో 'నీచ జాతులు'గా చూడబడు చున్నారు. వీళ్ళందరూ "ఇండో - ఆర్యన్" విజేతలచేత నీచవృత్తులలోనికి తీసికొని రాబడ్డారని శాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు.

ఐతే సభ్యతా సంబంధం మూలముగనేమి, ప్రజా దృక్పథమునందు మార్పు వచ్చుటచేనేమి, వీళ్ళల్లో చాలమంది ఇప్పుడిప్పుడు స్థిర నివాస మేర్పరచుకొని శాంతియుత జీవితములు గడుపుచున్నను, కొందరు మాత్రము సాంప్రదాయకమైన తిరుగుబోతు పద్ధతులనే అవలంబించుచు, గ్రామ గ్రామములకు తిరుగుచూ, గారడి, లేక సర్కస్‌పనులు చేసిగాని, కూలినాలి చేసుకొనిగాని, పొట్టపోసుకొనుచున్నారు.

నిజమునకు పూర్వకాలంలో, ఈ తిరుగుబోతులందరు మన దేశ చరిత్రయందు ప్రాధాన్యత వహించినారని చెప్పక తప్పదు. ఒకప్పుడు హైందవ గ్రామజీవనమునకు ఎంతో సహాయపడి చైతన్యమును కలిగించిన వాళ్ళే. ఆరోజులలో - కాస్తో, కూస్తో-ఇప్పుడుకూడ అంతే - మనపల్లెటూళ్ళల్లో, వీళ్లే సంగీతముపాడి, భట్రాజు గీతాలుపాడి, జ్యోతిష్యముచెప్పి, మందు మాకులిచ్చి, ప్రజాలోకాన్ని ఆశ్రయించుకొని వుండేవాళ్లు. ప్రతి గ్రామానికి వీరు అప్పుడప్పుడు వెళ్తూ, నాట్యాలు, భట్రాజు గీతాలుపాడి,

ప్రజలకు సంతోషం కలుగజేస్తూ ఉండేవాళ్లు. కొందరు సర్కస్ పనులు చేసి వినోదం కలిగించేవాళ్ళు.

ఐతే ఈ రోజుల్లో, పారిశ్రామికాభివృద్ధి మూలంగానైతేనేమి, ప్రజలలో ఒక విధమైన నూతనభావము కల్గుటవల్లనేమి, ఈ జాతులను ఆశ్రయించటము తగ్గినది. దానిమూలంగా వీళ్ళందరకు జీవనోపాధి తగ్గిపోయి, క్రమేపీ దొంగతనము చెయ్యటం, దార్లుకొట్టటం మొదలగు నేరాలు చెయ్యటం సాగించారు. అందుచేతనే చాలా జాతులు క్రిమినల్ (దొంగ) జాతులుగా పరిగణింప బడినవి. కాని పోలీసువారు తగు కట్టుదిట్టములు చేసి వీరిబాధ కొంత తగ్గించినారు.

పై తెల్పిన రెండురకములవాళ్ళే గాక, పెద్దపెద్ద పట్టణాల్లో ఏవిధమైన పని పాటలు చెయ్యక, ఏ వరండాలోనో, రోడ్లమీదనో, తిరుగుచూ కాలక్షేపం చేసేవాళ్లు చాలమంది ఉన్నారు. వీళ్ళల్లో బలిష్ఠులు లేకపోలేదు. వీళ్ళకు ఏపని చెయ్యటమన్నా ఏవగింపు. ఊరక తిరుగుచూ ముష్టెత్తిగాని, కేపుమారీ, జేబు కత్తిరింపులుచేసిగాని, జీవిస్తారు. వీళ్ళదొక ప్రత్యేక సమస్య.

ఈ జాతుల నిస్సహాయత, తిరుగుబోతుపద్ధతులు, నేరప్రవృత్తి - ఇవన్నీగూడ వీళ్ళను సంఘములో అధములుగా చేసివైచినవి. సభ్య సంఘంలోను, ప్రభుత్వంలోను వీళ్ళంటే అసహ్యం, ఏవగింపు మెండు. మనదేశములో యేవోకొన్ని మిషనరీ సంస్థలుతప్ప ప్రభుత్వంగాని, ప్రజాసంఘములుగాని వీరి విషయమై శ్రద్ధ వహించకపోవటం విచారకరమైన విషయము. ప్రభుత్వమువారిచే చిత్తూరువంటి జిల్లాలలో ప్రవేశపెట్టబడిన 'సెటిల్‌మెంటు' పద్ధతి ఈ జాతులకు తగినంత ఉపకారము చెయ్యజాలక పోయినది. అందుచేతనే శాస్త్రయుతమగు పరిష్కారమునకు ప్రభుత్వం పూనుకొనవలెను. ఈ తిరుగుబోతుజాతుల భావి అభివృద్ధినిగూర్చి ప్రభుత్వము ఏపద్ధతియైనను అవలంబించక పూర్వము వారి మానసిక ప్రవృత్తులు, సాంఘిక, ఆర్థికవ్యవస్థలు, బాగుగా అవగాహనం చేసికోటం అత్యవసరం. సాంఘికముగాను, ఆర్థికముగాను ఈ జాతులు పడుచున్న యిక్కట్లు అసంఖ్యాకములు. ఈ నేరగాండ్రందరును సంఘమునకు ఉపయోగకరమైన పౌరులుగా తయారుచేయట ప్రభుత్వము చేయవలసిన కనీసకర్తవ్యము.

వీళ్ల స్థితి చాలా శోచనీయమగుట యేగాక, ప్రస్తుత ఆర్థికవిధానమునకు సైతము వీళ్లు తగకుండా యున్నారు.

ఈ తిరుగుబోతులు, పనీపాటలులేనివాళ్లు, శాస్త్రజ్ఞులకు, ప్రభుత్వమునకు బహు జిగిబిగియైన సాంఘిక, మానసిక, రాజకీయ, జాతీయ సమస్యలను కలిగించుచున్నారు. వీళ్ళనుగూర్చి క్రమపరిశోధనలు జరిపినచో వాళ్ళ సాంఘిక, పంచాయితీ విధానములు, ప్రకృతులు తెలియుట మాత్రమేగాక, మన దేశీయజీవితములో వారి వైజ్ఞానిక, ఆర్థిక పాత్ర నిర్వహణముగూడ అవగాహన మగుచుండును.

ఇటీవల మద్రాస్ కార్పొరేషను కమీషనర్ జె. పి. ఎల్. షినాయ్ గారు, ఈ 'బీదవాళ్ళను' గూర్చి ఆలోచించి, వాళ్ళకొరకై నిధులను ప్రోగుచేయుట సంతోషకరమైన విషయం. ఆయన చేయుచున్న విజ్ఞప్తి సమంజసమే. కాని మద్రాసులోఉన్న ఈ తిరుగుబోతులు దేశమంతటా వ్యాపించిన 10 లక్షల తిరుగుబోతులలో ఎన్నోవంతు? అందుకనే ప్రజా శ్రేయస్సునకై, ఈ జాతుల భవిష్యత్తునకై, ప్రత్యేకకృషి సల్పాలి. ఇది 20 వ శతాబ్దము. ప్రజాదర్శములందు, ఆలోచనలయందు, క్రొత్తపోకడలు కన్పించుచున్నవి; ప్రపంచములో నూతనమై, "సర్వేజనాస్సుఖినో భవంతు" అనే సిద్ధాంతముపై, నూతన ప్రపంచ వ్యవస్థలు రాబోవుచున్నవి. నవీన సాంఘికాదర్శములు ఎల్లప్పుడును ఏదో మార్పును, శక్తివంతమగు మార్పును, మానవుల ఆలోచనలను – ఆదర్శములను సంపూర్ణముగా మార్చునట్టి శక్తిని, కోరుచున్నవి. ఎందులకు? జాతీయ విభేదములతో ప్రసక్తిలేని సార్వజనీన కళ్యాణముకొరకు, అభివృద్ధికొరకు, శ్రేయస్సుకొరకు. *

ఈ విషయములో ప్రభుత్వమున కొకమనవి చేసెదను. ఆచరణ యోగ్యమగు మానుషశాస్త్ర జ్ఞానము, ఈ తిరుగుబోతుల కష్టనిష్ఠూరములను రూపుమాపుటకు ప్రయత్నము సల్పును. అందుకనే ఈ శాస్త్రమునకనుగుణ్యముగా ప్రభుత్వము ఈజాతుల అభివృద్ధికి ప్రత్యేకశాఖ నొకదానివి నెలకొల్పి, వాళ్ళ కష్టసుఖాలను కనిపెట్టి అవి ఎంతవరకు ప్రభుత్వ చర్యలవలన నిర్మూలింపబడునో చూచి, ఇంకను ఎట్టి కార్యము లమలు

*From My essay on "The Problem of the criminals, nomads and Vagrants" - The Liberator Madras 12-12-44.

నందు పెట్టవలెనో యోచింపవలసినదిగా కోరుచున్నాను. ఆర్థికముగ ఈజాతుల స్థితిగతులు బాగుండెనేని, వీళ్ళందరు నేరగాండ్రుగా తయారగుటకు సంసిద్ధులుగారని నా యభిప్రాయము :

## 2. దిమ్మరులు

రెండవభాగములో ఉనికినిబట్టి చూచినచో జాతులలో దిమ్మరులు గూడ నుండిరని తెలియునుగదా! వారి విషయమై క్లుప్తముగా వర్ణించెదను. వీరు ఉత్తరహిందూస్థానములో — అంతవరకెందుకు? మన ఆంధ్రదేశములోనూ — ఎక్కువగా కన్పించుచున్నారు. చూడండి. బుడబుక్కలవాళ్ళు, నూనెగుడ్డలవాళ్లు, గంగిరెద్దులవాళ్లు, దొమ్మరివాళ్లు, పాములవాళ్లు, బైరాగులు, మొండిబంతవాళ్లు — ఎంతమంది? వీళ్ళంతా ఊరూరా తిరుగుచూ, ముష్టెత్తి జీవిస్తారు. వాళ్ళకి నావి అనేవల్లా, మట్టిపాత్రలు, చింపిరిగుడ్డలు; వెదురుగడలు.........మాత్రమే!

వీళ్లు బహు పేదవాళ్ళగుటవలన కార్లలోగాని, రైళ్ళలోగాని ప్రయాణం చెయ్యజాలరు. సామాన్యంగా వీళ్ళలో కొంతమంది గాడిదెలను, పందులను పెంచుతారు. గాడిదెలమీద తమ సామానులను వేసుకొని భార్యాపిల్లలతో ఊరూరే తిరుగుతారు. వీళ్ళనుచూచి, ప్రఖ్యాత పరాసు మత వ్యాపకుడు దీ ఆబి. జె. ఎ. డుబోయిస్ ఇలా వ్రాస్తున్నాడు :

"భర్త నెత్తిమీద, బుజాలమీద, గుడారం, చిన్నచిన్న మట్టిపాత్రలు, తినుబండారములు మోసుకొని పోతుంటే, భార్య వీపుమీద పసిపిల్లవానివి వేసుకొని, తలమీద ధాన్యం దంపుకొనే రోకలి మోసుకొని వెళ్తుంది. వీళ్ళిద్దరి వెనుకనే వాళ్ళ పెద్దకుమారుడు వస్తువులన్నీ కావడిమీద వేసుకొని, భారంచేత వంగుతూ నడుచుచుండును."

ఈజాతులన్నీ పూర్వకాలం పశువులను మేపుకోడంవల్లగాని, ఇతర వృత్తులవల్లగాని, కాలక్షేపం చేసేవారు. వారి ముఠా నాయకులలో కొంతమందికి ఎద్దులు, గాడిదెలు, బత్తెలు ఉండేవి. అంతేగాక, వీళ్ళెప్పుడూ 10, 20 కుటుంబాల జట్లుగాకలిపి ప్రయాణం చేసేవాళ్ళు. ఇప్పుడు గూడా, ఇట్లే ఊరూరా తిరుగుతారు. వెదురుకర్రలువంచి, వాటిమీద ఈతాకుచాపలు కట్టిన గుడిశెలే వీరి గృహాలు. అవిఅయినను బహు చిన్నవి. ప్రతి కుటుంబమునకు 4 లేక 5 అడుగుల వెడల్పు, 7 లేక 8

అడుగుల పొడుగు, 3 లేక 4 అడుగుల ఎత్తుగల గుడారములు ఉంటవి. వీటిలోనే తల్లి, తండ్రి, పిల్లలు, వాళ్ళు పెంచే పందులు — అంతా కట్టకట్టు కొని పడుకుంటారు.

ప్రస్తుతకాలంలో వీరిస్థితి చాలా శోచనీయముగా యున్నది.

వీరి పేదరికమే, వీరి అసభ్యపు అలవాటులే, వీరిని సంఘములో అధములుగాచేసినవి. సభ్యప్రజలకు వీరినిచూస్తే ఏవగింపు; అసహ్యము * ఒక్క గోమాంసం మినహా ఈ దిమ్మరిజాతులన్నియు, ఎలుకలు, పిల్లులు నక్కలు, పాములు, కాకులు మొదలగు అసహ్యపదార్థములను తినెదరు. స్త్రీ పురుషులు అమితముగా త్రాగుతారు. దొంగతనముగా సాగాయి తయారుచేసే ప్రబుద్ధులుగూడా వీళ్ళల్లో ఉన్నారు. త్రాగుటకు డబ్బు లేకపోతే, పెళ్లాలను కుదువబెట్టి అప్పుతెచ్చుకొనే దురాచారంగూడ వీరిలో ఉన్నది. వ్యభిచారంమూలంగా వీరిలో కొన్నిజాతులు డబ్బు సంపాదింతురు.

ఈ జాతులలో ప్రతిజాతికి ప్రత్యేక ఆచారవ్యవహారములు, నడవడులు, నిబంధనలు గలవు. ఏజాతికి ఆ జాతే స్వతంత్రముగాను, తక్కిన వాటితో సంబంధం లేకుండాను కాలం వెళ్లబుచ్చుకొంటారు. వారికులాల కనుగుణ్యముగా వారు తమ న్యాయచట్టం నిర్మించుకొనెదరు. వారిజాతిలో జరిగే వ్యవహారాలు, బయటి ప్రపంచమున కేమాత్రమును తెలియనీయకుండ రహస్యముగ జరుపుకొనుట గొప్ప విశిష్టత.

ప్రతిజాతికి కులపంచాయితీ ఉండును. ప్రతి పంచాయితీకి ఒకనాయకుడుండును. కులమంతా గలిసిగాని లేక అధికసంఖ్యాకుల ఇష్టప్రకారంగాని అతడు ఎన్నుకోబడతారు; వాళ్లే అతనిని త్రోసివేయవచ్చును. అతడే కులపెద్ద. కులములో జరిగే సమస్త వ్యవహారములపైనను అతనిదే బాధ్యత. కుల నిబంధనలను సక్రమముగా అమలు జరిపించుట అతని విధి. సామాన్యంగా కులతప్పులు జరిమానా రూపకంగాగాని, కులంలో నుంచి వెళ్ళగొట్టటంవల్లగాని, పరిష్కరింపబడును.

---

* ఈ జాతులన్నీ ఏ విధముగా దొంగజాతులుగా చూడబడుచున్నవో రోగడ ప్రకరణములో తెల్పబడినవి.

## 3. ఉత్తరదేశమందలి కొన్ని తిరుగుబోతు జాతులు

(అ) నట్ జాతి; నట్ జాతి వాళ్ళు ఎద్దులను, గాడిదలను పెంచెదరు. వీటి మీద సామానులను పడవైచి, ఊరూరా తిరిగెదరు; ఏదైన నొకఊరిలో యాగినచో, ఊరికి దూరముగా గుడెసెలు వైచికొని, గారడీ, మొగ్గలువైచి, దంత వైద్యులుగా పనిచేసెదమనియు, పురుషులకు మందులిచ్చి వారిని యౌవనవంతులుగా చేసెదమనియునమ్మించి, సొమ్ము గుంజి వేసెదరు; తమ మూలికల యొక్క ప్రాముఖ్యత వర్ణించుటకై ప్రత్యేకముగా కొందరిని నియమించెదరు. అంతేగాక, అదృష్టం కోసము తాయత్తులుకూడ కట్టెదరు; కాని ఒక రకమైన వేరుతో పాడైపోయిన దంతపు చిగుళ్ళనుంచి విషక్రిములను లాగివేయడములో 'నట్' కు చాల ప్రజ్ఞయున్నది. గారడీ చేయుట, మంత్రములుపెట్టుట, పాముల పడిగెలో నుంచి విషములాగుట మొదలగునవిచేసి, వీళ్ళు పొట్టపోసుకొనెదరు. ఇంతేగాక వీళ్ళ ఆడవాండ్లు చాల అందమయిన వాళ్ళు అగుటచేత, వ్యభిచారంగూడ వీళ్ళకు జీవనోపాధి అయినది.

(ఆ) సాటియాజాతి: వీళ్లు మరొక తిరుగుబోతుజాతి, వీళ్లు రాజపుత్రులమని చెప్పుకొందురు. వీళ్లు తక్కువజాతి హిందువులు. వీళ్ల స్త్రీలు సహితము, వ్యవసాయక జాతుల స్త్రీలవలె చీరెలు ధరిస్తారు; వీళ్ళకు గొడ్లు ఎక్కువగా ఉంటాయి. వాటిమీద సామాను పడవైచి, ఊరూర తిరిగెదరు. కోడెదూడలనుకొని, పెంచి, వాటికి నపుంసకత్వము తెప్పించి (Castrate), పెద్దవయిన తరువాత హెచ్చు ధరలకు అమ్మిట వీళ్ళ జీవనోపాధి. ఈ జీవితం మూలంగానే, వీళ్ళు చాల నీచంగా చూడబడుచున్నారు. వీళ్ళకు త్రాగడమంటే మహాప్రీతి. దానికోసం భార్యను, ఆస్థిని తాకట్టుపెట్టడానికిగూడ సంకోచించరు. అప్పుఇవ్వనంతకాలము ఋణదాతకు ఋణగ్రస్తుని భార్య ఉంపుడుకత్తెగా ఉండును. ఈలోగా స్త్రీకి గర్భము వస్తే, ఋణదాతదే ,భారం. ఈ విధంగా ఒక్కొక్క గుంపులో ఉండే యౌవన స్త్రీలందరు ఒక్కసారిగా, త్రాగుడుకుకాని, మాంసంకొరకుగాని, తాకట్టు పెట్టబడడం జరుగును. కర్మలప్పుడు, వీళ్లు విశేషముగా డబ్బు ఖర్చు పెడ్తారు. సామెత ఏమిటో తెలుసునా ? నాయనమ్మకర్మ; భార్య తాకట్టు - ఈ రెండు సాటియావంశంలో అమళ్ళతంగా జరుగుతవి.

(ఇ) బానోస్పర్ జాతి; వీళ్ళు శాంతియుతంగా జీవిస్తారు. దొంగ జాతి కాదు. వీళు పాకీపనిచేస్తారు. బుట్టలు, చాపలు, అల్లి, వెదురుగడలు అమ్మి జీవిస్తారు. సత్యసంధులు

(ఈ) బేహాలియా: చక్కని షికారీలు (వేటగాళ్లు) వేటాడుటలో నిపుణులు వీళ్ళను ఐరోపియన్లు ధైర్యవంతులనిన్నీ, సౌందర్యవంతులనిన్నీ, ఉత్సాహవంతులనిన్నీ, మెచ్చుకొంటారు.

(ఉ) చిరియామర్: పిట్టలను వేటాడుటలోను, వలవేసి పట్టు కోటంలోను చాలనేర్పుగలవారు. పట్టుకో వచ్చిన పిట్టలను గ్రామ బజారు లందును, పట్టణాలలోను అమ్ముతారు.

(ఊ) డోమ్: ఈ జాతివాళ్ళు దేశమంతటా వ్యాపించియున్నారు. కొన్నికొన్నిచోట్ల, అంటే జయపూర్ మొదలగు ప్రాంతాలలో వాళ్ళు నేరగాండ్రుగా పేరు పొందినారు. ఉత్తర హిందూస్తానములో వీళ్ళు పాకీవాళ్ళుగాను, ఉరితీసేవాళ్ళుగాను, బుట్టలు అల్లేవాళ్ళుగాను - కాటి కాపర్లుగాను ఉన్నారు. వీళ్ళను చాల నీచకులంగా చూస్తారు. వీళ్ళు నక్కలు, కుక్కలు మొదలగు వాటిని తింటారు. వీళ్లను కేవలం గాడిదలుగా చూస్తారు. దానికికారణం వాళ్ళుసల్పే వృత్తులే. ప్రతివాడు వీళ్ళని దోపిడిచేస్తాడు. చూడండి "కంజారు జాతివాడు వీనికుక్కను దొంగలిస్తాడు. గుజార్ వీని గృహాన్ని లూటీచేస్తాడు. కాని మంగలి మాత్రం ఏమీ తీసుకోకుండానే వీనికి క్షౌరం చేస్తాడు." పాపం!

(ఋ) కంజారుజాతి: పూర్వం వీళ్ళు గ్రామగ్రామం తిరిగి, ప్రతి గ్రామంలోను 'జజామనీ' అనే వార్షిక పారితోషికాలు తీసికొంటూ ఉండే వాళ్ళు. కొన్నికొన్ని కంజార వంశీకులకు కొన్ని ఊర్లపైన ఇల్లా డబ్బు వసూలు చేసుకొనేటందుకు హక్కుండేది. వీళ్ళు చాల ప్రఖ్యాతివహించిన పాటగాండ్లు—నటకులు—నాట్యంకూడ బాగాచేస్తారు. లంబాడీలు, కంజా రులు ఒకటే అని అంటానికి కారణాలు లేకపోలేదు!

కంజారస్త్రీలు, ముస్లిం స్త్రీలకువలెనే లాగూలు తొడుగుతారు. తొండలు, పాములు, కుళ్ళిన మాంసము మొదలగు అసహ్యపదార్థాలు గూడ వీళ్లు తింటారు. పాములు, బల్లులు, దేగలు మొదలైన వాటినుండి

కొవ్వు, నూనెలు తీయగలరు. వీళ్ళు చాల త్రాగుబోతులు. సామాన్యంగా శుభకార్యం వచ్చిందంటే, కొన్ని బుడ్లు పూర్తిచేస్తాడు ఒక్కొక్కడు।

వీళ్ళుసల్పే వృత్తులనుబట్టే వీళ్ళని క్రిమినల్‌జాతిగా చూస్తున్నారు. ముఖ్యముగా వీళ్ళు తమ ఆడవాళ్ళద్వారా గ్రామస్త్రీలను మోసంచేసి, డబ్బు కాజేస్తారు. వీళ్ళల్లో ముష్టెత్తుకోటం సాంప్రదాయం అవటంవల్ల ఏఊళ్ళోనైనా దిగినప్పుడు, వీళ్ళ ఆడవాళ్ళు ఇంటింటికిపోయి మగవారులేని సమయంలో ఇంటావిడెతో మాట్లాడి, సంతానానికి మందిస్తామనిచెప్పి, సొమ్ము దోచుకుంటారు. ఈవిషయం గృహయజమానికి తెలిస్యక పూర్వమే జట్టుఅంతా ఒక్కసారిగా ఆవూరినుంచి మాయమైపోతారు. మళ్ళీ కొన్నిఏండ్లదాకా వాళ్ళసంగతి తెలియదు.

వీళ్ళల్లో ఇళ్ళపేర్లు – వీళ్ళు పూజసల్పే దేవత, లేక జంతువును బట్టిగాని వీళ్ళుజరిపే వృత్తులనుబట్టిగాని పెట్టుకుంటారు.

ఆడపిల్లకు సామాన్యముగా 18, 20 ఏండ్లు వచ్చేదాకా - పెండ్లి చెయ్యరు. పెండ్లికిపూర్వం కన్య వ్యభిచారంసల్పినా, అది తప్పుగా చూడరుగాని, వివాహానంతరము చాల కట్టుబాట్లతో ఉంచుతారు. ఇలాంటి తప్పు ఏదైనా పట్టుబడితే, కులపంచాయితీ కఠినముగా శిక్షిస్తుంది.

వీళ్ళలో వివాహములు విచిత్రంగా ఉంటాయి. కన్యాశుల్కం అధికంగా ఉండుటవలన డబ్బు వాయిదాలతో చెల్లిస్తారు. పెండ్లికిపూర్వం కొంత, ప్రథమసంతానము కలిగినతరువాత మిగిలినది, చెల్లిస్తారు. ఒకవేళ వధూవరులు లేచిపోయి పెండ్లిచేసుకొన్నట్లయితే, వాళ్లు తిరిగివచ్చిన తరువాత కులపంచాయితీకి విందుచేస్తే ఆవివాహాలు అంగీకరింపబడతాయి.

ముందుగా నాయకుడు, తన చేత్తో పెండ్లికొడుకునకు తిలకము పెట్టినతరువాత అత్తగారింటికి తీసుకుపోబడి, అక్కడ గుఱ్ఱంమీద ఇంటింటికి ఊరేగుతాడు (పెండ్లికొడుకు). ప్రతిఇంట్లో వాళ్లు ఒకగుడ్డో నాణెమో, బహుమానముచేస్తారు. ఇట్లా సంపాదించిన డబ్బుతో విందులు చేస్తారు. మాంసము, త్రాగుడు అధికముగా ఉపయోగిస్తారు. దీనితరువాత పెండ్లికొడుకు ఒక మాంసపుముక్కను నోటితోకొరికి పెండ్లికూతురిచేత గూడ బలవంతముగా కొరికిస్తారు. దీనితర్వాత వివాహ స్తంభంచుట్టు ఏడుసార్లు తిరుగుతారు. దాంతో వివాహం పూర్తిఅవుతుంది. ఈ ఆఖరు కార్యాన్ని 'ఫేరా' అంటారు. లంబాడీవాళ్ళలో వలె, కంజారులలోగూడ

భర్త చనిపోతే మరిదిని వివాహమాడవలెననే ఆచారంఉన్నది. అట్లాగాక మరొకడు పెండ్లాడితే, వాడు స్త్రీ మరిదికి బాగా డబ్బుయివ్వాలి.

వీళ్ళ పంచాయితీకి చాల హక్కులు అధికారములు గలవు. వీళ్లు హిందూదేవుళ్ల నన్నిటిని పూజించెదరు. ముఖ్యదేవుళ్లు "అల్ ముండి" "అనపాల". వీటికి మేకలు, పందులు, కోళ్ళు - వీటిని బలిఇస్తారు.

## 4. దొంగజాతులు, ఆదిమనివాసులు : వీరు నేరాలెందుకు సల్పెదరు ?

మన దేశమందలి దొంగజాతులు, దిమ్మరిజాతులు మొదలగువ వన్నియునుగూడ క్రిమినల్ ట్రైబ్సు ఆక్టుక్రిందకు తేబడినవి. అట్లాంటి జాతులలో (మన ఒక్క ఆంధ్రదేశములోచూస్తే) లంబాడీలు, ఏనాదులు, ఎరుకలు, దొమ్మరులు కన్పడుతున్నారు. వీళ్ళేగాక, నేను లోగడ వర్ణించిన డోమ్, కంజార్, మొదలగు తిరుగుబోతు జాతులుగూడ పైవితెల్పిన ఆక్టుక్రిందకు తేబడినవి. వీళ్ళను ఈ ఆక్టులో ఎందుకు ఇరికించారు? సామాన్యంగా వీళ్లుసల్పే నేరాలే దీనికి ప్రధానకారణంగా ఎంచబడుతవి. అయితే ఇట్లా నేరాలుచెయ్యని కోయ, సవర, నాగ. మొదలగువారిలో హత్య, స్త్రీహత్య. బలి మొదలగునవి జరుపబడుతవిగదా? ఇవి మాత్రము నేరములుగావా ?

ఈ ప్రకరణములో ఈజాతులుసల్పే నేరములనుగూర్చి ముచ్చటించుట అప్రస్తుతము. వీళ్లు నేరాలు చెయ్యటానికిగల కారణాలుమాత్రం పేర్కొంటాను.

ప్రథమంగా. ఈ జాతులన్నిటికి నేరాలు చెయ్యటములో ఏమైన ప్రత్యేకతగాని, అలవాటులుగాని ఉన్నవా ? అనే విషయం చూడాలి. కేవలం ఆర్థిక దురవస్థే ప్రధానకారణముగా ఎంచబడే కొన్నిజాతులకు, నేరాలు చెయ్యటములో ఏలాంటి సాంఘిక విధికృత్యములుగాని, సాంప్రదాయములుగాని లేవు. కాని ఆటవిక, పర్వత, అనాదిజాతులలోమాత్రం ప్రస్తుతం సభ్యసంఘంలో ఘోరాలుగా ఎంపబడే నేరాలు చేయుటకు, ఆజాతులందలి సాంఘిక నిబంధనలు, జీవితం దోహదమొసగుతవి.

ఈ విషయం తెలుసుకోవాలంటే, మొట్టమొదటగా నేరమంటే ఏమిటో కనుక్కొనవలెను. ఒక సంఘంలో ఆచరింపబడే పద్ధతిగాని,

ప్రవర్తనగాని, మరోసంఘంలో నీతిబాహ్యంగాను, దోషం, తప్పు లేక నేరంగాను ఎంచబడవచ్చును. అంటే. ఏ సంఘములోఅయితే, ఒకపద్ధతి గాని, నడవడిగాని, అభ్యంతరమేమియునులేక, అనుచరణీయమని భావింపబడునో, ఆ సంఘంలో అది తప్పుగాదు. ఈ నడవడులు సంఘసంఘము నందును, జాతిజాతి యందును, భేదముగా నుండవచ్చు. చూడండి. ఆర్. డబ్లుయు. ఫర్తు చెప్పినట్లు, పరాసుదేశీయులు పరస్పరము కలిసి కొన్నప్పుడు ముద్దుకొనుటగాని, పొలినీషియన్ ప్రజలు ఆసందర్భము లోనే ముక్కులు నొక్కుకొనుటగాని, ఆస్ట్రియా పెద్దమనుష్యుడు స్త్రీల యొక్క చేతులను తన పెదవులతో తాకుటగాని, భారతీయులకు చిత్రము గను, అపహాస్యముగను, ఏవగింపు గల్గించునవిగను ఉండును. కాని ఇవి ఆయా సంఘములలో సహజములు. నేరములుగూడ అంతే. ఒక సంఘ ములో నేరాలుగా ఎంచబడే కార్యములు మరోసంఘములో మర్యాదగా ఎంచబడవచ్చును. శిరచ్ఛేదనము సభ్యసంఘమునందు ఘోరదోషముగ పరిగణింతురుగాని, నాగ, బుష్మన్, ఆరుంటా మొదలగు జాతులందు, వివాహమునకు పూర్వము వరుడు అట్టి కార్యములయందు పాల్గొనవలె ననెడి నియమముగలదు.

తప్పు లనేకవిధములుగా ఉండొచ్చు. రాజకీయ సంబంధమైన నేరములకు, సంఘ దూష్యమగు కృత్యములకుగల వ్యత్యాస మనల్పము. రెంటికిని సంబంధమే యుండదు. ఇంతేగాదు. కొన్నినేరములు వ్యక్తి గతముగ నుండవచ్చును. మరికొన్ని నీతిబాహ్యములై ఉండవచ్చును; లేదా మానసిక నేరములైనను కావచ్చును.

అందుకనే 'నేరం'అనేదాన్ని నిర్వచనం చెయ్యాలంటే, ముఖ్యంగా ఈ క్రింది విషయాలను గమనించవలెను.

1. నేరమనేది, ఏ సంఘంలోనైనా సభ్యుడు సల్పవలె. లేదా కొందరు వ్యక్తులుకలిసి సమిష్టిగానైనా చెయ్యొచ్చు.

2. నేరము ,కేవలం ఊహాకల్పితమైగాని, మానసికమైగాని, ఉండక కార్యరూపము దాల్చవలె.

3. అట్టి కార్యము ఆ సంఘమందలి సభ్యులశాంతి, శ్రేయముల నాటంక పరచునదిగగాని, లేక వ్యక్తికి దైహికముగ నష్టము కల్గించి నట్టి దిగాగాని, లేక సంఘమునకు నష్టము కల్గించినట్టిదిగాగాని ఉండవలెను.

అట్టి కార్యమును సంఘము 'శిక్షాపద్ధతి' ద్వారా ప్రతిఘటించి రూపుమాపవలె. అందుకనే విఖ్యాతహాలెండుదేశ నేరశాస్త్రవేత్త (Criminologist) * బోంగర్ (Bonger' "నేరమనేది సంఘ వ్యతిరేకమగు తీవ్రచర్య. దీనికి ప్రభుత్వము, శిక్షనొసగి తన అసమ్మతి తెలుపును." అని తెల్పుచున్నాడు.

పైతెల్పిన వర్ణననుబట్టిచూస్తే, దొంగతనము, దారిదోపిడి. హింస, మొదలగునవేగాక, వ్యభిచారము, నరబలులు, పశు చిత్రవధలు మొదలయినవి కేవలము నేరాలే గాకుండా, ఘోరములనిగూడ తేల్తుంది.

మనసభ్య సంఘములో చేసేనేరాలు ప్రభుత్వంవారిచే శిక్షా పద్ధతి మూలంగా నిరోధింప బడడమే గాకుండా, కొంత వరకు రూపుమాపబడు చున్నవి. దీనికి ప్రధానాంగములుగా కోర్టులు, శిక్షలు, జైళ్లు, మొదలగు వాటిని ప్రభుత్వం నిర్మిస్తుంది. శిక్షా పద్ధతులలో సంస్కరణలు రాక పూర్వం, నేరగాళ్ళను కేవలం భయపెట్టి, నేరాలుమాన్పుటయే తమకర్తవ్య ముగా భావించేవి ఆయా ప్రభుత్వాలు.

సామాన్యంగా సభ్య సంఘం కానివ్వండి, అసభ్య సంఘం కానివ్వండి, దొంగజాతులుగా చూపబడుచున్న తిరుగుబోతు జాతులయినాకూడ అంతే—నేరములు చెయ్యడానికి ఆర్థిక దురవస్థకుతోడు మరికొన్ని ముఖ్య కారణాలు లేకపోలేదు. ఈ కారణాలు ఒక వ్యక్తినిగాని, ఒక సంఘాన్ని గాని, నేరాలు చెయ్యడానికి ప్రోత్సహిస్తవి. అందుకనే నేరశాస్త్రవేత్తలు, నేరాలు సల్పడానికి ప్రధానంగా 4 కారణములు తెల్పినారు. అవి ఆర్థిక, సాంఘిక, మానిసిక, మతసంబంధములు. రాజకీయ కారణములు ఈ సందర్భములో తీసికొని రాకూడదు.

లోగడ ప్రకరణములో, తిరుగుబోతు జాతులేవిధమున దొంగ జాతులుగా చూడబడుచున్నవో, అందులకేవిధముగా వారి ఆర్థిక దురవస్థ కారణమో నిరూపించాను. పోతే మిగిలిన 3 కారణాలు ఈ ప్రకరణములో వర్ణిస్తాను.

మానసిక కారణాలు : ఈకారణాలు అనాదిజాతిసభ్యులలో ఎక్కువ గానే నేరాలు చెయ్యటానికి ప్రోత్సహిస్తవి. సహజంగా జాతుల దృక్పథము బహుసంకుచితము. తాత్కాలికోద్రేకము, ఆశాభంగములు, ద్వేష

* W. A. Bonger - Introduction to Criminology

ములు—ఇవన్నీ వ్యక్తిగతములు. చూడండి. గిడుగు సీతాపతిగారి "సవర జాతి" వ్యాసములుచూస్తే, కేవలము తమ ఆజ్ఞనుమీరి వినోదం చూట్టానికి వెళ్ళినందులకుగాని, భార్యయొక్క అవినీతి ప్రవర్తనను కనులారగాంచి, తాత్కాలికోద్రేకమును, మరుగుబడిన ద్వేషమును, ఒక్కసారిగా పొంగ జేయ హత్యలు సంభవించినవి. అదేవిధముగా వెరియర్ ఎల్విన్ వ్రాసిన "మేరియాజాతిలోని హత్యలు, ఆత్మహత్యలు" అనే గ్రంధములోగూడ క్షణికమగు క్రోధావేశాలు ఏవిధంగా ఘోరహత్యలకు దారితీసినవో, అద్భుత ముగా వర్ణించ బడినది. సకాలంలో వంటచేయజాలని భార్యలను చంపిన భర్తలు అసంఖ్యాకులు !

సాంఘిక కారణములు : సంఘమునందు మానవుడొక సభ్యుడు. కొందరు మానవులుగలిసి ఒక సంఘముగా ఏర్పడుతారు. ఈ సంఘము సభ్యులయొక్క శాంతి భద్రతలను కాపాడుటకును, తద్వారా తమ నిర్మాణ పునాదులను భద్రపరచుటకును, కొన్ని విధులను, నడవడులను నిర్దేశి చును. వీనినిగనుక మానవుడు నిర్వర్తించక పోయినచో సంఘాభివృద్ధి ముప్పు వాటిల్లును. అందువలననే సంఘము, అట్టి విధులను స్వేచ్ఛా ప్రవర్తకుడై ఎవరైనను నేరములుచేస్తే అతణ్ణి సంఘ... వెళ్ళగొట్టిగాని, లేక ప్రభుత్వ శాసనముల వలనగాని, శిక్షిస్తుంది. ... ణము చేతనే సంఘమందలి వ్యక్తి సంఘమునకును అందలి సభ్... హానికరమగునట్టి నేరములు చేయుటకు జంకును. గాని, మానవునకు ప్రకృతః, స్వార్థము, ఆశఅనేవి గలవు. అతడు తన కోరికలను కార్య రూపమున పెట్టగోరుతాడు. ఆ సమయమునందు సంఘ నిబంధనలను సైతము అతిక్రమింప సంసిద్ధుడగును. ఉదాహరణకు, దారిద్ర్యమును తీసి కొందము. తిండి, గుడ్డలకు దూరమైనవ్యక్తి వాటిని సంపాదించి క్షుద్బాధ తీర్చుకొని, మానము కాపాడుకొనుటకై "దొంగతనమైనను సల్పి, ధనము సంపాదించుటకు సాహసించును. అదేవిధమున భగ్నప్రేమ, ప్రతీకార వాంఛ మొదలగునవి వ్యక్తులు నేరములు సల్పుటకు దారితీయును.

గోండు, సవరజాతులలో జరిగిన నేరములు, హత్యలనుగూర్చి పేర్కొంటినిగదా ! ఆ సందర్భములలో అనాదిసభ్యులు తాముసల్పిన కార్య మునకెట్టి ప్రయత్నముగాని ఆలోచనగాని చేసియుండలేదు. కాని ఎక్కడ 'ప్రతీకార వాంఛ' నేరమునకు దోహదమొసగునో, అక్కడమాత్రము

ఆ కార్యము ప్రయత్నపూర్వకము. ఆలోచనా ఫలితము. ఇంతేగాదు. ఆదిమనివాసులు మానసికముగా ఉద్రిక్తులు. స్వజాత్యాభిమానులు. ప్రతీకార వాంఛాప్రియులు; ఊహాకల్పితములగు అవమానముల నాధారముచేసుకొని ప్రతి క్రియకు వెనుదీయనట్టి మూఢులు!

ఈ సందర్భమున సాంఘిక వాతావరణమునుగూర్చి కొంత ముచ్చటించుట యుక్తము. మానవస్వభావ లక్షణాదులను దైహిక లక్షణములు,

నం

ఇంతేగాదు. కొన్ని అనాదిజాతులందలి సభ్యులు సహజంగా బద్ధకస్తులు. ప్రతి కార్యమునకును ఉదాసీనత చూపెదరు. వాళ్ళకు స్థావర వృత్తులంటే అయిష్టం. పని తప్పించుకొనుటకు బహు ప్రయత్నిస్తారు. అసలు వీరు నేరముచేయుటలోగల ప్రధానోద్దేశ్యము పని తప్పించుకొనటమే. అందుకనే హేవలాక్ ఎల్లిస్ ఈ సందర్భములో ముచ్చటిస్తూ "నేరమనే 'కళ' కు మూలాధారం ఏమంటే — ఎలాంటిపని చేయకుండా

ములు—ఇవన్నీ వ్యక్తిగతములు. చూడండి. గిడుగు సీతాపతిగారి "సవర జాతి" వ్యాసములుచూస్తే, కేవలము తమ ఆజ్ఞనుమీరి వినోదం చూట్టానికి వెళ్ళినందులకుగాని, భార్యయొక్క అవినీతి ప్రవర్తనను కనులారగాంచి, తాత్కాలికోద్రేకమును, మరుగుబడిన ద్వేషమును, ఒక్కసారిగా పొంగ జేయ హత్యలు సంభవించినవి. అదేవిధముగా వెరియర్ ఎల్విన్ వ్రాసిన "మేరియాజాతిలోని హత్యలు, ఆత్మహత్యలు" అనే గ్రంధములోగూడ



పుత్తెల తోరణం

ఎ. సి. హాడెన్‌గారి 'నల్ల, తెల్ల, ఎర్ర శిరశ్ఛేదకులు' నుండి

తీర్చుకొని, మానము కాపాడుకొనుటకై "దొంగతనమైనను సల్పి, ధనము సంపాదించుటకు సాహసించును. అదేవిధమున భగ్నప్రేమ, ప్రతీకార వాంఛ మొదలగునవి వ్యక్తులు నేరములు సల్పుటకు దారితీయును.

గోండు, సవరజాతులలో జరిగిన నేరములు, హత్యలనుగూర్చి పేర్కొంటినిగదా ! ఆ సందర్భములలో అనాదిసభ్యులు తాముసల్పిన కార్యమునకెట్టి ప్రయత్నముగాని ఆలోచనగాని చేసియుండలేదు. కాని ఎక్కడ 'ప్రతీకార వాంఛ' నేరమునకు దోహదమొసగునో, అక్కడమాత్రము

ఆ కార్యము ప్రయత్నపూర్వకము. ఆలోచనా ఫలితము. ఇంతేగాదు. ఆదిమనివాసులు మానసికముగా ఉద్రిక్తులు. స్వజాత్యాభిమానులు. ప్రతీకార వాంఛాప్రియులు; ఊహాకల్పితములగు అవమానముల నాధారముచేసుకొని ప్రతి క్రియకు వెనుదీయనట్టి మూఢులు!

ఈ సందర్భమున సాంఘిక వాతావరణమునుగూర్చి కొంత ముచ్చటించుట యుక్తము. మానవస్వభావ లక్షణాదులను దైహిక లక్షణములు, ప్రకృతి వాతావరణము, ఎట్టి ఆచరణకు - పంథాలకు త్రిప్పగల్గును? ...రమునందు మార్పుదెచ్చుటమినహా, ఈ దైహికలక్షణములు ప్రకృతి, ...ఘిక వాతావరణము (Social environment) వలన గలుగు మానసిక మార్పులకేమాత్రమును యడ్డుదగులజాలవు. అంటే, సంఘము ...దలి విజ్ఞానము, అనగా అందలి ప్రజల నమ్మకములు, ఆచారసాంప్రదాయములు, సాంఘిక, ఆర్థిక జీవితపద్ధతులు—అందలి సభ్యుల ప్రవర్తనా లక్ష్యములకు చాలవరకు కారణభూతమగును. అందువలననే మనము నేరాలుగాఎంచే కార్యములుకొన్ని అనాది సంఘములందు గౌరవమును, ప్రతిష్టను సంపాదించును. చూడుడు. మన దేశమందలి నాగజాతిలో యువకులు 'నరవేట' యందు సామర్థ్యము సంపాదింపవలెనని కాంక్షింతురు. (ఇప్పుడు గాకపోయినను డాక్టర్ హట్టన్ గారికి పూర్వపురోజుల్లో బహు వ్యాప్తంగా ఉండేది.) కొందరు మానవులను చంపివారి పుఱ్ఱెలను విజయస్మృతిగా తోరణరూపమున బహిర్గత మొనర్చిననేతప్ప అతడు వివాహ యోగ్యుడుగాడు! ఇది ఎట్టి ఘోరము! కాని ఆఫ్రికా, న్యూగినీ యందలి కొన్ని జాతులలో ఇట్టి కార్యములు సాంఘిక గౌరవమును సంపాదించును. అదేవిధమున, నేను పరిశోధనలు సల్పిన 'లంబాడీ' జాతిలో కొన్నిచోట్ల వివాహమునకు పూర్వము, పురుషుడు దొంగతనమువంటి నేరమేదియో నొకటి సల్పవలెననెడి సాంఘిక కట్టుబాటు గలదు.

ఇంతేగాదు. కొన్ని అనాదిజాతులందలి సభ్యులు సహజంగా బద్ధకస్తులు. ప్రతి కార్యమునకును ఉదాసీనత చూపెద్దరు. వాళ్ళకు స్థావర వృత్తులంటే అయిష్టం. పని తప్పించుకొనుటకు బహు ప్రయత్నిస్తారు. అసలు వీరు నేరముచేయుటలోగల ప్రధానోద్దేశ్యము పని తప్పించుకొనటమే. అందుకనే హెవలాక్ ఎల్లిస్ ఈ సందర్భములో ముచ్చటిస్తూ "నేరమనే 'కళ' కు మూలాధారం ఏమంటే — ఎలాంటిపని చేయకుండా

తప్పించుకొనుటకు చేసే ప్రయత్నం" అని తెల్పినాడు. ఈ విషయం ముఖ్యంగా తిరుగుబోతుజాతుల జీవితములకు వర్తించును.

నేరాలుచెయ్యటానికి మద్యపానంగూడ కొంతవరకు కారణమనుటకు సందేహములేదు. దోపిడులు, హత్యలుచేసే సందర్భములో అపరాధులు సామాన్యంగా త్రాగిఉంటారు. మద్యము తాత్కాలికోద్రేకమును, కార్యోత్సాహమును బుట్టించును. మనుష్యుని ప్రవర్తనపై సారాయిబలము నిరుపమానము. ఎ. సి. సాల్‌మన్,* ఏమివ్రాస్తున్నాడో పరికింపుడు: "మనుష్యునకు యుక్తాయుక్త విచక్షణ కలుగజేయు ఆత్మ ఒకటిగలదు. సారాయి త్రాగుటవలన మనస్సాక్షి చెడిపోవును; కారాగృహవాసమునకు హేతువులగు పోట్లాట, ఖూనీ, స్త్రీ బలత్కారము మొదలగు నేరములన్నిటికి త్రాగుడే కారణము. క్రిమినల్ న్యాయస్థానముల నేరపుచరిత్రల దీసినయెడల ఉరిశిక్షలు బొందినవారందరు త్రాగిన మత్తులోనే నేరములు చేసినట్లు తెలియగలదు". మాన్‌హీం మొదలగు విఖ్యాత శాస్త్రజ్ఞులు, నేరస్థుడు త్రాగి మైకముపొందిన మనోవస్థ పొందిననేతప్ప, సామాన్యముగా నేరం చేయలేడని వ్రాస్తున్నారు. అదిమనివాసులలో మద్యపానము నేరములుచేయుటకు వాడరుగాని, ఆ సంఘములందు 'త్రాగుడు'కు గౌరవము ఇచ్చుటచేత ప్రతి సాంఘిక కార్యాలప్పుడు తప్పత్రాగెదరు. ఆ సమయములందు ఏ నేరముసల్పుటనినను సామాన్యమేగదా!

నేరప్రవృత్తి వంశపారంపర్యమా? ఈ విషయంపైన అనేక వాదనలు ఉన్నవి. నా ఉద్దేశ్యం ఏమిటంటే, ఏ మానసిక లక్షణములైనను, వంశపారంపర్యంకావు. తండ్రి నేరస్థుడు కావచ్చునుగాని, కుమారుడుగూడ నేరస్థుడు కావలయుననే సిద్ధాంతము ఎక్కడాలేదు. మానవుని గుణగణములు పుట్టుకతోడనేరావు. అట్లాఅయితే ప్రతి దేశంలోను "పండితపుత్ర" బిరుదధారులగు "పరమ శుంఠలు" అవతరించటానికి కారణమేమి?

కాబట్టి ఎవరైనాసరే — చిన్నతనంనుంచి, చక్కని వాతావరణంలోను, పెద్దల సాంగత్యంలోను పెరుగుతూఉంటే, వారి భావములు విశాలవంతములయి, అభివృద్ధికి తోడ్పడును. పరిసరములు, సాంఘిక వాతావరణముల, మూలమున అతడు మంచి గుణములతో విలసిల్లగలడు.

* ఆరోగ్యము — దీర్ఘాయువు. పేజీ 102.

ఐతే ఇటాలియన్ శాస్త్రజ్ఞుడగు లొంబ్రొసో మాత్రము ఈ సిద్ధాంతము నకు వ్యతిరేకాభిప్రాయ మిచ్చుచున్నాడు. అతడు నేరస్థులకు ప్రత్యేక దైహిక మానసిక లక్షణములు గలవని తెలుపుచున్నాడు. కాని ఈ అభిప్రాయము శాస్త్రీయమైనదిగాదు.

కాని సామాన్యముగా నేరస్థులు మనోనిగ్రహం లేనివారు. చెడు సలహాలు ముఖ్యంగా వీరిని అధోగతిలోనికి ఈడ్చుకొనిపోతవి. ఈసందర్భంలో ఇంకోవిషయం తెలిసికోటం అవుసరం. కొంతమంది బుద్ధిలో 'Id' గుణమధికంగా ఉంటుంది. అలాంటివాళ్ళల్లో 'Super ego' గుణం అంతగా పనిచెయ్యదు. ఇలాంటివాళ్ళున్నూ, ఆలోచనాహీనులు, ఉచితానుచితములను విచక్షణ చేయజాలనివారును ముఖ్యంగా నేరాలు సల్పుతూ ఉంటారు,

మత కారణములు: అనాదిజాతుల మతము బహు పురాతనమైనది. అది కేవలము జంతుబలులతోడను, పూజలతోడను నిండియుండును. తమ దేవతలను సంతోషపెట్టి, తద్వారా తమ అభీష్టముల నెరవేర్చుకొనుటయే వారి పూజల లక్ష్యము. పూర్వకాలము లంబాడీలు బిడారీ వ్యాపారం సల్పేటప్పుడు తమ కులదేవత "భవానీ" ప్రీత్యర్థం నరబలులు ఇచ్చెడివారు. అలాగే గోండు జాతిలోగూడ నరహత్యలు, స్త్రీహత్యలు ప్రబలమై ఉండెడివి. జయపూరు ప్రాంతమందలి 'గడబలు' చనిపోయిన వారి జ్ఞాపకార్థం 'పశు చిత్రవధ'లతో 'గట్టర్' అనే పండుగ చేస్తారు. లంబాడీలలో అన్యజాతులను తమ కులంలో కల్పుకొనేటప్పుడుగాని, ఎత్తుకుపోయిన పిల్లలను తమ పురుషులకు ఉంపుడుకత్తెలుగా నుంచవలసి వచ్చినప్పుడుగాని - నాలుకలు కాల్చుటయో, లేక కత్తిరించుటయో సల్పెడివారు. స్త్రీ మాంత్రికురాలని అనుమానింపబడితే, ఆమెకు చావు మూడెడిది. ఇల్లాంటి నేరాలన్నీ మతముపేరిట ఆదిమనివాసులు చేస్తారు.

## 5. * తరుణాపరాధులు : (Juvenile offenders)

ఈ ప్రకరణం ముగించేముందు యీ తరగతి నేరస్తులనుగూర్చి క్లుప్తంగా ముచ్చటిస్తాను. మైనారిటీవెళ్ళని, వయస్సులోనుండు, బాల నేరస్తులను తరుణాపరాధులని అంటారు. సరిగ్గా తలిదండ్రుల భయభక్తులలో

* J. w. Coombes : the juvenile offender.

పెరుగక, దుస్సాంగత్యములో, దారిద్ర్యంలో, లేత జీవితములను గడుపుచు సామాన్యంగా ప్రజలచేతను, ప్రభుత్వముచేతను నిరాదరింపబడి, గత్యంతరములేకనో, లేక దుస్సాంగత్యప్రభావముచేతనో రైలుదొంగలుగానో, కేపుమారీ, జేబు కత్తిరింపుగాళ్ళవలెనో తయారవుతారు. సామాన్యంగా తిరుగుబోతుల కుటుంబములలోనే వీళ్లు ఎక్కువగా కన్పడుతారు.

మన మదరాసురాజధానిలో వీళ్ళకు ప్రత్యేకంగా చెంగల్పట్టు, తంజావూరు మొదలగుచోట్ల రిఫార్మేటరీస్ అనే సంస్థలు గలవు. ఈ సంస్థలు వీళ్ళకు చేతిపరిశ్రమలయందును, కళలయందును శిక్షణయొసగి స్వతంత్ర జీవనములు సల్పుటకు వీలుగా తయారుచేయుటకై ఏర్పడినవి. కాని ఈ విద్యాలయములలో పరిశోధనలు సల్పిన J. w Combes ఇవి రెండవతరగతి జైళ్ళుగా నున్నవనియును, నిర్వహణ భారము బాధ్యతా రహితులగు ఉద్యోగస్థుల చేతులలోబడి సంస్కరణా రహితములైనవని తెలుపుచున్నాడు.

అందుచేత మద్రాసుప్రభుత్వంవారు ఈబాలనేరస్థుల విషయమై కొంత విచారణసల్పి, వలయు సంస్కరణలు ప్రవేశపెట్టి, దేశమును యీదొంగల నుండి కాపాడుటయేగాక, అపరాధులను సంఘమునకు ఉపయోగకరమగు పౌరులుగా తయారు చెయ్యవలసినదిగా నా అభిప్రాయం. దొంగజాతులు, వృత్తిదొంగలు, బాల్యనేరస్థులు - వీళ్ళందరు ఒక్క మనదేశమునందేగాక, ప్రపంచములో అన్నిచోట్లలోను ఒకేవిధమగునష్టము—భయము, గలుగజేసినారు. కాని ఆయా ప్రభుత్వములు నేరశాస్త్రవేత్తలను నియమించి సంస్కరణలు ప్రవేశపెట్టినారు. విద్యాలయములలోగుడా ప్రత్యేకముగా ఈ శాస్త్రము ప్రవేశపెట్టినచో చాల ఉపయోగకరముగా నుండును.

"మానవులెందుకు సమాజాభ్యున్నతికి అనుకూలంగా ప్రవర్తింతురో, ఎందుకు తద్వ్యతిరేకంగా ప్రవర్తింతురో, శాస్త్రీయదృష్టితో పరిశీలించి, తదనుగుణ్యమైన చట్టములుచేయుటకు సూచనలిచ్చు శాస్త్రమే నేరశాస్త్రము." — ప్రొఫెసర్ వైట్.

## 6. ఆదిమనివాసుల సమస్య — వివిధదేశముల వైఖరులు

<u>ఉపోద్ఘాతము</u>: పారతంత్ర్యము ననుభవించుచున్న మనదేశమునందు ఆదిమనివాసుల సమస్యాపరిష్కారమునకు వివిధరాష్ట్ర ప్రభుత్వ

ములు ప్రవేశపెట్టిన పద్ధతులను నేను లోగడనే వివరించితిని. కాని అవిఅన్నియును ఏదోవిధముగ అసంతృప్తికరముగనేయున్నవి. శాస్త్రీయ పరిజ్ఞానముగావి, అనుభవముగానిలేని ప్రభుత్వ చర్యలమూలమున అమలు నందుపెట్టు ఏ పద్ధతియయినను సంతృప్తికరముగను, ప్రజాహితముగను నుండజాలదనియే నా యుద్దేశ్యము. కాని ఇటీవల సప్రూసంఘమువారు సూచించిన ప్రణాళికలో ఆదిమనివాసులకుగూడ 3 స్థానము లిచ్చుటచేత వీరిసమస్య రాజ్యాంగవేత్తల దృష్టినిగూడ నాకర్షించినదని తెలుపవచ్చును. ఇది శుభసూచకము. మన జాతీయప్రభుత్వస్థాపన వీరిసమస్యలను పరిష్కరించునమట కెట్టి సందేహమునులేదు.

ప్రభుత్వము ఆదిమజాత్యాభివృద్ధి కనువగు శాఖలను నెలకొల్పి, సంస్కరణలను ప్రవేశపెట్టవలెననినచో, ఇతర దేశములందు ఈజాతుల సమస్యలు ఏవిధముగ పరిష్కరింపబడినవో జాగ్రత్తగా పరిశీలింపవలయు నని లోగడనే తెలిపితిని. నిజమునకీ పరిశీలనాపద్ధతి కడుసమంజసమైనది. వివిధదేశములందు ప్రవేశపెట్టబడిన పద్ధతులను వర్ణించుటకుముందు ఆ దేశములందు "వెనుకబడ్డజాతుల" విజ్ఞానసభ్యతలు ఎట్టిస్థితిలోనున్నవో తెలిసికొనవలయును. ఆస్ట్రేలియా దేశీయుడగు ఎల్కిన్ * ఈవిషయమై వ్రాస్తూ, ఈవిధంగా పేర్కొన్నాడు: "ప్రపంచమందలి అన్ని ఆదిమ జాతుల విజ్ఞానములు గొప్ప మార్పును బొందుచున్నవి. ముఖ్యముగా ఎచ్చట నల్లజాతులు తెల్లజాతులతో సంబంధమేర్పరచుకొనినవో, అచ్చట అనాదిజాతుల ఆర్థిక, రాజకీయ మతవ్యవస్థలు క్రమముగా మార్పుచెందుచూ, నూతన ఐరోపియన్ సాంప్రదాయ వ్యవహారములకు అలవడజాలక, ఆస్ట్రేలియావంటి ప్రదేశములలో గొప్పసంఘర్షణలు బయలుదేరు చున్నవి. ఈ జీవితమార్పులు కేవలము శాస్త్రజ్ఞునకును, పురాతన వస్తు తత్వజ్ఞునకును మాత్రమేగాక, ఆదిమనివాసులకును, వారి పరిపాలకులకును, మత ప్రచారకులకును, సులభముగా పరిష్కరింపబడజాలని నూతన సమస్యలను లేవదీయుచున్నవి. పలుతావులందు నూతన సభ్యతాసంబంధమగు మార్పులయెదుట తమ పురాతన జీవితపద్ధతులను కోల్పోవలసి వచ్చినది".

---

* Oceania - september 1939. (ఓషియానియా)

యూరపియన్ జాతులు పసిఫిక్ దీవులకును, ఆఫ్రికా మొదలగు ఖండములకును వలస వెళ్ళక పూర్వము ఆదిమ నివాసుల జీవితము ఎట్టి సభ్యతా సాంకర్యమును పొందలేదు. నేను ఇదివరలో వర్ణించిన (Vide part II of the book 'జాతి విశిష్టతలు') ఆర్థిక సాంఘిక వ్యవహారములు, వ్యవస్థలు, జీవిత పద్ధతులు మొదలగు వానితోడనే ఆదిమనివాసులు తమ జీవితమును గడుపుకొనుచుండిరి. తెల్లజాతులు అనాదిజాతుల ప్రదేశములయందు కాలిడక పూర్వము ఆదిమనివాసుల జీవిత ప్రమాణములు, జీవితపు విలువలు, వారివారి సాంఘిక వాతావరణతోడను, విశిష్టతలవల్లను విలసిల్లు చుండెడివి. ఎఫ్. ఎం. కీసింగ్ * ఈ సందర్భమున తెలుపుచున్న వాక్యములను గమనింపుడు:

"ఆదిమజాతులు యూరోపియనులు వచ్చిన తరువాత వలస వెళ్లుట ప్రారంభించినారు. జావానీయులు, సుమిత్రా, మలేద్వీపకల్పము, న్యూకాలడోనియాకును, ఇలోసినోలు ఫిలిప్పైన్ దీవులకులను, గిల్బర్టు, ఎకలాస్ ద్వీపవాసులు తమకుగల కొబ్బరి, చేపల సంపదచాలక, ఫీజీ, సామోవా, టాహిటి, మొదలగు ప్రదేశములకును, వలస వెళ్లుచున్నారు.

"ఎప్పుడు యూరపియనులు నల్లజాతులతో చేతులు కలిపినారో అప్పుడే జాతుల ఆర్థిక దృక్పథము సైతము మార్పుచెందినది. పూర్వము వారి ఆర్థిక విధానమునందు "నాణెములపద్ధతి" లేదు. యూరపియన్‌ల సాంగత్య ఫలితముగా వారి ఆర్థిక విధానమునందు ఈ పద్ధతి ప్రవేశపెట్టబడినది. వారి ఆహారం సైతము అనేకవిధముల మార్పుచెందినది. నూతనముగా పాలకులు ప్రవేశపెట్టిన ప్రభుత్వ విధానములకు కొన్ని జాతులు అలవడ జాలక పోయినవి. నిజమునకు ఆదిమనివాసులకు రక్షణయొసగి, వారి ఆర్థిక పరిస్థితులు చక్కబరచి, విద్యా ప్రదానంచేసి, ఆరోగ్య శిక్షణయొసంగి, అన్నివిధముల వారిని బాగుచేయ సంకల్పించినవి ఆయాప్రభుత్వములు. అందుకనే తిరుగుబోతు జాతులు స్థావరముల నేర్పరుచుకొనవలసిందనిగా ఆజ్ఞాపింపబడినవి. వేటాడు జాతులు వ్యవసాయ పద్ధతులకు మరల్పబడినవి. వ్యవసాయక జాతులు ఉత్పత్తి విధానమువైపు ప్రోత్సహింపబడినవి."

---

* Pacific Affairs-1935: Keesing: "Standards of living among Native peoples"

విదేశీయ ప్రభుత్వములు కొంతవరకు కొన్నిచోట్ల జాతుల దృక్పథములో మార్పుతెచ్చుటయేగాక, తమ పద్ధతులకు అలవడునట్లు చేయగలిగినవి. కాని ఎచ్చట సంస్కారణలకై చూపబడిన ఉత్సాహ ఫలితముగా ప్రభుత్వ శాసనం వొత్తిడితగిలి, జాతీయ విశిష్టతకు, విలువలకు భంగము వాటిల్లెనో, అచ్చట ఆజాతులందు అసంతృప్తి, శత్రుత్వం, ప్రతీకారవాంఛ ప్రబలినవి. ఉదాహరణకు, న్యూజిలెండులోని మవోరీలు సమిష్టిజీవిత పద్ధతులకు అలవడినవారు. వారియందు వ్యక్తిత్వమును ప్రవేశపెట్టవలెననెడు ప్రయత్నము కల్లోలములకు దారితీసినది. ఇంతేగాక ఆస్ట్రేలియాయందలి ఆదిమ నివాసులు, పిగ్మీ - నీగ్రిటోలు, నూతన నాగరికతకేమాత్రమును సుముఖులు కాజాలనంతటి ప్రాచీన స్వభావము, లక్షణములు గలవారు.

ఇట్టి క్లిష్ట పరిస్థితులవల్ల ఆయాదేశముల పరిపాలనా వైఖరియందు మార్పులువచ్చినవి. ఆదిమనివాసులను ఎవ్విధమున అభ్యున్నతికి తీసుకొనిరాగలమా ! అని శ్రద్ధవహించినవి ఆ ప్రభుత్వములు. జాతులకు రక్షణయొసంగి, తద్వారా వాటిని వృద్ధిలోనికి తీసుకవచ్చుటయే యుక్తమని తలచిన వా ప్రభుత్వములు. ఈ కార్యనిర్వహణమునకు ప్రధానాంగములు నాలుగు. అవి, మత ప్రచారకులు, విద్యాలయములు, మానుషశాస్త్రజ్ఞులు, ప్రభుత్వచర్యలు. ఇవి ఎవ్విధమున విదేశములలో పనిసాగించినవో తెలుసుకొనెదము.

## 7. ఆదిమనివాసుల సమస్యాపరిష్కారము - ఆస్ట్రేలియా (1)*

ఆస్ట్రేలియాలో యిటీవల అనగా 1927 నుంచి మానుష శాస్త్రజ్ఞానము విశేషముగా అభివృద్ధిచెందినది. దీనికి ప్రత్యేక ఉపజ్ఞ గణించిన మానుష శాస్త్రజ్ఞులే గాక మత ప్రచారకులు, ఉద్యోగులు, పరిశోధకులు గూడ దోహదమొసంగిరి.

ఆస్ట్రేలియన్ జాతీయ పరిశోధనా సంఘము (**Australian National Research council**) 1927 లో స్థాపించబడి, చాలవరకు ఆదిమనివాసులపై సమగ్రమైన పరిశోధనలు జరిపించి, ఇంతవరకు 150 విషయములను ప్రకటించినది. ఇంతేగాక రాక్‌ఫెల్లర్ సంఘమువారు ఈ సంఘ

---

***Mr. E P. Elkin - "Anthropology in Australia" : Oceania 1939 - September.**

మునకు పరిశోధనలకుగాను 60,000 పౌనులు గ్రాంటుగా యిచ్చినారు. ఈ సంఘము ఆదిమజాతుల భాషావిషయంలో ఒక పుస్తకమును ప్రకటించటమేగాకుండా, ఉద్యోగులకును, ప్రచారకులను ఉపయోగపడురీతిని న్యూబ్రిటన్ భాషకు ఒక నిఘంటువును, విక్నూకన్ భాషకు ఒక వ్యాకరణమును తయారుచేసి ప్రకటించినారు.

ఎడలయిడ్ విశ్వవిద్యాలయంవారుగూడ పైచెప్పిన జాతీయ పరిశోధనా సంఘ సహాయముతో అనాది జాతులనుగూర్చి పరిశోధనలు జరుపగా, మెల్‌బోరన్ విశ్వవిద్యాలయాధికారులు కొందరు విద్యార్థి పరిశోధకులకు ధనసహాయముచేసి, సొలమన్ దీవులలోని అనాదిజాతులపై కృషసల్పించినారు. ఈసంఘమునకు ఆస్ట్రేలియా ప్రభుత్వం పెద్దమొత్తములను గ్రాంటు నొసగినది. అనాదిజాతులందలి శిల్పము, కళలు సహితము బాగుగా పరిశోధింపబడినవి. ఇట్టి పరిశోధనలు జరుపునప్పుడు శిక్షణ పొందిన మానుష శాస్త్రజ్ఞులు మూడు పద్ధతుల నవలంబించినారు. అవి (1) జాతులు నివసించే ప్రదేశములన్నిటిని మొట్టమొదట పరిశోధించుట, (2) ఒక నిర్ణీత ప్రదేశమును తీసికొని సమగ్రముగా పరిశోధించుట, (3) జాతుల కష్టనష్టములనుగూర్చి ప్రత్యేకముగా పరిశోధించుట.

నల్లజాతులకు తెల్లజాతులతో కలిగిన సంబంధ ఫలితములను గూర్చి విచారించుటకుగాను ప్రభుత్వ మానుషశాస్త్రజ్ఞుడగు ఎల్కిన్ సలహాతో ఆస్ట్రేలియా ప్రభుత్వము విశ్వవిద్యాలయములలో ప్రత్యేకముగా మానుషశాస్త్ర శాఖ నొకదానిని నెలకొలిపి, గ్రాంటుల నొసగినది. ఎల్‌కిన్ ఉద్యోగులకు, ప్రచారకులకు ఆదిమనివాసుల సమస్యపైని ప్రత్యేక శిక్షణ యిచ్చును. ఇంతేగాక, ఆయన సలహామీదనే ఆస్ట్రేలియా ప్రభుత్వం ఉత్తర రాష్ట్రములో (Northern Territory) E. W P. Chinnery అను వారిని ఆధిపత్యంక్రింద ఆదిమనివాసులకు ప్రత్యేకంగా ఒకడిపార్టుమెంటును నెలకొల్పింది (Department of Native affairs). మరియును ఆస్ట్రేలియాలో దేశరక్షకులు, పోలీసు ఉద్యోగులుకూడ మానుషశాస్త్రములో తర్ఫీదు పొందవలెననెడి నిబంధన యున్నది.

న్యూసౌత్ వేల్సు మానుషశాఖవారు ప్రభుత్వమునకు చక్కని సలహాల నిచ్చినారు. అసలు ఆస్ట్రేలియాలో ప్రభుత్వము ఆదిమనివాసుల సంరక్షణశాఖ నొకదాని నేర్పరచి (Aboriginals' Protection Board)

దానికి ప్రత్యేకముగా నొక మంత్రిని నియమించినది. పబ్లిక్ సర్వీసు బోర్డు వారుగూడ టి. కెల్లీసతి, ఎల్కిన్‌ల వంటి మానుషశాస్త్రజ్ఞుల సలహాను పొందుచూ, తమ జాతుల పరిపాలనా పద్ధతిలో మార్పుతెచ్చుటయే యుక్త మని అభిప్రాయపడి, ఒక మానుషశాస్త్రజ్ఞుని ఆధిపత్యముక్రింద ఆదిమ నివాసుల అభివృద్ధికొరకై క్రొత్తబోర్డు నొకదానిని నెలకొల్ప నిశ్చయించినారు.

ఇదేవిధముగా న్యూగిన్నీ, పాపువా, మెలనీషియా మొదలగు ప్రదేశములలో విలువగల పరిశోధనలు జరుపబడినవి. అందు ప్రభుత్వము, మత ప్రచారకులు ఎచ్చట తమ ప్రయత్నములు చేయుచుండిరో అట్టి వన్నియునుగూడ మానుషశాస్త్ర దృష్టితోడనే జరువవలెననెడి సిద్ధాంతము అంగీకరింపబడినది. ఉదాహరణకు- పాపువాయందలి ప్రభుత్వ మానుష శాస్త్రజ్ఞుడగు ఎఫ్. ఇ. విలియమ్సు జాతులపరిపాలన అంతయు మానుష శాస్త్ర పరిజ్ఞానము వలననే జరుగవలయునని విశదీకరించినాడు. పరిపాలకులకును, ప్రచారకులను మానుషశాస్త్రము యిచ్చు దోహదమునుగూర్చి ప్రభుత్వమున కనేక నివేదికలను బంపినాడు.

## 8. ఆదిమనివాసుల సమస్యాపరిష్కారము - ఆఫ్రికా (2)

ఆఫ్రికాలో జాతులసమస్య సులభముగ పరిష్కరించుటకు వీలుగా లేదు. ఇచ్చట అనేక యూరపియన్‌జాతులవారున్నారు. వారందరు స్వప్రయోజనముల కొరకై స్వదేశీయులను అధోగతిలో నుంచుటకే చాలకాలము వరకు నిశ్చయించినారు. కాని తరువాతమాత్రము వారి దృక్పధం మారినది. ఈ ఆదిమనివాసుల సమస్యా పరిష్కారము నాలుగు భాగముల క్రింద చేయవచ్చును. పరిశోధనాలయములు, శాస్త్రజ్ఞులు సల్పినపని; ప్రభుత్వ భూవిధానము; స్వదేశీయుల న్యాయశాస్త్రం; ప్రభుత్వపు ఏర్పాటులు.

"దక్షిణాఫ్రికా విశ్వవిద్యాలయముల సంఘము"* South African Inter-university Committee for African studies అనునది మానుషశాస్త్ర పరిశోధనలకై 1932 లో తెరువబడెను. దీనిలో కేప

* Proceedings of the first meeting of the above committee: 1932.

టౌన్, ప్రెటోరియా, స్టెలెన్‌బోషిచ్, విట్‌వాటర్‌స్రాండ్ మొదలగు విశ్వవిద్యాలయ ప్రతినిధులు సభ్యులుగానుండి, ఆఫ్రికాయందలి జాతుల భాషలను పరిశోధించుటకై, "ఆర్థాగ్రఫీ" కమిటీలను ఏర్పరచినారు. వీరు తయారుచేసిన ప్రణాళికలన్నియునుగూడ ప్రభుత్వ విద్యాశాఖవారి ఆమోదమును బడసినవి. తొలిరోజుల్లో ఈ సంఘముల కృషిని ప్రచారకులు, ఆదిమనివాసులు అనుమానించినారుగాని, క్రమేపి దానియందలి సత్యమును, విలువను, గ్రహించి శ్లాఘించినారు.

ఈ విశ్వవిద్యాలయసంఘమే కేంద్రభాషా సంఘము నొకదానిని స్థాపించి, సలహాలన్నియు ప్రభుత్వమువారికి అందుబాటులో ఉంచగలిగినది. మరియును, విశేషకృషిసల్పి ఈక్రింది ప్రభుత్వశాఖలను తనకు సుముఖముగా చేసుకొనినది. వీరందరు ఈ సంఘమున సభ్యులుగా చేరినారు. ఆ శాఖలు ఇవి :

(1) యూనియన్ స్వదేశీ వ్యవహారాలశాఖ (2) విద్యాశాఖ (3) రాష్ట్రాల హైకమీషన్‌బోర్డు (4) దక్షిణ రొడీషియా ప్రభుత్వం (5) దక్షిణఆఫ్రికా జాతుల వ్యవహారసంస్థ.

ఆఫ్రికాలో మరో సంస్థగలదు. ఇది జగత్‌విఖ్యాతి గాంచినది. ఇదే 'International Institute of African Languages and cultures' * ఇది బ్రిటన్, ఫ్రెంచి, బెల్జియం ప్రభుత్వముల ప్రోత్సాహము మూలమున స్థాపింపబడినది. మానుషశాస్త్రమును అభిమానించిన అనేకమంది విద్యార్థులను ఈ సంస్థకుబంపి, ఉత్తర, దక్షిణ అమెరికాలయందును, ఆఫ్రికాయందును, పసిఫిక్‌దీవులయందును. మెలనీషియాయందును పరిశోధనలు జరిపించుచుండును, ఆ ప్రభుత్వములు. ఎందుకంటే, ఆదిమనివాసులు మార్పుచెందుచున్న కాలప్రవాహములో కొట్టుకొని పోవుచున్నారనియు, అందుచేత వారి పురాతన సాంప్రదాయములను, జీవితపద్ధతులను, సంరక్షించుట తమ బాధ్యతఅనియు, ఆప్రభుత్వములు ఎంచుకొనినవి.

ఈ సంస్థ ప్రస్తుతం ఆఫ్రికాలోని ఆదిమనివాసులు అనుభవించుచున్న దురవస్థలకు ప్రధానకారణములు, యేయేశక్తులు బలీయమై జాతుల కనర్థకరముగ పరిణమించినవో — కనుగొనుటయేగాక, తెల్లజాతులకును, స్వదేశీ

* Dr. J. S. Bulsara - Journal of the Antropological Society of Bombay : 1927 - 28.

యులకును, సామరస్యం కుదిర్చి, వాటి అభ్యున్నతికై పాటుబడుటయే ప్రధానాదర్శముగా పనిచేయుచున్నది. ఈ సంస్థలోనే విఖ్యాత శాస్త్రజ్ఞులగు బి. మాలనొవిస్కీ; ఏ. ఐ. రిచర్డ్సు; ఇవాన్సు ప్రిచార్డు మొదలగు వారు కృషి సల్పుచున్నారు. 1938 లో "సభ్యతా - సంబంధము" (Culture contact) ను పరిశీలింపవలసిన పద్ధతులనుగురించి వ్రాసిన గ్రంథమొకటి ఈ సంస్థ ప్రకటించి, మానుషశాస్త్రమునకొక నూతనపంథా ఏర్పరచినది. విశ్వవిద్యాలయసంఘము, Inter National Instituteయొక్క సహకారమును సహాయమును పొందగలిగినది.

విద్యాలయసంఘము మానుషశాస్త్రజ్ఞుల యొక్కయు, భాషాకోవిదులయొక్కయు, ఉపసంఘముల రెంటిని నియమించినది. ఈ రెండు ఉపసంఘములుకూడ ఆదిమజాతుల బాషను, ఆచారములను, పరిశోధించి ఇంతవరకు జరిగినపనియు, ఇకముందు జరగవలసినపనియు, చర్చించును. తత్ఫలితముగా నివేదికలు కేంద్ర సంఘమునకు బంపెదరు.

ఆఫ్రికాయందు మానుషశాస్త్రజ్ఞుల సలహాలను ప్రభుత్వం ప్రతి విషయంలోను తీసుకొనును. లోగడ నేను ఆఫ్రికాలోని అషాంతి ప్రజలు ఏవిధమున ప్రభుత్వము యెడల అసంతృప్తి ప్రకటించిరో తెల్పితిని. (చూడుడు : ద్వితీయభాగము : ప్రకరణము 7 మద్యపానము.) ఆబంగారు పీటను ప్రభుత్వము వశపరచుకొనునను భయముచేత అషాంతి ప్రజలు దానిని భూమిలో పాతిపెట్టినారు. ఇరువై సంవత్సరముల అనంతరము * ప్రభుత్వం భూమిని త్రవ్విస్తుంటే ఇది బయటపడింది. దానిపైగల ఆభరణాలను ప్రభుత్వం స్వాధీనము చేసుకొన్నది. అషాంతి ప్రజలకు ఈ విషయము తెలియగానే, మండిపడ్డారు. ఎవరు దానిని ప్రభుత్వమునకు స్వాధీనము చేసిరో, వాళ్ళని పట్టివ్వమన్నారు. మరో చిత్రవధ జరిగేది. కాని అప్పటి ప్రభుత్వ మానుషశాస్త్రజ్ఞుడగు కాప్టెన్ రాట్రీ మాత్రం, దాని నిజం తెలుసుకొని, అపరాధిని జాతిపెద్దలకు అప్పగించి, వధకు మారుగా, అజ్ఞాతవాసం వేయించగలిగాడు. లేకపోతే మరోయుద్ధం సంభవించేది.

ప్రఖ్యాత మానుష శాస్త్రజ్ఞుడగు ప్రొఫెసర్ వ్కపేరా ఆధిపత్యం క్రింద మానుషశాస్త్ర శాఖ ఒకటి నెలకొల్పబడి, ట్రాన్‌స్వాల్, ట్రాన్‌స్కెయిన్ జాతులపై సమగ్రపరిశోధనలు జరుపబడినవి.

* E. W Smith - The Golden stool

ఈ విశ్వవిద్యాలయ సంఘము యూనియన్ ప్రభుత్వపు స్వదేశీయుల వ్యవహారాల శాఖతోడను, విద్యాశాఖ మంత్రులతోడను, దక్షిణాఫ్రికా హైకమీషనరుతోడను, ఆఫ్రికన్ జాతులనుగూర్చి చేయవలసిన పరిశోధనలయొక్క ప్రాముఖ్యమును, ఆవశ్యకతను నిరూపించినది. ఇంతేగాక ప్రభుత్వము స్వదేశీయుల విషయంలో ఏమిచేసినను వారి భాష మానసిక ప్రవృత్తులు, ఆర్థిక వ్యవస్థలు, ఆచార వ్యవహారములు - వీటియందు గణించిన విశేషానుభవముమీఁదనే ఆధారపడవలెనని సలహాయిచ్చినది. అంతేగాక ప్రభుత్వోద్యోగులు ఆదిమనివాసుల భాషలను సైతము నేర్చుకోవలెనని అభిప్రాయపడినారు.

## ప్రభుత్వము — అనాదిజాతులు

పోతే, ప్రభుత్వము ఆదిమనివాసులకు ప్రత్యేకముగా రిజర్వులను ఏర్పరచవలెనని నిశ్చయించినది. అంతేగాక, దేశమందలి ఆ యా జాతులనుగూర్చి సంతృప్తికరమగు శాస్త్రపరిజ్ఞానము అవుసరమని అభిప్రాయపడినది. అందుచేత శాస్త్రజ్ఞులకును, అధికారులకును సహకారము పెంపొంద చేసినది.

జొహనాస్‌బర్గు, ప్రెటోరియాలవంటిచోట్ల 'యూరోపియనేతర, మరియును స్వదేశీయుల వ్యవహార, శాఖలు నెలకొల్పబడినవి. మిరియం జానీసన్ అను యీ శాఖయందలి ఉన్నతోద్యోగి ఒకరు స్వదేశీయుల వివాహవిషయముపై పరిశోధన జరిపి, సిద్ధాంతములు కనిపెట్టినారు. తత్ఫలితముగా సాంప్రదాయబద్ధమగు స్వదేశీ వివాహములు ప్రభుత్వము చేత ధర్మబద్ధములని గుర్తింపబడినవి. స్వజాతీయులలో కొన్ని సాంఘిక పద్ధతులు ప్రభుత్వమునకు లోపభూయిష్టమని తోచుటచేత, వాటిని ఎత్తివేయదలచినారు. పురుషుడు వివాహము జేసుకొనిన స్త్రీని వదలివైచి, ప్రభుత్వముచే ఏర్పరచిన రిజర్వులందు నివశించు వేరొకస్త్రీని రిజిష్టరు పద్ధతిద్వారా వివాహమాడవచ్చును. ఇట్టి సందర్భములందు కొన్ని నియమముల ననుసరించి ప్రభుత్వము ప్రథమ భార్యకు రక్షణ యొసంగెదరు. అదేవిధమున 'లోబాలో' ('Lobalo') అనుపేర స్త్రీ విక్రయము అమలునందుండెడిది. పశువులు, కొంత ధనము తీసుకొని స్త్రీని విక్రయించు పద్ధతికి 'లోబాలో' అనెదరు. ఈ విషయమై ప్రభుత్వము ఒక కమిటీని నియమించి సరియగు నిర్ణయమునకు వచ్చినది.

1937 లో మిస్ గ్లాడిస్ ఒప్పెన్‌హీమ్ అనునామె నీగ్రోలకు అత్యవసరమగు పుస్తకము నొకదానిని ప్రకటించినది.

స్వదేశీయుల న్యాయశాస్త్రం

స్వదేశీయుల న్యాయశాస్త్రమును, విధులను, ఆచారములను, పరిశోధించి క్రోడీకరించే ప్రయత్నము 1852 లో చేయబడెను. 1909 వ సంవత్సరములో ట్రాన్సువాల్ ప్రభుత్వము "సపేడీ న్యాయశాస్త్రము - ఆచారము" [Sapede law and custom] అను పుస్తకమును ప్రకటించి నది. 1938 లో ప్రొఫెసర్ స్కాపేరా ట్స్వానా జాతులలోని న్యాయాచారములనుగూర్చియు అట్టిదే మరియొక పుస్తకమును, బెకూనాలాండ్ రచించినారు. అంతేగాక. విశ్వవిద్యాలయాల సంఘపు కోరికపైని జూలియస్ లెవైన్ అనునతడు స్వదేశీయులలో ఆచార, న్యాయశాస్త్రములను పరిశోధించి క్రోడీకరించినాడు. అప్పీలు కోర్టులోగూడ స్వదేశీయుల న్యాయ చట్టము గుర్తింపబడుటయేగాక ఆదిమ న్యాయశాస్త్రమునకును పౌర న్యాయమునకును భేదము అంగీకరింపబడి ఆచరణయందు పెట్టబడినవి. లోగడనేను పేర్కొనిన విశ్వవిద్యాలయములలో సైతము L. L. B. B A. Hons తరగతులలో స్వదేశీయుల న్యాయశాస్త్రము పాఠ్యభాగముగా ఏర్పరుపబడినది.

## 9. ప్రభుత్వ భూవిధానము[1] - ఏర్పాట్లు

యూరోపియనులు ప్రవేశించకపూర్వము ఆఫ్రికాఖండ ప్రదేశమంతయు స్థావరనివాసములేని బంటు [2] జాతులవల్ల ఆక్రమింపబడినవి. తక్కిన అనాదిజాతులతో వచ్చిన పోరాటముల మూలమున ఈ తిరుగుబోతు జాతులన్నియును దక్షిణాఫ్రికాకు వలసవచ్చినవి. ఈ జాతులకు స్థావరవృత్తులు అంతగా ఆకర్షించవు. వారికి పశుపెంపకమే ప్రధానవృత్తి.

స్వదేశీయుల భూశాసనమును (Native land Act) అమలు పరచిన లగాయితు స్వదేశీయులకు 21 లక్షల ఎకరములభూమి ప్రత్యేకించబడినది. కాని ఈభూమి వారి జీవనమునకు చాలని కారణముచేత,

---

1. Bantu Studies of Africa 1940. E. B. Jones.
2. బుష్‌మన్, హాటెంటాట్ మొదలగు జాతులు.

దక్షిణాఫ్రికా గవర్నరుజనరలు ఎంత భూభాగము ప్రత్యేకించవలెనో నిర్ణయించుటకు ఒక సంఘమును నియమించినాడు.

Representation of Natives' Act మరియు Native Trust Act (1936) షరతులప్రకారము మరికొంతభాగము స్వదేశీయులకు ప్రత్యేకించబడెను. అంతేగాక, దక్షిణాఫ్రికా స్వదేశీయుల ట్రస్టు (South African Native Trust) నొకదాని నేర్పరచి, దానికి గవర్నరు జనరలునే ట్రస్టీగా నియమించిరి. గవర్నరు జనరలు తన యధికారములను స్వదేశీయ వ్యవహారశాఖా మంత్రిపరము గావించవచ్చును. శాసనమును అమలుపరచిన తొలిరోజుల్లో ఆ ట్రస్టుకు 60 లక్షలపౌనులు, మరికొంత భూమిని కొనుటకుగాను గ్రాంటు, ఇవ్వబడెను. అంతేగాక, ప్రభుత్వ స్వాధీనములోనున్నట్టియు, స్వదేశీయులు వదలివైచినట్టియు, భూములు సహితము ట్రస్టుకు స్వాధీనము చేయబడెను. ఈ ట్రస్టు, స్వదేశీయుల స్థావర నివాస వృత్తులకొరకును, ఐహిక, నైతికలాభములకొరకును పాటుపడుచుండెను. అందుకొరకై ఆదిమనివాసుల గృహనిర్మాణ విషయమువందు సంస్కరణలు ప్రవేశబెట్టిరి. అంతేగాక, వారిభూములు బీటువారిపోకుండగను, అనవసరపు నీటివలన మునిగిపోకుండగను, జాగ్రత్త తీసికొనబడెను. ఆరోగ్యము మొదలగు విషయములు సైతము బోధింపబడినవి. వ్యవసాయము, పశువుల పెంపకము యందు క్రమశిక్షణ, ఇవ్వబడెను. అందుచేత ఈట్రస్టు అన్నివిధముల ఆదిమనివాసులకు సాయముచేయ సంకల్పించినది. ఇంతేగాక, జాతులలోని ప్రభువుల (Tribal chieftains) అధికారము జాతిప్రదేశములందేగాక (Tribal areas)వాటికిచేరువగాప్రత్యేకించబడిన ప్రదేశములందుకూడా(Reserves) అంగీకరింపబడెను. ఈ పద్ధతులద్వారా దక్షిణాఫ్రికాలోని యూనియన్ ప్రభుత్వము ఆదిమనివాసుల అభ్యున్నతికి పాటుబడుచున్నది.

కాని నల్ల-తెల్ల జాతి విద్వేషములు ఘనీభవించిన ఆఫ్రికా ఖండమందు ఆదిమనివాసులకు ప్రభుత్వము హృదయపూర్వకమైన సేవయు, కృషియు చేయజాలకపోయినది. కాని ఈ ఖండమునందలి విశ్వవిద్యాలయములు, మానుషశాస్త్రజ్ఞులు, క్రైస్తవమత ప్రచారకులు, పరిశోధనా సంస్థలు కలసి ప్రభుత్వముపై ఒత్తిడితెచ్చి, జాతుల అభ్యున్నతికి తోడ్పడినవని చెప్పవచ్చును.

## 10. ఆదిమనివాసుల సమస్యాపరిష్కారము - అమెరికా (3)

అమెరికాయందు నీగ్రోలు, ఎర్రయిండియనులు, క్రో-యిండియనులు మొదలగు జాతులవారు గలరు. అమెరికాలో మానుష శాస్త్రమునకు ప్రధాన గౌరవమివ్వబడినది. షుమారు 1000 మంది మానుషశాస్త్రజ్ఞులు ప్రభుత్వములో పనిచేయుచున్నారు. అంతే సంఖ్యగల శాస్త్రజ్ఞులు స్వతంత్రముగా కృషిసల్పుచున్నారు. అమెరికాలో మ్యూజియములు అసంఖ్యాకములు. యూనివర్సిటీలుగూడ అంతే. రెంటియందును మానుషశాస్త్ర శాఖలు నెలకొల్పి, పరిశోధనలు జరుపుచున్నారు. అధఃపతితుల అభ్యున్నతికి పాటుపడుచున్నారు.

ఇందు పత్రికా సహకారము మిక్కుటము; ప్రత్యేకముగా ప్రపంచ ఖ్యాతిగాంచిన మానుషశాస్త్ర పత్రికలు చాల గలవు. ముఖ్యంగా వాటిలో Man, American Anthropologist, physical Anthropology పేర్కొనదగినవి. ఇంతేగాక Musuem Bulletin లు క్రమముదప్పక వెలువడును; మత ప్రచారకులుగూడ ఎక్కువగా తోడ్పడుతున్నారు.

న్యూయార్కు* నందలి ఫెల్కు-ష్టోక్ ఫండ్ (Felk-stoke Fund) వారు ఇటీవల "నవాజా ఇండియన్ల"పై పరిశోధనలు సల్పి ప్రకటించిన ఒక్క నివేదికమాత్రమే అమెరికాయందు జాతుల సమస్యను యెంత నిర్దిష్టముగను, శాస్త్రీయముగను పరిష్కరింతురో తెల్పుటకు చాలును.

ఈ పరిశోధనలు సల్పినవారు గొప్ప ఉద్యోగస్థులు: పండితులు. ఈ సంఘమందు ఫెల్కు ఫండుకు విద్యా డైరెక్టరగు డాక్టరు టి. జె. జోన్సు, యేల్ యూనివర్సిటీయందు జాతుల సంబంధ బాంధవ్యశాఖకు అధ్యక్షుడైన ప్రొఫెసర్ సి. టి. లోరమ్, మానుష శాస్త్రజ్ఞుడును జాతీయ వ్యావసాయక స్కూలుకు ప్రెసిడెంటును అగు హెచ్. బి. ఆలెన్ - ఈ ముగ్గురు సభ్యులు. వీరే పరిశోధనను సల్పినారు.

ఫెల్కు - ష్టోక్సు ఫండుకు ప్రెసిడెంటు అగు Allen Phelps stockes నవాజా ప్రజల సమస్యాపరిష్కారము పైననే అమెరికనుల ఆత్మగౌరవము ఆధారపడినదని తెల్పుతున్నాడు.

ప్రభుత్వమువారు ఈ జాతికి 24,000 చ. మైళ్ళ వైశాల్యముగల ప్రదేశమును ప్రత్యేకించినారు. ఈజాతి సంఖ్య షుమారు 50,000. అంటే

* Oceania - 1939.

మన దేశంలోని గడబలకన్న 6 వేలు మాత్రమే అధికము: నాగరికతా సంబంధమువలనను, ఇతర జాతుల సంబంధమువలనను, ఈజాతికి ఒత్తిడి ఎక్కువగ కలిగినప్పటికీ, వారిభాష, ఆచారములు ఇప్పటివరకును నిలుపుకొనుచున్నారు. కాని వారి ప్రస్తుత స్థితిగతులు ప్రభుత్వ దృష్టినాకర్షించినవి. అవి ఏవి : భూములు బీటలుదేరుట, పశువులసంఖ్య, జనులసంఖ్య అధికమగుట. ప్రభుత్వం అనవసరమగు పశువులను నిర్మూలించి, పశువుల గుణలక్షణములను వృద్ధిపరచెను. భూములను సస్యశ్యామలముచేసెను. జాతికి విద్యనేర్పెను. ఈ జాతివాళ్లు వ్యవసాయకులు గూడ. చక్కని ప్రదర్శనములు జరిపి, నమూనాలక్రింద కొన్ని భూములను ప్రత్యేకించినారు. సూపర్‌వైజర్లను రిజర్వ్ంతటను ఏర్పాటుచేసినారు.

ప్రతివిద్యాలయమునందును పెద్దవాళ్ళకు ప్రత్యేకంగా ఒక శాఖను నెలకొల్పినారు. రకరకములగు వస్తువులను తయారుచేయుట, వాటిని బాగుచేయుట, వంటచేయుట, బట్టలునేయుట, అచ్చట నేర్పెదరు. 1938 లో చూస్తే ఈ ఆదిమనివాసులు అద్భుతంగా మారిపోయినారు. 19,788 మంది స్నానాలు చేశారట: 3926 మంది తలకడుగుళ్లు జరిపారట. 2,150 ఉత్తరములు వ్రాసినారట. 3099 మంది ప్రథమ చికిత్సపొందారట. 3434 మంది గంటలుమగవారు, 6684 గంటలు ఆడవారు, పనిచేయ గల్గినారట.

పరిశోధనా నివేదికలో ఆఫీసర్ల కందరకు మానుష శాస్త్రజ్ఞానం కావలయునని సలహాయివ్వబడినదని వేరే తెలుప నక్కరలేదు. అంతేగాక స్వదేయుశీలకు పరిపాలనా నిర్వహణంలో బాధ్యత ఇవ్వవలెనని గూడ సూచింప బడ్డది.

స్వతంత్రం అనుభవించుచు, ప్రజాస్వామిక పద్ధతులపై పరిపాలన సాగిస్తూ, క్లార్క్ విస్లర్ వంటి ప్రపంచ ప్రఖ్యాత మానుష శాస్త్రజ్ఞులకు మాతృదేశమగు అమెరికా చేయజాలని పని ఏ మున్నది.

## 11. ఆదిమనివాసుల సమస్యాపరిష్కారము - బర్మా (4)

మానుష శాస్త్రం బర్మాదేశమునందుగూడ ప్రాముఖ్యము వహించుచున్నదనుటకు, అచ్చట ఆదిమనివాసుల సమస్యా పరిష్కారమునకు చేసిన ముఖ్యసలహాలే ప్రబల సాక్ష్యము.

బర్మాలో జనసంఖ్య సుమారు 17 మిలియన్లు. అందులో 3 మిలియన్లు ఆదిమనివాసులు. వీరు యుద్ధసమయములలోకూడా, అరణ్య పర్వత ప్రాంతాల్లో నివసిస్తూ తమసాంప్రదాయములను, ఆచార వ్యవహారములను, కాపాడుకొనుచున్నారు.

మానుషశాస్త్రంయొక్క ప్రాముఖ్యం, దాని ఉపయోగం పరీక్షించుటకుగాను, మొట్టమొదట రెండు జిల్లాలను తీసుకున్నారు. ఒక జిల్లాలో ఉద్యోగస్థులను, మరోజిల్లాలో అనుభవ జ్ఞానములేని మానుష శాస్త్రజ్ఞుని పరిశోధించ వలసినదిగా ప్రభుత్వం నియమించినది. అనుభవజ్ఞులగు ఉద్యోగుల నివేదికకన్న, అనుభవశూన్యుడగు శాస్త్రజ్ఞుని రిపోర్టే, విలువైనదిగా అధికార్లకు తోచినది. అందువలన యుద్ధానంతర పునర్నిర్మాణంలో ఆదిమనివాస సమస్యలకు శాస్త్రీయముగు సలహాలొసగబడినవి.

హెచ్. ఎన్. సి. స్టీవెన్‌స్సన్, బి. ఒ. యి. * ఈ విషయమై వ్రాసిన వాక్యములు గమనీయములు . ఆయన ఇట్లా వ్రాస్తున్నాడు.

అసలు పరిపాలనా సమస్యలలో ప్రధానమైనది, ఏ సిద్ధాంతములపై మనము బర్మాలో ఆదిమనివాసుల సమస్య పరిష్కరింపవలెను ? అనునది. అందుకని ప్రథమంగా మనము కోరేది యేమో తెలుసా ? శాస్త్రీయ పరిచయము లేని పరిపాలనా నిర్వాహకులు, తాము స్వయంగా చూచియు, అర్థము చేసుకొనలేని విషయములను మానుష శాస్త్రజ్ఞులకు తెలుపవలెను.

దీని విషయమై ఏర్పరచిన కమిటీ ఆఫీసర్లందరికి మానుష శాస్త్రమునందు శిక్షణ ఇవ్వవలెనని తీర్మానించినది.

మొట్టమొదటగా ప్రతి జాతిని, ఒక చిన్న ఫెడరల్ యూనిట్టుగా ఏర్పరచి, అట్లాంటి యూనిట్లకు ఒక కౌన్సిల్ సంఘములో ప్రాతినిధ్యము యిప్పించి, ఆ సంఘము తరఫున మంత్రిపదవులు ఇప్పించవలెనని సూచింపబడినది,

పూర్వం బర్మా ప్రభుత్వం ఈ జాతుల విషయములో అవలంబించిన పద్ధతులు రెండు. (1) అసలు వాళ్ళ అవసరములను గుర్తించక పోవటం, (2) ఒకవేళ ఏదైనా పనిచేసినా పౌరుల విషయములో అమలు

* Man · Jan and Feb 1945· Stevenson : Case for applied Anthropology·

జరిపిన చర్యలే వీళ్ల లోగూడా ప్రవేశ పెట్టటం. అందుకనే యీ జాతుల కనర్ధదాయకమగు పద్ధతులు ప్రవేశబెట్టబడినవి.

అందుకనే స్టీవెన్‌సన్ ఈ క్రింది సలహాలిస్తున్నాడు :

1. బర్మా ప్రభుత్వపుటుద్యోగులకు మానుషశాస్త్రమునందు శిక్షణ యివ్వవలెను.

2. జాతులకు సంబంధించిన వ్యవహార కాగితములన్నియు యుద్ధ మూలంగా తగులబెట్టబడినవి. అందుచేత మరల పరిశోధనలు సాగించ వలెను.

3. "మానవ జాతిపరిశోధన శాఖ" (Ethnographic Department) నొకదానిని నెలకొల్పి, యూనివర్సిటీలో ప్రాముఖ్యం ఇవ్వవలెను,

4. ప్రజల సహకారము — సాంఘిక సేవ తీసుకొనవలయును. ఇందులకుగాను స్టీవెన్‌సన్‌గారు శాస్త్రజ్ఞులనుబంపి పరిశోధనలు జరుపవలసి నదిగా Royal Anthropological Institute కు విజ్ఞప్తిచేసినారు.

ఐతే, ఉద్యోగములన్నీ దొరలకే కాదుగదా ?

## 12. ఆదిమనివాసుల సమస్యాపరిష్కారము - న్యూగినీ (5)

న్యూగినీయొక్క మొత్తం వైశాల్యం 93,000 చదరపుమైళ్ళు. ఇది ఆస్ట్రేలియా కామన్‌వెల్తు ప్రభుత్వముక్రింద పాలింపబడుచున్న మాండేటరీస్టేటు. ఇంత వైశాల్యములో షుమారు 37,370 మైళ్ళుమాత్రమే ప్రభుత్వాధీనముక్రిందికి తేబడినది. తక్కిన భాగమంతయు ఆదిమనివాసుల ప్రదేశముక్రిందనే ఎంచబడినది. 1938 లో ఈ అనాదిజాతులసంఖ్య 5,81,342. వీరిక్రింద ప్రభుత్వము ఖర్చుపెట్టునది 5,08.613 పౌనులు. అంటే సగటున మనిషికిషుమారు 1 పౌను వంతునప్రభుత్వం వెచ్చిస్తున్న దన్నమాట. మన దేశంలోగల 2½ కోట్ల సంఖ్యగల ఈ అధఃపతితులకు గవర్నమెంటు షుమారు 52 లక్షలు మాత్రమే ఖర్చుపెట్టుతున్నది. ఎంత వ్యత్యాసము!

ఇందలి ఆదిమనివాసులందరు చిన్నచిన్న గుంపులుగా నివసించు చున్నారు. ప్రతిగుంపు తక్కినవాటితో సంబంధములేని భాషా సాంప్రదాయ విజ్ఞానములను గల్గియుండును. జాతీయంగాగూడ వీరు అనేక భిన్నతరగతులుగానున్నారు. ఈ కారణములచేత ప్రభుత్వమునకు పరిపా

లనా నిర్వహణములో చాల యిబ్బందులు గలుగుచుండును. ప్రభుత్వ బాధ్యతలుసైతము రెండురకములు. ఒకటి జాతుల అభ్యున్నతి. రెండు, దేశముయొక్క ఆర్థిక పునర్నిర్మాణము. పాలకులు తమ కార్యనిర్వహణమునందు ఈక్రింది ఆదర్శములను గల్గియున్నారు.

1. మరీ వెనుకబడియున్న జాతుల ఉద్ధరణ.

2. సభ్యతా - సంబంధముగల్గిన జాతుల అభ్యుదయము.

3. ఆదిమ శ్రామికుల అభివృద్ధి.

న్యూగినీలోని ఆదిమనివాసుల జీవితవిధానములు బహుక్రూరమగునట్టివి. వీళ్ళలో కిరాతక కృత్యములు అధికము. మానవవేట, నరమాంస భక్షణము. వితంతుహత్యలు, శిశుహత్యలు, అంతఃకలహములు సర్వసామాన్యముగా జరుగుచుండును.

ఏజాతికిని సంబంధించని భూమివిషయమై (Noman's land) తగాదాలు సర్వసామాన్యముగా జరుగుచుండెడివి. ఇవియే యుద్ధరూపములు దాల్చెడివి. ఇప్పుడుగూడ అంతే. ప్రభుత్వ పరిపాలనక్రిందకురాని ప్రదేశమందలి అనాగరిక గ్రామములు సులువుగా దర్శించుటకు వీలుగానట్టివి. అట్టి గ్రామములన్నియును కంచెతోడను, ముళ్ళతోనిండిన గోతులతోడను, బల్లెములతోడను, చుట్టబడి సంరక్షింపబడుచుండును. పూర్వకాలమందు ఈ జాతులన్నీ యూరోపియనులను నానా కష్టములపాలు చేసినవి. కొందరిని బాణములతో సంధించి చంపిరి. మరికొందరిని చిత్రవధ గావించిరి. ఇప్పటికిగూడా ఇట్టి విద్వేషములు గలవు. కొన్ని స్థలములు ఇప్పటికిని యూరోపియనులకు ప్రవేశార్హములుకావు. ప్రభుత్వము స్వాధీనపరచుకొనిననేతప్ప, యూరోపియనులు అందు ప్రవేశించుటయనగా మృత్యువు నెదుర్కొనుటయే. పూర్వకాలం వీళ్ళు సముద్రపుటొడ్డున పడవలను, భూభాగమందు వర్తకులను దోచెడివారు.

కాని అంతులేని వలసప్రవాహములు న్యూగిన్నీ ప్రజలను కొంతవరకు మార్పుచేయకపోలేదు. ప్రస్తుతము ప్రభుత్వము నెదుర్కొనిన సమస్య భాషావిషయము. ఈ విషయములో మతప్రచారకులు నిజమైన సేవ సల్పినారు. జాతుల భాషలను వారు బాగుగా నేర్చుకొనినారు. లూథరిక్ మిషన్‌వారు మెలనేషియన్, పాపువా, భాషలను బాగుగా అభ్యసించినారు. రోమన్‌కాథెలిక్, మెథడిస్టు చర్చివారు రబాలు జిల్లాయందలి

ఆదిమనివాసులయందు తమ మతమును వ్యాపింపచేయుచున్నారు. కాని ఇంగ్లీషుభాష మాత్రము దేశమందంతటా జాతీయభాషగా అంగీకరింప బడినది.

1921 లో న్యూగినీ గవర్నరు సర్. హెర్బర్టు ముర్రె ఆదిమ నివాస సమస్యను పరిష్కరించుటకును, జాతులను పరిశోధించుటకును, ఒక మానుషశాస్త్రజ్ఞుని నియామకము చేసేను. కొంతకాల మయినతరువాత ఆస్ట్రేలియా ప్రభుత్వము సిడ్నీ విశ్వవిద్యాలయమునందు మానుషశాస్త్ర శాఖ నొక దానిని తెరిచి, దానికి గ్రాంటు నొసగినది. ఇందు ఉద్యోగస్థులకును, మతప్రచారకులకును శిక్షణ యొసంగబడును. ఇంతేగాక, ప్రతి సంవత్సరము సమర్థులగు యువకులను కొందరినేరి, వారిని ప్రొబేషన్ ఉద్యోగులుగా నియమింతురు. నిర్ణీతకాలానంతరము మానుషశాస్త్రము నందు శిక్షణ బొందుటకై సిడ్నీ విశ్వవిద్యాలయమునకు బంపబడెదరు.

ప్రతిజిల్లా ఒక ఉద్యోగస్థుని అధీనమున నుండును. * అతడు స్వదేశీయుల వ్యవహారశాఖకు బాధ్యుడు. అతడే జిల్లాకంతటికిని మేజ స్ట్రేట్. ఏదైనను తిరుగుబాటువచ్చినచో సులభముగా అణచుటకు వీలైన ప్రదేశములో తన కార్యస్థానమును నెలకొల్పును. గ్రామ పరిపాలనలో సమర్థతగల స్వదేశీయులకు బాధ్యతగల ఉద్యోగముల నిత్తురు.

ప్రభుత్వము తోటలలో పనిచేయువారి అభివృద్ధి కొరకును, గను లలో పనిచేయువారి శ్రేయముకొరకును ప్రత్యేకముగా ఆఫీసర్లను నియ మింతురు. కార్మికుల వృత్తులు 'Native Labour Ordinance యొక్క అధికారము క్రిందకు తేబడినది.

ఇదీ న్యూగినీ చరిత్ర.

## 13. ఆదిమనివాసుల సమస్యాపరిష్కారము - రష్యా (6)

రాజకీయంగాను, సైనికంగాను, శాస్త్రీయంగాను ప్రపంచములో కెల్ల సర్వముఖాభి వృద్ధిగాంచుచున్న, సోవియట్ రష్యాలో ఆదిమనివాసుల సమస్యలు స్వార్థరాహిత్యంతోను, ఉత్సాహంతోను, మానవసేవా తత్పరత తోను, శాస్త్రీయంగా అన్నివిధములా సంతృప్తికరంగా పరిష్కరించా

* Oceania 1939 - 39 J R Halligan - Administration of native races.



ఉంగరాల జుట్టుగల చెంచుబాలుడు
హైద్రాబాద్ జనాభా రిపోర్టు 1931 నుండి

రంటే, పాఠకులు ఆశ్చర్యపడవలసిన అవుసరములేదు. తక్కిన దేశాలలో ఈసమస్యను పరిష్కరించారంటే, అది పాలకుల దయాధర్మములపైన ఆధారపడిన విషయం: పాలకులకు, పాలితులకు మధ్యగల అఖాతం అందు వ్యక్తమగును. నేను పైన తెల్పిన 5 దేశాలలోను తెల్లవారి నిరంకుశత్వం, నల్లవారిబానిసత్వం; ఒకరిఅధికారం, రెండవవారి నిస్సహాయత; ఒకరి సామ్రాజ్యతత్వ భూయిష్టమగు పరిపాలనాపద్ధతి, రెండోవారి శతాబ్దముల తరబడి అలవడిన పారతంత్ర్యపు లొంగుబాటు - గోచరమగుతవి. కాని రష్యాలో మాత్రం ప్రజలలో ప్రజలకుగల సామరస్యం, సర్వమానవ సౌభ్రాతృత్వం, సార్వజనీయకళ్యాణం, సమస్త జాతుల ఐక్యత, - ఈ ఆదర్శములు ఆచరణలో పెట్టబడినవి.

రష్యన్ ఫెడరల్ రిపబ్లిక్ షుమారు 100 మంది విశిష్ట జాతులతో నేర్పరపబడినది. జార్ ప్రభుత్వంలో వీరి స్థితిగతులు బహు క్లిష్టంగా ఉండెడివి.

మైనారిటీ జాతుల పరిపాలన విషయములో జార్ ప్రభుత్వం అనేక సమస్యలను లేవదీసినది. జారు చక్రవర్తుల నిరంకుశత్వము, క్రౌర్యము, భయోత్పాదకరమైన పరిపాలనా విధానము ఈ జాతుల ఆర్ధిక దురవస్థలకును, నిస్సహాయతకును దారితీయుటయేగాక, వారినన్నివిధముల అధోగతిలోనికీడ్చినవి. ప్రతిజాతియందును దోపిడీ విధాన ఫలితముగ చిన్న చిన్న జమీందారులు, వర్తకులు, పూజారులు, భూస్వాములు బయలు వెడలి, పేదలను, కర్షక, కార్మికులను తమ స్వార్ధముకై ఉపయోగించుకొనినారు. దీనికితోడు ప్రజాసామాన్యమునందలి పిరికితనము, నిస్సహాయత, మూర్ఖత, మూఢనమ్మకములు, ప్రాకృతమగు సాంఘిక అలవాట్లు. వీరి కుతంత్రములకు, స్వార్ధపరత్వముతో గూడిన చేష్టలకు, దోహదమొసగినవి.

జారు చక్రవర్తులు సల్పిన మహాపరాధములలో నొకటి జాతుల భాషలను, ఆచారవ్యవహారములను గుర్తింపక పోవుట. దీనికితోడు ఆదిమనివాసులపై రష్యన్ జీవితపద్ధతులను బలవంతముగరుద్ది వారికితీరని నష్టము గలుగచేసినారు. జాతుల విశిష్టత, ప్రత్యేకతలు తొలగిపోయినవి.

ఇట్టి సంకట పరిస్థితులలో సోవియట్ ప్రభుత్వము 1917 లో అధికారము స్వీకరించినది. ఈ జాతుల విషయమై క్రొత్తపద్ధతులను అమలునందు బెట్టినది.

సోవియట్ ప్రభుత్వము* జాతుల ఆర్థిక స్థితిగతులను చక్క బరచి వారి జీవితములలో శాంతి సౌఖ్యముల నొసగుటయేగాక జాతులలో పాతుకుపోయిన చెడుపద్ధతులను, జీవిత అలవాటులను, మనోప్రవృత్తులను. అనుకరణలను కూకటంట పెళ్ళగించవలసి వచ్చినది. అసలు సోవియట్ ప్రభుత్వం, ఈ జాతులన్నీ జార్ప్రభుత్వపు సామ్రాజ్యతత్వపద్ధతి మూలంగా ఆర్థిక అగచాటులకును, లోపభూయిష్టమగు రాజకీయ వాతావరణమునకును, సంకుచితమగు వైజ్ఞానిక దృక్పధమునకును, బలి అయినారని గ్రహించినది. అందువలన ఈ జాతుల పరిసరములందు చక్కని వాతావరణమును కల్పించి, వారిని తమ అమాయకత్వమునుండియు, మత్తునుండియు లేవదీసి ఉపయోగకరమగు పౌరులుగా తయారుచేయ నిశ్చయించినది. ఇందులకై ముఖ్యముగా 3 పద్ధతులు అమలునందుబెట్టినది. అవి: (1) ప్రత్యేక హక్కులు, అధికారములు ఏజాతికీ లేకుండచేసినది. (2) ప్రతి జాతికిని సంపూర్ణమగు సమానత్వము ప్రసాదించినది. (3) జారు చక్రవర్తి అధికారమునకు లోబడిన భూభాగములు, జాతులు, ఎప్పుడు పడితే అప్పుడు సోవియట్‌నుంచి విడిపోవునట్టి హక్కును గుర్తించినది.

వీటితరువాత ప్రతిజాతీగూడ ఒక్కొక్క రాజకీయ ప్రమాణము చేయబడెను (Political group). ప్రస్తుతం రష్యాలో 7 యూనియన్ రిపబ్లిక్కులు, 15 (ఇప్పుడు 16) అటానమస్ రిపబ్లిక్కులు, 20 అటానమస్ ప్రదేశములు, జిల్లాలు ఉన్నవి (Autonomous Regions and Districts).

రష్యాలో 26 రకముల ఆదిమజాతులు నివసించుచున్నవి. వీరి జనసంఖ్య షుమారు 1½ లక్షలు. ఈ జాతులలో ముఖ్యమైనవి చుక్‌చీ, ఎస్కిమో, టుంగూ, కోర్యక్, జార్జియన్, ఆర్మీనియన్, తాజిక్, టర్కుమోనియన్, ఉజ్బెక్, కరేలియన్, కజక్, తాతార్, ఖిర్గీజ్, మొదలగునవి.

ప్రధమంగా 1925 లో 'ఉత్తరదేశీయుల అభివృద్ధి సంఘము' (Committee for the Advancement of Northern Peopler) అనునది స్థాపింపబడి, వారి వైజ్ఞానిక అభివృద్ధిని కనిపెట్టుచుండెను. ఈ జాతులలో చాలవరకు తిరుగుబోతులు. వీళ్ళకు శుభ్రత అనినను, వైద్య

* Mr Archie Phinney - "Racial Minorities in the Soviet Union" Pacific Affairs 1935.

మనినను, చివఁకు ఆరోగ్యప్రదమగు భోజనమనినను ఏమియు తెలియదు. షామాను అనే పేరుగల మంత్రవేత్తలు, పూజారులు, చిన్నిచిన్ని ప్రభువులు. వీళ్ళ ఐహికాధ్యాత్మిక జీవితములపై అధికారము వహించి యుండిరి. వీళ్లు పురాతన పద్ధతుల ప్రకారం రైన్‌డీర్లను (ఒకవిధమగు లేళ్లు) పెంచుట, చేపలను బట్టుట, వేటాడుట మొదలగు వృత్తులు చేయుచుండిరి. ఈ జాతుల భాషలలో దేనికి కూడ లిపిలేదు.

అందుకని పైనితెల్పిన కమిటీ, స్కూళ్ళను, ఆస్పత్రులను, స్థానిక ప్రభుత్వములను స్థాపించి, జాతుల కౌన్సిళ్ళను నెలకొల్పెను. మొట్టమొదటగా స్కూళ్లయందు రష్యన్ భాషలోనే బోధనచేయబడినది. అప్పుడు జాతుల భాషలను నేర్చుకొనిన ఉపాధ్యాయులెవరును లేరు. ఇట్టిస్కూళ్లనుండి సామర్థ్యముగల విద్యార్థులను లెనిన్‌గ్రాడ్‌కుపంపి అచ్చట "సంఘసేవ" యందు శిక్షణ నొసగెడివారు. ఈజాతుల భాషలన్నిటికిని లాటిన్ అక్షరములలో లిపి నిర్మింపబడినది. అందుకుగాను 26 భాషలలోను ముఖ్యమైన 14 భాషలుమాత్రము సాహిత్యవంతములని ప్రభుత్వముచేత గుర్తింపబడినవి. జాతులనుండియే ఉపాధ్యాయులు నియమింపబడి పిల్లలకనుగుణ్యమగు పాఠ్యపుస్తకముల నచ్చొత్తించి, బోధన సహితము ఆయా "జాతుల భాష"లలోనే చేయబడినది.

ప్రతి అనాదిజాతియు ఒక్కొక్క రాజకీయసంస్థ నేర్పరచుకొనెను. అంతేగాక, సహకారసంఘము, ఆసుపత్రి సహితము స్థాపించుకొనినది, 1926 లో 667 వర్తకకేంద్రములు గలవు. 1934 లోవాటిసంఖ్య 2721. వరకు పెరిగెను. పురాతన వ్యవసాయకపనిముట్లు తొలగింపబడి వాటిస్థానే నవీనపరికరము లమలులోకి వచ్చెను. వ్యవసాయము సమిష్టిపద్ధతులపైననే నేర్పబడినది. చేపలపరిశ్రమసహితము నవీనమార్గము ద్రొక్కినది. మోటారు బోట్లు వృద్ధిపరుపబడినవి. సమిష్టిగానేపనిచేయుట విధాయకమయ్యెను.

వేటలోసహితము క్రమశిక్షణ ప్రవేశపెట్టబడెను. నక్క, సీల్ పోలార్ గుంటనక్క, నీలపునక్క మొదలగువానిని ఇష్టమువచ్చినట్లుగా నాశనముచేయుటకు సోవియట్ ప్రభుత్వము ఒప్పుకొనలేదు.

సభ్యసంఘమునకు ఆదిమనివాసులు దూరముగానుండుటను ప్రభుత్వము నిరోధించుటయేగాక, వారినందరిని నాగరికతకు దగ్గరగాజేర్చినది. దీనికిగాను ఆదిమ ప్రదేశములన్నియు రేడియోస్టేషన్లు, విమానములు,

రైల్వే మార్గములు మొదలగువానితోడను, విద్యుచ్ఛక్తితోడను, నింప బడినవి.

అనేక కేంద్రములయందు ఉత్తరదేశీయుల సంస్థలు (Institute of northern people) నెలకొల్పబడి, ఆదిమ ప్రదేశములందు ఉద్యోగములు నిర్వహించుటకుగాను జాతులందలి 18, 20 సంవత్సరములమధ్య వయస్సుగల యువకులకు 4 సంవత్సరములు శిక్షణ నొసంగుచున్నారు.

మాస్కోలోని 'Institute of Nationalities' అను సంస్థలో ఉన్నత తరగతుల విద్యార్థికులు పరిశోధనలు సల్పుటకు అవకాశము లున్నవి. ఆర్థికశాస్త్రము, విజ్ఞాన శాస్త్రము, రాజకీయములు, సాంఘిక సేవాప్రచారము, సభ్యతా సంబంధము, ముఖ్యముగా మానుషశాస్త్రము — మొదలైన శాస్త్రములందు క్రమశిక్షణ నొసగి, పరిశోధనలుచేయింతురు.

మాస్కోలోని "Pedagogical institute of nationalities" అను మరియొక సంస్థ 150 తెగలను గురించి పరిశోధనలు సల్పినది.

వివిధ జాతులకు ప్రత్యేక విద్యాలయములు, నాటకశాలలు, సంగీత నృత్య కేంద్రములు స్థాపింపబడెను. ఇంతేగాక రహదారీ నిర్మాణాభివృద్ధి విద్యుత్‌ప్రసారాభివృద్ధి, యంత్రాగార ఉత్పత్తి, వ్యావసాయక సమిష్టీకరణాభివృద్ధి మొదలగునవన్నియు చేయబడినవి. ఇవన్నియు ఆదిమ నివాసుల జీవితాదర్శములను, దృక్పథమును సంపూర్ణముగా మార్చివైచినవి. 1935 లో ఈ ప్రాంతాలలోచూస్తే, 4,250 ట్రాక్టర్లు, 70,000 నవీనములగు నాగళ్లు కన్పడినవి. ఇది ఎంతటి అభివృద్ధి !

రష్యన్‌ప్రభుత్వం - జిప్సీజాతుల*సమస్య :

అన్నిజాతులు ఒకయెత్తు, జిప్సీ లేక తిరుగుబోతు జాతులు ఒకఎత్తు. సోవియట్ ప్రభుత్వం ఈ విషయములోగూడ మార్గదర్శిఅయినది. రష్యాలోని తిరుగుబోతులుగూడ తక్కిన చోట్లవలెనే ఇళ్లు, వాకిళ్లు లేక, ఊరూరా తిరుగుచు పొట్టపోసుకొనేవారు. రోట్లవెంట నడవటమన్నా అదృష్టాన్నిగూర్చి చెప్పటమన్నా తిరుగుబోతులకు మహాయిష్టము. ఇదే వాళ్ళ గుణములలోని విచిత్రమగుప్రత్యేకత. కొందరుబిచ్చమెత్తుచున్నారు.

* సిడ్నీ, బియాట్రిస్ వెబ్ దంపతులిద్దరూ Soviet Communism లో రచించిన ఈవిషయమై కొంత వ్రాయబడినది.



రష్యాయందలి ఆదిమ నర్తకి

**బొరోడిన్‌గారి 'సోవియట్ సైబీరియా' నుండి**

కాని రష్యాలో వీళ్ళసంఖ్య షుమారు 60,000 : మన దేశంలోనో 10 లక్షలు ?

కాని తక్కువ జాతులలో ప్రవేశపెట్టబడిన సంస్కరణల ఫలితముగా జిప్సీలకు ప్రభుత్వ పద్ధతులు నచ్చినవి. వాళ్ళు దిమ్మరి పద్ధతులను వదలుకొని, స్థావర నివాసం ఏర్పరచుకోటం, లాభకరమగు వ్యవసాయం వంటి శాంతియుత జీవన పద్ధతులయందభిమానం పెంపొందించుకొనటం, చేయుచున్నారు. ఐతే ప్రభుత్వంవారు వీరి విషయంలో ఏవిధమైన శాసనములుగాని, ఒత్తిడిగాని చేయలేదు. అట్లాచేసినను వారిలోమార్పులురావని ప్రభుత్వం తలచినది. అందుచే ప్రధమంగా వారిలో ప్రచారం సల్పింది. తక్కువజాతులతోగల సంబంధ ఫలితంగా జిప్సీలలో మార్పువచ్చింది. ఈ రోజుల్లో వీళ్ళకొరకై ప్రత్యేకంగా వినోదశాలలు, నృత్యశాలలు, సమిష్ఠికరములగు వ్యవసాయిక ప్రదేశములు, ఏర్పాటుచేయబడినవి. జిప్సీపిల్లల కొరకై ప్రత్యేకపు పాఠశాలలలోను, లేనిచోట్ల మామూలు పాఠశాలలోనే ప్రత్యేక తరగతులలోను, చిన్న బిడ్డలకు కిండర్‌గార్టెన్ పద్ధతిలోను శిక్షణనిచ్చుచున్నారు. జిప్సీనాట్యము,జాతీయపాటలు, కవిత్వం మొదలగువాటికి సోవియట్ ప్రభుత్వం తగు ప్రోత్సాహం ఇచ్చింది.

ఎట్టి శాస్త్రీయపద్ధతులు ! ఏమి చక్కని ఫలితములు !! ఎల్లాంటి శాంతిభద్రతలు, సర్వసౌఖ్యములు !!! రష్యాప్రభుత్వ ఆదర్శములగూర్చి మనకు భేదాభిప్రాయము లుండవచ్చుగాక ! కాని ఎంత నిర్దుష్టంగా, ప్రజాశ్రేయస్సుకొరకు ప్రభుత్వం ఎట్టి నూతనపంధాలో, శాస్త్రీయ పరిజ్ఞానముతో, ఎంత మార్పుతెచ్చింది ! దీనివలన సోవియట్ ప్రభుత్వం నిజమైన మానవసేవ చెయ్యగలిగింది. భారతదేశ ఆదిమనివాసుల జోహార్లకు రష్యా ఎంతయు తగినది!



## చతుర్ధభాగము

# ఆంధ్రదేశ ఆదిమనివాసులు

## ఉపోద్ఘాతము

ఆంధ్రదేశమందలి ఆదిమనివాసులుగూడా సభ్యతా — సంబంధ మిటీవల అలవరచుకొనుచున్నారు. ఇది నిజమునకు మంచిదే. నాగరికత యందలి మంచిగుణము నలవరచుకొనుటయే సరియగుపద్ధతి. కాని, దేశమందలి తక్కినజాతులవలెనే, క్రమశిక్షణతో కూడుకొనని యీ నాగరికతా—సంబంధమువలన ఆంధ్రజాతులు అనేక ఇడుముల బడుచున్నాయి.

నేను జాతులను రెండుభాగములక్రింద విభజించితిని. (1) అరణ్యములయందును, కొండలయందును నివసించుచున్న కోయ, సవర, చెంచు, గడబజాతులు (2) మన పరిసరములలోనే నివసించుచు, దొంగజాతుల వలె చూడబడుచున్న ఆదిమ, తిరుగుబోతు జాతులు. వీటిలో ఎరుకలు, ఏనాదులు, లంబాడీ, దొమ్మరులు — ముఖ్యము.

ఈ జాతులన్నీ తమ ప్రత్యేక కుల కట్టుబాట్లు, సాంఘిక పద్ధతులు మొదలగువానితో తమ జాతీయ జీవితము నిప్పటివరకు నిలుపుకొనినవి. ఈ భాగములయందు పైచెప్పిన జాతుల జీవిత విశేషములనుగూర్చి ముచ్చటించెదను.

## 1. లంబాడీలు

లంబాడీలు మనదేశంలో అనేకచోట్ల కనబడుచున్నారు. ముఖ్యంగా వీరు మైసూరు, హైద్రాబాద్, మధ్యరాష్ట్రాలు, సంయుక్తరాష్ట్రాలు, మధ్య ఇండియా, బొంబాయి రాజధానులయందును, మన మద్రాసు రాజధానిలోని విశాఖపట్టణం, దత్తమండలం జిల్లాలు, గుంటూరు, కృష్ణా జిల్లాలలోను, దక్షిణమున కోయంబత్తూరు, ఆర్కాటు జిల్లాలలోను వ్యాపించియున్నారు. హైద్రాబాద్ రాజ్యంలో ముఖ్యంగా ఆదిలాబాద్, పర్భణీ, కరీంనగర్, వరంగల్, నల్లగొండ జిల్లాలలో కనబడుచున్నారు. నేను పరిశోధనలు సల్పిన కృష్ణా, గుంటూరు, నల్లగొండ జిల్లాలలోని లంబాడీలు వరంగల్,

నల్లగొండ జిల్లాలలోనుండి మన ప్రదేశాలకు జీవనోపాధికై వలసవచ్చిన వారై యున్నారు.

వీరి విజ్ఞానానికి, సాంఘిక వ్యవస్థలకు హైద్రాబాదే కేంద్రభూమి అని చెప్పవచ్చు. 1931 వ జనాభా లెక్కలప్రకారం చూస్తే ఆ రాజ్యంలో 3 లక్షలమంది లంబాడీలు ఉన్నట్లు తేలుచున్నది. వీరి హైద్రాబాద్ ఉనికిని గూర్చి వ్రాస్తూ, డబ్ల్యు. క్రూక్ "తక్కిన రాజధానులలో నివశిస్తూ ఇతర జాతులతో కలిసిపోయి సంకరమయిన తెగకంటె దక్కనులోనున్న లంబాడీల తెగలోనే ఎక్కువగా పురాతన పద్ధతులు, కట్టుబాట్లు కన్పట్టుచున్న" వని వ్రాసినాడు.

వీరు దేశమంతా వ్యాపించినవాళ్ళగుటచేత ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క పేరుతో వ్యవహరింపబడుచున్నారు. కోయంబత్తూరు, ఆర్కాటు జిల్లాలలోను, దత్తమండలములలోను వీరిని సుగాలీలు లేక సుకాలీలు అని పిలుస్తారు. తక్కిన మద్రాసు రాజధాని జిల్లాలలో లంబాడీలంటారు. మైసూరు, హైద్రాబాద్, సి. పి., యు. పి. లలో "బ్రింజారులు" లేక "బంజారు"లంటారు. ఒరిస్సా, జయపూరు, ప్రాంతాల్లో "బొయిపారీ" లంటారు. బొంబాయి రాజధాని, కర్ణాటక జిల్లాలలో లమనులు, లవనులని మారుపేర్లతో వ్యవహరిస్తారు, ఒకేజాతికిచెందిన వీరికి ఇన్ని మారుపేర్లు రావటానికి గల కారణములేమి? ఒక్కొక్క ప్రదేశంలో వీరు సల్పిన వ్యాపారాలనుబట్టి వీళ్ళకీ మారుపేర్లు వచ్చినవి. ఏమైనా వీరు వస్తువులు, ధాన్యం,ఉప్పు మొదలైనవి సరఫరాచేసే ఒక తిరుగుబోతుజాతి అనటంలో సందేహంలేదు. వీరు ఏ వస్తువు సరఫరా చేసినా, పరిశోధకులు వివిధ అభిప్రాయాలతో ఉన్నారు; కొందరు వీరు అడవులలో తిరిగేవాళ్ళని లేక బియ్యం వ్యాపారం చేసేవాళ్ళని, మరికొంతమంది వీరు వక్కల వ్యాపారం చేసేవాళ్ళని, అభిప్రాయం వెలిబుచ్చినారు. కాని నా యుద్దేశం ప్రకారం వీళ్లు రవాణాచేసే వస్తువులలోకల్లా ఉప్పు, ధాన్యం ముఖ్యమైనవి. గ్రిగ్సన్, ఎంథోవన్‌వంటి పరిశోధకులుగూడ ఇట్లాంటి అభిప్రాయమే వెలిబుచ్చినారు. దీనికి తార్కాణంగా ఇప్పటికీగూడ ప్రతి లంబాడీవద్ద గోనెలు కుట్టేసూదులు ఉంటవి. పూర్వం ఈ గోనెల్లోనే ధాన్యం, ఉప్పు ఎడ్లమీద వేసికొని "బిడారీ" వ్యాపారం చేసేవారు. ఇట్టి సూదిగనుక ఎవ

_రైనా దొంగిలించినా, లేక పోగొట్టుకొనినా అతనికి కులనాయకుడు రు. 12–8–0 మొదలు రు. 61–0–0 వరకు జరిమానా వేస్తాడు.

శాస్త్రజ్ఞులలో ' వీరు ' అసలు అనాదిజాతివారేనా ? అనే ప్రశ్నపై అభిప్రాయభేదములున్నవి. వీరి "తిరుగుబోతు" "బిడారీ" వ్యాపారము వలననే వీరిని "ఇండియన్ జిప్సీ" లని కొందరు పిలుతురు; వెరియర్ ఎల్విన్‌గూడా వీళ్ళని "జిప్సి" లన్నాడు. వీరి ఆటవిక నివాసము, వీరు ధరించే దంతపు సొమ్ములు, జీవిత పద్ధతులనుచూస్తే వీరుగూడ ఆదిమ నివాసులేఅని అనిపిస్తుంది గాని, వీరు ఆరాధించే దేవుళ్ళు, కులకట్టుబాట్లు, కొన్ని చూస్తే సభ్య సంఘములోనుండి వ్యాపారరీత్యా బయలుదేరి, దేశ ములు తిరుగుచూ రానురాను ఒక కులముగా పరిగణింపబడ్డవారేమో నని అనిపిస్తుంది. గ్రిగ్సన్ ఉద్దేశ్యము ప్రకారము చూస్తే, వీరు అసలు రాజపుత్ర స్థానంలోనుంచి వచ్చిన వాళ్ళనిన్నీ, కాని అనాదీయులు కారనిన్నీ, అయి నప్పటికిని ఆదిమనివాసుల సంపర్కము ఎక్కువగా వీళ్ళల్లో కన్పిస్తున్న దనిన్నీ, తెలుస్తుంది. మధ్యరాష్ట్రాలలోని నిమారుజిల్లాలోని గోండ్లు, కోర్కులు, మొదలయినవాళ్ళు లంబాడీజాతిలో కల్పుకొనబడినట్లు గ్రిగ్సన్ తెలుపుచున్నాడు. ఐతే ఈఅభిప్రాయాన్ని పూర్తిగా వ్యతిరేకిస్తూ ఆర్. ఇ. ఎన్‌థోవెన్ ఐ. సి. ఎస్. వీరు ఆదిమ నివాసులేనని తేల్చి చెప్పినాడు. అసలు "లంబాడీ" పదము కాబూలునదికి వుత్తరపైపుననున్న "లాంఘం" అనే ప్రదేశంలో నివసించుటవల్ల వచ్చినదనీ, గ్రీకు భూగోళ శాస్త్రజ్ఞుడగు "టాలమీ" పేర్కొనిన జాతుల జాబితాలో "లంబటాయి" అనే లంబాడీ లకు సన్నిహిత పదము ఉన్నదనిన్నీ అందుచేత "లంబటాయి" పదము నుండే ప్రస్తుతం వాడుకలో ఉన్న "లంబాడీ" పదము వచ్చినదనిన్నీ తెల్పినాడు. ఏమైనప్పటికిన్నీ లంబాడీలు అనాది జాతివాళ్ళనే నిస్సంశ యముగా తెల్పవచ్చు. కాని కాలక్రమేపి ఉత్తర హిందూస్థానమందలి రాజపుత్రులు మహారులువంటి జాతులలోకలసి ఇప్పుడు వీళ్ళు ఏజాతికి చెందుతారో చెప్పడానికికూడ వీలులేనంత జాతి సాంకర్యమును పొంది నారని తోస్తున్నది.

లంబాడీలు పూర్వకాలములో చాల ప్రసిద్ధి పొందిన వ్యాపారులు. వీరి వ్యాపారము మొగలు చక్రవర్తులకును, మహారాష్ట్రులకును, ఇంగ్లీషు వారికిని, యుద్ధములలో సహాయికారిగా ఉండేది. The Abbe J. A.

Dubois వీరి వ్యాపారాన్ని వర్ణిస్తూ సైన్యాలకు ధాన్యమును సరఫరా చేయుటలో వీరు చాల నిపుణులనిన్నీ, తమ ఎద్దులమీద ఒక ఊరినుంచి ఇంకొక ఊరికి ధాన్యము, బెల్లము మొదలయినవి సప్లయి చేసేవాళ్ళనిన్నీ, వ్రాసినాడు. కారన్ వాలీస్‌ప్రభువు మైసూరు టిప్పుసుల్తానుతో చేసిన యుద్ధములో ఈ లంబాడీలు ఇంగ్లీషువారికి ఎక్కువగా సాయపడ్డారట. అనంత కృష్ణ అయ్యర్ ఈ విషయం గూర్చి వ్రాస్తూ మైసూరులో ఉండే ఆంగ్లప్రతినిధితో 1½ లక్షల రూపాయలకు 25 వేల బస్తాల ధాన్యమును సరఫరా చేయుటకు లంబాడీలు ఒప్పుకొన్నారనిన్నీ, వీరుచేసిన సహాయమువలననే శ్రీరంగపట్టణము ఇంగ్లీషువారి వశమైనదనిన్నీ తెలియజేసినాడు.

ఇ. థర్‌స్టన్ ఇంకొక విషయమైవ్రాస్తూ 15 వ శతాబ్దములో ఒరిస్సాలోని జయపూర్ రాజగు వినాయక్‌దేవుపైన ప్రజలు తిరుగుబాటు సల్పి అతనిని పదభ్రష్టుని చేసినపుడు ఈ లంబాడీలే అతనికి సాయముచేసి అతనిని మళ్ళీ సింహాసనమెక్కించిరని తెలిపినాడు.

పైవాటినిబట్టిచూస్తే, లంబాడీలు వెనుకటిరోజుల్లో— అంటే బ్రిటిషు ప్రభుత్వము మనదేశములో స్థాపించబడకపూర్వము—రైళ్లు రాకపూర్వము చాల ప్రాముఖ్యము వహించినారని తెలుస్తున్నది.

అసలు వీళ్లు మన దక్షిణదేశానికి రావటానికిగూడ వ్యాపారమే ప్రధానకారణమైనది. వీరి అసలుదేశము రాజపుత్రస్థానము. వీరుమాట్లాడే భాష రాజస్థానీభాష. సరఫరాచేస్తూ మొగలు సైన్యముతోపాటు దక్కను ప్రవేశించినారు. వీళ్ళకు అసలు మన ప్రాంతాలలో భిక్షపెట్టినది ప్రథమ హైదరాబాదు నవాబైన అసఫ్‌జా I. వీరి రవాణా నైపుణ్యమునకు మెచ్చుకొని నవాబుగారు వీరిని ఎప్పుడూ తనదగ్గరనే అట్టిపెట్టుకోవలెనని కోరినాడు. అప్పుడు లంబాడీల నాయకులగు జంగీ భంగీ అనే యిద్దరు 80 వేల ఎద్దులతో పాదుషాగారి సేనలకు ధాన్యము సరఫరా చేసేవారు. తమకు తిండి దొరుకుటలేదనిన్నీ, తమ పశువులకు మేత, నీళ్ళు సరిగా అందుటలేదనిన్నీ, అందుచేత తమదేశానికి వెళ్లెదమని బెదరించేటప్పటికి, వారికి నవాబుగారు ఈక్రింది హుకుము జారీచేశారు.

"మీకు నీళ్లు దొరకకపోతే నా సైనికుల పాత్రలలోనివి తీసుకొపొండి. మేత దొరకకపోతే వాళ్ళ యిళ్ళ కప్పులమీదనుండి సంపాదించండి. రోజుకు మీరు 3 ఖూనీలు చేసినను క్షమిస్తాను. కాని నా సైన్య

ములు ఎక్కడఉంటే అక్కడ మీరు మీ ఎద్దులతో ఎప్పుడూ హాజరుగా ఉండాలి."

ఈ ఫర్మానా ప్రస్తుతము పర్భినీజిల్లా హింగోనీ తాలూకాలోని "మిసే" అనే గ్రామములోని నాయకుడిదగ్గర ఉన్నది. యితనిని లంబాడీ ప్రభువుగా హైద్రాబాదు ప్రభుత్వము గుర్తించుతున్నది.

మన ప్రాంతములలోని ఎఱుకిలు, యానాదులవలెగాక లంబాడీలు మంచి బలిష్టులు. పొడగరులు. వీరి స్త్రీలుగూడ అందముగానూ ఆరోగ్యముగాను ఉంటారు. మూర్ వీళ్ళనుగూర్చి వ్రాస్తూ, "ఇండియాలో మేము ఎక్కడా చూడనంత బలిష్ఠులేగాక లంబాడీ స్త్రీలు ఎంత కష్టమునైనను అతి సులువుగా చేస్తారని" వర్ణించాడు.

వీరిగ్రామాలకు తండాలంటారు. సామాన్యముగా యివి సభ్యగ్రామాలకు దూరంగా కట్టబడతవి. ఒక్కొక్కతండాలో 15, 20 గుడిసెలు చాల చిన్నవిఉంటవి. ప్రతి గ్రామంచుట్టూ కంచె వేసుకుంటారు. దీనికి కారణము దుష్టగ్రహాలు తమగ్రామాలలో అడుగుపెట్టకుండ తమ కుల దేవత భవానీదేవిచేసిన కట్టుబాటేనట. ప్రతి పదిసంవత్సరాలకు లేక అంత కంటే తక్కువకాలంలోకాని, వారు తండాలను క్రొత్తప్రదేశములకు జరుపుతారు. ముఖ్యముగా వారిలో తగాదాలువచ్చినా, అంటువ్యాధులు తగిలినా, దుష్టగ్రహాలు తిరుగుచున్నవని అనుమానముతోచినా యిల్లా తండాలు జరపటం వారి సాంఘికజీవనములో పరిపాటిఅయినది.

లంబాడీలు తిరుగుబోతు లగుటమూలంగాను, వాళ్ళ ఆర్థిక వృత్తులు గూడ వాళ్ళ ద్రిమ్మరితనముమీద ఆధారపడుట మూలంగాను, ప్రతి కుటుంబానికి 2 ఇళ్లువుంటవి. చెంచువాళ్ళల్లోగూడ ఈ ఆచారమే కనిపిస్తున్నది; ఒక గుడిసె తండాలోఉంటుంది. రెండవది మాత్రము ప్రయాణములు చేసేటప్పుడు ఉపయోగించే డేరా. అయితే యీ రోజుల్లో యీ డేరాలు అంతగా కనపడుటలేదు.

లంబాడీలకు క్రొత్తవాళ్ళంటే అనుమానము జాస్తి. అంతేగాక సిగ్గుకూడ పడతారు. ఒకసారిగనుక అనుమానించారంటే యింకా మనకు ఏమీ సహాయము; చేయరు సరికదా, హానిచేయుటకుగూడ వెనుదీయరు. కాని వీరు అమాయకులు. ఎవరినైన నమ్మితేమాత్రము చాల ఆదరణ చూపిసారు.

అతిథులను లంబాడీలు బాగా గౌరవిస్తారు. ఎవరైనా అతిథులు తండాకువెళ్ళితే పురుషులు చేతులు జోడించుకొని ముందర నిలబడతారు. యుక్తవయస్సులోనున్న స్త్రీలు మాత్రము నవ్వుముఖముతో తమ తల మీదనున్న ముసుగును కొద్దిగా జరుపుతారు. చిన్నపిల్లలు మాత్రము చుట్టుముట్టుతారు. వెంటనే తండాలోని తమ పెద్దదగ్గరకు తీసుకొని వెళ్ళి పీటగాని, చాపగాని వేసి పాలు, మజ్జిగ దాహమిస్తారు.

స్త్రీల పాతివ్రత్యమంటే లంబాడీలకు అమిత పట్టుదల. ఎవరైనా స్త్రీనిగన్నుక లేవదీసుకవెళ్ళినట్లయితే, వాళ్ళ నాయకులు అపరాధికి రు. 25 మొదలు 750 రూపాయలవరకు జరిమానావేసి శిక్షిస్తారు.

వీళ్లలో జ్ఞాపకశక్తి ఎక్కువ. చిత్రం ఏమిటంటే, అసలు చదువు కున్నవాళ్ళు వీళ్ళల్లో లేకపోయినగూడా, వీళ్ళలో కొందరు – ముఖ్యముగా నైజాముజిల్లాలో పెద్ద పెద్ద వడ్డీవ్యాపారములు చేసేవాళ్లున్నారు – తమకు యెంతరావాలో, యెంత యివ్వాలో, మొదలైన ఖాతాలన్నీ నిమిషములో తేల్చివేస్తారు.

చెంచువాళ్ళకువలెనే లంబాడీలు కుక్కలను పెంచుతారు. ఇవి వేటాడునపుడుగాని, తండాలలోనికి క్రూరమృగములు రాకుండా కాపలా కాయుటకుగాని, ఉపయోగపడుతవి. ఈ కుక్కలనుగూర్చి రస్సెల్. హీరాలాల్‌గారలు ఈ క్రింది కథ వ్రాశారు :

ఒక లంబాడీవాడు తనకుక్కను తాకట్టుపెట్టి కొంతడబ్బు అప్పు తెచ్చాడు. కుక్క నూతన యజమాని ఇంట్లోవుండగా దొంగలుపడ్డారు. కుక్క మొరిగిందిగాని యెవ్వరూ లేవలేదు. అప్పు డర్ధరాత్రివేళ యెవ్వరికీ తెలియకుండా ఆదొంగల వెంటబడి తరుముకుపోయింది. దొంగలుడబ్బును ఒక చెరువులో పాతిపెట్టారు. తెల్లవారిన పిదప కుక్క యజమానిని చెరువువద్దకు తీసుకువచ్చింది. డబ్బుదొరికింది. యజమాని సంతోషించి, తాకట్టును విముక్తిచేసి, ఆవిధంగా ఒక చీటీ దాని మెడకుకట్టి, లంబాడీ వద్దకు తిరిగి పంపివైచినాడు. కుక్క సంతోషంతో తన అసలు యజ మానివద్దకు వచ్చుచుండెను. ఇంతలో వాడే డబ్బు తీసుకువస్తూ దారిలో తన కుక్కనుచూచి, పారిపోయి వచ్చినదని అభిప్రాయపడి వెంటనే

చంపేశాడు. తర్వాత నిజం తెలిసికొని, పశ్చాత్తాపబడి, దానికి ఒక గుడి కట్టించాడు. ఆ గుడిపేరు "కుక్కుర్ మందిర్".* ఇప్పటికిగూడ యిది సి. పి. లో దుర్గ జిల్లా "బాలోద్" గ్రామంలో కన్పిస్తున్నది.

కాని లంబాడీలు అతి త్రాగుబోతులు. వీళ్ళల్లో త్రాగుడు మూలంగానే అనేక ఘోరాలు చేయడం, పొట్లాడుకోటం, జరుగుతుంది.

వీళ్లలో శుభ్రత అనేది లేనేలేదు. సామాన్యంగా స్త్రీలు నెలకొకసారి మాత్రం స్నానంచేస్తారు. వీళ్లు దురాశపరులు. ఎవరికైనా అప్పిచ్చి వాళ్ళు తీర్చకపోతే ఋణగ్రస్తుని యింటిముందుకు వెళ్ళి మకాం వేస్తారు. ఆ యింటిలోనుంచి ఎవరయిన ఆడవాళ్ళు బయటికివస్తే అసభ్యంగా మాట్లాట్టం, తిట్టడం మొదలయినవి చేస్తారు. అందుకనే సామాన్యంగా ఈ భయంచేత వీళ్ళ అప్పు వెంటనే తీరుస్తారు. ఈపద్ధతికి "ధర్ణ" అంటారు.

<u>సాంఘిక వ్యవస్థలు</u> ;— వీళ్ళ సాంఘిక వ్యవస్థలు కొద్దిగా చూద్దాము : కొన్ని కుటుంబాలు కలసి ఒక "తండా"గా ఏర్పడుతవి. ప్రతి కుటుంబానికీ "తండా"లో నుంచి ఎప్పుడు పడితే అపుడు లేచిపోవడానికి అధికారమున్నది. సామాన్యంగా కుటుంబము అంటే, భార్యా, భర్తలు, వారి పిల్లలనిమాత్రమే అర్ధము చేసుకోవాలి. పెండ్లికాగానే కుమారునికి వేరే గుడిసెవేసి కాపరం పెడతారు.

కుటుంబంలో బంధుత్వము పురుషుని వైపునుండే నిర్ణయిస్తారు. ఇల్లాంటి కుటుంబాలుకలసి ఒక "గోత్రం" అవుతుంది. కొన్ని "గోత్రాలు" కలసి ఒక "తండా"గా ఏర్పడవచ్చు. సగోత్రీకులలో వివాహాలుండవు. ఈ గోత్రాలే గాకుండా, లంబాడీజాతి, అంతాకలసి ఐదు కులాలగా చీలింది. రసపుత్రులు, భట్లు, భూక్యాలు, ధాలియాలు, నావీలు అనేవి ముఖ్యమైన కులాలు.

రసపుత్రులు లంబాడీలలో బ్రాహ్మణులవంటివాళ్లు. వీళ్ల మాంసము తినరు. కల్లుత్రాగరు. కొందరు జంధ్యములు, తులసిపూసలు వేసుకొంటారు. బ్రాహ్మణులు, వైశ్య గృహాల్లోనే భోజనము చేస్తారు. తక్కిన లంబాడీల తెగలతో బాంధవ్యములుగాని, భోజనములుగాని, చేయరు. ఐతే భూక్యా జాతితోమాత్రం వివాహాలు చేసుకొంటారుగాని, ఆహారం మాత్రం

* Tribes and castes of Central Provinces

కలసి తీసికోరు. వీళ్ళు వానరజాతి వాళ్ళమని తెల్పుతారు. హనుమంతు డంటే చాలభక్తితో కొలుస్తారు.

భూక్యాలు లంబాడీలలో ఎక్కువ సంఖ్యగల తెగవాళ్లు. చాలమంది వీళ్ళలో ఇప్పుడు వ్యవసాయం చేసుకొంటున్నారు. లంబాడీ నాయకులలో చాలమంది ఈ తెగలోనుంచే ఎన్నుకోబడుతారు. సామాన్యంగా శాంతి యుతంగా జీవనం సల్పుతున్నాగూడా, నేరాలుచేసేది ఎక్కువగా ఈ తెగవాళ్ళే.

నావీలు లంబాడీలలో మంగళ్లు. ప్రతి ఒకటి, రెండు "తండా" లకు ఒక నావీ ఉంటాడు. క్షురకర్మ చెయ్యటమేగాకుండా ప్రతిసాంఘిక కార్యమప్పుడు వివాహాలయందు వంటచేస్తాడు.

ఢాలియాలు అనేవాళ్లు ఈజాతిలో మాదిగలు. వాళ్లు అస్పృశ్యుల వలె ఎంచబడుతారు. వీళ్ళల్లో ముష్టెత్తుకోటం సాంప్రదాయం. గౌరవం. కుళ్ళిన మాంసం తింటారు. వివాహసమయాల్లోను, పిల్లలు పుట్టినప్పుడు ఢాలియాలు "తండా"లకువచ్చి డప్పుకొడ్తారు.

భట్లు లంబాడీజాతిలో భట్రాజువంటివాళ్లు. వీళ్లు ఈ జాతిలో చాలా ప్రసిద్ధిపొందినారు. కల్నల్ టాడ్ తన "రాజస్థాన చరిత్ర"లో భట్లు మార్వారులో పూర్వకాలం వస్తువులు సరఫరా చేసేవారనిన్నీ, చాలా ధైర్యవంతులనిన్నీ, పవిత్రమైన నడవడి గలిగినవారనిన్నీ వర్ణించినాడు.

పెండ్లిండ్లప్పుడు, దేవతా కొలుపులప్పుడు భట్లువచ్చి లంబాడీ పూర్వీకుల గొప్పదనాన్నిగూర్చి పాడుతారు. ఆ సమయాల్లో వీళ్లు సంగీతాలుపాడి, తండాలలోమాత్రమే అడుక్కోవాలి. తక్కినతెగల ఇళ్ళల్లో వీళ్లు భోంచేస్తారుగాని, వీళ్ళ ఇళ్ళల్లో తక్కినవాళ్ళు భోజనంచెయ్యరు. పైగా వాళ్ళను మహమ్మదీయులవలె చూస్తారు. దానికి కారణం భట్లు పశువులను చంపేముందు, మనదేశంలో మహమ్మదీయులకువలెనే హలాలు చేస్తారు. మైసూరు రాష్ట్రంలో వీళ్ళు తుంబురులని పిలువబడుచున్నారు. మహమ్మదీయమతమే అవలంబిస్తారు. ఇల్లా ఎందుకు మహమ్మదీయ మతం అవలంబిస్తారని అడిగితే, భట్లుచెప్పే మాటలివి: వాళ్ళపూర్వీకుడు గురునానక్ శిష్యుడు. ఆయనతో కలిసి హుమాయూన్ చక్రవర్తి ఇచ్చిన విందులో పాల్గొని గోమాంసం తిన్నాడట. అందువలన వీళ్లు మహమ్మదీయులెనారట.

ఫీళ్ళేగాకుండా జంగారులనే తెగ ఇంకొకటిఉన్నది. వీళ్ళకు సంఘములో ఎటువంటి స్థానమూలేదు. పూర్వకాలంలో వ్యాపారంచేస్తున్నప్పుడు లంబాడీలు పిల్లలను ఎత్తుకుపోయి, తమజాతిలో కలుపుకొనేవాళ్ళు. ఇలా కలుపుకోబడ్డవాళ్ళే జంగార్లు. సామాన్యంగా రస్సెల్ తెల్పినట్లు, స్త్రీలను మాత్రమే తమజాతిలో చేర్చుకొనేవాళ్ళు. వాళ్ళను పురుషులు తమఉంపుడు కత్తెలుగా స్వీకరించేవాళ్లు.

గ్రామాధికారి :—ప్రతి 'తండా'కు సామాన్యంగా ఒక నాయకుడు ఉంటాడు. 'తండా'లో జరిగే సమస్త వ్యవహారాలపైన అతనిదే అధికారం. కొత్తవాళ్ళు "తండా"కువస్తే మొదట నాయకునివద్దకే దీసికొని వెళ్తారు. అతనిద్వారానే తక్కినవాళ్ళతో పరిచయంచేసికోవాలి. కులంలో ఏమైనా తప్పులుచేస్తే, నాయకుడు పంచాయితీదార్ల సహాయంతో విచారించి శిక్షిస్తాడు. నాయకునికి సహాయంగా మరొకడుంటాడు. అతణ్ణి 'కార్యభారి' అంటారు. వీళ్ళిద్దరేగాక "నింబుకట్నల్", "జంత" అనే ఇద్దరు మతాధికారులుగూడా ఉంటారు.

నాయకుని హోదా వంశపారంపర్యము. అతనికి నిర్ణీతమైన రుసుములేదుగాని, వివాహాలప్పుడు, తదితర సాంఘిక కార్యములందు, బహుమానములు, తప్పులు పరిష్కరించినప్పుడు విధించిన జరిమానా భాగములు అతనికి ఇవ్వబడుతవి.

తప్పులన్నీ సామాన్యంగా జరిమానా రూపకంగాగాని "తండా"లో నుంచి వెళ్ళగొట్టటంవల్లగాని పరిష్కరింపబడుతవి. ఈక్రింది జరిమానాల పట్టికను చూడండి :

| | | |
|---|---|---|
| గోతాల సూదిపారేస్తే | | రు 12—8—0 మొ॥ రు 61—0—0 |
| నిందారోపణచేస్తే | | 61—0—0 |
| కళాయికర్ర దొంగిలిస్తే | | 8—0—0 |
| వ్యభిచారం | | 25—0—0 మొ॥ 750—0—0 |
| పోట్లాట, | దెబ్బకి | 25—0—0 |
| | తిట్టుకి | 5—0—0 |
| మానభంగం | అవివాహిత, తలిదండ్రులకు | 125—0—0 |
| లేచిపోవుట | | 750—0—0 |

జరిమానాలు చెల్లించకపోతే "తండా"లోనుంచి వెళ్ళగొట్టి తక్కిన "తండా"లలో అపరాధిపేరు చాటిస్తారు. దానితో వాడికెక్కడా నిలుచునే చోటు దొరకదు.

ప్రమాణాలు :— వీళ్ళలో ప్రమాణాలన్నా, ఒట్టులన్నా భయం జాస్తి. ఏ స్త్రీనైనా అనుమానిస్తే ఒక వేపమండతెచ్చి దాన్ని ముట్టుకో మంటారు. దానిలో "మారెమ్మ" ఉంటుందని వాళ్ళనమ్మకం. తప్పుచేసిన స్త్రీ దాన్ని ముట్టుకోదు; లేకపోతే అనుమానించిన అపరాధిని అంతా చూస్తుండగా స్త్రీదగ్గర పాలు త్రాగమంటారు.

వివాహం :— లంబాడీలలో వివాహమనేది ఒక సాంఘికావసరం. వివాహితునికే సంఘంలో గౌరవం ఇస్తారు. సకుల వివాహాలున్నవిగాని, సగోత్రీక వివాహాలు దూష్యం.

సామాన్యంగా పురుషుడు యిద్దరు స్త్రీలను వివాహమాడవచ్చును. ఇద్దరు సోదరులు అప్పచెల్లెళ్ళను వివాహమాడవచ్చును. ఎదురు బదురు యిచ్చుకోటం వున్నదిగాని, చాలా అరుదు. మేనరికాలు ఇప్పుడిప్పుడు సామాన్యమవుతున్నవి. భర్త చనిపోతే అతని తమ్ముణ్ణి మారుమనువు చేసికోటం ఒక సాంప్రదాయకమైన మర్యాద. ఇందుకు నిదర్శనముగా తాము వాలి, సుగ్రీవుల సంతతివారమనిన్నీ, తార సుగ్రీవుని వివాహంచేసు కోటంవల్ల అది శాస్త్రీయమనిన్నీ, వీళ్లు మనతో వాదిస్తారు. భర్త భార్య కన్న పెద్దవాడై ఉండాలనే పట్టుదలలేదు. మైసూరు లంబాడీలలో భర్తకు మైనారిటీ వెళ్ళేదాక భార్య యింకోడితో కాపురము చెయ్యవచ్చనే ఆచారం వున్నది. సామాన్యంగా వీళ్ళ పెళ్ళిళ్లు వానాకాలంలో జరుగుతవి.

వీళ్ళల్లో వివాహవిచ్ఛేదాలు లేకపోలేదు. సామాన్యంగా నపుంస కత్వము, సంతానహీనత్వము, భార్యాభర్తల మధ్య అభిప్రాయభేదాలు, వీటిమూలంగా విచ్ఛేదములు కలుగుతవి. భర్తనువదలి వేరే పురుషుణ్ణి వివాహం చేసుకోదలిస్తే రు. 800/- పంచాయితీకి చెల్లించాలి. ఇలాగే పురుషుడు వేరేపెళ్ళి చేసికోదలిస్తేగూడ రు. 800/- చెల్లించాలి. బ్రహ్మ చారులు వితంతువులను వివాహం చేసుకోకూడదు.

వివాహ తంతు :— వివాహతంతు విచిత్రంగా ఉంటుంది. మొట్ట మొదట పెండ్లికొడుకు తండ్రి పెండ్లికూతురు "తండాకు"వెళ్ళి, ఒక

మంచిరోజు చూచుకొని ముహూర్తం పెట్టుకుంటారు. పెండ్లికూతురు తండ్రికి రు. 45/-లు, నాలుగు కోడెదూడలను ఇవ్వాలి. ఆరోజున 2 మళ్ళ బెల్లం పానకంచేసి త్రాగుతారు. ఇందుకు ప్రతిగా పెండ్లికూతురుతండ్రి పిల్లకు ఆభరణాలు, కంచె, లంగాలు, జాకెట్లు, ఒక ఆవును యిస్తాడు. మంచిరోజు చూచుకొని పెండ్లికొడుకు తన స్నేహితులతోపాటు మామ గారి "తండా"కు వెళ్ళి, ఊరుచివర దేరాలో మకాంవేసి, హుక్కా, తమలపాకులు "తండా" నాయకునికి పంపిస్తాడు. పెండ్లికొడుకు పార్టీ నుంచి ఆడవాళ్లెవ్వరూ వెళ్ళరు. నాయకుడు పెండ్లికొడుకు రాకను పెండ్లి కూతురు తండ్రికి ఎరిగిస్తాడు. ఒక ఆడవాళ్ళజట్టు అంతా కలిసివెళ్ళి, పాటలుపాడుతూ ఆతనిని తమయింటికి తీసుకువెళ్తారు. రెండురోజుల పాటు విందులుచేస్తారు. త్రాగుడు, భంగు యధేచ్ఛగా వాడతారు.

దీనితర్వాత పెండ్లికొడుకు ఒక్కడూ రెండునెలలపాటు అత్తగారి ఆధిపత్యంలో ఉండాలి. మామగారికి, కల్లు, భంగు, మాంసము. సప్లయి చెయ్యాలి. బయటకు ఎక్కడకూ వెళ్ళగూడదు. నెత్తిమీదనుంచి కాళ్ళ వరకు దుప్పటికప్పుకొని ఉండాలి. ఈరెండు నెలలపాటు అక్కడ స్త్రీలు, పిల్లలు ఎగతాళి చేస్తారు; తన్నుతారు. ఇవన్నీ భరించాలి. ఈ రెండు నెల లను "ఘోటా" చెయ్యడం అంటారు.

"ఘోటా" అయిన తరువాత ఒక బ్రాహ్మణునిరప్పించి, మంచిరోజు చూచి వివాహము సల్పుతారు. ఆరోజున కుమ్మరి రకరకాలకుండలుతెచ్చి ఒక ముళ్ళకంచెలోపెట్టి వెళ్ళతాడు. వధువు తమ్ముడు పళ్లెంతో ఉప్పుతెచ్చి ఈ కుండలమీద చల్లి తీసుకవెళ్తాడు. వివాహపు యింటిముందు పందిరి వేసి, దానిక్రింద నాలుగు గుంటలు త్రవ్వుతారు. ప్రతిగుంటలోను 5 కాన్లు వేస్తారు. ప్రతిగుంటపైనా 5 కుండలు దొంతర్లగాపెట్టి, వాటిమధ్య రోకళ్లు పెట్టుతారు. ఈ కుండలుపైన జిల్లేడు మండలు కప్పుతారు. స్నానము చేయించి, వధూవరులను తీసుకొనివచ్చి, కంకణం కట్టించి, ఈ కుండల చుట్టూ ఏడు ప్రదక్షిణాలు చేయిస్తారు. బ్రాహ్మణునికి వేరే పనిలేదు. "శోభన, శోభన" అనటంతో పెండ్లి పూర్తి అవుతుంది. ఇలా మూడు రోజులయిన తర్వాత 4 వ రోజు తెల్లవారుఝామున స్నానముచేయించి ఒకకోడిని చంపి, వండిపెడ్తారు. అప్పుడు ఒకఎద్దుమీద పిల్లను ఎక్కించి అత్తగారింటికి పంపిస్తారు. అక్కడ విందులుచేసికొని భార్యాభర్తలు కాప

రము చేస్తారు. వివాహసమయంలో బ్రాహ్మణ్ణి ఆడవాళ్ళు నానా అల్లరి చేస్తారు. పల్లేరుకాయలుగ్రుచ్చుతారు, రాళ్ళతోకొట్టారు. దీనికి కారణంగా పూర్వము ఎవరో బ్రాహ్మణుడు నిర్దయుడై, పెళ్ళిడువచ్చిన కుమార్తెలను అరణ్యములో వదలి వేశాడని, అందుచే ఇలాచేస్తున్నామని చెప్తారు.

జనన కర్మలు :— పిల్లలు పుట్టినపుడు "జా ని కే" అనే తంతు చేస్తారు. స్నానం చేయించగానే బెల్లము, లవంగాలు, మిరియాలు నూరి, ఆవునేతితో కలిపి స్త్రీకి యిస్తారు. 3 వ రోజున ఒకపాత్రలో నీళ్ళుపోసి, ఆవుతోకత్తో చేసిన త్రాడుకుకట్టి, ఆ నీళ్ల స్త్రీని ఒక పేడకుప్పకు ఎదురుగా కూర్చోపెట్టి గ్రుమ్మరిస్తారు. వీళ్ళల్లో పురుడు 5 రోజులు మాత్రమే. 5వ రోజు "తండా" లోఉండే పిల్లలకాళ్ళు కడిగి వాళ్ళకు పంచదార మొద లయినవి పెడతారు.

పిల్లలకు పేర్లు వాళ్లపూజించే దేవతల్నిబట్టిగాని, వారాన్నిబట్టిగాని, పిల్లల్లోవున్న అంగవైకల్యమును బట్టిగాని, పెట్టారు.

మృతకర్మ :— అవివాహితులు, అంటుజాడ్యాలవారు మరణిస్తే పాతిపెట్టబడ్తారు. తక్కినవాళ్ళు దహనము చేయబడ్తారు. వీళ్ళకు ప్రత్యే కంగా స్మశానాలు లేవు. ఎవరిభూముల్లో వాళ్ళకు అంత్యకర్మలు చేస్తారు. ఈ సందర్భంలో 3 వ రోజున, 5 వ రోజున "నానకిడాడో" "మోటా డాడో" అనే రెండు కర్మలు చేస్తారు. మొదటిరోజున దహనంచేసి తిరిగి వచ్చినతర్వాత అంతా చచ్చిపోయినవాడి గుడిసెముందు బార్లుతీర్చి కూర్చుం టారు. పెద్దకొడుకు ఒక కుండతో నీళ్ళుతెచ్చి ప్రతివాని ఎడమచేతిమీదా పోస్తాడు.

"నానకిడాడో" నాడు, పాలు అస్థికలపైచల్లి "ఛర్మో" అనే పింద ములు అంతా తింటారు.

"మోటాడాడో"రోజున తండావాళ్ళంతా ఒక మేకనుకొని కోస్తారు. కొంతభాగం చచ్చిపోయినవాని ఇంట్లో ఇస్తారు. బంధువులు, స్నేహితులు కల్లుతెస్తారు. ఆరోజు పెద్ద విందుచేస్తారు.

మతం — దేవుడు :—లంబాడీలను తక్కువజాతి హిందువులుగా పరిగణింపవచ్చు. వీళ్ళ ముఖ్యదేవుళ్లు బాలాజీ, భవానీ, మంత్రులస్వామి అంజనేయులు, మరియాలయాడి, పోలేరమ్మ మొదలగునవి. దేవుళ్ళకు

కొలుపులుచేస్తారు. మొక్కులు చెల్లిస్తారు. ప్రతిసమయంలోను త్రాగుడు, పశుబలి ముఖ్యంగా జరుగుతవి.

వీళ్ళకు ప్రత్యేకంగా గుళ్లు లేవుగాని, హుజూరునగరు తాలూకా చిలుకూరు గ్రామంలోమాత్రం ఒక గుడిఉన్నది. అక్కడ కొయ్య హనుమంతుడు, ఒక రాతి విగ్రహంతప్ప మరిఏమియు లేవు. ప్రతి సంవత్సరం పెద్ద వుత్సవం చేస్తారు.

లంబాడీల నేరాలు :— మన ఆంధ్రదేశంలోని ఎరుకలు, ఏనాదులు వడ్డెరలవలెనే లంబాడీలుగూడ ఒక దొంగజాతిగా చూడబడుచున్నారు. ముఖ్యంగా కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని లంబాడీలను క్రిమినల్ ట్రైబ్సులో చేర్పించారు.

ఇలా వీరిని దొంగజాతిగా పరిగణించటానికి కారణాలు లేకపో లేదు. ముఖ్యంగా పూర్వపురోజుల్లో - అంటే వీళ్ళు "బిడారీ" వర్తకంచేసే రోజుల్లో,—చాలా దురంతాలు జరిపేవాళ్ళు.

లంబాడీలు బహుమొండివాళ్లు. వాళ్లచేత నిజం చెప్పించటంకష్టం. ఏనాదివాడు ఎలాంటి దొంగతనంచేసినా స్టేషన్‌కు తీసికొనివస్తే భయపడి నిజంచెప్తాడు. కాని లంబాడీలు సామాన్యంగా నిజంచెప్పరు.

పూర్వకాలంనుంచిగూడా వీళ్ళు మామూలు దొంగతనాలేకాకుండా, శిశుహత్య, నరబలి, స్త్రీలను, పిల్లల్ని ఎత్తుకుపోవటం, బందిపోటు, దార్లు కొట్టటం మొదలగు ఘాతుకకృత్యములు సల్పినవాళ్లే. కాని పోలీసువారు సరియయిన కట్టుదిట్టాలు చెయ్యటంవలన ఈ ఘోరాలు ఇప్పుడు కొన్ని రూపుమాసిపోయినవి. వీళ్ళుచేసే కిరాతకాలు ఇప్పటికిగూడ కొన్నిచోట్ల కథలుగా చెప్పుకొంటారు. పూర్వకాలంలో వీళ్ల సరఫరావ్యాపారం రాజులకు, నవాబులకు అత్యంతావసర మగుటచేత వీళ్లు ఎన్నితప్పులు చేసినాగూడా క్షమించేవాళ్లు.

ఆరోజుల్లో ముఖ్యంగా వీళ్ళు సైన్యాలవెంట వెళ్తూఉండేవాళ్ళు. యుద్ధం ముగియగానే వీళ్ళు ఊళ్ళలో ప్రవేశించి, దోపిడీలుచేసి, అలా సంపాదించినదాన్ని సైన్యాలకు అమ్మేవాళ్ళు. మైసూరు యుద్ధానంతరం వీళ్ళుసల్పిన దురాగతాలు శత్రుసైన్యాలుసహితం జరుపనటువంటి వగుట

చేత ఇంగ్లీషువారు వీళ్ళతోవిసిగి, కొంతమంది లంబాడీ నాయకులను ఉరితీశారట!

పిల్లల్ని ఎత్తుకుపోవటం, ఆ రోజుల్లో — కాస్తో కూస్తో ఇటీవల కూడ బొంబాయి రాజధానిలో — స్త్రీలను మాయంచెయ్యటం వీళ్ళుపల్పిన నేరాల్లో మొదటిది. ఈవిషయమై వ్రాస్తూ రస్సెలు, హీరాలాలులు ఈ క్రిందివిధంగా తెల్పారు: "ఎత్తుకుపోయిన పిల్లల్ని గోనెసంచుల్లోపడేసి ఎద్దులమీద తీసుకుపోయేవాళ్ళు. వీళ్ళు మకాంచేసిన ప్రతి స్థలంలోకి ఒక ఆడదివచ్చి, వాళ్లను పైకితీసి పాలుపట్టి మళ్ళీ గోనెల్లోపెట్టేది."

అంతేగాక గుజరాత్ — మధ్యఇండియాలకుగల మధ్య ప్రదేశంలో ఈ లంబాడీలు స్త్రీ బానిసవ్యాపారం యథేచ్ఛగా సాగించారని మాల్కొం వ్రాస్తున్నాడు.

<u>నరబలి</u>:—వీళ్లు పూర్వంచేసిన బలివిషయమై క్లుప్తంగా వ్రాస్తాను. ఈఘోరం చెయ్యటంలో ఆర్థికావుసరమేమీ లేదుగాని, వీళ్లుచేసే వ్యాపారం వృద్ధిపొందాలంటే వీళ్లు తమ దేవతల అనుగ్రహం సంపాదించాలి. నర బలులు చెయ్యటం వాళ్ళ దేవతను సంతోషపెట్టటానికే.

ప్రఖ్యాత పరాసు మతవ్యాపకుడగు జె. ఎ. డ్యుబాయి వీళ్ళు నరబలి ఏవిధంగా చేస్తారో యీ క్రింది వాక్యాలలో వర్ణించాడు. "వీళ్ళకు నరబలి ఇద్దామను ఉద్దేశ్యం కల్గినప్పుడల్లా మొదట ఎవడు కన్పడ్తాడో వాణ్ణి ఒక రహస్యప్రదేశానికి తీసుకువెళ్ళి, ఒక గొయ్యి త్రవ్వి, అందులో పాతేసే వాళ్లు. కంఠందాకా పూడ్చిపెట్టి వానినెత్తిమీద ఒక ప్రమిదపెట్టి, దానిలో చమురుపోసి దీపం వెలిగించేవాళ్లు. వానిచుట్టూ స్త్రీ పురుషులుచేరి, కఠోర మైన ధ్వనిచేస్తూ, వాడు చచ్చేటంతవరకు నాట్యమాడేవాళ్లు". లేకపోతే ఏపిల్లవాణ్ణయినా పట్టుకొని, వాణ్ణి కంఠందాకా పూడ్చి, వానిమీదుగా వేలకొలది గొడ్లమందలను తోలేవారు!!

వీళ్లు దోపిడీలు ఏవిధంగా జరిపేవాళ్లోకూడా మేజర్ గంథ్రోవ్ వర్ణించాడు.

దోపిడి చెయ్యాలంటే, బయలుదేరేముందు 100, 150 మంది జట్టుగా బయలుదేరతారట! మొట్టమొదట ప్రయాణీకులమీద రాళ్లు రువ్వటం, మరుక్షణంలో లాఠీల ప్రయోగం చెయ్యటం, జరుగుతుందట.

ఇలా దార్లు కొట్టేటప్పుడు జట్టులో ఎవ్వరూ మాట్లాడుకోరు. ఒకవేళ అవుసరమైతేమాత్రం హిందూస్తానీలోనే మాట్లాడుతారు.

గ్రామాల్లో ప్రవేశించేటప్పుడు ఊరికి నాలుగువైపులా తమ మను ష్యుల్ని కాపలాపెట్తారు. ప్రతివానిదగ్గర గుండ్రటి రాళ్ళకుప్పలు ఉంచు తారు. ఖర్మంచాలక ఎవడైనా కొత్తవాడు వచ్చి, వాళ్ళని ప్రతిఘటిం చాలని చూచినా వానికి ఎంతప్రమాదమో గ్రహించండి!

ఇలా దోపిళ్ళు, దార్లు కొట్టడానికిముందు జట్టు అంతా ఒక తంతు చేస్తారు. నేను పర్యటనచేసిన లంబాడీ "తండా"ల్లో కొన్నిచోట్ల తెల్లని జెండాలతో చిన్న గుడిశెలు కన్పించినవి. డబ్ల్యు. క్రూక్ యీజెండాలను గూర్చి వ్రాస్తూ, ఎక్కడయితే యివి కన్పిస్తవో అక్కడ దొంగలజట్టు ఉందని అర్థంచేసికోవాలన్నాడు. ఇలాంటి "తండా"ల్లో ప్రత్యేకంగా ఒక గుడిశెవుంటుంది. దానిలో "మిత్తుభూక్య" అనే ఒక దేవుణ్ణి పెడతారు. ఇంతేగాక "సతి" అనే విగ్రహంకూడవుంటుంది. ఒక ప్రమిదలో నెయ్యి పోసి దీపారాధనచేస్తారు. తమ కార్యక్రమమంతా సన్నని గొంతుకతో విన్నవించుకుంటూ తమకు జయమగునట్లుగా ఆశీర్వదించమని ప్రార్థించి, అ వత్తిని తదేకదీక్షగా చూస్తారు. వత్తిగనుక ఆరిపోతే అది మంచి శకు నంగా భావించి, అంతా బయలుదేరుతారు. దారిలో ఎవడైనా క్రొత్తవాడు కన్పించి పలుకరిస్తే జవాబుయివ్వరు. అతనుగనుక వాళ్ళని అనుమానిస్తే వాణ్ణి చంపుతారట. ఇంతేగాక దారిలో ఎవరైనా తుమ్మితే వాళ్ళంతా దోపిడి చెయ్యకుండానే తిరిగివచ్చి, మళ్ళీ శకునం చూచుకోటమో, లేక అసలు ఆపని మానెయ్యటమో, చేస్తారు.

దోపిడినుంచి తిరిగివచ్చిన తరువాతగూడా "మిత్తుభూక్య"కు పూజ చేసి, తెచ్చినదాంట్లో కొంతభాగం ప్రత్యేకించుతారు. ఎవరైతే మొదటగా దెబ్బకొడ్తారో అతనికి ఎక్కువభాగం ఇస్తారు. "తండా" నాయకునికి రెండు భాగాలు పెడ్తారు. మిగిలినదానితో విందుచేస్తారు; త్రాగుతారు.

ప్రయోగాలంటే లంబాడీలకు చాలనమ్మకం. మ్యాజిక్‌వల్ల జబ్బులు నయం చెయ్యవచ్చని వాళ్ళకు దృఢవిశ్వాసం. వీటిమూలంగాగూడా వాళ్లల్లో తప్పిదాలు జాస్తిగానే జరుగుతుంటవి.

వీళ్ళలో "భగత్" అనే భూతవైద్యుడు ఉంటాడు. ఇతని ప్రభా వముచేత దయ్యాలు వాళ్ళదగ్గరకురావని వీళ్ళనమ్మకం. ఖర్మము జాలక

ఎవరికైన రోగంవచ్చినా, నంజుపుట్టినా, అది ప్రయోగంవల్లనే వచ్చిందనటం సామాన్యంగా జరుగుతుంది. అలాంటప్పుడు జబ్బు పడ్డవాని బంధువులు "భగత్" దగ్గరకు వెళ్ళి "అయ్యా, మాకు ప్రయోగం చేసిందెవరో తెలియియ్యండి; ప్రయోగం తిప్పండి" అనివేడుకుంటారు. స్త్రీని "డాకుం" అంటే మాంత్రికురాలు—అని అనుమానించేవాళ్ళు. మాంత్రికురాలు తక్కిన వాళ్ళల్లో వ్యాధులు కల్పించినందుకు శిక్ష ఏమిటో తెలుసునా? స్త్రీహత్య!

అసలు ఎవరికైనా జబ్బుచేస్తే ఒక 10, 15 మందికలసి "భగత్" (వీణ్ణే జంత అనికూడ అంటారు) దగ్గరకువెళ్ళి అడుగుతారు. "భగత్"కీ, ఈ వచ్చిన వాళ్ళలో ఉన్న ఒక మనిషికీ రహస్యంగా ఒక ఒడంబడిక ఉంటుంది. సంపాదించినదాంట్లో వీనికిచ్చేటట్లున్నూ, రోగం వచ్చినవాని యింటిరహస్యాలు యావత్తు చెప్పేటట్లున్నూ, ఆ ఒడంబడిక.

వీళ్ళు వెళ్ళగానే రేపుప్రొద్దున రమ్మంటాడు "భగత్". ఈ లోగా తన రహస్యపు మనుష్యుని ద్వారా అంతా కనుక్కుంటాడు. "భగత్" మహాత్మ్యం పరీక్షించటానికిగామ దారిలో ఒక ఎముకను ఏరోడ్డుపక్కనో పాతిపెడ్తారు. "భగత్" వాళ్ళు పాతిపెట్టిన స్థలంచెప్పాలి. అలాచెప్పటం ఒక కష్టంగాదు. రహస్యంచెప్పే మనిషి ఉండనేఉన్నాడుగదా?

అసలు జబ్బుసంగతీ, ఎన్నిరోజులనుంచి బాధపడుతున్నదీ, దీనికి ఎవరు కారకులైనదీ, గబగబ చెప్తాడు. వెంటనే కోపంతో ఎందుకు ఎముకపాతారు? అని ప్రశ్నిస్తాడు.

దీనితో అందరికి హడల్! చెంపలువేసికొని, క్షమాపణ కోరతారు. వెంటనే కొన్ని కొబ్బరికాయలు, నిమ్మకాయలు, కొంత డబ్బు, ఒక ధోవతి మొదలయినవన్నీ వస్తవి.

ఈనేరమంతా దురదృష్టవశాత్తు ఏ పిల్లలుగల తల్లిమీదనోపడ్తుంది. ఇందులో ఒక ముఖ్యవిషయ మేమంటే, "భగత్"కి ఎవరిమీదనైనా ఈర్ష్యగాని, కోపంగాని ఉన్నచో ఆ సంసారం మీద ఈ రాక్షసకృత్యం సల్పుతారు.

వెంటనే ఆ స్త్రీని తీసికొనిరావలెను. ఆమె భర్తగాని, ఆమె కుమారులుగాని ఆమెను చంపవలె; కొంత అపరాధం చెల్లించవలె. లేకపోతే భార్యపోయిన దుఃఖానికితోడుగా అతణ్ణి "తండా"లోనుంచి వెళ్ళగొడ్తారు.

కంబర్లీ జి అనే పోలీసు సూపర్నెంటు ఈవిషయమై ముచ్చటిస్తూ, ఇటీవల ఒక ముదుసలితల్లిని ఆమె ముగ్గురు కుమాళ్లు "భగత్" ప్రేరేపణ వల్ల చంపేశారని వ్రాశాడు. కాని ఈ పాపకార్యం చూశ్నేక అక్కడి వాళ్ళంతా రిపోర్టుచేశారు కట్టుకట్టి. "భగత్"కి 7 సంవత్సరాల శిక్షతో ఈపద్ధతి ఇప్పుడు తగ్గింది. కాని మర్డణానికిబదులు విపరీతమైన జరిమానాలు కులంలో వసూలుచేస్తారు.

అసలు ఈ దుర్మార్గుల కందరికీ సూరత్‌దగ్గర పాఠాలునేర్పే ప్రబుద్ధులు కొందరున్నార్లట!

ఐతే ప్రస్తుతం లంబాడీలుచేసే నేరాలుఅన్నీ అంత అపాయకరమైనవిగావు. ఎక్కడో నైజామ్‌యిలాకా దేవరకొండ తాలూకాలోమాత్రం కొద్దిగా దోపిళ్ళుచెయ్యటం ఉన్నవేగాని, అవైనా ఇప్పుడు తగ్గినవి.

కాని వీళ్లు చేసేనేరాలు సామాన్యంగా పశువులను ఎత్తుకుపోవడం, తమ మందలలో కలుపుకోవడం, ధాన్యం దొంగిలించటం - మొదలైనవి.

వీళ్లు పశువులను పుల్లరికి మేపుతారు. మాగాణీ ప్రదేశాలనుండి పశువులను తోలుకొనివచ్చి మరల వాటి యజమానులకు అప్పగించేటప్పుడు 2 లేక 3 దొంగిలించి ఏ పెద్దపులో, చిరుతపులో చంపిందని చెప్తారు.

కొంతమంది ఒకవూళ్లో ఎద్దుల్ని దొంగిలిస్తారు; ఇంకోవూళ్లో బండిని దొంగిలిస్తారు—ఈ రెంటినీకలిపి ఎక్కడో అమ్మేస్తారు.

మరికొందరు ఏ ఆవునో దొంగిలించి తమ పెద్ద మందల్లో కలిపేస్తారు. దానిని పట్టుకోటానికిగాని, గుర్తించటానికిగాని వీలులేకుండా కొమ్ములు కొయ్యటం, చెవులుగాని, తోకగాని కొయ్యటం చేస్తారు.

పందినిగాని మేకనుగాని దొంగిలిస్తే అసలు ప్రాణి కన్పడకుండా చంపివేసి తింటారు. సామాన్యంగా కులపంచాయితీలో ఇలాంటి నేరాలే యెక్కువగా విచారిస్తూవుంటారు.

లంబాడీలలో దొంగతనాలు చేసేవాళ్లు అంటే కన్నం దొంగతనాలు చేసేవాళ్లుకూడా ఉన్నారు. ఇంతేగాక ధాన్యపుబళ్లు పోతూంటే వెనుకగుండా వచ్చి బండివానికి తెలియకుండానే ఒకటో రెండో బస్తాలు దొంగిలించేవాళ్లు గూడా ఉన్నారు.

---

• మూలం: సేమ రచించిన The "Lambadis" అనే ఆంగ్ల గ్రంథం.

పూర్వకాలం వీళ్లు ఆడవాళ్ళని ఎత్తుకుపోయి వాళ్ళని ఇతగులు గుర్తుపట్టకుండా వాళ్ళ చెంపలమీద ఒక విధమైన రసంపోసి, కాల్చి, వికృతులుగా చేసేవాళ్లు. లేకపోతే నాలుక తెగకొట్టేవాళ్లు. ఇంతేగాక మోసం చేసి శక్తి (దేవత) ముందర కత్తితో నరికివేసే ఘోరాచారంవీళ్ళల్లో అమితంగా ఉండేది.

సంఘ సంస్కర్తలు వీళ్ళను బాగుచేసే మార్గాలు చూడాలి.

## 2. చెంచులు

ఆంధ్రదేశమందలి అనాదులలోనికెల్ల పురాతనులని తలపబడేవారు చెంచుజాతివాళ్ళు. ఈ జాతివాళ్ళు కర్నూలుజిల్లాలోని నల్లమలై పర్వత ప్రాంతాల్లోను, నైజాము రాజ్యములోని మహబూబ్‌నగరు జిల్లాకుచెందిన అమూరాబాద్ పీఠభూమి ప్రాంతపు టడవులలోను, విశేషముగా కన్పిస్తున్నారు. మద్రాసురాజధానిలో 1941 జనాభాలెక్కలనుబట్టిచూస్తే చెంచులు 9,000 మంది ఉన్నట్లున్నూ, అందులో ఒక్క కర్నూలుజిల్లాలోనే 6,000 మందిన్నీ, పోతే మిగతా 3,000 మంది గుంటూరుజిల్లా మొదలగు చోట్లను కన్పడుతున్నారు. హైద్రాబాద్ రాష్ట్రంలో వీళ్ళు 4,000 పైగా కన్పిస్తున్నారు.

ఇటీవల అమూరాబాద్ పీఠభూమిలో కన్పడిన గోరీలు మొదలగు వాటిని శోధించటం మూలంగా, చెంచులు, గడబల వలెనే రాతియుగ కాలమున, మన దక్షిణదేశములో ప్రబలమయిన నొకజాతి యని మనకు తెల్లమవుతున్నది. ఐతే ప్రస్తుతం వీళ్ళ ఆచారవ్యవహారాలకు, విజ్ఞానానికి నల్లమలై ప్రాంతాలే కేంద్రమని నిస్సంశయంగా తెల్పవచ్చు.

ఈక్‌స్టెడెట్ ఉద్దేశ్యప్రకారం చెంచులు 'మాలిడ్' తరగతికి చెందుతారు. కాని, డాక్టరు బి. ఎస్. గుహాగారు వీళ్ళున్నూ, భిల్లులున్నూ ఒకటేనని చెప్పుతున్నారు. ఆయన ఉద్దేశంప్రకారం వీళ్లు 'ఆష్ట్రిలాయెడ్' తెగక్రిందికి వస్తారు. భిల్లులు, చెంచులుగూడ విల్లు, అంబులు ఉపయోగించటంలో మహానేర్పు, ప్రజ్ఞగలవారు. బారన్ హైమండార్ఫుమాత్రం చెంచులు, పరిసరజాతులగు లంబాడీ, యానాది మొదలగు జాతులతో జాతీయంగా సాంకర్యము పొందినారని తెలుపుతున్నాడు. అసలు మరికొంతమంది యానాదులు, చెంచులు, జాతీయంగాను, వైజ్ఞానికంగాను ఒకటే నని వాదించుతున్నారు.

జన్మవృత్తాంతం :—ఏమైనప్పటికిని వీళ్ళు అనాదులనే నిర్ణయింపబడ్డారు. వీళ్ళు నల్లనివారు. మధ్యస్థమైన ఎత్తుగల్గిఉంటారు. ఐతే బలవంతులు. ఆకలిబాధకు ఎంతైనా ఓరుస్తారు. మంచి దంతపుష్టిగలవారు. కాని, కష్టపడి పనిచెయ్యటంగాని, వ్యవసాయము మొదలగు వృత్తులయందు శ్రద్ధ, ఉత్సాహం చూపించడంగాని జరుగదు.

ఇండో-యూరపియన్ జాతులలోవలెనే చెంచుజాతిలోగూడ తమ జన్మకు సంబంధించిన కథలు వ్యాప్తమయినవి. అందులోకల్లా ఈ క్రింది కథ పేర్కొనదగినది :

పూర్వము జనమంతా పశువుల కాపరులుగా జీవించేవారట. ఆరోజుల్లో ఒక అరణ్యములో ఒక పరమసాధువు తపస్సు చేసుకొంటూ ఉండేవాడట. కొంతమంది ఈ సాధువు మహాత్మ్యము కనిపెట్టాలని ఒక పిల్లవానికి స్త్రీవేషమువేసి పొట్టకుమాత్రము ఒక కొయ్యకట్టి ఆయనవద్దకు తీసుకువచ్చి "స్వామీ! ప్రసవించినతర్వాత ఈమె బ్రతుకునా?" అని ప్రశ్నించారట. సాధువు నిజం కనుక్కొని, శిశూదయమైన వెంటనే, వీరందరు చస్తారని శపించాడట! దానితో వాళ్లంతా భయపడి పారిపోయినారు. వేషము వేసికొన్న పిల్లవాడుగూడ పారిపోతుంటే సాధువు ఆత్మ వాడిని ప్రవేశించి వాడిని చంపి, వాడికికట్టిన కొయ్యను ప్రయోగంచేసి వదలితే, ఆకొయ్య అందరిని చంపినదట! కాని, అందులో ఒక పిల్లవాడుమాత్రం ఎట్లాగో తప్పించుకొనిపోయి, అరణ్యములోఉండే తక్కిన సాధువుల శరణుజొచ్చినాడట! వారికి కరుణగలిగి, సాధువువద్దకువచ్చి ప్రార్థిస్తే ఆయన జాలిపొంది, అతడు అరణ్యంలో నివశిస్తేమాత్రం రక్షిస్తానని అభయహస్తం ఇచ్చాడట! అల్లా బ్రతికిన పిల్లవాడిసంతతే చెంచులు. ఆ శాపంవల్ల వీళ్ళు అరణ్యాలయందే నివసిస్తారట.

దుస్తులు : అలంకారం :— పూర్వకాలంలో చెంచులు ఆకులములు కప్పుకొని తిరిగేవారు. కాని సభ్యతా ప్రపంచముతో సంబంధం మూలంగా ఇప్పుడిప్పుడు దుస్తులు ధరించుట నేర్చుకొన్నారు. మగవాళ్లు 5, 6 అంగుళాల వెడల్పుగల గోచీలు పెట్టుకొంటారు. ఈ గోచీలన్నీ తమ ఆడవాళ్ళ చీరలుచించి సంపాదించినవే. శీతాకాలంలో మాత్రం కొందరు ఒక దుప్పటి ధరిస్తారు. తలగుడ్డగా అప్పుడప్పుడు దీన్ని ఉపయోగిస్తారు. ఇటీవల శుభకార్యాలకు వెళ్లినప్పుడు రంగురంగుల తుండుగుడ్డలు గూడా



చెం చు గు డి సె

**హైమండార్ఫ్‌గారి ‘చెంచులు’ నుండి**

కట్టుకుంటున్నారు. ఐతే భాగ్యవంతులు మాత్రం ఇప్పుడిప్పుడు చొక్కాలు తొడగడం నేర్చుకొంటున్నారు. ఇత్తడి చెవిపోగులు ధరిస్తున్నారు.

ఆడవాళ్లు లోపల ముతకగుడ్డధరించి దానిపైన చీరె కట్టుతారు. రవికెలు కూడ ధరిస్తారు. పూర్వపు రోజుల్లో తమ ఆభరణాలు స్త్రీలే తయారు చేసుకొనేవాళ్ళు. వానాకాలంలో పుల్లిపూసలేరి, ఎండబెట్టి, హారాలుగా పేర్చేవారు. నెమలికన్నులు మెడచుట్టూ ధరిస్తారు. సామాన్యంగాజుట్టును వెనుకవైపు ముడివేస్తారు. లేదా, తల విరబోసుకొంటారు. ఐతే ఈ రోజుల్లో బజారుసరకంతా దిగుమతి అవుతున్నది. ఆడవాళ్లు అల్యూమినం, సత్తు మొదలయిన వాటితో చేసినగాజులు, ముక్కుపుడకలు, ధరిస్తున్నారు. పిల్లలుమాత్రం పుష్పాలంకారమంటే చాలశ్రద్ధ చూపిస్తారు. ఇంతేగాక, చెంచుపడుచులు ప్రత్యేక సమయాల్లో జింకచర్మం, కుందేలుచర్మం అలంకరణంగా ఉపయోగిస్తారు.

గ్రామనిర్మాణం :— చెంచుగ్రామాలను 'పెంటా'లంటారు. పెంటా అంటే సామాన్యంగా గుడిసెల సమూహమని అర్థం. ఒకప్పుడు వీళ్ళు కేవలం చెట్లక్రిందే నివసిస్తూ కాలం వెళ్ళదీసికొనేవారని 'ఫెరిస్తా' వ్రాసినాడు. వీళ్ళ గుడిసెలు గుండ్రంగా ఉంటవి. సామాన్యంగా వడ్డెర, ఏనాదులు గ్రామాల్లో నివసించేటప్పుడు గుండ్రటి గుడెసెలు వేసుకుంటారు. వెదురుకర్రలువంచి వర్తులాకారంగా కడతారు. చివరి భాగం గోపురంలాగ ఉంటుంది. ఈ కర్రలమీద గడ్డికప్పుతారు.

సామాన్యంగా చెంచు 'పెంటా'లో 5, 6 కన్న ఎక్కువ గుడిసెలు ఉండవు. కాని కొన్నిచోట్ల అంటే, ఈర్లపెంటా, పూలజలమ, రాంపూర్ సార్లపల్లి మొదలయినచోట్లమాత్రం 15, 20 గుడిసెలదాకా కన్పిస్తున్నవి.

వీళ్ళ ఆర్థిక విధానం పైననే వీళ్ళ గృహనిర్మాణం ఆధారపడి ఉంటుంది. అందుకనే ప్రతిచెంచువాడికి 2 గృహములు ఉంటవి. ఒకటి శాశ్వితంగా నివశించేది. రెండవది ఎండాకాలంలో నివసించేది. వానాకాలం, శీతాకాలములలోమాత్రం తన శాశ్వితగృహంలో నివశిస్తాడు. జనవరి మొదలు 4, 5 నెలల వరకు తన తిరుగుబోతు పద్ధతులను అవలంబిస్తాడు. అప్పుడు ఎక్కడైతే విప్పపువ్వు సమృద్ధిగా దొరుకుతుందో అక్కడ నూతన గృహ నిర్మాణం చేసికొంటాడు.

జీవనం :— అరణ్యములో తిరుగుతూ జీవించేవాళ్ళ వృత్తుల్లో ముఖ్యమైనవి వేట, చేపలను పట్టడమున్నూ. చెంచులుగూడ ఈ పని చేస్తారు. సంవత్సరానికి 9 నెలలపాటు అరణ్యసంపదే ప్రోగుచేసి దానితో కాలం వెళ్ళబుచ్చుతారు. ఇటీవల లంబాడీలతో సంబంధంమూలంగా గొడ్లను మేపుతున్నారు. కొందరు శ్రీశైలంవద్ద యాత్రికుల సామానులు మోస్తారు. ఇంకాకొందరు వెదురుగడలు, తేనె మొదలయినవి గ్రామాలకు తెచ్చి అమ్ముతారు. కొద్దిమందిమాత్రం రామములక్కాయలు, మిరప కాయలు పండిస్తున్నారు.

బాధ్యతారహితమైన జీవనానికి అలవడినారు చెంచులు. 'ఈ పూట తిండిలేదే' అనే దిగులు వారికిలేదు.

వీళ్లు దుంపలు, అడవిపళ్లు, తేనె, విప్పసారా మాత్రం అధికంగా ఉపయోగిస్తారు. విప్పసారా సభ్య ప్రజల్లోగూడా ఇప్పుడిప్పుడు ఉపయో గింపబడుటచేత చెంచులు దీనితో కొద్దిగా వ్యాపారంచేస్తున్నారు.

సాంఘిక విభాగాలు :— సభ్యతా ప్రపంచంతో సంబంధం చెంచుల సాంఘిక నిర్మాణంలో కొంతవరకు మార్పు తెచ్చినదని హైమండార్ఫు తెల్పుతున్నాడు. ఐనప్పటికినీ వీళ్ళసంఘం అతి ప్రాచీన స్వరూపంలోనే కన్పట్టుతున్నది. చెంచులు మాట్లాడేభాష తెలుగు అవటంవల్ల వీళ్లవాడే పదాలుగూడ మన సభ్యతా సంఘంలోని పదాలవలెనే ఉంటవి. తమ తెగను వీళ్లు కులం అని చెప్పుకుంటారు.

చెంచుజాతి అంతా అనేక కులాలుగా యేర్పడ్డది. ముఖ్యంగా జాతినంతా నాలుగు భాగాలు చెయ్యవచ్చు :

1. మెనులూరు, దాసరులు.

మెనులూరు తెగవాళ్లు అన్నిమతాలతోను వివాహాలు చేసికుంటారు. దాసరులు కుల వ్యవహారాలను పరిష్కరిస్తారు.

2. సిగుర్లు, ఉరటలు.

3. తోకలు, సల్లబోతేరు, కత్రాజ్.

4. నిమలు, ఎరవలు, పులసరు.

సిగుర్లు అంటే శిఖ గల్గినవారు. గులాం అహమద్‌ఖాన్ మాత్రము 'చింతచిగురు' తినేవాళ్లు ఈ పేరుతో పిలువబడుతారని తెల్పుచున్నాడు.



బాణము సంధించుట (చెంచు వేటకుడు)

**హైమండార్ఫ్‌గారి 'చెంచులు' నుండి**

ఉరటలు :—నల్లమలై పర్వతాల్లోకన్పించే ఒక పుడుతనుబట్టి, ఈ తెగకీపేరు వచ్చింది.

తోకలు :—ఈతెగవాళ్లు వెనుకవైపు జారేటట్టుగా పెద్దగోచీ పెట్టు తారు. ఇంతేగాక వీళ్ళ పూర్వీకుడు ప్రతి జంతువుతోకకి ప్రాముఖ్యం ఇవ్వటంవల్ల ఈ పేరు కల్గింది.

నల్లపోతేరు :—ఈతెగ పూర్వీకుడు అమితంగా పొట్ట ఉబ్బేట్టు తిని, పొట్టకు బొగ్గుమసి పూసికొని, నాట్యంచేశాడట.

కత్రాజ్ :—దీనినిగూర్చి తెల్పటానికి సాక్ష్యంలేదు.

నిమలు :— ఈ భాగమైన ఎరవలకులమునకు పూర్వీకుడు ఎవ్వరూ దొరక్క తన చెల్లెలినే వివాహం చేసుకొన్నాడట. పూర్వం రోజుల్లో ఈ తెగవాళ్ళందరూ ఈ తప్పుకు ప్రతిఫలంగా 40 ఏండ్లు రాగానే చచ్చిపోయేవారట. సగోత్రీకులలో వివాహము లుండవు.

కులపెద్ద :— చెంచుగ్రామాధికారిని పెద్దమనిచి' అంటారు. తక్కిన జాతులతో పోలిస్తే ఇతనికివ్వబడిన అధికారాలు బహుస్వల్పం. కాని ఇతణ్ణి గ్రామమంతా కలిసి ఎన్నుకొంటుంది.

దేవతకు పూజలు సల్పేటప్పుడు 'పెద్దమనిచి' ముందరగా ప్రార్థన జరపాలి. మత కర్మలప్పుడు అతడే ముందరగా కల్లుత్రాగాలి. గ్రామాలు వదలివేసేటప్పుడు క్రొత్త గ్రామస్థలం పెద్దమనిచే నిర్ణయించాలి. గ్రామాల్లో తగాదాలువస్తే, పెద్దమనిచి పంచాయితీ సహాయంతో పరిష్కరించాలి. అతనికి అపరాధిని శిక్షించుటగాని, అతనిపైన జరిమానా విధించుటకు గాని అధికారంలేదు. గ్రామ గ్రామాలకు పోట్లాటలు వస్తేమాత్రం ఆ గ్రామాలయందలి పెద్దమనుచులను ఆహ్వానిస్తే వాళ్ళువచ్చి వ్యవహారం పరిష్కరిస్తారు.

ఈ వుద్యోగం వంశపారంపర్యం కాదుగాని, సామాన్యంగా పెద్ద కొడుకునకే ఇవ్వబడుతుంది. కుమారుడు చిన్నవాడైతే, సోదరునకు ఈ వుద్యోగం సంక్రమిస్తుంది.

పైన తెల్పిన అడవిచెంచులేగాక, ఇంకా మూడురకాలుగా చెంచులు భాగింప బడ్డారు. వాళ్లు (1) తెలుగుచెంచులు (2) కృష్ణచెంచులు (3)బొంత చెంచులు. మొదటిరకంవారు పెద్దపెద్ద కొమ్ములు వూదుతూ అడుక్కుం

టారు. కృష్ణచెంచులు నెమలికన్నులతో అలంకరించుకొని, వెదురు గ్రోవు లతో పాడుతారు. బొంతచెంచులు చిన్నిచిన్ని బొంతగుడిసెలతో ఊరూరా తిరుగుతూ, అరణ్యసంపద అమ్ముతారు.

వివాహం :— తక్కిన జాతులలోవలెనే చెంచులలోగూడ యుక్త వయస్సు వచ్చువరకు స్త్రీ పురుషులు సామాన్యముగా వివాహం చేసుకోరు. అంతవరకు పెద్దవాళ్ళు వారి పెండ్లివిషయమై తలపెట్టరు. ఇప్పుడిప్పుడు మేనరికాలు సర్వసామాన్యమైనవి.

వివాహాలన్నీ పరస్పర ప్రేమద్వారానే జరుగుతవి. సామాన్యంగా బంధుగుల ఇళ్ళకు వెళ్ళినప్పుడు కన్యలు యువకులను కలిసికొని ప్రేమించుకొంటారు. ఇంతేగాక భిల్లులలోవలెనే, అరణ్యములలో స్వేచ్ఛగా విహారం సల్పినా యువతీయువకుల తలిదండ్రులు పెద్ద తప్పుగా పాటించరు. వివాహంగాని కన్యకు గర్భంకల్గితే గర్భవిచ్ఛేదంకోసం ప్రయత్నం సల్పే దురాచారం వీళ్ళల్లోగూడా ఉన్నది. ఒకవేళ కన్య తన వలపుగాని పేరు తెలిపితేమాత్రం వివాహితుడైనాసరే అతడు ఆమెను పోషించ వలసినదే.

ఒకే కులమునకు చెందిన వారి మధ్యమాత్రం వివాహాలు దూష్యం. అటువంటిపని జరిగితే మాత్రం కులపెద్దలు నేరస్థులను కొడతారు. జరిమానా వేస్తారు. సామాన్యంగా ప్రేమికవ్యాపారం విప్పపువ్వురాలే ఋతువులోనే జరుగుతుంది. ఆ సమయాల్లో పట్టుబడితే సారాతో విందు సల్పుకుంటారు. పోట్లాటలు ప్రారంభ మవుతవి. పెద్ద గొడవచేస్తారు. తరువాత వివాహం జరుగుతుంది. ఒకే గ్రామంలో ఉండేవారు మాత్రం వివాహాలు చేసికోకూడదు. ఈ ఆచారమే సవరలలోగూడ కన్పిస్తున్నది.

పిల్లవానికి వయస్సువస్తే, అతని తల్లిదండ్రులు 'అబ్బాయికి మీసాలు మొలిచినవి' అని తెల్పుతూ, పిల్లకోసం వెతుకుతారు. వివాహపు ఖర్చు 5 లేక 10 రూపాయలలోపు అవుతుంది.

వరుడు, వధువుకును, ఆమెతల్లికిని చీరె రవికె పెట్టాలి. అంతేగాక సారాకొరకు—విప్పసారాలేని దినాల్లో అయితే—2, 3 రూపాయిలు ఇవ్వవలె. ఎప్పుడైతే చీరె, రవికెలు కొన్నారో అప్పుడు కన్యాదాతకు తెలియబరుస్తారు. పెండ్లికి ముఖ్యబంధువులు ఆహ్వానింప బడుతారు.



చెంచుల నృత్యము

‘1931 హైద్రాబాద్ జనాభా ర'ర్టు’ నుండి

వివాహపురోజున పెండ్లికొడుకు అతని గ్రామంలోఉండే పెద్ద మనిచి కొందరు బంధుగులు, బియ్యం, సారా, ఇతరపదార్థాలతో కన్యా దాత ఇంటికివెళ్తారు. విశాలంగా ఉండేస్థలంలో అంతా కూర్చుంటారు. వరుడు చీరె, రవికె, కన్య తల్లికిఇస్తాడు. పెండ్లికూతురు పిరుదలను, వక్షములను టేకుఆకులతో కప్పుత్మారు. వరుని ప్రక్కగా వేయబడిన చాపమీద ఆమె కూర్చోవాలి. రెండుగ్రామాల "పెద్దమనుచులు" 'మీకిద్దరికీ ఈ వివాహం ఇష్టమేనా'? అని అడుగుతారు. వాళ్ళు వప్పుకొన్నమీదట కన్య చీరకొంగు, వరుని గోచీ రెండు ముడిపెడ్తారు. తలంబ్రాలుపోస్తారు పెండ్లికొడుకువాళ్ళు తీసుకువచ్చిన బియ్యంతో అన్నం వండుతారు. ఆ వండిన అన్నంచుట్టూ సాగా త్రిప్పుతారు. భోజనాలతరువాత, సారా త్రాగి రాత్రి పొద్దుపోయేంతవరకు నాట్యమాడతారు. భార్యా భర్తలుగూడ దీనిలో పాల్గొనవచ్చు.

తెల్లవారినతర్వాత పెండ్లికూతురు అత్తవారింటికి పంపబడుతుంది. అక్కడగూడ విందుచేసుకొని భార్యాభర్తలు కాపురముచేస్తారు. ఒకవేళ అల్లుడు ఇల్లరికం ఉంటేమాత్రం వివాహానికితర్వాత తన పుట్టింటికి వెళ్ళడు.

చెంచుస్త్రీలు కుటుంబ నిర్వహణంలో సర్వస్వతంత్రలు. వాళ్ళు కొత్తవారంటే సిగ్గుపడరు. భర్తకొడితే, మళ్ళీ తిరగబడి కొడతారట గూడాను! వివాహంలో భార్యాభర్తలకు మనస్సు కలవకపోతే, స్త్రీ తన ఇష్టంవచ్చినవాడితో సుఖంగా ఉండవచ్చు. అసలు జాతిలోనే స్త్రీ పురుషు లకు సమానహక్కు లివ్వబడుతవి.

ఆచారాలు :—కాపురానికి వచ్చిన స్త్రీ గర్భవతిగాకపోతే, ఒక గొప్ప లోపముగా ఎంచబడుతుంది. బిడ్డలకోసం భార్యాభర్త లిరువురు బహు వ్యాకులపడతారు. కనపడ్డ దేవుళ్ళనన్నిటిని కొలుస్తారు. మంత్ర వేత్తలను ఆహ్వానించి తంతు జరుపుతారు. దానిమూలంగా శిశువుకలిగితే, దేవతపేరు పెడ్తారు.

స్త్రీ ప్రసవవేదన ఎక్కువకాలం అనుభవించినట్లయితే ఆమె భర్త చేతిలో జొన్నలు తీసికొని కులదైవమైన గార్ల మాచమ్మకు మ్రొక్కి ఈవిధంగా ప్రార్థిస్తారు: "పిల్లవాడు ఊడిపడ్తే ఒక శేరు జొన్నలుతెచ్చి

మీకు మొక్కుతా. మీకు దండం" అప్పుడు శిశూదయమయితే, జొన్నలు తెచ్చి, వండి గార్లమాచమ్మకు నైవేద్యముపెట్టి తింటారు.

శిశువు పుట్టినతరువాత మాయ మొదలగునవన్నీ ఇంటిదగ్గర ఒక కంతలో దాస్తారు. స్త్రీగనుక దుంపలు తవ్వటానికి అడవికి పోయినప్పుడు హఠాత్తుగా కంటే, పిల్లవాడి మాయను రెండు రాళ్ళతో కొట్టిపారేస్తుంది. ప్రసవసమయంలో భార్యకు భర్త ఏవిధమైన సహాయం చెయ్యకూడదు.

కనినతరువాత స్త్రీకి అన్నం పెడతారు. ఇంతేగాక అడవిలోదొరికే కొన్ని గింజలు, ఆకులు, బెరడునూరి ఆమెచేత తినిపిస్తారు. విప్పసారా రోజులలో అది విధిగా త్రాగవలసిందే.

మంత్రసానికి ఒక పావలా డబ్బులు, రవికెగుడ్డ యిస్తారు. ప్రస వించిన స్త్రీ చచ్చిపోతే, శిశువుకు బర్రెపాలుపోసి పెంచుతారు. శిశువు గర్భంలో ఉండగానే పేరుపెడతారు. ఒక కుటుంబములో నలుగు రైదు గురు పిల్లలున్నా ఒకే దేవుడుపేరుపెట్టడం సామాన్యం. లింగారు, లింగమ్మ; గురవడు, గురవమ్మ; గంగడు, గంగమ్మ - ఈ పేర్లు చెంచు లలో బహు వ్యాప్తి.

చెంచువాళ్లు మలేరియా వ్యాధివలన అమితంగా బాధపడుతూఉంటా రు. తర్వాత మశూచికముకూడా జాతికి చాలా నాశనము తెచ్చిపెట్టు తున్నది. కుష్టుగాని, సుఖవ్యాధులుగాని ఈ జాతిలో లేవనే చెప్పవచ్చు.

సామాన్యంగా నొప్పులన్నిటికి పాలతీగె ఉపయోగిస్తారు. ఇంకో తమాషా. సార్లపల్లిలో పాపయ్య అనే చెంచువైద్యుడుండేవాడు. పాము కాటుకి మానవమూత్రం, కొన్ని అరణ్యపుటాకులతో చేసిన అరఖు యిచ్చి నయంచేసేవాడట!

మందువల్ల జబ్బులు నయంకాకపోతే దేవతలకు ఆగ్రహం వచ్చిం దని తలుస్తారు.

<u>అంత్యకర్మలు</u> :— చచ్చిపోయినవాళ్ళను దహనం చెయ్యడమనేది చెంచులు క్రొత్తగా అవలంబిస్తున్నపద్ధతి. మృతినొందినవాడి వెంట్రుక లకు నెయ్యిపూస్తారు. కాళ్ళకి బూడిదెపూస్తారు. నగలుంటే కొన్ని తీసే స్తారు. గాజులు మొదలైనవిమాత్రం శవానికే ఉంచుతారు. తర్వాత శవాన్ని పాతిపెడతారు. గొయ్యి సామాన్యంగా 4, 5 అడుగులలోతు త్రవ్వుతారు.

పెద్దపులిగాని చిరుతపులిగాని చంపితే మాత్రము తగల పెడ్తారు. ఎలుగుగొడ్డు వలన చంపబడితేగాని, ప్రసవమయినప్పుడు చనిపోతేగాని, వ్యాధివల్ల పోతేగాని పాతిపెడ్తారు. ఈ సందర్భములో 3 వ రోజున 10 వ రోజున రెండు కర్మలు— చిన్నదినం. పెద్ద దినం అనేవి—చేస్తారు. చచ్చి పోయిన మూడురోజుల వరకు ఉదయం, సాయంత్రం ఆకుల్లో అన్నము తెచ్చి పాతిపెట్టినచోట పారేస్తారు.

చిన్నదినం రోజున బంధువులు స్మశానానికి వెళ్ళి, అన్నము వండి మూడువి స్తళ్ళలోపెట్టి 'స్వామీ నారాయణా, భగవంతా నీకునాకు దూరమై పోయింది. సామీ నీ ఇచ్చినవారు నీవు తీసికొనిపోయెను. వారు నీసామీ దెగ్గరకి పోయి చేరాడు. నీకు ఇక దండం' అని ప్రార్థిస్తారు.

10 వ రోజు బంధువులంతా రెండు రూపాయలు పెట్టి బియ్యము, పప్పు వాసనద్రవ్యములు తెస్తారు. స్త్రీలు ఈపదార్థములను వండకూడదు. పురుషులు వండిన పదార్థములను 3 వి స్తళ్ళలో పెడ్తారు. స్మశానానికిమధ్య దారిలో ఒకవి స్తట్లోని పదార్థం పారేస్తారు. శవం పాతినచోటికి వెళ్ళి అక్కడ కొన్నిరాళ్ళుపాతి వాటిపైన చచ్చిపోయినవాడి ఎముకలు అమర్చి రెండో విస్తట్లోని అన్నంమీద విప్పసారా చల్లుతారు. తర్వాత ఒక చిన్న నీటిగుంటవద్దకు వెళ్లుతారు.

ఇక్కడ మృతినొందినవారి పెద్దకొడుక్కి క్షురకర్మ జరుగుతుంది. తలనున్నగా గొరుగుతారు. తక్కినవాళ్ళ గడ్డాలు గీయబడతాయి. తర్వాత జ్యేష్ట పుత్రుడు, పెద్దమనిచి నీటిలోదిగి వి స్తళ్ళలోని ఆహారం కొన్ని యెముకలు కలుపుతారు. తర్వాతఅంతా స్నానముచేసి, విప్పసారా త్రాగు తారు. ఇంటిదగ్గర విందుచేస్తారు. దీనితో అంత్యకర్మ సమాప్తి.

మతం:— చెంచువాళ్ల కొలిచేదేవుళ్లు వాళ్ళ మతం చాలావరకు లంబాడీలవల్లనూ, సభ్యతా సంబంధంవల్లనూ మార్పుచెందాయి.

వీళ్ళ ముఖ్యదేవత గార్ల మాచెమ్మ. చెంచు జాతిలోని సమస్త వ్యవహారాలకు ఈ దేవి అనుగ్రహం అవుసరం. వేటకువెళ్లే టప్పుడు, తిరిగి వచ్చినతరువాత, జబ్బులుచేసినా, ప్రయోగాలు జరిగినా — అన్ని కార్యాల్లో ఈమెకు మొక్కుతారు. చంపిన జంతువుల భాగాలను అర్పణం చేస్తారు. తరువాత భగవంతరు అహోబిలస్వామి వస్తారు. భగవంతరంటే చెంచు

లకు మహాప్రీతి మహాభక్తి. సమస్త సుభములను భగవంతరు కూరుస్తాడు సమస్త ఆపదలనుండి కాపాడుతాడు. తరువాత లింగమయ్య పోటసమ్మ, అంబాదేవీ, పీడమ్మ, దేవతలను కొలుస్తారు. సామాన్యంగా జంతువుకార్జము గొర్ల మాచమ్మకు నైవేద్యం పెట్టుతారు. పెద్దమ్మ, ఎల్లమ్మవంటి చిల్లర దేవతలంటే మహాభయం వీళ్ళకు. మ్యాజిక్‌లన్నా, ప్రయోగాలన్నా, అంతగా భయంగాని, నమ్మకంగాని లేదు.

ప్రభుత్వ సహాయం :— ఈజాతి అభివృద్ధినిగూర్చి ఇదివరలో మద్రాసు ప్రభుత్వం కొంత కృషిచేసింది. ఆర్థికదురవస్థ, ప్రభుత్వ పరిపాలనా పద్ధతులమూలంగా కోలుపోయిన స్వతంత్ర జీవనపద్ధతులు, అజ్ఞానము — ఈ కారణాలచేత చెంచువాళ్ళు చిన్నచిన్న దొంగతనములు, ఆటవిక శాసనధిక్కారణ. చివరకు దోపిడులుగూడా చేస్తుండేవారు. వీళ్ల నేరప్రవృత్తి రూపుమాపటానికి మద్రాసు ప్రభుత్వం కర్నూలుజిల్లాలో వీళ్ళకి ప్రత్యేకంగా సెటిల్‌మెంట్లను ఏర్పరచి, వాటిని ఫారెస్టుశాఖాపరం చేసింది. కొంతకాలం ఈపనులను నిర్వహించటానికి హెచ్. యం, కృష్ణస్వామి అనేవారు నియమింపబడ్డారు.

1911 లో ప్రవేశపెట్టబడిన ప్రభుత్వపు విధానంమూలంగా వీళ్లపై ప్రత్యేకంగా విద్యాధికారి, వైద్యులు, చెంచు ఆఫీసరులు నియమించబడ్డారు. వీళ్లకి ప్రత్యేకంగా స్కూళ్ళు పెట్టబడినవి. కాని ఈ పద్ధతులు అంతగా వీళ్ళకు సహాయకారి కాకపోయినవి.

ఇటీవల హైద్రాబాద్ ప్రభుత్వంవారు ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడగు క్రిష్టఫ్ హైమండార్ఫ్ సలహాపైని అమారాబాద్ పీఠభూమిఅంతా 'ప్రత్యేక చెంచు రిజర్వ్'గా ప్రకటించి, ఈజాతికి అరణ్యంలో హక్కులిచ్చి, ఇతర కంట్రాక్టరులు వీళ్ళని మోసంచెయ్యటానికి వీలులేకుండాచేశారు. ఇంతే గాక, వీళ్లపైన సమగ్ర పరిశోధనలుచేసి హైమండార్ఫ్ 'చెంచులు' అనే గొప్ప గ్రంథం రచించారు.

## 3. ఎరుకలు

ఎరుకలు దక్షిణదేశమంతా వ్యాపించిన ఒక అనాదిజాతివాళ్ళు. ఈ దేశంలో, ముఖ్యంగా తంజావూరు, తిరుచనాపల్లి, కోయంబత్తూరు, అర్కాటు జిల్లాల్లోనూ, మైసూరురాష్ట్రం, బొంబాయి రాజధానిలోని బెల్గాం

బిజాపూర్, ధార్వార్, జిల్లాల్లోను, మన తెలుగుసీమలో విశాఖపట్టణం జిల్లా మొదలుకొని దత్తమండలముల వరకును వీరు వ్యాపించియున్నారు. ఇంతేగాక, హైద్రాబాద్ రాజ్యంలోని నల్లగొండ, వరంగల్లు, కరీంనగరు, మహబూబ్‌నగరు, మేదకు జిల్లాల్లోగూడా విశేషంగా కన్పడుచున్నారు. 1941 జనాభా లెక్కలప్రకారం ఆ రాజ్యంలో 45,771 మంది ఎరుకలు ఉన్నారని తేలుచున్నది,

వలసలు :— ఇటీవల ప్రయాణాల సౌకర్యం మూలంగా వీళ్ళలో కొంతమంది పడమట బొంబాయి, సూరతు వరకున్నూ, ఉత్తరమున కల కత్తా మిడ్నపూర్, ఖర్గపూర్, పూరీ, కటకంవరకుగూడా వెళ్ళి, అక్కడే స్థావరం ఏర్పరచుకొన్నారు.

జాతి - భాష :— ఎరుకలను "మెలనీడ్" జాతికి చెందినవాళుగా ఈక్‌సిడెట్టు పేర్కొన్నాడు. వీళ్ళని కొరవర్లు, కురుమరులు, కొరచలు, కుర్రములు, కుర్రలు అనే మారుపేర్లతో వీరిని పిలుస్తారు. వీళ్లు యేప్రదేశంలో ఉన్నా, ఆ పరిసర ప్రాంతపు భాషను మాట్లాడుతారు. కాని వారికి ప్రత్యేకంగా ద్రావిడభాషకు సన్నిహితమైన స్వభాష ఒకటి వున్నది. దానిని "ఎరుకలభాష" అనిన్నీ, "కైకడీ భాష" అనిన్నీ అంటారు.

తెగలు :— లంబాడీలకు వలెనే ఎరుకలుగూడ ఒక తిరుగుబోతు జాతి అని చెప్పవచ్చు. కాని వాళ్ళవాళ్ళ వృత్తులనుబట్టి ఈ జాతి రెండు తెగలుగా భాగింపబడ్డది. ఒక తెగవారు పూర్వకాలం సముద్రతీరం నుంచి ఉప్పుపేరి గాడిదలమీద నలుమూలలకూ రవాణా చేసేవాళ్లు. దానికి బదులుగా ధాన్యం గాడిదెలమీద వేసుకొని సముద్రతీరంలో నివసించేవారికి అమ్ముతూ ఉండేవాళ్ళు. వీరినే మనవాళ్ళు "ఉప్పు ఎరుకలవాళ్ళు" అని అంటారు.

జీవనం :— ప్రస్తుతం ఎరుకలవాళ్లు బుట్టలు, చాపలు అల్లి, తాటి ముంజలు అమ్ముకొని జీవిస్తున్నారు. కొంతమంది పందులను పెంచి, వాటితో వ్యాపారం సాగిస్తున్నారు. ఇంకా కొంతమంది పంది ఎరువులను అమ్ముకుంటున్నారు. మరికొంతమంది కూలి చెయ్యడం, ఇళ్ళల్లో నౌకరీ వగయిరా సల్పడం; ఫ్యాక్టరీలలోను, కసాయి దుకాణాలలోను, పనిచెయ్యడం మొదలైనవి చేస్తున్నారు. ఇంకా కొంతమంది సోది చెప్పుకొని,

పాముల్నిఆడించి, అదీ లేకపోతే, బిచ్చ మెత్తుకొని జీవిస్తున్నారు. కాని సోదిచెప్పుకోవడమే వీళ్ళకి కులవృత్తి. మైసూరులోకూడ సోదిచెప్పడం, గొర్లని మేపుకోటం, వేటాడుకోడం, బరువులు మొయ్యడంవల్ల ఎరుకలు కాలం వెళ్ళబుచ్చు కొంటున్నారు.

జిప్సీ పద్ధతులు :— వీళ్ళకు స్థిరనివాస మనేదిలేదు. వీళ్ళ ఆచార వ్యవహారాలు ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాల్లోని జిప్సీ, ఈజిప్షన్, బొహీమ్ యన్ మొదలయిన దిమ్మరిజాతులవాళ్ళ ఆచారవ్యవహారాలతో పోల్చవచ్చు. అంతేగాక. వాళ్ళకు వలెనే ప్రపంచములో సోదిచెప్పే ఇతర జాతులతో వీళ్ళకేదైనా సంబంధం వున్నదేమోఅని అనిపిస్తుంది. ఈ కారణాలవల్ల కొంతమంది వీళ్ళ జన్మస్థానం ఈజిప్టుఅని అభిప్రాయపడ్డారు. కాని వీళ్ళ వేషభాషాదులనుబట్టి చూస్తేమాత్రం, అనంతకృష్ణ అయ్యర్ అన్నట్లు వీళ్లు దక్షిణ దేశంలోని ఆదిమనివాసులనే తేల్తుంది.

వివాహాలు :— వీళ్ళలో ఎదిగినవాళ్ళకే పెండ్లిండ్లు అవుతవి. మేనరికం చేసుకోవాలనే కట్టడి వున్నది. కన్యాశుల్కం అధికంగా ఉంటుంది. ఆడవాళ్లు ఏడు పెండ్లిండ్లవరకు చేసికోవచ్చు. తంతులేకుండా సులభంగా వివాహములు జరుగుతవి. వివాహ విచ్ఛేదములుగూడ సర్వ సామాన్యం.

మతం :— మతం విషయంలో వీరు యిప్పుడిప్పుడు హిందువుల పద్ధతులు అలవరచుకొంటున్నారు. సామాన్యంగా క్షుద్రదేవతలకు కొలుపులు చేస్తారు. చచ్చిపోయినవాళ్ళకు మ్రొక్కుబడులు చెల్లిస్తారు. విశాఖ పట్టణ ప్రాంతంలో వీళ్లు "ఎఱుకలమ్మ" అనే సహగమనంచేసిన పతివ్రతకు ప్రత్యేకంగా గుడికట్టి ఉత్సవంచేస్తారని శ్రీ గి. వెం. సీతాపతిగారు చెప్పుచున్నారు.

ఎరుకల నేరాలు :— వీళ్లు పేరుపొందిన నేరగాళ్లు. వీళ్ళని క్రిమినల్ ట్రైబ్సు ఆక్టులో చేర్చటానికి కారణాలు లేకపోలేదు. మన ఆంధ్ర దేశంలో ఏ పోలీసుస్టేషనులో చూచినా సామాన్యంగా రిజిష్టరు చేయబడని ఎరుకలవాడు ఉండడు.

షుమారు 1792 మొదలు 1823 వరకు మద్రాసు రాజధానిలో మతప్రచారం నిమిత్తం నివశించిన పరాసు దేశీయుడగు డుబోయిస్,

అతని తర్వాత ఇప్పటికి షుమారు 70 సంవత్సరాలక్రితం మద్రాసు రాజధానిలో ముఖ్య పోలీసోద్యోగియుడగు ముల్లాలీ, తర్వాత పాపారావు నాయుడు మొదలగువారు ఎరుకలు దొంగలనిన్నీ, భయంకరమైన ఘాతుకములను చేసేవారనిన్నీ వ్రాసినారు.

వారుచెప్పినదానిలో నిజంలేక పోలేదు. పూర్వకాలంనుంచి దొంగతనాలకీ, బందిపోటులకూ, దార్లుకొట్టటానికీ ఎరుకలు చాలా పేరుపొందినారు. డ్యుబోయిస్ వ్రాతల ప్రకారంచూస్తే వీళ్ళలో నేరాలు చేయడమే ఒకవృత్తి అని తెలుతుంది. ఇల్లా నేరాలు సల్పేవారిని 'కల్లబంత్రులని' పిల్చేవారు. ఈనేరాలు చేయుటలో కల్లబంత్రులకు సిగ్గుగాని, అభిమానంగాని, లేకపోగా గొప్పగా చెప్పకొనేవారు. ఈ సందర్భములో—ఇది వెనుకటి రోజుల్లోమాట—ఎవరయినా తీవ్రంగా గాయపడ్డా, లేక మేజిస్ట్రేటులు ముక్కు చెవులు చేతులు ఛేదించే శిక్షలు విధించినా, ఆభాగములను వాళ్ళ ధైర్యానికి మంచితనానికి నిదర్శనంగా చూపించేవాళ్లు ఈ ఘాతకులు. వాళ్లనే సామాన్యంగా కులపెద్దలుగా ఎన్నుకొనేవాళ్ళు.

రాజాదరణ :—కల్లబంత్రులప్రభ పూర్వపురోజుల్లో అమోఘంగా వెలిగింది. బ్రిటిష్ ప్రభుత్వం మనదేశంలో స్థాపించబడకపూర్వం దక్షిణదేశమంతాగూడ చిన్నచిన్న రాజులచే పాలింపబడేది. ప్రతిరోజూ ఈ దొంగల జట్టుకు కొంతవరకు హుషారిచ్చేవారట. దీనికి ప్రతిఫలంగా కల్లబంత్రులు తాము దోపిడీద్వారా సంపాదించినదానిలో కొంతభాగం ఈరాజులకు చెల్లిస్తూఉండేవారు. ఐతే ఇదంతా రహస్యవ్యాపారంగా జరిగేది. ఇలాంటి రాజ్యాలలో ఈప్రజాకంటకుల క్రౌర్యాలనుండి తప్పించుకోటానికిగాను నిస్సహాయులైన గ్రామీణులు వీళ్లతో ఒకవిధంగా రాజీచేసుకోక తప్పేదిగాదు. జట్టునాయకునితో ప్రతి గ్రామస్థుడుగూడా సంవత్సరానికి ఒక పావలా పన్ను చెల్లించేటట్టున్నూ, ప్రతియింటికి ఒక కోడిపెట్టను యిచ్చేటట్టున్నూ, ఇందుకుగాను జట్టునాయకుడుఆ గ్రామంలో ఇంకో జట్టు వచ్చి దొంగతనం చెయ్యకుండా బాధ్యత వహించేటట్లున్నూ, ఏర్పాటు ఉండేది.

ఎరుకల సైన్యం :—టిప్పుసుల్తాను మైసూరు పరిపాలించే సమయంలో అతడు ప్రత్యేకంగా 'కల్లబంత్రుల' సైన్యాన్ని ఒకటి ఏర్పాటు చేశాడు. వీళ్లు చేసేదల్లా రాత్రిళ్ళు శత్రుసైన్యాన్ని దోచటం, వాళ్ళ ఉద్యో

గస్తులగుత్తాల్ని తుపాకులను, దొంగలించడం, శస్త్రసహాస్త్రాలను సేకరించ
డం అయివుండేది. వ్యక్తిగత సామర్థ్యాలననుసరించి వాళ్ళకి సుల్తాను
గారు ప్రతిఫలం నిర్ణయించేవారు. దేశం శాంతియుతమై ఉన్నప్పుడు వీళ్ళే
ఇతర రాజ్యాల్లోబడి దోపిడిచేసేవారు.

సాహసం ;— వీళ్ళు తమపిల్లలకు చిన్నప్పటినుంచి, ఎంతకొట్టినా
నాకు తెలియదనటం, అబద్ధం మాడడం, నేరాన్నొప్పుకోక పోవటం,
నేర్పుతారు. ఇంతేగాక వీళ్ళ స్త్రీలు తమపని నెరవేర్చుకోడానికి ఎలాంటి
సాహసమైనా చేస్తారు. శిగ్గువిడిచి ఏపనికైనా జొరబడతారు. దొంగలిం
చిన వస్తువులు చిన్నవయితే, మర్మాయవములలోను, గొంతుకలోను,
కడుపులోను, దాస్తారట.

దొంగతనము :— వీళ్ళుచేసే దొంగతనాలు సామాన్యంగా రాత్రుళ్ళ
యందే చేస్తారు. చడీ చప్పుడు లేకుండా, ముందు గ్రామాల్లో ప్రవేశించి
లంబాడీలవలెనే నాలుగు మూలలయందు మనుష్యులను కాపలా పెడ్తారు.
వాళ్ళు నిర్దేచిన ఇళ్ల గోడలమీదుగా ఎక్కి లోపలప్రవేశించి ఇంట్లో
వున్న సమస్తం దొంగలించి వచ్చినదారినే వెడతారు. అసలు తలుపులు
పగులగొట్టరు. లేకపోతే నెమ్మదిగా ఇంటి మట్టిగోడలకు పదునైన ఇనుప
పనిముట్టుతో ఒక మనిషి పట్టేటంత కన్నం వేస్తారు. సామాన్యంగా వీళ్లె
ప్పుడూ పట్టుబడరు. ఒక వేళ పట్టుబడుతామనే భయముంటే, ఒంటినిండా
జారిపోయేటందుకు ఆముదము పూసుకుంటారు. ఎవరయినా పట్టుకుంటే.
తమ స్వరక్షణార్థం ప్రత్యర్థిని చంపడానికి వెనుదీయని సాహసకులు వీళ్ళు.
ఇలాంటి దొంగతనాల్లో ఎరుకలవాడు ఎవడయినా చచ్చిపోతే, వాడికి
తోడుగా వచ్చినవాళ్లు వాడి శవమును తీసుకుపోవడానికి ఎంత ప్రయత్న
మైనా చేస్తారు. అలా వీలులేకపోతే వాని తలకాయయినా కోసి తీసుకు
వెళ్తారట !

కొందరు ఇళ్లల్లో దొంగతనం చేసేటప్పుడు నిద్రపోతున్న వాళ్ళ
మీద ఏదోపొడి చల్లుతారని, దానిమూలంగా వారికి మెళకువరాదని,
కొందరి నమ్మకం. వీళ్లనే "మచ్చుఎరుకల"ని అంటారు,

ఆడవి దొంగలు :— ఎరుకలవాళ్ళు హత్య, బందిపోటు చెయ్య
టానికిగూడా వెనుదీయరు. ఈవృత్తి అవలంబించేవాళ్ళు "అడవిదొంగల"నే

పిలువబడతారు. అయితే బందిపోటుచెయ్యటం. దార్లుకొట్టటం ఇప్పుడు లేదనే చెప్పవచ్చు. కాని గ్రామాల్లో దొంగతనంగా పొలాల్లోని ధాన్యం మాత్రం సంగ్రహిస్తారు.

పందుల దొంగతనం - శిక్ష :— వీళ్ళుచేసే నేరాల్లో పందుల్ని దొంగిలించటం ముఖ్యం. దొంగిలించిన పందుల్ని తింటారు. లేదా, దాస్తారు. వాళ్ళ కులపంచాయితీ ఇలాంటి నేరాల్ని విచారించి అపరాధికి శిక్ష విధిస్తుంది.

ఈ శిక్షలు తమాషాగా ఉంటవి. సామాన్యంగా పంది ధర పంచాయితీ నిర్ణయించి అసలువానికి ఆ మొత్తం అపరాధిచేత ఇప్పిస్తారు. లేక పందినిదాస్తే పంచాయితీ ఇష్టప్రకారం అపరాధి పందిని ఒక గుడిదగ్గర కట్టివేస్తాడు. పెద్దలందరకు త్రాగుడుపోసి తన తప్పు దిద్దుకోవాలి. అలా ఒప్పుకోకపోతే మాత్రం పోలీసులకు ఒప్పచెప్పుతారు.

పోట్లాటలు ;—వీళ్లుగూడ లంబాడీలవలెనే; బహు త్రాగుబోతులు. త్రాగినప్పుడు ఈ పందుల వ్యవహారం మూలంగానే అమితంగా కొట్లాడు కుంటారు. ఒక్కొక్క సమయంలో నెత్తురుచిందటం, తల పగలటం జరుగుతుంది.

మోసం - మాయబంగారం :—ప్రజలవద్దనుండి వీరు మోసంచేసి డబ్బుకాజేస్తారు. మెట్టగ్రామాల్లో నివశించే ఎరుకలవాళ్లు పొలాల్లోపడి దొంగతనంగా ప్రత్తి, వేరుశనగ, పొగాకు పీకుతారు. ఆసామీ వచ్చి ఎంతతిట్టినా నవ్వుతారు. సామాన్యంగా ఈ దొంగతన్నాలు స్త్రీలు చేస్తారు. ఆసామీగనుక ఒక దెబ్బకొడితే, వీళ్ళు ఒక పెద్ద కేకపెట్టి మూర్ఛ వచ్చినట్లు పడిపోయి, శ్వాసబిగబట్టి చచ్చిపోయినట్లు నటిస్తారు. ప్రక్కనుండి వాళ్ళ జట్టుఅంతావస్తుంది. అంతట ఆసామీ భయపడటం, పదో పరకో ఇయ్యటం జరుగుతుంది !

ప్రజల్ని వీళ్లు ఇంకోవిధంగా మోసంచేస్తున్నారు. ఇటీవల రంగూన్ నుంచి కొందరు జనం మనదేశానికి బంగారంతోవచ్చారని ప్రజల్లో కొంత పుకారు బయలుదేరింది. ఇది ఆధారంచేసుకొని కొందరు వడ్డెరలు, ఎరుకలు కలిసి ఏ యిత్తడిదానికో, రాగిదానికో బంగారుపూతపూసి, అసలు బంగారమని చెప్పి నమ్మించి, అమ్మటం మొదలుపెట్టారు. ఇటీవల ఈ

వ్యాపారం చాలా అధికమైంది. చాలామంది ప్రజలు మోసపోయినారు. ఈమధ్య కృష్ణాజిల్లాలో 40 మంది జట్టు బయలుదేరి ఈ వ్యాపారం సాగించారు. వాళ్ళల్లో 13 గ్గురు ఎరుకలవాళ్లు. పోలీసువారు వీళ్ళని పట్టు కొని 23 రకు శిక్ష విధించారు.

వీళ్ళ క్రిమినల్ చర్యలు ఆరికట్టడానికి ప్రభుత్వంవారు ష్టూఅర్టుపురం, శీతానగరం మొదలయినచోట్ల సెటిల్‌మెట్లు ఏర్పరచినారు. ఇప్పుడు వీళ్ళల్లో నేరాలు క్రమేపి తగ్గుచున్నవి.

## 4. ఏ నా దు లు

ఎరుకలు, లంబాడీలవలెనే ఏనాదులుగూడ మన ఆంధ్రదేశమంతటా వ్యాపించిన ఒక అనాదిజాతి. వీరు నైజాంరాష్ట్రంలోని తెలంగాణా భాగములందును, మనదేశంలో విశాఖపట్టణంజిల్లా మొదలు నెల్లూరుజిల్లా వరకును వ్యాపించియున్నారు.

వీరి సాంఘిక వ్యవహారాలకు, ఆచారాలకు, విజ్ఞానానికి నెల్లూరు జిల్లాయే కేంద్రం అని చెప్పవచ్చు. అసలు ఏనాదిజాతిలో సగంమందికి పైగా ఈ జిల్లాలోనే నివశిస్తున్నట్లు తేలుచున్నది,

లక్షణాలు :— ఏనాదులు 'మంగోలియడ్' జాతికి చెందుతారని ముల్లాలీ, డాక్టర్ షాట్ మొదలయినవారు అన్నారు. కాని వీళ్లన్నూ, చెంచువాళ్లన్నూ జాతిరీత్యా ఒకటే అని పి. సి. రెడ్డి తెలుపుచున్నాడు. దీనికి తార్కాణంగా ఏనాదులుకూడా చెంచువాళ్ళవలెనే 'చెంచుదేవుణ్ణి' తమ కులదైవంగా చూడటం, పెండ్లిండ్లప్పుడు బందేడాకు, తంగేడు పువ్వు వాడటం మొదలయినవి చేస్తారు. ఇంతేగాక అసలు చెంచువాళ్లుకూడా ఏనాదులను "ఊరచెంచులు" అని వ్యవహరిస్తారు.

"ఏనాది" శబ్దం :— "ఏనాది" అనే శబ్దాన్నిగూర్చి కొన్ని వాదనలు ఉన్నవి. కొందరు ఈ పదం 'అనాధ' అనేదానినుంచి వచ్చినదని చెప్పుతారు. అందుకు నిదర్శనంగా ఏనాదుల దారిద్ర్యం, నిస్సహాయత పేర్కొంటారు.

మరికొంతమంది "ఏనాది" అనేశబ్దం "అనాది" అనేదానికి సన్నిహితంగా వుండబట్టి ఏనాదులు, అనాదీయులని తెల్పారు.

ఏనాదులు అనాదులా ? — అసలు టోపినార్డు ఏనాదివాళ్ళను దక్షిణ దేశంలోని ఆదిమనివాసులక్రింద జమకట్టాడు. అంటే వీళ్లు ద్రావిడులకు పూర్వమే మన దేశంలో నివశించినవా రన్నమాట.

పి. సి. రెడ్డిగారు మాత్రం కొద్దిగా పైదానికి సవరణచేశారు. ఏమంటే వీళ్లు దక్షిణదేశంలో నివశించిన పురాతనవాసులనిన్నీ, కాల క్రమేణ ఇతరులచేత కొండల్లోకి, అడవులలోకి తరుమబడ్డారని ఆయన వాదన.

ఏమైనా వీరు "అనాదులు" అనడానికి సందేహంలేదు.

జన్మస్థానం :—పులికట్టు సరస్సులోఉన్న శ్రీహరికోట వీరి జన్మస్థానమని కొందరన్నారు. వీరు పులికట్టు ప్రాంతంలోనికి తరుమ బడ్డారని మరికొందరన్నారు. ఈవాదనే సహేతుకంగా కన్పిస్తున్నది. ఏనాదివాళ్ళలో తమ పూర్వవృత్తాంతాన్ని గూర్చిన కథలలో ఈ క్రింది విషయము పేర్కొనవచ్చును. మెకంజీ వ్రాసిన కథ చూడండి :

పూర్వం రాఘవుడు అనేవాడు పిరషోటి ప్రదేశంనుండి 60 ఏనాది కుటుంబాల్ని శ్రీహరికోటకు తీసుకువచ్చి, నివశించాడట. శ్రీహరికోట మధ్యప్రదేశంలోకి అంబికేశ్వరుడు అనే ఋషివచ్చి రోజూ నదిలో స్నానంచేసి, శివారాధన చేస్తుండేవాడు. ఆ రోజుల్లో ఏనాదులకు ఒక క్రూరసర్పంనుండి మహావిపత్తు సంభవించినదట. ఈ ఋషియొక్క దయ సంపాదించటానికిగాను రోజూ వీరు ఆయనకు పండ్లు మున్నగునవి ఇస్తూ ఆయననుండి మంత్రాలు నేర్చుకొన్నారట.

ఇంకోకథ ఏమంటే శ్రీ వాశిరెడ్డి వెంకటాద్రినాయుడుగారు వీరం దరిని చంపవలసినదిగా ఆజ్ఞఇస్తే వీరు భయపడి పారిపోయి శ్రీహరి కోటకు వచ్చారట.

జాతివిభాగాలు :—ఏనాదులంతా రెడ్లవల్ల ఓడింపబడి, వాళ్ళకు ఊడిగం చెయ్యటం మొదలుపెట్టారు. రెడ్లతాకిడి తగిలేదాకా వీళ్ళు సభ్య ప్రపంచంతో ఏమీ సంబంధం పెట్టుకోకుండా, వేటాడుతూ, చేపలుపట్టీ, దుంపలుతినీ కాలం గడిపేవారు.

ఏనాదులు నాలుగు రకాలుగా ఏర్పడ్డారు. 1. రెడ్డిఏనాదులు 2. చల్ల లేక గరప ఏనాదులు 3. అడవి ఏనాదులు 4. తూర్పు ఏనాదులు.

1. రెడ్డిఏనాదులు : రెడ్డిఇళ్ళల్లో వంటచెయ్యటం, ఊడిగం చెయ్యటం, మొదలైన పనులవల్ల వీరు జీవిస్తారు. వీరిని కాసాలు, దాసీలు మొదలైన వాళ్ళతోపాటుగాచూస్తారు. తక్కిన ఏనాదులకంటె వీరు తక్కువగా చూడబడుతారు. వీరితో తక్కిన తెగలవాళ్లు వివాహ భోజనాదులుసల్పరు. వీళ్ళు స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు.

2. చల్ల లేక గరప ఏనాదులు గ్రామాల్లో చివర చిన్న గుడిసెలు వేసి కొంటారు. ఏనాదులలో ఎక్కువగా నేరాలు చేసే తెగ ఇదే అని అన్నాడు ముల్లాలీ.

3. అడవి ఏనాదులకు అసలు స్థిరనివాసమేలేదు. అడవుల్లో తిరుగుతూ, వేటాడుతూ కాలం వెళ్లబుచ్చుకొంటారు.

4. తూర్పు ఏనాదులు గంజాం, విశాఖపట్టణం, గోదావరి జిల్లాలలో కనిపిస్తున్నారు. వీరినే "నక్కలవాళ్లు" అనిగూడ పిలుస్తారు. వీళ్ల వలలుపన్ని, నక్కల్నిపట్టడం, తినటం మూలంగా వీళ్లకీపేరు వచ్చింది. తక్కిన తెగలవాళ్లు వీళ్లకి తమతోపాటు సమానగౌరవమివ్వకపోగా అసలు వీళ్లు ఏనాదులే కాదంటారు.

జీవనం :— ప్రస్తుతం ఏనాదివాళ్ళు ఇళ్ళల్లో నౌకరీలు చెయ్యటం, గ్రామాలు కావలి కాయటం మొదలగు పనులు చేస్తున్నారు. కొంతమంది పొలాలకుగూడ కాపలా ఉంటారు. ఇంకా కొంతమంది ఏమీ పనిలేక బిచ్చమెత్తుకోవడం, పుల్లాకులలో పారేసిన అన్నంతినటం మొదలయినవి చేస్తున్నారు. వీరితో తక్కిన ఏనాది వాళ్లకి ఏమీ సంబంధముండదు. మరి కొంతమంది పాకీపనిసల్పి జీవిస్తున్నారు.

ఏనాదులు వ్యవసాయం మొదలయిన స్థావరవృత్తులు చెయ్యలేరు. వేటాడుట, చేపలుపట్టుట పుల్లలు ఏరుట అంటే వీళ్ళకు చాలా ఇష్టము.

వీళ్ళు తాబేలు, ఎలుకలు, మొదలయిన అసహ్యపదార్థములనుకూడ తింటారు.

వివాహం :— వీళ్ళవివాహాలు బహుతేలికగా జరుగుతవి. వివాహం పెండ్లికొడుకు యింట్లోనే జరుపుతారు. పెండ్లి ఆధ్వర్యం అంతా వధువు మేనమామ ద్వారా జరుగుతుంది. వీళ్ళు లగ్నం పెట్టుకోవడం

తమాషాగా ఉంటుంది. మేనమామ ఒకబాణం పాతుతాడు. దానిమీద ఒక నిర్ణీత ప్రదేశంలో పడడమే ముహూర్తమన్నమాట.

మొట్టమొదట స్నానం చేస్తారు వధూవరులు. తరువాత కొత్త బట్టలు కట్టుకొని బందేడాకు కంకణాలు కట్టుకొంటారు. మూడో రోజున విప్పుతారు. దీనితో పెండ్లిసమాప్తి. తర్వాత బంధువులతోసహా త్రాగుతారు. భోజనాలు పెడ్తారు. నాట్యమాడుతారు.*

ఇతర ఆచారాలు :— వీరు వ్యభిచారాన్ని ఒక దోషంగా పరిగణించేవారుకారట* విధవా వివాహాలు, వివాహవిచ్ఛేదాలు సర్వసామాన్యం. ఒక ఏనాదివాడు షుమారు 25 పెండ్లిండ్లు చేసికొన్నాడు.

పిల్లలకు బ్రతికివున్న బంధువుల పేర్లుబెట్టరు. వాళ్ళకు తమ కుల దేవతల పేర్లుపెడతారు. వీరి పిల్లలకు చిన్నప్పటినుంచి మట్టి తినడం బాగా అభ్యాసం. దానివలననే ఈ జాతిలో అనారోగ్యం, అకాలమరణాలు సంభవిస్తవి.

ఏనాదులకు వేళ్లు, దుంపలు — వీటి ఔషధగుణాలు బాగా తెలుసు.

ఏనాదుల నేరాలు :— ఎరుకలవలెనే ఏనాదులుగూడ క్రిమినల్ ట్రైబ్సులో చేర్చబడ్డారు. వీళ్లుసల్పేనేరాల్లో బందిపోటుతనం, దార్లుకొట్టటం ఉన్నవిగాని కన్నం దొంగతనమే ఏనాదులకు ప్రధానమైన వృత్తి.

గొర్రెలను, మేకలను దొంగిలించడం రెడ్డి ఏనాదులు చేసే ముఖ్యమైన నేరమని అన్నాడు ముల్లాలీ.

ఎరుకల సహాయం :— దొంగతనాలు చెయ్యటంలో ఏనాదులు, ఎరుకలతో "భాయి, భాయి" అంటారట ! అంతేగాదు; "నీవు ఎవర"వని అడిగితే, "మేము ఎరుకల"మనికూడా చెప్పుకుంటారట ఈ ప్రబుద్ధులు. కారణం తెలుసునా ? నేరం అంతా పాపం, ఎరుకలజాతిమీద మోపటానికి.

కన్నపు దొంగతనం :— అసలు వీళ్లు తమ చుట్టాలలో కావలివాండ్రుగావున్న గ్రామాలకి వెడతారు. అలాగవెళ్ళి తమ బంధువుద్వారా ఎవ్వరూ అనుమానించకుండా, అతి చురుకుగాను, జాగ్రత్తతోను ఊరి వ్యవహారమంతా తెలిసికొంటారు. అంతే ! ఆరాత్రి ఎవడికొంపో మట్టి

* ఈవిషయములో అభిప్రాయభేదము లున్నవి.

మైనదన్నమాటే! కావలివాడు, దొంగకలిసి భాగం పంచుకొంటారు. అందుచేతనే పోలీసువారు విచారించటానికి వచ్చినప్పుడు కావలివాణ్ణి పట్టుకొని నిర్బంధించటం సామాన్యంగా జరుగుతుంది.

దొంగతనం చేసేటప్పుడు ఏనాదివాడు ఉపయోగించేది "సిక్కాలు కోల" అనే చిన్న ఇనుపపలుగు. దీనికి రెండువైపుల పదునుఉంటుంది. శబ్దం ఏమాత్రం కలుగకుండా, ఎలాంటి గోడకైనాసరే కన్నం వెయ్యా వచ్చు. సామాన్యంగా కన్నం వెయ్యటం, చంద్రోదయమైన మొదటి ఝాములోనే.

ఇంకోసంగతి! దొంగతనంచేసి ఇంట్లో ఉన్న అన్నంతిని వెళ్లతారు. ఏనాదులు: మలవిసర్జనగూడ చేస్తారని ముల్లాలీ వ్రాశాడు.

జె. డబ్లుయు. కూంబస్ ఏనాదివాళ్ల క్రమపద్ధతిలో, అంటే అదే వ్యాపారంగా, దొంగతనం చెయ్యటానికి సమర్థులుకారని అన్నాడుగాని అది సరికాదు; ఎందుకంటే వీరి ఆడవాళ్లగూడా దొంగసొమ్ములు దాచే విషయంలోను, అమ్మటంలోను మగవాళ్ళకి సహాయంచేస్తారు.

అడుక్కోటానికి వెళ్ళినప్పుడు ఇంటావిడతోమాట్లాడి రహస్యంగా దొంగిలించిన వస్తువులు చౌకధరకు అమ్ముతారు. ఇంకా షరాబువర్తకులు, కోమట్లుకూడా కొనేవాళ్ళని వినికిడి. ఐతే ఇప్పుడుఎల్లాఉందో చెప్పలేము.

కాని ఏనాదివాడిదగ్గర ఒక సుగుణంవున్నది. పిరికివాడు! ఒక దెబ్బకొడితే నిజం చెప్పుతాడు.

ప్రభుత్వంవారు వీళ్లలోసంస్కరణలు ప్రవేశపెట్టటానికి వి. సుబ్బ రాయన్ అను పోలీసు సూపర్నెంటు ఆధిపత్యంక్రింద చిత్తూరుజిల్లాలో సెటిల్‌మెంట్లు ఏర్పరచినారు. గాని ఆ పద్ధతి అంతగా వారి అభివృద్ధికి తోడ్పడలేకపోయినది. పోతే వీరి అభివృద్ధికి నెల్లూరు వాస్తవ్యులైన శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య, బి.ఏ., బి.ఎల్.గారు విశేషమైన కృషిసల్పుతున్నారు. వీరికి ప్రత్యేకంగా నెల్లూరు జిల్లాలలో కాలనీలు స్థాపించారు. వీరికితోడు నా మిత్రుడు పి. సి. రెడ్డిగారు ఈజాతిపైన సమగ్రపరిశోధన సల్పి ఒక చక్కని గ్రంథం రచించారు.

## 5. దొ మ్మ రు లు

దొమ్మరులు ఆంధ్రదేశమంతటా వ్యాపించిన ఒక ద్రిమ్మరి జాతి వారు. వీరు హైదరాబాద్ రాష్ట్రంలోని తెలంగానా, కర్ణాటక జిల్లాలలోను, మైసూరు రాజ్యములోను విశేషముగా కన్పడుచున్నారు.

జన్మస్థానం :— వీరి జన్మస్థానం దత్తమండలాలలోని "బొంబర మద్దలాపుర" మని కొందరు చెప్తారు. కాని వీరు కర్నూలు, నెల్లూరు జిల్లాలనుండే తక్కినప్రదేశాలకు వ్యాపించారని ఎల్. ఎ. కె. అయ్యర్ తెలుపుచున్నాడు.

పూర్వంవీళ్లు విజయనగరసామ్రాజ్యకాలంలో ఆ ఆస్థానంలో గారడీ విద్యలు, సర్కస్ పనులుచేసి జీవనం చేసినవారు. ఇప్పటికిగూడా దీనికి తార్కాణంగా వీరికి జమ్మలమడుగు, తాడిపత్రి, ప్రొద్దుటూరు మొదలయిన చోట్ల ఈనాములున్నవి.

ఎరుకలవలెనే, వీళ్లుకూడ ఇతర పేర్లతో అంటే—దోమర, దొంబరి, దోమ్రి అని వ్యవహరింపబడుచున్నారు.

లక్షణాలు :—డాక్టరు ఫ్రాట్ వీళ్ళను మంగోలియడ్ జాతిక్రింద పేర్కొన్నాడు.

అసలు దొమ్మరశబ్దం వీళ్లు తిరుగుబోతులవటం మూలంగా వచ్చిన దని కొందరంటున్నారు. ఇంకా కొందరు ఈ శబ్దం ఉత్తర హిందూస్థానంలో "దోమ్" అనే నీచజాతివాళ్ళనుండి వచ్చిందన్నారు.

షిరాజ్-ఉల్-హుస్సేన్ మాత్రం వీళ్లున్నూ, మహారాష్ట్ర దేశంలోని కొల్హాట్లున్నూ, ఒకేజాతికి చెందుతారని వ్రాసినాడు. కాని ముల్లాలీ వీళ్ళకున్నూ లంబాడీలకున్నూ, సంబంధం ఉన్నదన్నాడు.

ఏమైనా, లంబాడీలలోవలెనే, దొమ్మరులలోగూడ జాతిసాంకర్యం హెచ్చుగాకలదని చెప్పవచ్చును.

ఎరుకలు ఏనాదులవలెగాక, దొమ్మరులు పొడగరులు; బలిష్ఠులు; వీళ్ల స్త్రీలు సామాన్యంగా అందంగా ఉంటారు.

సాంఘికవిభాగాలు :—దొమ్మరులు రెండుతెగలవారు. 1. తెలుగు లేక రెడ్డి దొమ్మరులు; అందులో మళ్ళీ రెండురకాలు. (a) ఊరు దొమ్మ

రులు (b) కాడు దొమ్మరులు. ఊరుదొమ్మరులు స్థావరనివాసం, వృత్తులు అవలంబించుతారు. కాడుదొమ్మరులు ఊరూరాతిరుగుతూ జీవిస్తారు. 2. ఆరెదొమ్మరులు. వీళ్లు తెలుగుదేశంలోకి వలసవచ్చిన కొల్లాట్లు. వీళ్లు మాట్లాడేది మరాఠీభాష. ఈ రెండుతెగలకు, వివాహభోజనము లుండవు.

జీవనం :—ప్రస్తుతకాలంలో దొమ్మరులు గారడీచేసి, మొగ్గలువేసి సర్కసుపనులుచూపి జీవిస్తున్నారు. ఇంతేగాక "గడఆట" "త్రాడుఆట" ఆడి పొట్టపోసుకొంటున్నారు. ఈరోజుల్లో వీళ్ళకిదే ప్రధాన జీవనోపాధి అయింది. కాని, కొందరు వ్యవసాయంచేసి, చేపలుపట్టి, వేటాడి, చాపలు అల్లి, గాడిదెలను పందులనుపెంచి, కాలంగడుపుతున్నారు. మరికొందరు కొమ్ము దువ్వెనలుచేసి, మగ్గాలకు పనికివచ్చే పేకలుచేసి, డబ్బు సంపాదిస్తున్నారు.

అలంకరణ :—తక్కిన తక్కువ జాతులవలెగాక దొమ్మరులకు విలువైన వస్తువులు ధరించటమంటే చాలా ప్రీతి. అందుచేతనే పండుగలప్పుడు, ఉత్సవ సమయాల్లోను వీరు శాలువలు, చొక్కాలు, తలగుడ్డలు ధరిస్తారు. స్త్రీలు సామాన్యంగా రంగురంగుల చీరెలు, బిళ్లేరుగాజులు, హారాలు, గవ్వలు మొదలయినవి ధరిస్తారు.

వివాహాలు : వీరిలో మొగవాడు ఇద్దరు అక్కచెల్లెండ్రను వివాహమాడవచ్చునుగాని, అన్నతమ్ములు అక్కచెల్లెండ్రను మాత్రం పెండ్లిచేసుకోకూడదు.

సామాన్యంగా ఈడువచ్చిన పిల్లకే వివాహం చేస్తారు. ఐతే బాల్య వివాహాలుకూడ జరగడంకద్దు! ఒకప్పుడు ప్రేమిక వివాహాలు కూడ జరుగుతుంటవి.

పెండ్లిజరగాలంటే మొదట పిల్లవాని తండ్రి వధువు తండ్రి వద్దకు పోయి కన్యాశుల్కం క్రింద రు. 20 ఇస్తాడు. తరువాత పెండ్లికి చీర, రవిక ఇస్తాడు. మొట్టమొదట కులపెద్దని పిలిచి, ఒక గ్లాసెడు కల్లుపోసి అనంతరం కులంవాళ్ళంతా త్రాగుతారు. సామాన్యంగా వివాహం ఏదో పండుగరోజునే చేస్తారు.

లగ్నంరోజున వాళ్ళ కులదేవతయిన మాచెమ్మ విగ్రహము పెట్టి దానికి ఎదురుగా అంటే తూర్పుముఖంగా ఈతాకుల చాపవేసి వధువుని

కూర్చోపెడ్తారు. వానిచేతిలో డోలు వాయించే కర్ర ఒకటి ఉంటుంది. అప్పుడు పెద్ద ఉత్సవంతో వధువుని తీసుకొనివచ్చి పెండ్లి కొడుకున కెదురుగా కూర్చోపెడ్తారు. వరుడు బిళ్లేరుగాజులహారం ఒకటి వధువు మెడలో వైచి కొంగులు ముడిపెడ్తాడు. అనంతరం తలంబ్రాలు పోసికొంటారు.

ఆరోజునే ఒక పందినికోసి, కులంవాళ్ళకు విందుచేస్తారు. మూడో రోజున వధువును పెండ్లికొడుకు ఇంటికి పంపిస్తారు. అక్కడకూడ ఉత్సవం, విందుజరుగుతవి. పెండ్లి సమాప్తి.

దైవం :— వీళ్ళ కులదైవము మాచెమ్మ. సామాన్యంగా శ్రావణ మంగళవారాల రాత్రిళ్లు ఈ దేవతలకు కొలుపులు కొలిచి, ఉత్సవంచేస్తారు. కులమంతాకలసి విగ్రహాన్ని ప్రతిష్ఠించి గొఱ్ఱెలు, మేకలు, పందులు, కోళ్లు, మొదలయిన వాటిని కోస్తారు. ఇలాంటి పూజలు సల్పేటప్పుడు కుమ్మరి వాణ్ణిపిలిచి వాడిచేతనే పూజారత్వం జరిపిస్తారు. ఆసమయాల్లో డోళ్లు, మద్దెళ్ళతో మగవాళ్ళంతా వాద్యము చేస్తూంటే స్త్రీలు పాటలు పాడతారు. నరికినవాటి తలలుమాత్రము కుమ్మరివాడు తీసుకొని వెళ్తాడు. మిగిలిన మాంసముతో అంతా విందుచేసికొంటారు. మాచెమ్మగాకుండా, ఎల్లమ్మ, ముత్యాలమ్మ, పోచమ్మ, అంకమ్మ, మహేశ్వరుడు, కిష్టయ్య మొదలగు క్షుద్రదేవతలను కొలుస్తారు.

వీళ్ళకు దయ్యాలంటే మహాభయం. అందుచేత ఎవరికైనాదయ్యం పట్టితే ఎరుకలవాళ్ళని సోదిఅడిగి, మంత్రాలు పెట్టించుకొంటారు.

దొమ్మరులు చుంచులు, పొలిపు ఎలుకలు, పిల్లులు, ఉడుతలు, ముంగిసలు, పిచ్చుకలు, కుళ్లిన మాంసం మొదలయిన అసహ్యపదార్థాలు తింటారు. ఇంతేగాక వీరు అతిత్రాగుబోతులు.

వీరు ఒక్క మాలమాదిగలు మినహా అన్ని కులాల ఇళ్లలోను, భోజనం చేస్తారు. అయితే మాలమాదిగలు వీరి దగ్గరనుండి ఆహారము తీసుకోవచ్చు.

పంచాయితీ :— వీళ్ళల్లో కులపంచాయితీ ఉన్నది. కుల పెద్దను "మట్లిగురు" అంటారు. కులంలో జరిగే సమస్త వ్యవహారాలపైన అతనిదే పెత్తనం. అతని నివాసస్థలం కడపజిల్లాలోని "చిట్టివేలు" గ్రామమని చెప్పుతారు.

ప్రస్తుతస్థితి :—ప్రస్తుతకాలంలో వీరిస్థితి చాలా శోచనీయంగా ఉన్నది. సభ్యసంఘంలో వీరంటే అసహ్యం, ఏవగింపు.

దీనికి కారణాలు లేకపోలేదు. వీళ్ళతినే అసహ్యాపదార్థాలకు, అమితత్రాగుడుకు తోడుగా, ఎరుకలు, లంబాడీలు, ఏనాదులవలెనే, మన మద్రాసు, మైసూరురాష్ట్రాల్లో వీళ్లని దొంగజాతిగా చూస్తున్నారు. ఇంతేగాక ఈజాతిలో వ్యభిచారం అమితం.

వ్యభిచారం :—వీరు గెడమీదా, త్రాడుమీదా ఆడటం చేస్తారుగదా! ఈ విద్య సామాన్యంగా ఆడపిల్లలకే నేర్పుతారు. కారణం ముఖ్యంగా ప్రజల్ని ఆకర్షించటానికే! ఇలా ఆటనేర్చుకొన్న స్త్రీని "సాని" అని పిలుస్తారు. దీనికి వివాహంచెయ్యరు. అది కేవలం పడుపువృత్తివల్ల జీవితం గడుపుతుంది. వీరిలో కొంతమంది కన్యలను గుళ్లో దేవుడికిచ్చి పెండ్లిచెయ్యటం, కత్తికి ప్రధానం చెయ్యటంవంటి పద్ధతులున్నవి. వీటి మూలంగా కన్య వివాహం చేసికోకూడదుగాని, ఎంతమందికైనా ఉంపుడు కత్తెగా ఉండొచ్చు!!

పూర్వపురోజుల్లో ఈదొమ్మరికన్యలు ప్రత్యేకంగా పాళెయగాండ్రకు ఉంపుడుకత్తెలుగాఉండి, ధనం గడించేవాళ్ళట!!

అంతేగాదు. గడమీద సరిగ్గా ఆడలేని పడుచును కులమందరికీ ఉపయోగించేలాగున వ్యభిచారం సల్పమంటారట. అందుకూ పనికిరాక పోతే మాత్రం వివాహం చేస్తారట! ఏమిఘోరం!

డ్యుబోయిస్ వ్రాతల్లోగూడ ఈ స్త్రీల అవినీతికర ప్రవర్తననుగూర్చి ఘోరంగా వ్రాయబడ్డది. మగవాళ్లు సర్కస్‌పనులు చేస్తుంటే వీళ్ళు వ్యభిచారంద్వారా డబ్బుగడించి కాపురం సాగించేవాళ్ళని వ్రాశాడు.

వ్యభిచార ప్రోత్సాహము :—అసలు వీరి మగవాళ్లు స్త్రీల వ్యభిచారాన్ని సహించటమేగాకుండా, అది ఒక సంపాదనమార్గంగా ప్రోత్సహిస్తారు.

పడుపువృత్తిని సమర్థించటానికిగాను ఈ క్రిందికథను చెప్తారు ఈనీతిబాహ్యులు. చిన్నమ్మ అనే వాళ్ళ పూర్వీకురాలు ఒకతె ఒక రాజు ముందర ఆటఆడిందట. కాని రాజు దానితండ్రిని కారాగారంలో వేశాడట.

ఆదరించేవాడు లేక, పొట్ట గడువక, వ్యభిచారం సాగించి జీవించిందట ఆ మనిషి.

అందుచేతనే వ్యభిచారం వీళ్ళలో ఒక సాంఘికాచారం, మర్యాద, అయినది.

వీరికుల పంచాయితీ వ్యభిచారాన్ని ఏవిధంగా ఆదరిస్తున్నదో చూడండి:

1. తమకంటె ఎక్కువ కులంవాళ్ళతో వ్యభిచారం చేస్తే తప్పు లేదు.

2. వివాహవిచ్ఛేదమైతే, స్త్రీ మళ్ళీ పెళ్ళిచేసుకో కూడదు. కాని వ్యభిచారం చెయ్యొచ్చు.

3. వివాహానికి పూర్వం గర్భం రాకుండా వుంటే వ్యభిచారం చెయ్యవచ్చు.

4. వితంతువు పెండ్లాడరాదుగాని, ఇష్టమయితే ఎవరికైనా ఉంపుడుకత్తెగా ఉండొచ్చు.

ఈదురాచారం రూపుమాపితేనేగాని ఈజాతి బాగుపడదు. సంఘ సంస్కర్తలు తమ దృష్టిని వీళ్ళవైపు మరల్చవలసినదిగా నావిజ్ఞప్తి.

దొమ్మరులనేరాలు :—పూర్వకాలంలో వీళ్ల స్త్రీలను ఎత్తుకుపోయే వారు; బందిపోట్లు జరిపేవారు; దార్లు కొట్టేవారు; దొంగతనం చేసేవారు.

వీరు చాలా ధైర్యవంతులు. దువ్వెనలు అమ్మటానికి గ్రామాల్లోకి వెళ్ళే తమ స్త్రీలద్వారా ఊరి విషయమంతా తెలిసికొంటారు. అంతాసిద్ధం చేసికొన్న తర్వాత గ్యాంగ్‌నాయకుని వద్దకు పోతారు. వాడు నాలుగైదు జట్టీలను పంపుతాడు. ముందుగా శకునం చూచుకొని, పోలేరమ్మకు ముడుపుకట్టి, వెళ్తారు. సంపాదించిన దాంట్లో నాయకునకు భాగం పెడ తారు. దొంగతనమప్పుడు వీరు ఉపయోగించేది ఒక అడుగు పొడుగుగల ఇనుప పలుగు.

సామాన్యంగా ఆడవారి ఒంటిమీద నగలు ముట్టుకోరు దొమ్మరులు. ఎక్కువగా వీరు దొంగిలించేవల్లా వస్త్రాలు. ఖరీదుగల గుడ్డలైతే మాత్రం అమ్ముతారు. లేకపోతే కొన్నిరోజులు పోనిచ్చి, ఆటఆడేటప్పుడు బహు

మానంగా ఇచ్చిన వాటితోపాటుగా ధరించి తక్కువవారు అనుమానపడ కుండా ప్రవర్తిస్తారు.

దార్లుకొట్టటం, బందిపోటుచేయటం ఇప్పుడు లేవనే చెప్పవచ్చు. పూర్వకాలం ఆడపిల్లల్ని ఎత్తుకుపోయి, దొమ్మరాట ఆడటానికి, వ్యభిచారం సల్పేటందుకు, శిక్షణ ఇచ్చేవాళ్లు దొమ్మరులు.

లంబాడీలవలెనే వీరుగూడ పేరుపొందిన పశువుల దొంగలు, దూరప్రదేశాల్లోని పశువుల సంతల్లో వీటిని విక్రయిస్తారు.

దొంగిలించిన ఆస్తి కొంతకాలంవరకు దాస్తారు. సామాన్యంగా వారు తమ గాడిదలను కట్టివేసేచోట గుంటత్రవ్వి సొమ్ములను దాస్తారు. తర్వాత కొన్నిరోజులకు కోమట్లకు, కంసాలులకు, ఎరుకలవాళ్లకు రహస్యంగా అమ్ముతారట।

అసలు వీరు నేరాలు చెయ్యటానికి రెండు కారణాలు ఉన్నవి. మొదటిది వీరి ఆర్థిక దురవస్థ. ఈ రోజుల్లో సర్కస్ కంపెనీలు బయలుదేరటంవలన ప్రజలలో వీరిపై ఆదరణతగ్గింది. రెండవది ఏగ్రామములోనైనా వీళ్లని చులకనగాచూచి, వీళ్ళఆటకి తగిన ప్రతిఫలంఇవ్వక నిర్లక్ష్యం చెయ్యటం.

ఇదీ దొమ్మరుల వృత్తాంతం.

## ౯. కోయలు

కోయలు గోదావరి జిల్లాలోని భద్రాచలం, పోలవరం మొదలగు అరణ్యప్రాంతాల్లో నివసించే ఒక అనాది జాతివారు. వీరు మధ్యరాష్ట్రులు. బస్తర్, హైదరాబాద్, జయపూర్ పరిసరాల్లోగూడ ఎక్కువగా కన్పిస్తావున్నారు. ఒక్క హైదరాబాద్, బస్తర్ రాజ్యాలలోచూస్తే 1931 జనాభా లెక్కల ప్రకారం వీరిసంఖ్య షుమారు 4 లక్షలు.

వీరు వివిధప్రదేశాలలో వివిధనామాలతో పిలువబడుచున్నారు. వీరినే మేరియా, మరియ, గోండ్, కోంద్, కుయ్, కోదులనిగూడ పిలుస్తారు.

ఆంధ్రదేశమంగలి కోయలను 1911 జనాభా లెక్కలలో గోండ్లలో చేర్చినారు. గ్రిగ్సన్‌గారు వీరివిషయమై కోయలు గోండ్లజాతిలోని భాగమనిన్నీ, వారిలో తెలుగువారి ఆచారవ్యవహారములు భాష బాగుగా కలిసిపోయెననిన్నీ వ్రాసినారు.



పెండ్లికూతురుపై సారాచల్లుట
(మధ్యరాష్ట్రములందలి గోండ్లలోని ఆచారము)

డబ్ల్యు. వి. గ్రిగ్సన్‌గారి ‘మధ్యరాష్ట్రములు బీరారులందలి
‘ఆనాదులసమస్య’ నుండి

కోయలకు ప్రత్యేకముగా భాషఉన్నది. కాని వీరు తెలుగు గూడ బాగుగా మాట్లాడగలరు. కోయలు నిరాడంబరులు, సంత్యసంధులు, విశ్వాయతీ గలవారు. అతిధి సత్కారప్రియులు.

వీళ్ళగ్రామములు మన్యప్రదేశములలో నుండుటచేత వీరిలో అనారోగ్యం ఎక్కువ. సామాన్యంగా వీరందరు రోగగ్రస్తులే. కోయరోగం (Jaws) అనే దానివల్ల వీరందరు ఎక్కువగా బాధపడుతూ ఉంటారు. ఈ వ్యాధి పాపం! ఈ జాతిలో అధికంగా వ్యాపిస్తుంది.

వ్యవసాయం :— వీరి ఆర్థిక విధానం బహు పురాతనమైనది. వీరు వ్యవసాయం, వేట, మూలంగా జీవిస్తున్నారు. కొందరు కలప, తేనె, వెదురు గడలు, మొదలయినవిగూడ అమ్ముతారు. మరికొందరు గ్రామాలకు వెళ్లి మందులు, వేళ్లు, పులిగోళ్లు అమ్మి జీవిస్తారు. ఇటీవల నెయ్యి కూడ అమ్ముతున్నారు.

వీరి వ్యవసాయపద్ధతి బహు నష్టకరమైనట్టిది. దీనిని 'పోడు' పద్ధతి అంటారు. మొట్టమొదట ఒక అరణ్యములోని చెట్లునరికి, అవి ఎండినతర్వాత తగులబెడ్తారు. ఆబూడిదే ఎరువుగా ఉపయోగిస్తారు. దానిమీదే విత్తులు చల్లుతారు. వర్షాలు సక్రమంగాకురిస్తే పంట బాగా పండుతుంది. లేకపోతే వృధాశ్రమ.

వీరిలో త్రాగుడు అమితం. వీరుత్రాగేది విప్పసారా. అంటే విప్ప పువ్వులనుపిండి, ఆ రసాన్ని పులవబెడ్తారు. ఇది బహుమత్తుకల్గిస్తుంది.

వివాహం :—వీరిలో ఎదిగిన పిల్లలకే వివాహాలుచేస్తారు. వివాహ సమయంలో వధువు మేనమామదే పెత్తనమంతాను. మేనరికాలు సర్వ సామాన్యం. మొట్టమొదట వరునితండ్రి, స్నేహితులు వధువు తండ్రి దగ్గరకువెళ్ళి కొన్ని రూపాయలు, కొంత సారా బహుమానముచేస్తారు. ఆ గ్రామాధికారి అనుమతితో ఇరుపక్షాలవారు వివాహానికి ఒప్పుకొంటారు. తరువాత వధువు ఒంటరిగా ఇంట్లోవున్నప్పుడుగాని, నీరు తేవటానికి ఏటికి వెళ్ళినప్పుడుగాని, లేక పుల్లలు ఏరడానికి అడవికి వెళ్లినప్పుడుగాని, వరుడు, అతని స్నేహితుడు పొంచిఉండి ఆమెను ఎత్తుకుపోతారు. మర్నాడు సాయంత్రం త్రాగటం, విందుచేసికోటం, నాట్యమాడటం మొదలయిన వినోదాలలో పాల్గొంటారు. దీనితో పెండ్లి సమాప్తి.

ఫాదరు ఎల్విన్ బస్తరు, మధ్యరాష్ట్రాలలోని "గోండ్లజాతివారి పెండ్లిండ్లనుగూర్చి ఈవిధంగా తెల్పుచున్నాడు : పిల్లవానితండ్రి కాబోయే వియ్యంకునిదగ్గరకువెళ్ళి "మీదొడ్లో ఒక పుష్పంవుందని విన్నాము; దాన్ని కోసికొనిపోదామని వచ్చాము" అని అంటాడు. ఒకవేళ కన్యాశుల్కం హెచ్చుగావుంటేమాత్రం చాటుగా పిల్లను ఎత్తుకుపోవడమో, లేక లేవదీసుకొనిపోవడమో జరుగుతుందట! మొదట వధువుని తల క్రిందికి వంచమనిచెప్పి వరుడు ఆమెమీదుగా వంగినపుడు స్నేహితులు కడవలతో నీళ్ళు కుమ్మరిస్తారు. తర్వాత పాలు, అన్నం పెడతారు. ఆతర్వాత ఇద్దరినీ ఆరాత్రి బలవంతాన ఒకగదిలోకినెట్టి తలుపుకు తాళంపెడ్తారు.

నాట్యం :—కోయల వివాహ సమయాల్లో మనకు ముచ్చటగొల్పే దృశ్యం వాళ్ల సల్పే నాట్యం. దీనిని "దున్న కొమ్ముల నృత్యం" అని అంటారు. గ్రామంలో ఉండే వారంతా దీనిలో పాల్గొంటారు. గ్రామంలోని ప్రతి యువకుడు ప్రత్యేకంగా దున్నపోతు కొమ్ములతో అమర్చిన, పుష్పములతోను, అరణ్యపుటాకులచేతను అలంకరింపబడిన 'తల' నొకదానిని తయారుచేసి దానిని తన తలమీద ధరిస్తాడు. ఇది పులివేషంకోసం తయారుచేసిన దానిలాగా ఉంటుంది. ఒక్కొక్కడు చిన్న డోలుపట్టుకొని, వలయాకారంగా నిల్చుని పాటలు పాడుతాడు. ఆడపిల్లలు పుష్పముల నలంకరించుకొని, కుడిచేతులలో చిన్న వాయిద్యపు కర్రలు పట్టుకొని వయ్యారంగా మగవాళ్ళ చుట్టూ తిరుగుతూ, మధ్యమధ్య ఆ కర్రలతో డోలుమీద డి-డమ్-డిమ్ అనే ధ్వనిచేస్తూ పాడతారు. మగవాళ్లు—వీరిని 'దున్న'లంటారు. వొకళ్ళతో వొకళ్ళు పోట్లాడుకుంటూ "దున్నతల" మీదనున్న ఒక్కొక్క ఆకే లాగేస్తూ ఆడపిల్లలను వెంటాడుతారు.

కులపంచాయితీ-కఠినశిక్ష :—కోయవాళ్లు గ్రామాధికారిని "సామంతుదొర" అంటారు. ఇతనికి విధులు నిర్వహించటంలో యిద్దరు ముగ్గురు సహాయం చేస్తూవుంటారు. పండగలప్పుడు, సాంఘికకార్యాలప్పుడు, ఇతడు పెత్తనం వహిస్తాడు. కులతప్పులు విచారించి శిక్షలు విధిస్తాడు.

ఈ జాతిలో వ్యభిచారంలేదనే చెప్పవచ్చు. అల్లాంటి తప్పులుచేస్తే అపరాధిని కులపంచాయితీ బహుకఠినంగా శిక్షిస్తుంది. థర్‌స్టన్ ఏమని వ్రాశాడో చూడండి : అపరాధిని రెండుదూలములమధ్య పడవేసి పైదూలం



దున్నకొమ్ముల నృత్యం

**ఎల్విన్ గారి 'మేరియాహత్యలు : ఆత్మహత్యలు' న.డి**



ఆదిమ కన్య

**ఎల్విన్‌గారి 'మేరియా హత్యలు : ఆత్మహత్యలు' నుండి**

మీద-ఆ నిర్భాగ్యుని చావకుండామాత్రం కనిపెడుతూ, ఎంతమందైతే పట్టుతారో అంతమంది ఎక్కుతారు. వివాహితస్త్రీతో వ్యభిచరించటమే గ్రామాల్లో పోట్లాటలకు ప్రధానకారణం. ఒక్కొక్కప్పుడు ఈపోట్లాటలు ఖూనీలు దాకా పోతవి. గ్రిగ్సన్‌గారు తెల్పినట్లు అవమానం పొందినవాడు తన స్నేహితులతో విరోధి ఇంటిముందు నిల్చుని, బూతులు తిట్టుతూ వెంట్రుక ఒకటిపీకి వాడిగుడిసిమీద పారవేస్తాడు. యుద్ధానికి ఆహ్వానిస్తాడు. అంతే- ఆరాత్రి ఏదో దారుణహత్య జరిగిందన్నమాటే.

"ఘోటుల్" :— కోయవాళ్ళ సాంఘికజీవితంలో "ఘోటుల్" ప్రధానఘట్టం. ఘోటుల్ అంటే ప్రేమసదనం. ప్రతి గ్రామానికి రెండు పెద్ద ఇళ్ళు ఉంటవి. ఒకదానిలో అవివాహిత యువకులు, మరోదానిలో అవివాహిత యువతులు నివసించాలి. రాత్రిళ్ళు అక్కడే నిద్రపోవాలి. ఈ గృహములు ఇద్దరు వృద్ధస్త్రీల ఆధిపత్యంక్రింద ఉంటవి. యువతీ యువకులు ఈ కాలమందే నృత్యసమయాల్లోను, మునలిదాని మూలంగాను పరస్పరంగా ప్రేమించుకొని వివాహములు చేసికొంటారు.

• నరబలులు — స్త్రీహత్యలు :— స్త్రీకి కోయలు గౌరవస్థానమివ్వరు. పూర్వపురోజుల్లో స్త్రీహత్యలు జరిపేవాళ్ళట. స్త్రీ సమస్తపాపములకు కారణమనే మూఢనమ్మకం వీరిలో ప్రబలంగా ఉన్నది. స్త్రీలను మాంత్రికరాండ్రగా తలచేవారు. మాంత్రికురాలికి ఏ పురుషునిమీదనైనా ఇష్టంలేకపోతే, అర్ధరాత్రివేళ అతని నెత్తురు పీల్చేస్తుందట. అందుకని స్త్రీపైన ఇల్లాంటి అనుమానాలు కలిగితే, భూతవైద్యునివద్దకు తీసుకొని వెళ్లుతారు. పాపం ఆ స్త్రీమీద వాడు అత్యాచారం జరపటం, చివరికి చంపటంగూడ జరుగుతుంది.

ఇలాగే ఒక స్త్రీని చంపినందుకు ఒక వైద్యునకు కొన్ని సంవత్సరములు కఠినశిక్ష పడ్డది. ఈ ఘోరాచారం లంబాడీలలోకూడా ఉండేది. ఇంతేగాదు. తమ ముఖ్యదేవతలైన ముత్యాలమ్మ, పోతరాజుల ప్రీతి కొరకు, బాగా పంటలు పండుటకు, నరబలులుకూడా ఇచ్చేవాళ్ళు యీ కోయలు. ఐతే ఈ రోజులలో నరహత్య, స్త్రీహత్య, రెండూ ప్రభుత్వం రూపుమాపింది. కాని ఆ స్థానాలలో దున్ననుగాని, కోతినిగాని దేవతకు బలియిస్తారు. మ్యాజిక్ అన్నా, ప్రయోగమన్నా, దయ్యాలన్నా, వీరికి మహాభయం.

<u>ఇతర ఆచారాలు</u> :— పిల్లవాడు పుట్టినప్పుడు తండ్రి బంధువులను త్రాగుడుకు విందుకు పిలుస్తాడు. వారి సమక్షములో పిల్లవానికి పేరు పెడ్తారు. ఆ బంధువుల పేర్లలో ఏదైనాఒకటి పిల్లవానికి పెట్టటం సంభవిస్తే, ఆబంధువు తాను అదృష్టవంతుడుగా భావిస్తాడు. అతడు పిల్లవానికి కొన్ని రూపాయలు బహుమానం చేస్తాడు. కనలేకపోయిన స్త్రీలు, గర్భిణీ స్త్రీలు, ఘోరజాడ్య పీడితులు చచ్చిపోతే పాతిపెట్టుతారు. లేకపోతే తగులపెట్టుతారు. ఒక ఆవునుగాని, ఎద్దునుగాని, చంపి, దానితోక శవం చేతిలో పెట్టుతారు. వానిభార్య "తాలిబొట్టు" కూడా ఆ చేతిలో పెడ్తారు. స్త్రీ చచ్చిపోతె, కుమారుడు, పురుషుడు చనిపోతే మేనల్లుడు కర్మ చేస్తారు. ప్రతి కోయగుడిసెలోను చనిపోయినవారి జ్ఞాపకార్థం ఒక కుండ ప్రత్యేకిస్తారు. కర్మానంతరం మృతినొందినవాని ఆత్మ ఈ కుండలో నివసిస్తుందని కోయుల నమ్మకం.

ఈ కోయల అభివృద్ధికై పోలవరంలో ఆశ్రయమేర్పరచి పాటు పడుచున్నవారు శ్రీ పుసులూరి కోదండరామయ్యగారు. ఇతర రాష్ట్రాలలో వీరిపై సమగ్ర పరిశోధనలు సల్పినవారు డబ్ల్యు. వి. గ్రిగ్సన్, ఇంద్రజిత్ సింగ్, వెరియర్ ఎల్విన్. ఎల్విను గోండుజాతికి హితుడు; మిత్రుడు. ఇతనిసేవ మరువరానిది.

## 7. సవరలు

సవరలు ఒరిస్సాలోను, జయపూర్ సంస్థానములోని గుణిపురము తాలూకాలోనూ, గంజాం జిల్లాలోని టెక్కలి, పాలకొండ, మందసా తాలూకాల పరిసరప్రాంతాల్లోను, నివసిస్తున్న ఒక కొండజాతివారు. వీరినే వారి భాషలో 'సొఓరా' లంటారు.

1901 జనాభా లెక్కలప్రకారం మనదేశంలో మొత్తం 6 లక్షలకు పైగా సవరలు ఉండేవారని తెలుస్తుంది. కాని 1931 లో చూస్తే రెండు లక్షలు మాత్రమే కనపడుచున్నారు.

డాక్టరు బి. యస్. గుహాగారు సవరజాతి వారిలో 'నీగ్రిటో' లక్షణాలున్నవని అభిప్రాయ పడుతున్నారుగాని, వీరు 'ఆస్ట్రాలాయెడ్' జాతికి చెందుతారని శ్రీ గిడుగు సీతాపతిగారు తెల్పుతున్నారు. ఈ రెండు వాదనలుకూడ సరియైనవే.



మధ్యరాష్ట్రములందలి కోయ (మేరియా) పడుచులు

గ్రిగ్సన్‌గారి 'మధ్యరాష్ట్రములందలి అనాదుల సమస్య" నుండి

సవరజాతి పుట్టుపూర్వోత్తరాలను గూర్చి వ్రాయడం అంత సులువయిన పనికాదు. కాని మన భారతదేశ ఆదిమనివాసులలోకెల్ల అనాదిజాతి అని తెల్పడానికి ఏమీ సందేహములేదు.

కొందరి ఉద్దేశ్యము ప్రకారము శ్రీరామునకు మామిడి పండ్లు ఇచ్చిన 'శబరి' సంతతివారే ఈ సవరలని తెలుస్తున్నది. వారి విషయమై రామాయణ మహాభారతములలోను, ఐత్రేయ బ్రాహ్మణములలోను, పేర్కొనబడినది. అంతేగాక గ్రీకుశాస్త్రజ్ఞులగు టాలమీ మొదలయినవారు ఈ సవరలను 'సుయరే' 'సబరే' అను పేర్లతో పిలచినారు.

ఈ సవరలు అసలు ఎక్కడివారు? ఈ విషయం తేల్చి చెప్పడం కష్టం. కాని శాస్త్రజ్ఞులు సవరలను కొలేరియన్ జాతులలో జమకట్టారు. కన్నింగ్‌హాం ఉద్దేశ్యం ప్రకారం, కొలేరియన్ గుంపులలోకల్లా ఈ సవరలే శక్తివంతమైన వారట. బి. సి. మజుందార్ పూర్వం కొలేరియన్ జాతులన్నీ 'సవర' అనే పేరుతోనే పిలువబడేవని వ్రాస్తున్నారు.

అంటే సవరలు ఆర్యద్రావిడ ఆక్రమణలకు పూర్వమే మన దేశములో నివశించిన 'అనాదులని' నిశ్చయమైనది.

ఈజాతి ఎంతపురాతనమైనదో వీరిభాషకూడ అంతపురాతనమైనది. సవరలకు ప్రత్యేకభాష యున్నది. అది కొలేరియన్ జాతులు మాట్లాడే 16 రకాల 'ముండా' భాషల్లో ఒకటి. అయితే ఈ ముండా భాషకూడా ఆస్ట్రిక్ భాషల్లో ఒకటి. ఆస్ట్రిక్ భాష మాట్లాడేవారు ఒక్క మన దేశంలోనేగాక, ఇండోనేషియా, పొలినేషియా, మెలనేషియా, మెడగాస్కర్, న్యూజీలాండ్ మొదలగు దేశాలన్నీ ఆక్రమించివున్నారు.

<u>ప్రస్తుత పరిస్థితులు</u>:— వీరి ప్రస్తుతస్థితి అధోగతిగా నున్నది. వీరిలో చాలమంది పశుప్రాయులవలె నున్నారు. సభ్యతాసంబంధములేని ఆదిమజాతులలో యీజాతి ఒకటి. వీరి పురాతన జీవితపద్ధతులకు వీరి ఉనికిగూడ దోహదమొసగినది. వీరుండేవన్నీ అరణ్యప్రదేశాలు. పర్వతమయాలు. చిరుతలు, పులులు, త్రాచులు సామాన్యంగా దారిప్రక్కలనే చరిస్తూఉంటవి. ఈ ప్రదేశాలన్నీ ఒక్కొక్కపుడు నేత్రోత్సవాన్ని కలుగజేస్తవి. ఒకవైపు గోడలవలెకన్పడే పర్వతశ్రేణులు, ప్రక్కనే అంతస్తులుగా అమర్చినట్లుకనపడే పచ్చని పైరుపొలాలు, అరణ్యమందలి సహజ

ప్రకృతి సౌందర్యం — ఇవన్నీ నిజంగా చిత్రకారునకు సమకూర్పగల వస్తుచయం. ఇలాంటి ప్రదేశాలలో సవరలు తమగ్రామాలు కట్టుకుంటారు.

చరిత్రాత్మక వృత్తాంతం:—వీరి సాంఘిక జీవితపద్ధతులు వర్ణించే ముందు వీరి పూర్వవృత్తాంతం తెలుసుకోవడం ముఖ్యం. ఈరోజులలో పశుతుల్యాలుగా చరిస్తున్నా, ఒకప్పుడు సవరలు రాజ్యాలేలారు. యుద్ధాలు చేశారు. గొప్ప నాగరికత అనుభవించారు. వీరి పూర్వవృత్తాంతమంతా వీరు ఆర్యులతోచేసిన యుద్ధాలను తెల్పుతుంది. ఒకప్పుడు వీరు కళింగ గంగులతో యుద్ధంచేశారు. మరొకప్పుడు పశ్చిమ చాళుక్యులతో కత్తి దూశారు. మరో సమయంలో శ్రీ కూర్మక్షేత్రం ముట్టడించారు. ఆఖరుకు గోండ్ల (కోయలు)తో యుద్ధంచేసి నాశనం పొందారు.

జీవనం:—సవరలు ప్రస్తుతం వ్యవసాయం చేసుకుంటున్నారు. అరణ్యసంపద నమ్ముకొంటున్నారు; కొందరు చాపలు, బుట్టలు అల్లుకుంటున్నారు. ఇంకా కొంతమంది ఆజాతిలోని భాగ్యవంతులఇళ్ళల్లో నౌకరీలు చెయ్యటం, పొలాలు, గొడ్లు కాపలా కాయటం చేస్తున్నారు.

వ్యవసాయం:—వీరి వ్యవసాయపద్ధతి విచిత్రంగా వుంటుంది. దున్నడాన్ని "చప్టా పద్ధతి" అంటారు. ఎక్కడైనా పెద్ద నీటిప్రవాహం చూచి చాల ఎత్తుగా నేల చదునుచేస్తారు. దానికి క్రిందగా ఇంకోనేల చదును పరుస్తారు. ఇట్లే ఒకదానిక్రింద నొకటి 10, 15 ప్రదేశాలు చదునుచేసి, పై జలపాతపు నీరంతా వీటిలోనికి మరల్చుతారు. నీరుపోకుండా ప్రతి ప్రదేశానికి కొండరాళ్ళతో గట్లుకడతారు. నీరు ఇంకిపోయినతర్వాత విత్తులు నాటుతారు; నిజంగా దీనిలో ఎలాంటి ఉపజ్ఞఉందో గమనించండి!

దుస్తులు - తిండి:— దుస్తుల విషయంలోను తిండిలోనుకూడా సవరలకంత శ్రద్ధవున్నట్లు కనుపించదు. వీరిపూర్వీకులు నగ్నంగా వుండేవారట. అయితే ఇప్పుడిప్పుడు కొంచము నాగరికతా సంబంధము ఏర్పడటంవలన మగవారు మొలచుట్టూ చిన్నగుడ్డ, బుజంమీద ఒక దుప్పటి వేసుకుంటారు. స్త్రీలుగూడా మొలచుట్టూ రెండడుగుల వెడల్పు, నాలుగడుగుల పొడుగు, గల గుడ్డమాత్రం చుట్టుకుంటారు. అడవిలో ఏది దొరికితే అదే తింటారు. పండించిన ధాన్యం, మాంసం, దుంపలు, పళ్లు వీరి ముఖ్యాహారం.

సవరలకు దేశభక్తి ఎక్కువే. తమ దేశాన్నిగూర్చి ఎక్కువగా పొగడుతారు. కష్టపడి పనిచేస్తారు. నిజాయితీగలవారు. కాని వీరికి ఉద్రేకం ఎక్కువ. క్రొత్తవిషయాలు తెలిసికోవాలనే అభిలాష, ఉత్సాహం వీరిలో లేవు. ఇదే వీరిని నిత్యదారిద్ర్యంతో ముంచుతూంది.

వీరు మంచి వేటగాళ్లు. పుల్లులను, దుప్పులను కొట్టటంలోను, పిట్టలను కొట్టటంలోను, పాములను చంపటంలోను వీరికెంతోనేర్పున్నది. వీరువాడేవి విల్లు, అంబులు.

అతిథిసత్కారం* :—అతిథులను గౌరవించటం అనేది నిత్యజీవితంలో ఒకవిధిగా ఎంచుకొంటారు. ఈ విషయం వీరి కవిత్వంలో గూడ కన్పడుతుంది.

సాంఘికాచారాలు :—సవరలలో వివాహం సాంఘికావుసరమే గాక, అది ఒక పవిత్రకృత్యంగా పరిగణింపబడుతుంది. సామాన్యంగా ఎదిగినవాళ్ళకే వివాహాలుచేస్తారు. చాలమట్టుకు పరస్పర ప్రేమద్వారానే వివాహాలవుతాయి. కాని కొన్నిసమయాలలో తల్లితండ్రుల అనుమతిద్వారా జరుపుతుంటారు. వీరిగ్రామంలోఉండే స్త్రీ పురుషులు, అన్నచెల్లెళ్ళవలె మసలుకొంటారు. అందుచేతనే వీరి గ్రామాల్లో ప్రేమిక సదనాలు లేవు.

వివాహానికిపూర్వం వ్యభిచారంచేసినా అంతగా పాటించరుగాని, తరువాతమాత్రం బహు కట్టడులలోపెడ్తారు. కోయలలోవలెనే వీళ్ళల్లో గూడ అవినీతిప్రవర్తనే కొన్ని హత్యలకు దారితీసిందట. అవివాహిత శీలం భంగపరిస్తే, యువకుడు ఆమెను పెండ్లాడి, కులతప్పుచెల్లిస్తే, వారి వివాహం హర్షింపబడుతుంది. వారిని కులంలో చేర్చుకుంటారు.

కులవిభాగాలు :— సవరజాతి 25 భాగాలక్రింద విభజించబడ్డది. వీరిలో 'జాతి' సవరలు ముఖ్యులు. వీళ్లు సవరలలో విశిష్టులు. వీళ్ళు ఒక్క దున్నమాంసం తింటారటగాని పందిమాంసము తినరట. తరువాత క్రమంగా కిందల్, కుంబి లాంగ్ మొదలగు వర్ణములు వస్తవి. ప్రతి వర్ణానికి ప్రత్యేక విధులు వృత్తులు ఏర్పరచటం వీరి విశిష్టత.

అలంకరణ — నాట్యం:—సవరలు వివిధములైన పూసలు, మెళ్లో హారాలుగా ధరిస్తారు. అంతేగాక స్త్రీ పురుషులకు పచ్చ పొడిపించు

* రెండవభాగం : ఆదిమవాసుల జీవిత విశేషములు చూడుడు.

కోటమంటే సరదా. ముఖం, కాళ్లు, చేతులు, భుజములు, రొమ్ము, ఇవి ముఖ్యంగా పచ్చ చేయించుకొంటారు. కోయలలో వలెనే సవరలలోగూడ నాట్యమంటే మహా ఇష్టం.

అధికారం :— సవర గ్రామాధికారిని 'సాడిగమ్మాంగ్' అంటారు. అతరే ప్రధాన న్యాయాధికారి. పెత్తందారుడుగూడ. అతనిమాట శాసనమువంటిది. ఇతనికి మతకార్యాల్లో సహాయపడటానికి సాత్రిబుయ్యా అనే మరియొకడుంటాడు. ప్రతిసంవత్సరం విశాఖజిల్లా కలెక్టర్లు దర్బారు జరిపినప్పుడు సాడిగమ్మాంగ్లకు ఒకధోతి బహూకరిస్తాడు. అతడే జ్ఞాతికకంతకు నాయకుడుగా ఎన్నుకోబడతాడు. సామాన్యంగా ఈ ఉద్యోగాలు వంశ పారంపర్యం. కాని నాయకుడు వివేకముగలవాడుగను, నీతివంతుడుగను, ఉండవలెననే కట్టడి ఉన్నది.

మతం :—సవరలలో పునర్జన్మవిషయంలో నమ్మకంవున్నది. ఐతే వీరిమతం బహు పురాతనమైనది. చచ్చిపోయిన వారికి కర్మ చేస్తేనేగాని, శాశ్వితానందం ముక్తికలుగవనే నమ్మకం సవరలకున్నది. అందుకనివీళ్ళు 'గువార్' అను కర్మచేస్తారు. గువార్అంటే స్మృతిచిహ్నంగా రాళ్ళను పాతడం అన్నమాట. ఊళ్లోవారంతా కలసి రెండేండ్లకొకసారి ఈ కర్మ చేస్తారు. 40, 50 దున్నలు ఇంకా మేకలు, కోళ్లు వీటిని తెగవేస్తారు. ఈ కర్మ 4, 5 రోజులు జరుగుతుంది. సవరల 'గువార్'—ఆర్యులు సల్పే 'యజ్ఞం' ఈ రెండూ ఒకేప్రాచీన స్వరూపంగల్గియుండెనని శ్రీ సీతాపతి గారి వాదన.

ఏమైనా వీరిమతం కేవలం జంతుబలులతోడను, ద్రవ్యనష్టంతోడను కూడివుంటుంది. వీరికికూడ దయ్యాలన్నా, పిశాచాలన్నా భయం; నమ్మకం.

ఈ జాతినిగూర్చి విశేషముగా కృషిసల్పి, వారి భాషకు లిపికల్పిస్తి వీళ్ళకోసం పాఠశాలలు పెట్టించింది కీ. శే. గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు. పోతే వీరినిగూర్చి సమగ్రంగా పరిశోధనసల్పి వారి అభివృద్ధికి తోడ్పడినవారు వారి కుమారులు శ్రీ సీతాపతి పంతులుగారు.

## 8. గ డ బ లు

గడబలు బస్తర్, కల్హాండి, జయపూరు సంస్థానపు టడవులలోను, విశాఖపట్టణం జిల్లాలోని ఏజన్సీ ప్రాంతంలోను, నివసిస్తున్న ఒక్క కొండ

జాతివాళ్లు. వీళ్ళల్లో కొంచరు బొబ్బిలి, చీపురుపల్లి ప్రాంతాల్లో చిన్నచిన్న గ్రామాలుకట్టుకొని జీవనము సల్పుతున్నారు. మొత్తం ఈజాతి సంఖ్య షుమారు 44.000 మాత్రమే అని అంచనా వెయ్యబడ్డది.

జన్మస్థానం :—క్రొత్తరాతియుగ చివరికాలంలో వీళ్ళు ఒక ప్రబల మైన జాతిగా తలవబడుచున్నారు. నేను పైని పేర్కొనిన ప్రదేశాలకు వీళ్లు కొన్నివేల సంవత్సరములక్రితము వలసవచ్చినట్లు తెలుస్తున్నది. దీనికి కొన్ని సాక్ష్యాలుకూడా ఉన్నవి.•

అసలు "గదబ" అనేపదం దేన్నిబట్టి వాడుకలోనికి వచ్చిందో చూస్తే వీరి జన్మస్థానాన్నిగూర్చి మనకు కొంతవిషయం తెలియగలదు. చూడండి! గదబలు అనుశృతంగా చెప్పుకొనే కథల్లోగూడా ఈవిషయం వ్యక్తమవుతుంది. వాళ్ళేమంటారు? చాలాకాలంక్రితం వీళ్లు గోదావరి నదికి ఉత్తరవైపునుండి క్రమేపి పూర్వం జయపూరుసంస్థానానికి ముఖ్య పట్టణమైన నందపురమునకు తాము వలసవచ్చినామని చెప్పుతారు.

ఈకథకు ఆధారాలు లేకపోలేదు. అసలు "గదబ" శబ్దానికిన్నీ, ఓఢ్రములోని "గడ్" అనే పదానికిన్నీ మన తెలుగుభాషయందలి గడ్డ లేక "గడ్డి" అనేదానికిన్నీ, బందేలు ఖండంలో వ్యాప్తమగు. గోండుభాష లోని "గద" అనే మాటకిన్నీ అర్థస్వరూప సన్నిహితత్వము ఉన్నది. ఈమాటలన్నీగూడా ఏదో ప్రవాహానికిగాని, ఏటికిగాని, చెందుతాయి. అంటే గదబలు ఒకప్పుడు యేదో ప్రవాహందగ్గర నివసించారన్నమాట.

డి. యన్. మజుందార్‌గారు ప్రస్తుతం జయపూర్‌లో నివసిస్తున్న గదబలు ఒక్కరు మాత్రమే ఆ సంస్థానములోని ముండాజాతికి చెందుతా రనీ వ్రాస్తున్నారు. అంటే సవరలకువలెనే గదబలుగూడ 'ఆస్ట్రో-ఏషియా టిక్' తెగక్రిందకి వస్తారు. పూర్వకాలంలో ఈ తెగలన్నీగూడ వింధ్య పర్వతాలకు ఉత్తరదిశలో నివసిస్తుండేవిగాని, బలవంతులగు శత్రువుల తాకిడికి తాళలేక దక్షిణమునకు పారివచ్చినవి. అట్లాంటి జాతులలో గదబ జాతిగూడ ఒకటి.

శాస్త్రరీత్యా చూచినా, భాషావిషయంలో చూచినా, సవరలు, గదబలు ఒకటే అని తేలుంది.

ప్రాంతీయక విభాగాలు :— ప్రస్తుతం గడబలు 5 రకాలుగా భాగింపబడ్డారు.

1. గుటోబులు (గుతోబులు) : గడబలందరిలోను వీళ్ళే ఎక్కువవాళ్ళు. వీళ్ళల్లో స్త్రీలు చెవులకు పెద్దపెద్ద రాగిపోగులు ధరిస్తారు. ఎరుపు, నీలము గలిగిన అంచుచీరెలు ధరిస్తారు.

2. పరేంగులు : వీళ్ళ స్త్రీలు గుటోబులు ధరించేటంత పెద్ద చెవుప్రోగులు పెట్టరు. వీళ్ళ చీరెలు సన్నని అంచులు కలిగిఉంటవి.

3. ఒలేరోలు : వీళ్ళ స్త్రీలుగూడా పరేంగ్ తెగలోని ఆడవాళ్ళకు వలెనే ఉంటారు. ఐతే వీళ్ళు తమ నడుముకి క్రిందుగా వెనుకవైపు త్రాళ్ల వుండలు కట్టుకొంటారు. వీటిని 'కుడ్డల్' అంటారు. వీళ్ళెక్కడైనా కూర్చోవలసివస్తే వీటిని క్రిందవైచి కూర్చుంటారు.

4. కాపులు : వీళ్ళు తెలుగుదేశంలో నివశిస్తున్న గడబలు.

5. కథారోలు : అనేవాళ్ళుగూడ ఉన్నారు. వీళ్ళకి సభ్యసంఘంతో సంబంధం ఎక్కువ. చీపురుపల్లి, బొబ్బిలి ప్రదేశాల్లోనివాళ్లు మామూలుగా నాగరికత పద్ధతులకు అలవాటుపడ్డారు. వీళ్లు తమ భాషగూడా మరిచిపొయ్యారు.

జీవనం :— గడబలు పేదవారు. చాలామందికి వ్యవసాయం ముఖ్యవృత్తి. జయపూరు ప్రాంతాల్లోని గడబలు పల్లకీలు మోస్తారు. కొంతమంది కట్టెలు అమ్ముకొంటారు. కొందరు షికారీలకు (వేటగాళ్లకు) సహాయము చేస్తారు. పల్లకీలు మోసేవాళ్ళు గుర్రాన్ని ముట్టుకోరు. కారణం తెలుసా ? తమ వృత్తికి పోటీచేస్తుంది గుర్రము. ఇటీవల కొంతమంది అస్సాం, బెంగాలులకు వెళ్ళి తేయాకుతోటల్లో కూలిచేసుకొని పొట్టపోషించుకొంటున్నారు.

దుస్తులు — ఆభరణాలు :— మొగవాళ్ళు వేసికొనే దుస్తులలో ఏమీ వింత ఉండదుగాని స్త్రీల దుస్తులలో ప్రత్యేకత వున్నది. వీళ్లు ధరించేవి రెండు వస్త్రాలు. అవి సామాన్యంగా 5 అడుగుల పొడుగు 1½ అడుగుల వెడల్పు ఉంటవి. ఒకటి మొలకు చుట్టుకుంటారు. అది బీలమండల దాకా వస్తుంది. రెండవది పైనవేసుకొనే వల్లె.

ఆభరణాల విషయంలో ఈ స్త్రీలు లంబాడీలకు ఏమాత్రము తీసి పోరు. ప్రతిరోజు ఉదయం స్త్రీ తన అలంకరణకోసం చాలాకాలం ఉపయో గిస్తుంది. కేశాలంకరణం మహా ప్రత్యేకంగా చూస్తుంది. జుట్టు రేగిపో కుండా తలచుట్టూ ఒక రేకు చుట్టుకుంటుంది. ఇంతేగాదు! మన నాగరిక స్త్రీలవలెనే వీళ్ళుగూడ ఎక్కడకుపోయినా ఒక అద్దము, దువ్వెన, తమతో కూడా తీసికొనివెళ్తారు.

మెడచుట్టూ వివిధమైన పూసలపేరులు ధరిస్తారు. సామాన్యంగా బొడ్డువరకు ఈ హారాలు ఉంటవి. వీటిపైన ఏసత్తువో రెండు హారాలు. అడవిలో దొరికే కొన్ని గింజలను నూరి వాటిని ఒంటికి పట్టించి ప్రతి రోజు శుభ్రం చేసికొంటారు. నవరలెంత అశుభ్రంగా ఉంటారో వీళ్లు అంత శుభ్రంగా ఉంటారు. గాజులుమాత్రం ఒక్క ఎడంచేతికే ధరిస్తారు.

<u>నేత పరిశ్రమ</u> :—ఈజాతిలో ప్రతి స్త్రీ తన చేతిమీదుగా చీర నెయ్యగలిగేటంతవరకు వివాహానికి అర్హత పొందలేదు. వీరు నేయునేత విచిత్రంగా ఉంటుంది. వీళ్లు ప్రత్తితో వడికిన దారములు వాడకూడదు. వీటితో నేయబడిన వస్త్రం ధరించకూడదు. దీనికో కథఉన్నది. పూర్వం సీతాదేవి వనవాసం చేస్తున్నప్పుడు ఈ గదబల ప్రదేశంవద్దకు వచ్చినదట. ఆవిడ వల్కలాజినములుచూచి గదబస్త్రీలు నవ్వినారట. అంతట ఆమెకు కోపంవచ్చి గదబస్త్రీలెవ్వరుకూడ నూలుదారముతో నేయబడిన చీరెలు ధరించకూడదని శపించిందట! అంకుడుచెట్టు, బొడ్డచెట్టు వీటికొమ్మలు తెచ్చి ఆకులుతీసి ఎండబెట్టుతారు. తర్వాత బెరడుతీస్తారు. ఆ బెరడు లోపల ఉండే మెత్తని పదార్థం ఊడేటట్లు కర్రతోకొట్టి, దానిని పట్టుకుచ్చువలె తయారుచేసి, దానితో దారంతీస్తారు. వీళ్లు ధరించే చీరలన్నీ ఈదారంతో నేయబడినవే. నూలుచీరెలు ధరిస్తేమాత్రం సంసారాలకి నుప్పు వాటిల్లు తుందని వీళ్ళల్లో మగవారి భయం. కాని ఇప్పుడిప్పుడు కొంతనూలు, కొంత నారతోకలిసిన చీరెలు కట్టుకోటానికి గదబస్త్రీ ఉత్సాహపడటం, భర్త నిరాకరించలేకపోవటం జరుగుతున్నది.

<u>ఇళ్ళు - గ్రామాలు</u> :—వీళ్లు తక్కినజాతులకు దూరంగా నివశి స్తారు. లంబాడీలుగూడా అంతే. వాళ్ళల్లో వాళ్ళే ప్రత్యేకంగా మారు మూలల తమ గ్రామాలు కట్టుకొంటారు. గదబగ్రామం సామాన్యంగా రెండు శ్రేణులలో తీర్చి ఉంటుంది. ఈ రెండు శ్రేణులమధ్య పెద్దదారి. ఇళ్లు ఒకదానికి ఒకటి ఎదురుగ్గా కట్టబడుతవి. ఈ గృహాలకి మధ్యగా

నాయకుని గృహం ఉంటుంది. ఆయింటి కెదురుగా ఒక మర్రిచెట్టో, మామిడిచెట్టో పెంచబడుతుంది, ఆచెట్టుచుట్టూ నాపరాళ్లుపరచి ఉంటవి. ఇదే గ్రామపంచాయితీ జరిపే చోటు; నాట్యంచేసే స్థలం.

కోయగ్రామాలలోవలెనే గదబగ్రామాలలోగూడా బ్రహ్మచారులకు, అవివాహితస్త్రీలకు ప్రత్యేకంగా ప్రేమికసదనాలు ఉంటవి. వివాహం కానివాళ్లు రాత్రిళ్లు తల్లితండ్రులదగ్గర పడుకోటం ఒక గొప్ప తప్పుగా భావిస్తారు.

కులపెద్ద :— గదబ గ్రామాధికారిని నాయుడో లేక నాయికో అంటారు. ఇతడు పంచాయితీ సహాయంతో కులతప్పులు పరిష్కరిస్తాడు. ఇతడికి – సవరలలోవలెనే – మత విషయాల్లో సహాయం చెయ్యటానికి "కిరసాని" అనే ఉపోద్యోగి ఒకడుంటాడు.

వివాహాలు - విచ్ఛేదాలు :—తక్కిన జాతులలోవలెనే వీళ్ళలోకూడా ఎదిగిన పిల్లలకే పెండ్లిచేస్తారు. ఐతే సగోత్రీకులలో వివాహాలుండవు. ఇదిగాక సామాన్యంగా పిల్లవాడి తల్లిదండ్రులే పిల్లను వెదికి పెండ్లిచేస్తారు. వీళ్ళగోత్రాల నామాలు వీళ్ళు ఆరాధించే జంతువుల పేర్లను కలిగివుంటవి. ఆ జంతువులను వీళ్ళు సామాన్యంగా చంపరు. హింసించరు. కొన్ని గోత్రాలపేర్లు : నాక, భగ్, కీర, గొల్లరిత్రాచు, పులి, చిలుక-వానరం.

వీళ్ళలో విధవావివాహాలు సర్వసామాన్యం, విచ్ఛేదాలుకూడాఅంతే. ఐతే విధంతువు తన భర్త తమ్ముణ్ణి పెండ్లాడాలనే నియమం ఉన్నది. అల్లాకాక మరిఒకణ్ణి చేసుకొంటే నూతనభర్త ఆమె మరిదికి కొంతడబ్బు చెల్లించాలి. దీనికే 'రండ్‌టొంకా' అంటారు. భర్తకు ఇష్టము లేకపోతే భార్యను వదిలిపెట్టవచ్చు. ఒక్క రెండు రూపాయలు ఆమెకిస్తే చాలు. అల్లాగాక స్త్రీగనుక భర్తను వదలిపెట్టితే, నూతన భర్త అసలువాడికి పంచాయితీ ఎంత విధిస్తే అంతా కట్టవలసిందే.

వివాహతంత్రు:— వివాహాలు మూడువిధాలుగా వుంటవి.

భీభాపద్ధతి వివాహంలో కన్యకోసం రెండువేషాలు చీలుతవి. ఇరువురు ముష్టియుద్ధం చేస్తారు. ఈ పోట్లాటలో వరుడు కన్యను ఎత్తుకపోతాడు.

లేధూలియా : (Lethulia) పద్ధతిలో యువతీ యువకులు అడవికి షికారు వెళ్ళి క్రీడిస్తారు. వరుడు మామగారికి రు. 20 సమర్పించుకొంటాడు. తరువాత వివాహాపుతంతు జరుగుతుంది.

మోతఇవాయీ పద్ధతి ప్రకారం కాబోయే అల్లుడు తన మామగారి ఇంట్లో కొంతకాలం వూడిగం చెయ్యాలి.

మొట్టమొదట పిల్లను చూడటానికిగాను ఒక బంధువును కొంతకల్లు, బియ్యంతోసహా—కన్యాదాతయింటికి పిల్లవాడి తండ్రి పంపుతాడు. బంధువు పిల్లతండ్రితో వచ్చిన పని తెల్పుతాడు. కల్లు, బియ్యం పరిగ్రహిస్తే వివాహానికి అమోదించినట్లే. తరువాత కొన్ని రోజులకు ఇంకా ఎక్కువ కల్లుతోను, బియ్యంతోను పెండ్లికొడుకు తండ్రివస్తాడు. తెచ్చిన బహుమానం వాకిట్లో పెడ్తాడు. అప్పుడు పిల్ల తండ్రి, తల్లివచ్చి కాబోయే వియ్యంకుణ్ణి కూర్చోమంటారు. పిల్లతరపు బంధువులుకూడా (గ్రామంలో ఉండేవాళ్లు) ఈ లోగా వస్తారు. వాళ్ళసమక్షంలో పిల్లవాడి తండ్రి 'అయ్యా! నా దొక మనవి చిత్తగించండి! మీ అమ్మాయిని మా అబ్బాయికివ్వండి' అని పిల్లతండ్రిని ప్రార్థించాలి. పిల్లతండ్రి 'చూస్తాలే! మా బంధువులను కనుక్కొని చెప్తా' అంటాడు. తెచ్చిన కల్లంతా త్రాగుతారు. బియ్యం వండి విందు చేసుకొంటారు. మళ్ళీకొన్ని రోజులతర్వాత ఇంకా ఎక్కువగా బియ్యం, కల్లులతో వరుని తండ్రి ప్రత్యక్షం. అందరి సమక్షంలో లగ్ననిశ్చయం చేస్తారు. అప్పుడే కన్యాశుల్కం, తక్కిన గ్రామకన్యల కివ్వవలసిన బహుమానం, రివాజుగా ఇచ్చేబట్టలు వగయిరా అన్నీ మాట్లాడుకొంటారు.

నిర్ణయించిన రోజుకి ఒకదినం ముందరగా పెండ్లికొడుక్కి తలంటిపోసి క్రొత్తబట్టలు కట్టబెడ్తారు. వాడు మిత్రులతో అత్తగారింటికివచ్చి, రెండు రూపాయలు, అత్తగారికి చీరెలు, కన్యకు ఒక ఇనుపఉంగరం బహుమానం చేస్తాడు, ఇల్లాచేసి పిల్లను తన ఊరికి లాక్కొని వెళ్తాడు. పిల్లతరపువారు ఆ ప్రయత్నం నిరోధించటం, తన్నులాటంగా, యుద్ధం పొసగటం జరుగుతుంది.

<u>బురదతో కొట్టుకోటం</u> :— వరుడి ఇంటిముందు పందిరి వేస్తారు. దానిక్రింద సాల వృక్షాల కొమ్మలతో అలంకరింపబడిన స్తంభాలు పాతుతారు. వాటికి మధ్యగా చిన్న తిరుగలిరాయి పెట్టి పెండ్లికూతుర్ని దానిమీద కూర్చోబెట్టుతారు. ఆమె ఒడిలో వరుడు కూర్చోవాలి. అప్పుడు వాళ్ళిద్దరి వస్త్రాంచల కొంగులు ముడిపెట్టి చేతులు కల్పుతారు. తర్వాత విందు, త్రాగుడు జరుపబడుతవి.

తెల్లవారినతర్వాత పందిరిదగ్గరగా పెద్ద మట్టికుప్ప పోస్తారు. పురోహితుడు ముందరగా మూడు గుప్పిళ్ళమట్టితీసి పందిరిలో చార

బోస్తాడు. వెంటనే వధూవరులువచ్చి ఆ మట్టికుప్పలో నీళ్లుపోసి బురద చేస్తారు. ఇక సాగుతుంది మహాయుద్ధం. వచ్చినవాళ్ళందరిని బురదతో కొట్టుతారు. ఈ వేడుకతరువాత ప్రవాహానికివెళ్ళి స్నానంచేసి, చేపల్ని పట్టి, వాటితో విందు చేసికొంటారు.

వేట : పండుగలు : వేడుకలు :—ముఖ్యంగా గదబల పండుగలు మూడు. అవి చైత్రపర్వం; బలిజాత్ర; పుష్య. "పుష్య" అనేది ధాన్యం ప్రోగుచేసి ఇంట్లో నిలువచేసినప్పుడు జరుపుతారు. ఆసమయంలో ఎద్దులను, దున్నలను, పందులను కోస్తారు.

బలిజాత్ర పండుగ 10 రోజులపాటు జరుగుతుంది. ప్రతిరాత్రి సంగీతంతోను, నాట్యంతోను స్త్రీ పురుషులు గడుపుతారు. చెదపుట్ట మట్టి తెచ్చి "పాలకుల"లో నవధాన్యాలు చల్లుతారు. తొమ్మిదిరోజులకల్లా అవి మొలకలెత్తుతవి. 10 వ రోజున వీటిని పెద్ద ఉత్సవంతో గ్రామదేవత వద్దకు తీసుకువెళ్తారు. వీళ్ళపూజారి — వీణ్ణి బెజ్జు అంటారు — అక్కడ ముళ్ళతో అమర్చబడిన ఒక ఉయ్యాలపైకెక్కి ఊగుతాడు. ఆశ్చర్యం. ముళ్ళు వాడికి గ్రుచ్చుకోవట! తర్వాత అంతా ఏటికివెళ్ళి స్నానంచేసి ఆ ధాన్యపుమొక్కల్ని పీకి, మట్టి కడుగుతారు. స్త్రీలు వాటిని భక్తితో తమ చెవుల్లో ధరిస్తారు.

చైత్రపర్వం - వేట :—ఇదే వీళ్ళకు ముఖ్యపండుగ. ఇది మార్చి ఏప్రియల్, నెలలలో జరుగుతుంది. ధృఢకాయులగు యువకులంతా వేటకువెళ్లుతారు. వాళ్లులేని సమయములో స్త్రీలంతా పుష్పాలతో అలంకరించుకొని నృత్యసంగీతాలతో కాలక్షేపముచేస్తారు. ఈ సమయాల్లోనే స్త్రీపురుషులు పరస్పరముగా ప్రేమించుకొనుట జరుగుతుంది. యువతీ యువకులకు సంగీతపోటీ, కవిత్వపోటీ జరుగుతుంది. పురుషుడు ఓడిపోతే అవమానముతో తిరిగిపోతాడు. గెలిస్తేమాత్రము కన్య అతనికి విందుచేసి అతనితో క్రీడిస్తుంది. ఇది ఏమాత్రమూ వాళ్ళలో ఒకతప్పు కాదు. వివాహిత స్త్రీలుగూడా దీనిలో పాల్గొనవచ్చు.

వేటనుంచి తిరిగివచ్చిన పురుషులు జంతువును చంపకుండావస్తే స్త్రీలు పేడనీళ్లుకొడ్తారు. ఒకవేళ విజయంతో వస్తేమాత్రం ప్రతీకార వాంఛతో తమ స్త్రీలతో అధిక కాముకవ్యాపారానికి దిగుతారు.

అల్లాంటి సమయంలో చంపిన జంతువులను ఊరిచివరనుంచి, స్త్రీలకు కబురు చేస్తారు. స్త్రీలు ఉత్సాహంతో విశేషాలంకృతులై పుష్ప

మాలలు తమ హస్తాలలో దాల్చి ఆ జంతువులవద్దకు వచ్చి వాటిని అలం కరిస్తారు. గొప్ప ఉత్సవంతో వాటిని గ్రామంలోకి తీసుకువస్తారు. నాయ కుడి అనుమతిమీద వాటి మాంసం అంతా పంచుకొంటారు. భోజ్యయోగం గాని జంతువుల తలలు, చర్మములు తమ జయచిహ్నంగా దాచి, కళే బరాల్ని మాత్రం భూమిలో పాతిపెడ్తారు.

మతం :— వీళ్ళ ముఖ్యదేవుళ్ళు తుకారాణి, మౌళి, గంగాదేవి, ఈశ్వర, భైరవ, ఝంకేరా. వీళ్ళకి గుళ్ళుపేషీ లేవుగాని చెట్లక్రింద మాత్రం వర్తులాకారంగా రాళ్ళుపాతి మధ్యలో దేవతను ప్రతిష్టిస్తారు. ఆమెకు జంతుబలులు ఇస్తారు. సామాన్యంగా పూజారత్వం వహించేది ఒక కొజ్జా గాని, స్త్రీగాని అయివుంటారు.

కర్మలు :— వీళ్ళకి దయ్యాలన్నా, దుష్టగ్రహాలన్నా భయం జాస్తి. ఏ స్త్రీకైనా దయ్యం పట్టిందని అనుమానం తగిలితే తక్కినవాళ్ళంతా ఆమెను చావకొడ్తారు. పశువులకు రోగాలు తగిలితే అడవిదున్నను చంపి ఆ కొమ్మును భూమిలో పాతిపెడ్తారు.

పెద్దవాళ్లు చచ్చిపోతే తగులవేస్తారు. స్త్రీలు పిల్లలు, అయితే పాతి పెడ్తారు. 3 రోజుల వరకు ఆశౌచము పట్టుతారు. సవరలకు వలనే వీరు కూడా పునర్జన్మమంటే నమ్మకం ఉన్నది.

గ్రామంలో ఎవరయినా చచ్చిపోతే గ్రామవాసులందరు స్మశానానికి వెళ్ళుతారు. భర్తచస్తే భార్య, భార్యపోతే భర్త విధిగా స్మశానానికివెళ్లాలి. దహనం చేసిన తరువాత ఏటికివెళ్ళి స్నానముచేసి చేపలనుపడ్తారు. వీటిని వండి అన్నంతోపాటు దారిలో వదలి వేస్తారు. మృతినొందిన వారి కుటుంబం మొట్టమొదటగా భోజనంచేయాలి.

3వ రోజువగూడ యిలాగే అన్నం, చేపలు, స్మశానంలో పార వేస్తారు. ఇంటికి తిరిగి వచ్చిన తరువాత విందుచేసికొంటారు.

10 వ రోజున పెద్దవిందు జరుగుతుంది. చనిపోయినవాని స్నేహి తులు, బంధువు, అంతావస్తారు. ఒక దున్ననుగాని, ముసలి ఆవునుగాని, కోస్తారు. రాగి అంబలి పులవ పెట్టడంవల్ల తయారుచేసిన మహామత్తు గల్గించే సారాయితో అతిథులు సత్కరింపబడుతారు.

'గొట్టర్' - పశుచిత్రవధ :— ప్రతి గడబవాడుగూడ తన తండ్రి పోయిన ప్రతి 3 సంవత్సరాలకు ఈ కార్యం చెయ్యాలనే నియామకం ఉన్నది. ప్రతి సంవత్సరం దీని కోసం కొంత ధనం నిల్వచేస్తాడు. దూర

దేశాల్లోవున్న బంధువులను పిలుస్తారు. వాళ్లందరూ తల ఒక అవునుగాని దున్ననుగాని, తెస్తారు. నిర్ణయించబడిన రెండుదినాలకు పూర్వమే వీళ్లని విందులతోను, త్రాగుడుతోను గౌరవించాలి.

నిర్ణీతమైన రోజున ఊరికిమధ్యగా ఒకస్థంభం పాతుతారు. గృహ యజమాని ఒక ముసలి అవునుగాని, దున్ననుగాని దానికి కట్టేస్తాడు. తర్వాత తక్కినవాళ్ళు ఒక్కొక్కరే తామతెచ్చిన పశువులను కట్టుతారు. రెండు రోజులకు పూర్వమే మేతలో కలిపి పశువుచేత రెండు రూపాయల్ని మ్రింగిస్తారు. పశువులన్నిటిని స్థంభమునకు కట్టి బావమరుదుల్లకు దానం చేస్తారు. తర్వాత వాటివి వదలి పెడ్తారు.

ఇంక ప్రారంభమౌతుంది రాక్షసకృత్యం! పురుషులంతా తప్ప త్రాగి పదునైన గొడ్డళ్ళతో సిద్ధంగాఉంటారు. పశువులను వదలిపెట్టగానే గొడ్డళ్ళతో నరుకుతూ, మాంసం లాగేస్తూ, ఎవడైతే పశువులలోవున్న రెండు రూపాయలను తీసుకోగల్గుతాడో వాడు అదృష్టవంతుడు. వాడి పెద్దలకు స్వర్గం ప్రాప్తిస్తుంది. ఈ నమ్మకంతోనే ఈ ఘోరాచారం ఆచ రించబడుతున్నది. ఒక్కొక్కవేటుకి మాంసంముద్దలు బైటికివస్తూంటే ఈ కిరాతకులు వాటి మర్మావయములలో తమచేతులు జొనిపి మాంసం బైటికిలాగుతారు. అమాయకములై, బాధకోర్వజాలక చెల్లాచెదరై పరు గెత్తుతూ, ఎదురుబడ్డవ్యక్తిని, వెంటాడే ఘాతకుణ్ణి, పొడుస్తూ, తన్నుతూ మృత్యువు నెదుర్కొంటున్న ఈ పశువులు — వాటి జాలి అరుపుల కేమా త్రము చలించక వికటాట్టహాసములతో వాటిని చిత్రవధచేస్తుండే ఈ పశు తుల్యులు ఆ సమయంలో సమానంగానే పోట్లాడుతారు; ఒక్కొక్కప్పుడు మృత్యువాత బడుతుంటారు. ఏం బీభత్సం! ఇల్లా వధింపబడిన జంతు వుల మాంసం అంతాకలిపి పంచుకొంటారు. (జి. రామదాసు Man in India 1931 లోని వ్యాసంలోనుంచి ఈవిషయం వ్రాస్తున్నాను.) ఐతే ఇప్పుడు ఈ ఘోరకృత్యము తగ్గింది.

వీళ్ళనుగూర్చి ఇంతవరకు ఎక్కువగా పరిశోధించిన వారెవరున్నూ లేరు. పైని పేర్కొనిన రామదాసుగారుమాత్రం కొంతవరకు వీళ్ళ జీవి తాన్నిగూర్చి వ్రాశారు. ఇటీవల నా మిత్రులు మద్రాసు మ్యూజియం క్యూరేటర్ డాక్టరు ఎ. రామకృష్ణారెడ్డిగారు జయపూరుప్రాంతాల్లో వీరిని గూర్చి పరిశోధించారు.

# ఉపసంహారము

పాఠకులారా!

మానవాభ్యుదయమునకు సంబంధించిన మానుషశాస్త్ర విషయము క్లుప్తముగా పై ప్రకరణములలో వర్ణించితిని. అధోగతిలోనికి త్రొక్కబడి, అధఃపతితులగు ఆదిమనివాస జీవిత విశేషములను ప్రత్యేకముగా, విపులముగా వర్ణించుటయు, తత్ఫలితముగా వారి సమస్యా పరిష్కారమునకు దోహదమ్మొసంగుటయు, నా ప్రధానోద్దేశ్యము.

భారతదేశమందలి పరిస్థితులు వేరు. దేశమునందెల్లెడలను దారిద్ర్యము, నిరక్షరాస్యత, మూఢనమ్మకములు పాతుకుపోయినవి. ఇంతేగాక, మానవుని భౌతికాభివృద్ధికి అవసరమగు మార్పులను గమనింపజాలని జీవితపద్ధతులు, వీటన్నిటికన్నను ముఖ్యముగ రాజకీయ పారతంత్ర్యము, భారతదేశీయ జీవితమునందలి ప్రస్తుత ప్రధాన లక్షణములు.

కాని కాలమొక్కరీతిగా నుండదు. సభ్యప్రపంచమునందు గలుగు మార్పుల ప్రాబల్యమునుగుర్తించి, సంఘాభివృద్ధికి అనువుగ సంస్కరణలు ప్రవేశబెట్టినవి ఆయాదేశ ప్రభుత్వములు. దారిద్ర్య నిర్మూలనకై లక్షల కొలది ఎకరములను సేద్యమునకు తీసికొనివచ్చి, దానితోపాటు నిరుద్యోగ సమస్యను శాస్త్రీయముగా పరిష్కరించినవి. నూతన పరిశ్రమలను నెలకొల్పినవి. పాత పరిశ్రమలకు చేయూతనిచ్చి వాని నభివృద్ధికి తెచ్చినవి. నిర్బంధ విద్యావిధానములు అమలుజరిపినవి. క్రమశిక్షణీయమగు సాంఘిక మార్పులను దెచ్చినవి.

వీటికితోడు సోవియట్ ప్రభుత్వం నూతన రాజకీయవ్యవస్థ నొకదానిని అమలునందుబెట్టి ప్రపంచమునకంతకును మార్గదర్శి అయినది. అది కార్మిక, కర్షక రాజ్యము. అచ్చట దోపిడి విధానమునకు స్వస్తిచెప్పబడినది. దానితో నూతనాదర్శములు ఆవిర్భవించినవి. ప్రతి జాతియొక్క స్వాతంత్ర్య మంగీకరించబడినది. ఇది యూరప్‌రాజ్యాల "ట్రస్టీ" లక్ష్యాలకు తీరనిదెబ్బ!

భారతదేశంగూడ ఈ మార్పులకు తన సహకారం చూపింది. దేశంలో ఎన్నిపార్టీలున్నా, స్వతంత్రసంపాదన పరమలక్ష్యంగా గ్రహింపబడ్డది. దీనికితోడు ఇప్పుడిప్పుడే కార్మిక-కర్షక హక్కులను సంరక్షించే ప్రయత్నాలు జరుపబడుచున్నవి.

'సర్వేజనా స్సుఖినోభవంతు' అనేసూత్రం యువకులకు తలమానిక మైనది.

ఏ సంఘమైనా అభివృద్ధిలోకి రావాలంటే ఆ సంఘమందలి ప్రతి వ్యక్తిగూడ ఆ సంఘాభ్యున్నతికి పాటుబడవలెను. అప్పుడే నిజమయిన ఐక్యత, జీవిత మాధుర్యం తెలిసికోగలగటానికి వీలవుతుంది.

పరిశ్రమాభివృద్ధి, వ్యవసాయకాభివృద్ధి, రాజకీయాభివృద్ధి, ఆర్థిక స్వాతంత్ర్యం—ఇవి నిజంగా భారతదేశానికి రావాలంటే, 40 కోట్ల భారతీయులు దేశావుసరాల్ని గుర్తించేటట్లు సల్పేబాధ్యత దేశభక్తులది; సంఘ సేవకులది; శాస్త్రజ్ఞులది. ఒకరి లక్ష్యం రాజకీయ స్వాతంత్ర్యం; రెండవ వారికి మానవసేవ పరమావధి; ఇంకొకరు శాస్త్రీయజ్ఞానం సమకూరుస్తారు. ఈ ముగ్గురుగూడా దేశాభివృద్ధికి ప్రధానాంగములు; ఒకరి ఎక్కువలేదు; మరొకరి తక్కువలేదు. సంఘ సేవకుడు కొన్నిమార్పులను, పద్ధతులను సూచిస్తాడు; రాజకీయవేత్త వాటిని అమలులోపెడ్తాడు. వాటి సమిష్టీకరణమే దేశాభ్యుదయము.

ఇట్లాంటికార్యాల్లో, ఆదిమనివాసులసేవ ముఖ్యం. వీరిని అభివృద్ధిలోనికి తీసుకురావటానికి సంఘమందలి ప్రతివ్యక్తికీ బాధ్యత, అవకాశములు గలవు. ఆపనికి ఒక్క ప్రభుత్వమేగాదు; రాజకీయవాదేగాదు; శాస్త్రజ్ఞుడేకాదు; అంతా అవుసరమే.

ఈ పని నిర్వహించటంలోగల కష్టసుఖాలు, బాధ్యతలు నేను ఊహించక పోలేదు. ఒకప్పుడు మన దేశాన్నిపరిపాలించిన దొరలయినా కారణంతరములచే సంఘమార్పులను, నాగరికతా పద్ధతులను కనిపెట్టుటకు వీలులేక, ప్రస్తుతము మనకంటికి పశుతుల్యులవలె కన్పిస్తున్న అనాగరికుల జీవితములను పరిశోధించి, వారినిగూడ ప్రస్తుత సభ్యనాగరికతలను అనుభవించేటట్టు చెయ్యవలె. ఇందులకై ప్రజలు, ఆదిమనివాసుల విషయము గ్రాహ్యం చేసుకొనవలె. ఆంధ్రదేశంలో అల్లా గ్రాహ్యం చేసుకొనేందుకు అవకాశం కల్పించిన "ప్రజాశక్తి" సభ్యులు ఆంధ్ర ఆదిమ నివాసులకు నిజమైన సేవసల్పి ధన్యులైనారు. గుణగ్రహణ పారీణులైన పాఠకులు మీరే ఈ కార్యభారం మీదవేసికొని, ఈ వుద్యమం జయప్రద మొనరింతురుగాక!



# BIBLIOGRAPHY

## JOURNALS


1. The Journal of the Bombay Anthropological Society
2. The Journal of the Royal Asiatic Society of Bengal
3. Journal of the Royal Anthropological Society of Great Britain and Ireland
4. The Journal of the Andhra HistoricalResearch Society
5. Journal of the Bihar and Orissa Research Society
6. Man
7. Man in India
8. Social Anthropologist
9. Physical Anthropology
10. Oceania
11. Pacific Affairs
12. Bantu Studies
13. Human Affairs
14. Journal of The Mystic Society


## BOOKS


1. A Tribe in Transition — D. N. Majumdar
2. Some Vagrant Tribes of Northern India — "
3. Tribal Culture and Acculmation (Presidential Address) — "
4. The Bhils of Guerat (paper) — "
5. Polyandrous people of JaWas Bawar — "
6. Gonds and Gondwana — Indrajit Singh
7. Maria Gonds of Bastar — W. V. Grigson
8. The Aboriginal Problems of C. P. and Berar — "

9. Leaves from the Jungle — Dr. Verier Elvin

10 The Agaria — "

11. Maria Murder and Suicide — "

12. The Aboriginals — "

13 Loss of Nerve — "

14. The Mundas and their Country — Late S C Roy

15. The Oroan Customs and Beliefs — "

16. The Problem of the Tribes in India Primitive — Dr. A. Aiyappan

17. Presidential Address at the Science Congress 1945 (Nagapur) — "

18. The Nayadis of Malabar — "

19. The Irulas and Culture ~~Contact~~ change — "

20. The Fortunes of a Primitive Tribe — von Christoph F. Haimendorf

21. The Chenchus — "

22. The Yanadis (Paper) — V. Raghavaih

23. The Yanadis (Thesis) — P. C. Reddy

24. The Soras and their poetry — Dr. G. V. Sitapati

25 Interpenetration of Aryan and Primitive Cultures — "

26. Lectures on Ethnography — Late L A K Iyer

27. Castes and Tribes of Mysore — "

28. " South India — Thurston. E

29. " C. P. and Berar — Russel and Hiralal

30. " N. W. Provinces and Oudh — W. Crooke

31. " Bombay — R E Enthoven

32. " Hyderabad — Shiray-ul-Hussain

33. Castes and Tribes of Mysore — Essays on Anthropology. Edited by Dr. D. N. Majumdar
34. Introduction to Social Anthropology — Clarke Wissler
35. Introduction to Physical Anthropology — J. K. Bose
36. Property in Aboriginal India (Paper) — N. D. Majumdar
37. Human Types — R W. Firth
38. Racial Elements in Indian Population — Dr. B S. Guha
39. The Lambadis (Thesis) — A. M. Somasundaram
40. The Lambadis and Culture Contact (Paper) — "
41 Anthropology and Culture Contact — "
42. The Problem of the Vagrants, Nomads and Criminals — "
43. Causes for crime among the Primitives and Criminals — "
44 Aboriginal Problems and administrative measures — "
45. Magic and Religion — Sir J G. Frazer
46. The Juvenile offender — J. W. Coombes
47. Introduction to Criminology — W A. Bonger
48. Hindu Manners, Customs and beliefs — The Abbe J A. Dubois
49. Criminal Classes of Madras Presidency — F S. Mullaly
50 History of the Railway Thieves — Paupa Rao Naidu

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| IV | 5 | పాశ్నాత్య | పాశ్చాత్య |
| ,, | 17 | పేవకునకు | సేవకునకు |
| 1 | 5 | Valuble | Valuable |
| ,, | 16 | హోమండార్ఫ్ | హైమండార్ఫ్ |
| 5 | 22 | స్ప్రెయన్ | స్ప్రెయిన్ |
| 6 | 15 | పలించినది | ఫలించినది |
| 7 | 6 | మదింకి | మందికి |
| ,, | 25 | భిన్నభిన్న | భిన్నభిన్న |
| 8 | 21 | మొనర్చుటకుకు | మొనర్చుటకును |
| ,, | 25 | ఆనిద్యా | అవిద్యా |
| 9 | 3 | పలితముగా | ఫలితముగా |
| ,, | 8 | కృష | కృషి |
| 10 | 12 | పరిస్థుతులపై | పరిస్థితులపై |
| ,, | 27 | బస్వాస్ | బిస్వాస్ |
| 14 | 25 | మరుదుపడి | మరుగుపడి |
| 15 | 5 | విద్వేషనాగరికత-సభ్యత | విద్వేషములు-సభ్యత, నాగరికత |
| 24 | 14 | తెల్పినాడు | తెల్పినారు |
| 21 | 6 | ఆవర్భంచెను | ఆవిర్భవించెను |
| 30 | 12 | విజ్ఞానముల | విజ్ఞానముల |
| 33 | 27 | 'సి' గ్రూపు | 'ఓ' గ్రూపు |
| 34 | 4 | రిమ్నెయస్ | లిమ్నెయస్ |
| 40 | 8 | లెడ్డా | వెడ్డా. |
| 42 | 26 | ఆష్ట్రిల్ | ఆష్ట్రిక్ |
| 43 | 17 | 6 లక్షలు | 6 వందలు |
| 44 | 17 | ఓడ్రము | ఓఢ్రము |
| ,, | 26 | జాగములోకి | భాగములలోకి |

| | | | |
|---|---|---|---|
| 44 | 28 | గుర్తించి | గుర్తించ |
| 45 | 2 | సంపత్తు | సంపత్తి |
| 53 | 28 | (గాౖండు) | (గోండు) |
| 54 | 1 | అనెదురు | అనేదరు |
| 59 | Foot note | His paper in | His paper on |
| 62 | 20 | చాపలు | చాపలు |
| 72 | 1 | గారు శ్రీవత్సవాగారికి | గారికి శ్రీవత్సవాగారు |
| 79 | 16 | సాంప్రనాయములు | సాంప్రదాయములు |
| 82 | 18 | బిద్రే | బిద్రీ |
| 85 | 3 | అతనిభయ | అతనివిభయ |
| 87 | 6 | బరోహర్ | బిరోహర్ |
| 95 | 15;16 | 915; Sicence | 1945: Sciences |
| 96 | 7 | పోషకులై | పోషకములై |
| ,, | 10 | Tooday and tmarrow | Today and tomorrow |
| 97 | 14 | అధికుడపను | అధికుడవను |
| 98 | 5 | షిరికిపంధ | పిరికిపంద |
| 99 | 16 | ప్రదర్శనశాలము | ప్రదర్శనశాలయు |
| 100 | 21 | రక్షణ | రక్షణను |
| ,, | 25 | వీరందరికిను | వీరందరికిని |
| 101 | 5 | గోప్పగొప్ప | గొప్పగొప్ప |
| ,, | 19 | కూలీల | కూలీలు |
| 105 | 2 | 8 గవర్నరుల | గవర్నరుల |
| ,, | 25 | ప్రొవిన్షిల్ య | ప్రొవిన్షియల్ |
| 110 | 27 | సాఘికముగ | సాంఘికముగా |
| 114 | 13 | జీవనోపాది | జీవనోపాధి |
| 115 | 22 | ఊర | ఊళ్ళ |
| 117 | 24 | ఎంపబడే | ఎంచబడే |
| 118 | 29;30 | కల్గించి; కల్గించి | కల్గించు; కల్గించు |
| 121 | 9 | మాన | మానవుని |
| 125 | 13 | పరిశీలింనపలయు | పరిశీలింపవలయు |

శ్రీరస్తు.

తరిగొండ వేంకమాంబప్రణీతమైన

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము.



కలూరు. వాసుదేవయ్యగారిచే

పరిశోధితము.







చెన్నపురి:

వావిళ్ల - రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 1914. [Rs. 0-14-0.